# పరమ రహస్యము

శ్రీ వాసుదేవరావు
గ్రంథరచన

కవిరాజహంస - కవికులాలంకార
శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు
సంపాదితము

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్,
గ్రంథప్రకాశకులు : : : రాజమహేంద్రవరము.

# పరమ రహస్యము

## మొదటి ప్రకరణము

నేనిప్పుడే యింటికి వచ్చియుంటిని. నాచేత నొకయుత్తరముండెను. ఆ యుత్తరము నాతో నివసించుచున్న యొకయువతిపేర వ్రాయఁబడి యుండెను. ఆమె బాలికపాఠశాలలో నుపాధ్యాయినిపదవియందుండెను. ఆ సుందరి మనోహరరూపమును, వాక్చాతుర్యమును, సుగుణమును గని నేనామె నాయింటనె నాతో నివసింప నీయకొంటిని. ఇప్పుడామె యింట లేనందున నాయుత్తరమును బల్లపైఁ బడవేసితిని. అది పైవిలాసము వ్రాయఁబడిన ప్రక్క క్రిందుగను, మఱొకప్రక్క మీఁదుగను బడియెను. నేను దానిని గమనింపనైతిని. నాహృదయ మనేక విచారములచే నావృతమైయుండెను. నా హృదయము స్వవిషయచింతనముల నిండియుండెను.

నేను కిటికీకడకరిగి యటనున్న చిన్నగోడనానుకొని నిలువఁబడితిని. ఆహా! ఏకాకినియగు స్త్రీజీవిత మెంతదుఃఖభాజనము! దాని నెట్లు వర్ణింపనగును. మాతాపితరులు లేరు—మగఁడు లేఁడు—స్వావలంబిని యగు నిట్టి స్త్రీ యెట్టులీజగమున జీవితశేషమును గడపఁగలదు? ఎన్ని విధములఁ బ్రయత్నించినను, ఆమె కెందును నొకయుద్యోగము లభింపకున్నప్పుడు—ప్రయత్నించిన నేదియులభింపదని నిశ్చయముగ నెఱిఁగియున్నప్పుడు—ఆయువతి చేయునదేమి? మిత్రులచెంతఁ జేరి యాచించుటయో, కాక యుపవాసములతోఁ గృశించి మరణించుటయో

చేయవలయునుగదా! ఈ రెండాధారములుతప్ప వేఱొండాధార మేమున్నది? నేననుభవించుచున్న కష్టముల నెన్నటికిని వర్ణింపను—ఏలయన, నేనభిమానధనను—అదియునుగాక గతవృత్తాంతములచే నా పాఠకమహాశయులను గష్టపెట్టుట నాయిచ్ఛకాదు. కావున, నాపూర్వ వృత్తాంతమును నేను జగమునకుఁ దెలియనీయను. మాతాపితరులు నాకొక్కింత విద్యఁగఱపి ప్రసూతికావిద్య నేర్పియున్నారు. నాకదియే చాలును! ఇంతకన్న నాకధికవిద్య నేలయుపదేశింపరైతిరని వారిని దూషించుటవలన లాభము లేదు—కాదు—నాకది మేలుకాదు. వారి స్థితిగతులఁ దలంచిచూడ వారు నాకీపాటివిద్యను జెప్పించుటయే యధిక మనవలయును. ఆహా! నాస్థితియేమి? నేను—నళినిని—ఇరువదిమూఁ డిరువదినాల్గేండ్ల తరుణిని; ఇల్లులేదు; వాకిలిలేదు; బంధుమిత్రాదులు లేరు; ఉదరనిర్వాహకసాధనములులేవు; దగ్గర రెండు రూకలకన్న నధికము లేదు; పాషాణహృదయనై యున్నాను. నేఁటిదినమంతయు ననేకవిధములగు నిరాశల ననేకవేళల ననుభవింపవలసివచ్చినది. కావున నాకు భవిష్యత్సుఖకిరణ మొక్కటియుఁ గనఁబడకుండెను.

నేనెంతసేపు కిటికీకడ నిలిచియుంటినో తెలియదు. ఇంటిముందటి గోడవంక శూన్యదృష్టిం దిలకించుచు నిలిచియుంటిని. నేనుండిన గదిలో నేమిజరిగినదియు నాకుఁ దెలియలేదు. ఇంతలో నేమియో ధ్వనియై నట్లు తోఁచెను. వెనుదిరిగి చూచితిని. నా చెలిమికత్తె వెనుక నిలిచి యుండి సంతప్తవదనముతో నన్నుఁ జూచుచున్నట్లు నాకుఁ దెలిసెను. ఆమె యావదనముం గాంచినంతన నేను నా దుఃఖమంతయు నొక్క నిమిషములో మఱచిపోయితిని.

"నీ విట్టుంటివేమి?" అని నేను దయార్ద్రహృదయనై యామె కడకరిగి యడిగితిని.

"ఎట్లుంటినో నాకుఁ దెలియదు. ఏమోగాని యిక్కడ బాధగా నున్నది" అని యామె తన్నహృదయముపైఁ జేయిడి చెప్పెను.

నేనామెను సమీపించితిని. ఇంతలో నింతవఱకును నామె ముఖమునఁ గనఁబడుచున్న పాండురవర్ణ మాకస్మికముగ నదృశ్యమై పోయి యరుణకాంతి యగపడెను. నాచేతిని దనచేతితోఁ బట్టుకొని యామె యిట్లనియెను "నళినీ! నీవు నాకన్నన ధికాస్వస్థవుగ నగపడుచున్నావు. నీకు శరీరము బాగుగనుండలేదు. కారణమేమో చెప్పవా?" అనియెను.

ప్రేమపూర్ణమును, అత్యంతోత్కంఠా పూర్ణమును, విచారగ్రస్తమునైన యామెదృష్టి నా హృదయమున నాటెను. నేనామెను గౌఁగిలించుకొని యేడువఁదొడఁగితిని.

కొంతతడవునకు నేను "నాకేమియును దెలియుటలేదు. నేనన్ని విధముల దిక్కుఱియున్నదానను. జేపెట్లుజరుగునాయను సంశయమొక్కటియే యెదుటనిలిచియున్నది. దీనికై నేనంతగ విచారించుటలేదు, నాలోపలి యభిమానస్వభావము మరలఁ దలసూపినందున నేను మరల నిట్లంటిని. "కాని, యిఁకముందేమి సేయవలయును? ఈ జీవితకాల మంతయు నేవిధముగ గడపఁగలను? ఇదియేనన్ను బాధించుచున్నది."

ఆమె నా ప్రశ్నముల కేమియుఁ బ్రత్యుత్తరమీయలేదు. ఆ యువతి ముఖకమల మొక్కత్రుటిలో వెల్లబాఱెను. శూన్యదృష్టితో నాచెలి మఱొకవంకకుఁ జూచుచుండెను. అప్పు డామెనేత్రము లెంతో మనోహరముగఁ గనఁబడుచుండెను. మరల నామె చెక్కిళ్ళపై నరుణదీధితులలమికొనియెను. ఆమె నాచేతిని బట్టుకొని—

"నీ జీవనోపాయమునకుఁ దగినయేర్పాటులు సేయుభారము నాపై నుంచెదవా!" అని యడిగెను.

ఆమె యిట్లనుటవలన నాకుఁ గలిగిన యాశ్చర్యము నాముఖమునఁ బొడసూపియుండఁబోలును! వెలయన—ఆమె మరల నిట్లనియెను.

"నిజము పరికింప నీజీవయాత్ర సాగుట కష్టమని నాకుఁదోఁచుటలేదు. దానినిగూర్చి విచారపడుటకుఁ గారణములేదు. కర్తవ్యదక్షయు, వివేకధురీణయువగు నిన్నుఁబోలినస్త్రీ కుద్యోగములభింపక

పోదు. చూడుము—నీ ముఖమును జూచుకొనుము !" అని యామె నన్నూ్నిఅడించుచుఁ బ్రేమపూర్వకముగ నన్నొకయద్దము నొద్దకుఁ దీసికొనిపోయి దానియెదుట నిలువఁబెట్టి "ఆహా! ఈనుదురు—ఈ నీ ముఖకమలము—చక్కఁగఁజూచుకొనుము—ఇఁకఁజెప్పుము చూతము !—నీవీ జగమున యశమార్జింపఁగలవో లేవో చెప్పుము ! ఎక్కడ కరిగిన నక్కడ నీకు జయముకలుగునని నీముఖమే నీకుఁ జెప్పుచుండలేదా ? కాని, నీకిప్పటియవస్థనుగూర్చియే కొంచెము విచారముగనున్నది—దానిని నేనుదీర్పఁగలను." అనియెను.

"కాని—" అని నేనుత్సుకతతో నంటిని.

కాని, యనునంతలో నామెవదనబింబముపై వెలసిన రుచిరసుహాసము నన్ను మూఁగదానింజేసి వైచెను.

"ఏమి ? కానియేమి ? నేను నీస్థితిలోనుండి నీవు నాస్థితియందున్నయెడల నావిషయమైనీవు తగినయేర్పాటులఁ జేసియుందువుకదా !" అని చెప్పుచు నించుకైన నాలసింపకయే యామె ప్రేమపూర్వకముగ నన్ను ముద్దుపెట్టుకొని యాలింగనము చేసికొనియెను. ఆహా ! ఆనిమసమున నాసుఖప్రదాలింగనము మమ్మొద్దఱ నక్కసెల్లెంద్రనొనర్చి యుండఁబోలును !—నన్నొకపడకకుర్చీపైఁ గూర్చుండఁబెట్టి యామె నాప్రక్క నాసీనయయ్యెను.

"నళినీ ! నీకును దెలిసియేయుండవచ్చును. నేనొకింతధనవంతురాలను, బ్యాంకిలో నాపేర నైదువందల రూపాయలున్నవి, అంతియే కాక —" అనియామె యేమో చెప్పఁబోవుచుండ నేనామెనోరు నాచేతులతో మూసితిని. అట్టు లేనొనర్పకుండఁజాలనైతిని. ఏలన — ఆమె శరీరయష్టి యంతటిరమ్యమును, సూక్ష్మమునై యుండియు నామె యంతగొప్ప మొత్తమును నిలువయుంచియుండినందుల కామెపై మన స్ఫూర్తిగ నాకు దయయుదయించెను.

"కాని, యెదుర్కొందలనఁగా నెంత ! నీకైనను ముందటిజీవనము నకై తగినయేర్పాటులు చేసికొనవలసినదేకదా ? అదియునుగాక నీవు నావలె దృఢశరీరిణివిగా నుండవైతివి. నీకీస్వల్పధన మున్నంతమాత్ర మున నేమైనది" అని నేనంటిని.

నాయీపలుకుల కామె నవ్వెను. లజ్జించెను ; మరల నవ్వెను ; ఆకస్మికముగ నేడువఁదొడఁగెను.

"కాని, నళినీ ! నాకాద్రవ్యముతోఁ బనిలేదని నీకుఁదోఁచుట లేదా ?" అని యామె యనుచుండ నేనాయువతి మోననము నాశ్చర్యముతోఁ జూచితిని. మరల నామెపలుకఁజొచ్చెను, "అదియొక రహస్యము. నేనిఁక నొకమాసములోపల వివాహబద్ధనుగాఁబోవుచున్నాను. అటుపిమ్మట నాకాద్రవ్యముతో నేమిపనియుండఁగలదు ? కావున నీవు నాకు వివాహమగువఱకును నాగదిలో నెయుండిన నెంతో యుపకార మగును. ఉద్యోగమునకై పరదేశములకేగకుము. ఇప్పుడు నీతో నాకుఁ బనియున్నది. నేనును నీవలెనె నిరాశ్రితననియు, ననాథననియు నీ వెఱిఁగియేయున్నావు. నావివాహమునకై చేయవలసినస్వల్ప ప్రయత్నములొనర్ప నీకన్న నింకనాకెవ్వరున్నారు" కావున నీవు పోకుము. నన్ను సుఖవతినిగాఁ జేయుటయు, ఋణవతినిగానొనర్చుటయు నీచేతనున్నది. నావివాహమునకై వలసినవన్నియు సంసిద్ధపఱుపవలసి యున్నదని నీకు నేను చెప్పనక్కఱయే లేదుకదా !" అని యామె వచించెను.

ఇఁక నేనేమనఁగలను ? అనుటకైన నేమున్నది ? ఆమె సరళ ప్రపూర్ణవదనము నావంకకే యుండెను. స్వదుఃఖముల నామెకుఁ దెలిపి యామె సౌఖ్యమున కంతరాయముఁ గల్పించుట నాకిష్టములేదు.

"భాగ్యశాలియగు నేపురుషుని హృదయమును నీవు హస్తగత మొనర్చుకొనియున్నావు !" అని మూఁడవజామునందలి తీక్ష్ణసూర్య కిరణముల నివారించుటకై కిటికీపైని యవనికను జాఱవిడుచుచు నేనామెనడిగితిని.

"ఈపురమున నాతనిఁబోలినసత్పురుషుఁ డింకొకఁడుండఁబోఁడు!" అని యభిమానపూర్ణ స్వరమున నామెవచించెను. "డాక్టరు—"

అంతట మఱేమియుఁ బలుకలేదు. ఒకవేళఁ బలికెనేమో! నాకామెమాట వినరాదయ్యెను. ఏలన—ఆసమయముననె బయట నల్లరియయ్యెను. తత్క్షణమే నేను గవాక్షముతలుపుఁ దెఱచి బయటికిఁ జూచితిని.

"ఈ యల్లరియేమి!" అని యాత్రముతో నాసఖి నన్ను సమీపించి యడిగెను.

నేను : నాకేమి తెలియును! లోకులు గుంపులుగుంపులై యొక్క దిశకే పోవుచున్నారు. వారువీరనక యెల్లరు నచ్చటికే పోవుచున్నారు. వీరిమనసు నేమియాకర్షించినదో నేను చెప్పఁజాలను.

ఆమె : పద ; మనమును బోవుదము.

ఆమె తొలుత గదిలోనికివచ్చినప్పు డెట్లుతనవక్షస్థలముపైఁ జేయిడికొనియుండెనో, యిప్పుడు నట్లే చేయిడికొనియుండెను. అంత నెవ్వరో కేకవైచిరి,—"డాక్టరే! డాక్టరే!" అని యామె బిగ్గఱగాఁ గేకవేసి నాప్రక్కకరుదెంచి నాబాహువునుగట్టిగాఁ బట్టుకొని "జనులేమనుచున్నారు? డాక్టర్! డాక్టరే! డాక్టరే!" అని యఱచుచున్నారుకాదా!" అని యామె భయభ్రాంతచిత్తముతోఁ గలవరపాటుతో గద్గదస్వరముతో నన్నడిగెను.

నేనును భయవిహ్వలనై యామెవంకఁ జూచుచు "ఔను." అని యంటిని. అప్పటికామె బహిర్ద్వారముకడ కరిగియుండెను.

"డాక్టరు ప్రభాకరుని వివాహమాడ నుండెనాయీయామె!" అని నాలో నేననుకొనుచు నామెవెనువెంట నడచుచుంటిని.

మాయీనిసరపురమున డాక్టరనుపదవికిఁ దగినయాతఁ డాతఁడొక్కఁడే. డాక్టరులింకను గొందఱుండినను, వారందఱుఁ దమపదవిని బట్టి యీయూరనందందు రోగుల కౌషధముల నిచ్చుచుండినను.

వారందఱును దమరోగుల హితచింతనములకుమాఱుగ స్వహితమునే యెక్కువగ గమనించుచుందురని చెప్పుట యతిశయోక్తి కాఁజాలదు. అందఱిలో నీడాక్టరు ప్రభాకరరావొక్కఁడె తనసరళస్వభావము చేతను, పరోపకారపారీణతాంతఃకరణముచేతను, అకృత్రిమభాషణములచేతను, ఊరిజనుల మెప్పుకోల్వడసియుండి, తనయుదారవృత్తికి మఱింతవన్నె తెచ్చుచున్నవాఁడు.

"డాక్టరు ప్రభాకరుఁడే యితఁడు! పరమేశ్వరుఁడాతని కెట్టియాపదయుఁ గలిగింపకుండుఁగాక!" అని యనుకొనుచు నేనతిశీఘ్రగమనమున మేడమెట్టులనుదిగి క్రిందికివచ్చితిని. నా చెలియప్పుడే తలవాకిలి దాఁటిపోవుట నాకగపడెను.

ఎట్టకేలకు నేనామెను సమీపించితిని. కాని, యెక్కడ ఊరిబయట నఱమైలుదూరమున — అదిగో నావటవృక్షమున కావల భగ్గుభగ్గునఁ బొగలెగజిమ్ము యంత్రాలయమునకు సమీపమున— అచటకుఁ జేరకుమున్నె యీ మెకచట నేమికనఁబడునో నేనెఱిఁగియే యుంటిని. ఆమె ప్రేమసుఖస్వప్నము నష్టమైనదని నాకుఁ దెలియ వచ్చెను. ఆయంత్రాలయమునకు సమీపమున దట్టముగ నెదిగినపచ్చికపై డాక్టరు ప్రభాకరుని ప్రేతము పడియున్నదని నేనప్పుడే తెలిసికొని యుంటిని. నేనీభవిష్యద్వృత్తాంతమంతయు నెట్టులెఱిఁగితినో నాకే తెలియదు. కాని, యీవిశిష్టస్థలమున జనులు గుంపులుగుంపులుగాఁ గూడి యుండుటవలనను, వారివిచిత్రవృత్తివలనను, పుడమిపై నిశ్చలముగఁ బ్రసరించియున్న వారిదృష్టులవలనను, అంతియేకాక, నాహృదయమున నుద్భవించిన యొకవిధమగు విచిత్రకల్పనాధారమువలనను నేనటులనుకొనియుండవచ్చును. నా చెలియును నేనును మాచేతనైనంత శీఘ్రగమనమున నచ్చోటికేఁ బోయిచేరితిమి.

# రెండవ ప్రకరణము

పైవృత్తాంతమువలన నానెచ్చెలి విషయలీలలమై యుండుట వాచకులకుఁ దెలిసియేయుండును. కాని, మేమాజనసమూహముకడ కరిగిన తోడనే యామె ప్రియుని ప్రేతమునకుఁ జుట్టును మూఁగియున్న జనులందఱు నొకప్రక్కకొదిగిరి. ఒకానొక యదృశ్యశక్తియే వారినటు దూరముగాఁ దొలఁగించి యుండఁబోలును! తరుణుఁడగు నా డాక్టరుతో నామెకుఁగల సంబంధ మాసమూహమున నొక్కనికైనఁ దెలిసియుండఁ జాలదు. నేనామె వెనువెంట నుంటిని. నేను నాసమూహమునఁ ద్రోవ చేసికొనిపోయితిని. ఆమె దృష్టి తొలుదొల్త నామె ప్రియునిపైఁ బడి నప్పుడు నేనామె ప్రక్కనే యుంటిని. అప్పు డామె లేఁగవలె యఱచిన యఱపు నే నెన్నటికిని మఱవఁజాలను. ఆమె కట్టెదుటఁబడియున్న శవము ముఖముకడఁ దనపిశాచసదృశనిస్తేజ హస్తముఁ జూపినప్పు డచటి వారందఱు నవలంబించిన మౌనవృత్తి నే నెన్నటికిని మఱవను! ఆమె యాయభినయమున "ఇదియేమి, ఇట్టులెట్టులయ్యెను" అను ప్రశ్నలు నిండియుండెను. అటఁగూడియున్న జనులలో నతికఠినహృదయుఁడు సైతము మంత్రబద్ధుఁడై యుండెనేమో! ఏలన-సత్యవృత్తాంత మచ్చట నున్న వారికందఱికిని వారివారిహృదయములు చెప్పుచునేయుండెను. ఆ మృతమనుష్యుని కురులును, దుస్తులును నాసమీపమునఁ బ్రవహించు నొకనదీజలమువలనఁ దడిసియుండక యొకవిధమగు ద్రవపదార్థముచేఁ దడిసియుండెను—ఆ ద్రవపదార్థపు నీలిరంగాతని నొసటను, నితరస్థలములను నంటియుండెను. ఆ చెంతనున్న పచ్చికయు నారంగుచే వివర్ణమై యుండెను.

"ఇది యేమి? దీనికర్థమేమి." అని యామె గట్టిగ ననియెను. ఆ శవముపైనున్న తడివస్త్రమునుండి జారుచున్న యా ద్రవపదార్థ మొక చిన్నప్రవాహముగ బారుచుండ నామె దగ్గరకువచ్చెను. అంత నామె

దానిఁగని భయపడి ప్రక్కకు జరిగెను.

ఎల్లెడల నిశ్శబ్దముగా నుండెను.

"నాకీవృత్తాంతము తెలియవలయును. నేనీతని వివాహమాడ నుంటిని" అనుచు నామె విహ్వాలనేత్రములతో నెల్లర మొగములవంకను గాంచుచుండెను.

అటుపిమ్మట నొక్కరుఁడు ప్రేమపూర్ణస్వరమున "అమ్మా! ఈ మనుష్యుఁడు మునిఁగిచచ్చెను. ఈ ప్రవాహరూపనీలపదార్థము—" అని యూరకుండెను.

"ఆ పదార్థము మేమీతని నేతొట్టిలోనుండి తీసితిమో అదియా తొట్టి కడుగుభాగముననున్న రంగై యుండును." అని మఱియొక్కఁ డనియెను.

"తొట్టిలోనుండి యా? ఏతొట్టి?" అని నాచెలియడిగెను.

"ఈతఁడు నిజముగాఁ దొట్టిలోనే దొరకినాఁడు."

మరల నెల్లెడల నిశ్శబ్దమయ్యెను.

అట్లు నిస్తబ్ధమగుట యాశ్చర్యముగాదు. డాక్టరు ప్రభాకరునిఁ బోలిన యుద్యోగప్రియుఁడు —ఎవ్వనికొకింత సేపైన విశ్రామములభింపదో యట్టివాఁడు — నగరబాహ్యప్రదేశమున — నిరుపయోగమైన శిథిలమైన యంత్రాలయసమీపమునఁ — బాడుపడినతొట్టిలోఁ బడి చచ్చుటయున నెవ్వరి కాశ్చర్యముకలుగదు! ఇదెట్లుజరిగినది? ఎట్టు లీతఁ డిచ్చటికివచ్చెను? ఈప్రశ్నల కెవ్వరుత్తరమీయఁగలరు? అటఁ జేరియున్న జనులలో నెవ్వరును సశోకోద్వేగ వృత్తాంతమును జెప్పసాహసింపరైరి.

సుకుమారియగు నాచెలి నన్నానుకొని నిలిచియుండెను.

"తొట్టిలో నీప్రేతము దొరకినదా?" అని యామె మరల మరల ననుకొనియెను. ఇట్టియత్యాశ్చర్య సంభాషణమును విశ్వసించుట కామె హృదయము సంసిద్ధమై యుండలేదుకాఁబోలును!

"అవునమ్మా! తొట్టిలోనే యీశవము దొరకినది" అని నా వెనుకనె నిలిచియున్న యొకమనుజుఁడు చెప్పెను. "ఈ శవము దొరికియేయుండదు. విద్యార్థులొకకొందఱు నేఁడు మూఁడవజామున నటునిటు తిరుగుచు నీయంత్రాలయముకడకు వచ్చిరి. ఈ ప్రదేశ మత్యంత భయానకమును శిథిలమునై యున్నందున —" అని యాతఁడింక నేమియో చెప్పుచుండెను.

ఇంతలో నేను "ఊరకుండుము — చాలు!" అని మెల్లగా నంటిని. ఏలన — నా నెచ్చెలి మొగముపైఁ బ్రేతకళ యుదయించెను. అది నిస్తేజమయ్యెను. అంత నేనామెను నా బాహుపాశమునఁ గట్టిగఁ బట్టుకొని యటనుండి నడువఁ బ్రయత్నించితిని.

కాని, నా నెచ్చెలిస్వభావమును నేను బాగుగ నెఱిఁగియుండ లేదని నాకప్పుడు తెలియవచ్చెను. ఆమె నన్ను దూరముగాఁ ద్రోసి యటనున్న యొకపురుషుని ముఖమున స్పష్టముగఁ గనఁబడుచున్న విశ్వాసచ్ఛటలంగని యాతనివంకకుఁ దిరిగి—

"నన్ను లోనికిఁ గొనిపొమ్ము — నేనాతొట్టెను జూడవలయును" అని అనియెను.

ఆతఁ డాశ్చర్యముతో నామెవదనము నీక్షింపసాగెను. మేమందఱము నట్లే చూచుచుంటిమి.

"నేనాతొట్టెను జూచితీరవలయును." అని యామె యాయంత్రాలయమువంకకు దాటితీసెను.

ఇప్పుడామె వెనువెంటఁ బోవుటకన్న వేఱుమార్గము లేదయ్యెను. మేము బెదరుగదిరిన మోములతోడను, కరుణార్ద్రహృదయముల తోడను, నామె వెను వెంటనే పోవసాగితిమి. ఆమె ముఖమున నసామాన్యనిశ్చయరేఖ స్పష్టముగ దృగ్గోచరమగుచుండెను. అప్పటికి నామె వదనమండలముపై ధైర్యరేఖ విస్పష్టముగఁ గానవచ్చుచుండెను. ఆమె శరీరమున నేశక్తి ప్రవేశించియుండెనో యాశక్తి యస్వాభావికమైనదనియు, అదియేవేళకు విగళితమగునోయనియు, ఎప్పుడీమె

మూర్ఛితయై మాపాదములచెంతఁబడునో యనియు, నెల్లరును సంశయించుచుండిరి.

లోపలికిఁ బోవుమార్గమును జూపవచ్చిన యామనుజుఁడు లోనికనుమానముతో మెల్లగ నణఁగులిపుచుఁ బోవుచు "ఇప్పుడచటఁ జీఁకటి పడియుండును." అనియెను.

ఆమె యాతని పలుకులయెడ నించుకైన లక్ష్యముంచిన ట్లగపడలేదు. సాయంకాల వినీలపాండువర్ణము లాకాశభాగము నలమికొనుచుండెను. అప్పు డనతిదూరముననున్న యొక జీర్ణావరణము దెస కామె దృష్టి ప్రసరించెను.

"ఇచట నాతని కెవ్వరితోడను బనియుండఁబోదు— అట్టియెడ నెట్టితావున మునిఁగిమరణించెను!" అని యామె మెల్లగఁబలికెను.

ఈ పరమరహస్యమే యందఱి డెందములయందును దాండవమాడుచుండెను. ఈ రహస్యార్థ మెవరికిఁ దెలియఁగలదు? అందఱు నిందలి యథార్థస్థితి నెఱుఁగఁ బ్రయత్నించుచుండిరి.

ఆ యంత్రశాలాభవన ద్వారము లెన్నియో వత్సరములకుఁ బూర్వమే పడిపోయియుండెను. కావున లోనఁ బ్రవేశించుటకు మాకెంతో కష్టము కలుగలేదు. గడపదాటి లోనికరిగితిమి. అచటినుండి చావడిలోని కేగితిమి. అచటినుండి నట్టింటిలోని కేగుటకు మెట్టులుండెను. ఆ మెట్లను దిగఁదొడఁగితిమి. అప్పుడుమాత్ర మీసాయంకాలవేళ నిఁక ముందరుగుట సురక్షితముకాదని తోఁచెను. ఆమెట్లపై నడుగిడినతోడనే యయ్యవి శిథిలములై యుండెనని తెలియవచ్చెను. ఆమెట్లు కట్టెలతోఁ జేయఁబడినవి. మాయడుగులు వానిపైఁ బడుటతోడనే యవి కదలసాగెను. కాని, మమ్ముల నచటికిఁ బోవఁ బ్రేరేపించినయా పిశాచ మెచ్చటను నిలువదయ్యెను. నేను ప్రథమసోపానమున నడుగిడులోపలనే యామె సోపానములనెల్లదిగి, యటనస్పష్టముగ నగపడుచున్న ప్రదేశమునకరుగఁ బ్రయత్నించుచుండెను.

"అమ్మా! జాగ్రత్తగా నడువుఁడు. లేకున్న మీరును ఆ తొట్టిలోఁబడుదురు." అని మా వెనుకనున్న జనులలోఁ గొందఱనిరి.

కాని, యామె ముందరి కరుగుచునేయుండెను. ఆ చీఁకటిలో నామె యాకృతి యొకానొక పిశాచమువలెఁ బ్రతీతమగుచుండెను. ఇంతలో నామె తటాలున గమననునాఁపి చేతులు రెండును జోడించి కొని క్రిందికిఁ జూచుచు నిలువఁబడియెను. అప్పుడామె తొట్టిలోనికిఁ దొంగి జూచుచుండ వలయునని మేమనుకొంటిమి.

"ఆమె లోపలికి దుమికినది." అను నొకస్వరము వినవచ్చెను. నేను భయభ్రాంతనై ముందరికేగుచుండ నింతలో నామె మావంకకే వచ్చుచుండుట నాకగపడియెను.

"నేనాతొట్టెను జూచితిని. అది నిజముగాఁ దొట్టియే! పాషాణ నిర్మితమును, భయంకరమును, నగాధమునైనతొట్టి!" అని యామె నెమ్మదిగఁ బలికెను. అచ్చోటువాసి సోపానములనధిరోహించి, భవన బహిర్ద్వారముదాఁటి, వెలుపలకువచ్చి, మరలనామె పచ్చికపైఁ బడి యున్న ప్రియుని ప్రేతమును సమీపింపఁబోయెను. ఆమె క్షణకాల మా ప్రేతమువంకఁ జూచెను. పిదపఁ గ్రిందికిదృష్టి సారించెను. తనవైపునకే చూచుచున్నవారియెడ నిర్లక్ష్యభావమును వహించి యామె యాశవముపైకి వంగి యాప్రేతలలాటమును, చెక్కిళ్ళను, ముద్దుబెట్టుకొనియెను— మెల్లగ నేమియో యనుకొనియెను. ఆమాటలు నాకు వినరానయ్యెను. అప్పు డామెరూపమున నొకవిధమగు ప్రశాంతభావము వ్యక్తమగుచుండెను. ఆమె దేహకాంతి యాప్రేతమువలెనే నిస్తేజమును నిర్వికారమునై యుండెను. అటుపిమ్మట నామె లేచి, నా చేయిఁబట్టుకొని ముందరికిసాగెను. అంతలో నాజనసమూహమున నెవ్వఁడో యొకమాట నుచ్చరించెను. అది చెవులఁబడినతోడనే యామె యట్టె నిలిచిపోయెను. అప్పు డామెను జూచినవారందఱు నీమె యచ్చోటనే మొలకమొత్తినదని యనుకొనియుందురు. ఆమెకు విన

వచ్చినమాట "ఆత్మహత్య" యనునదియే. ఇప్పటికిని అప్పటికి నామె విలక్షణస్వరూపము నాకుఁ గన్నులఁగట్టినట్లేయున్నది. ఆమె వెల్లబాఱిన దేహమును, పలువరుస యగపడునట్లు లోక్కింత తెఱచియున్న పెదవులును, అవిశ్వాసపూర్ణమగు నామెదృష్టియు, ఇప్పటికిని నేను చూచుచునే యున్నదానను.

"ఏమి! ఆతనిపై నిట్టిదోషము నారోపించుట న్యాయమని మీకుఁ దోఁచుచున్నదా? ఆకస్మికముగనో, కాక యేరహస్యకారణమునవో, ఆతనికిట్టి మరణము సంప్రాప్తింపలేదనియుఁ, బ్రత్యక్షముగఁ దనప్రతిష్ఠకుఁ గళంకముఁదేఁజాలు నిట్టి విపరీతకృత్యమున కాతఁడు లోనయ్యెననియు, వచించుటకు మీరు సాహసించెదరా?" అని యామె గట్టిగఁబలికెను.

"తల్లీ! నిశ్చయముగ మేమట్లే నమ్ముచున్నాము" అను ప్రత్యుత్తరము వినవచ్చెను.

"డాక్టరు ప్రభాకరరావట్టినీచకృత్య మెన్నటికి నొనరింపఁడని నేను హేరాళముగ వచింపఁగలను. ఆతనికిఁ జిత్తవిభ్రమము లేదు. ఆతఁడన్నిట సుఖుఁడై యున్నాఁడు!"

ఈ తుదిపలుకు లామె మెల్లగ నుడివెను. ఆ క్షణమున నామె కపోలములపైఁ బ్రసరించియున్న రక్తిమను గనియుండనిచో, నామె భావార్థ మెవ్వరికిని దెలిసియుండఁజాలదు. కాని, యామె పలుకుల యందలి యర్థమందఱికిని దెలిసియుండవలయునని వారివారి ముఖభావములవలన స్పష్టముగ నగపడుచుండెను. ఆమెయు సంతోషవదనయై, నాహస్తమును బట్టుకొని యింటికి బయలుదేరెను.

# మూఁడవ ప్రకరణము

ఆమె ముఖముపై మృత్యుచిహ్నములు స్పష్టముగ నగపడుచుండెను. గదిలోఁ జేరినవెంటనే నేనంతయుఁ గనిపెట్టితిని. అప్పు డామె యుచ్చరించిన శబ్దముమాత్రము నన్ను విస్మయచకిత నొనరించివేసెను.

“డాక్టరు ప్రభాకరుని ప్రేతమును నాప్రేతము నొక్కమాఱే కాల్పఁబడుగాక! అతఁ డేనీటఁబడి మరణించెనో యానీరే నాతల కెక్కియున్నది. నా పలుకులు నిశ్చయపఱచుటకై నేను మరణించుటకుఁ బూర్వమె నీతో నొక్కమాట చెప్పెదను. లోకులేమైన ననుకొందురుగాక! మనసువచ్చినట్లెల్ల తర్కవితర్కము లొనరించుచుందురుగాక! నా ప్రియునకిప్పుడొదవిన మరణ మాత్మహత్యవలనఁగాదని స్పష్టముగ నుడువుచున్నాను. నీకు నాపలుకులయెడ దృఢవిశ్వాసము కలుగుటకై నీవు నాపక్షమవలంబించి, యెన్నికష్టములొదవినను సరకుగొనక సత్యమును బయలుపఱచు దీక్షనువహించుటకై, అతనికి నాకు సంబంధించిన కొన్ని విషయములను నీకుఁ దెలిపెదను. వినుట నీకిష్టమేనా?” అనియామె నన్నడిగెను.

“వినుటకిష్టమేనా!”—నేనేమియుఁ జెప్పఁజాలకుంటిని. నేను నాకుర్చీ నామెసమీపమున కీడ్చుకొని యామెప్రక్కను గూరుచుండి, యామె చెక్కులపై నాచెక్కిలిం జేర్చితిని. ఆమె తేజోవిహీనమగు రూపముతో విచిత్రస్మితముచేసి యత్యంతమృదుమధుర స్వరమునఁ దమయుభయుల చరిత్రమును జెప్పఁదొడంగెను.

“నేనును డాక్టరును బంధువిరహితులము. అతనికిని నాకును దగ్గఱచుట్టము లెవరునులేరు. ఇట్టిసమానస్థితియే ప్రథమదర్శనమున నె మమ్ముల నొక్కటిగఁ జేర్చివేసెను. నేను తొలుత విసరపురమునకు వచ్చినప్పుడు డాక్టరుగారు తమయుద్యోగమునకుఁ బ్రారంభించి కొంత

కాలమే యైయుండెను. వారి యుత్సాహమును, ఉద్యోగప్రీతియు, నసుపమేయములు. వారికిఁ గళాశాలయందలియనుభవ మెట్టిదైనమేమి!- అప్పుడును వారికి మహత్వాకాంక్షయే యుండెనని వారనుచుండ విని యుంటిని — కాని, నాయనుభవమున — వారిచ్చటికి వచ్చినప్పటి నుండియు వారియందట్టి మహత్వాకాంక్షచిహ్నములేవియు నగపడు చుండలేదు. వారిదృష్టి ద్రవ్యముమీఁదకన్న నధికముగఁ బరోపకారము నందే తగిలియుండెను. అందువలనను, వారిసత్స్వభావమువలనను వారి యందు జనులందఱు నత్యనురాగమును వహించియుండిరి. అందఱికిని వారియెడల నధికభక్తి యుండెను. అల్పకాలములోనే వారీనగరమునం దందఱికిని నతిలోకప్రియులైరి."

"నీవు వారినేకపర్యాయములు చూచియేయున్నావు. నగర మందిరమున (Town Hall) వారి యుపన్యాసము లనేకపర్యాయములు వినియున్నావు. కాని, తదితరసమయములలో వారితో నావలె మాట లాడు నవసరము నీకొదవలేదు. అట్లొదవియుండు నెడ నీకు వారిబుద్ధి స్వభావములు ప్రకటమైయుండును. వారు మాటలాడుచుండఁగా విను వారి మనసంతయు నాసంభాషణమునందే లీనమైపోవును."

"నళినీ! నీతో నిట్టివన్నియుఁ జెప్పుచుఁ గూర్చుండుట నాయి ష్టముకాదు. కాని, వారు కళాశాలలోఁ జదువుచునుండునప్పుడే వారి కొకతరుణితో వివాహము నిశ్చయింపఁబడెననిమాత్రము చెప్పుచు న్నాను. వారికామెపై ననురాగము లేదు. కాని, మాటయిచ్చిన తెఱఁగునఁ బ్రవర్తించుటయె వారి నిశ్చయమైయుండెను— కాను— ఆమెను వివాహమాడినచోఁ దాను సుఖింపఁగలుగుదుననునాశయు వారికిఁ దోఁచుచుండెను — కాని — నళినీ! వారు పరలోకవాసులైరి. నేనును బ్రయాణోన్ముఖనై యున్నాను. ఇప్పు డవియన్నియు నేను మఱవవలసియుండెను. ఆఱుమాసములకుఁ బూర్వము నాకు వారి ప్రథమ సందర్శన మొదవినది. అప్పటినుండియు మెల్ల మెల్లగ నాకుఁ

తెలియకయె నామనసు వారికడకరిగి ప్రేమింపఁదొడఁగుటను దలంచుకొన్నచో నప్పటికి నిప్పటికి నేనొడలు మఱచియేపోవుచుందును — లోకమే మఱచియుందును — అటుపిమ్మటఁ గొంతకాలము గడచెను. అప్పుడప్పుడు మేమొండొరులఁ జూచుకొనుచుంటిమి—అప్పుడొకటి రెండు మాటల నాడియుందుము — అప్పుడా సందర్శన సంభాషణములచే నా మనసున కెట్టిపరిణామము కలిగినదో నేను జెప్పఁజాలను. ఆతఁడో— తనమనస్థితిం గనిపెట్టి నాతోఁబలుకుటయు, సరళరీతిఁ బ్రవర్తించుటయుఁ దగ్గించెను. వారు నిస్తేజముగఁ గనఁబడసాగిరి. దేహస్థితి యుండవలసినరీతిగ నుండలేదు. వారి యంతఃకరణమునఁ దుములయుద్ధము జరుగుచుండెను—అప్పుడది నేను దెలిసికొనఁజాలనైతిని. ఏలయన— వారి కింకొకతరుణితో వివాహము నిశ్చయింపఁబడెనని నేనెఱింగియుంటిని. కావున, వారికి నాయందలిప్రేమ దినదినప్రవర్ధమానమగుచుండెనని యనుకొనుటకు నాకు సాహసము కలుగదయ్యెను. తుదకు వారు వ్యాధిగ్రస్తులైరి. తమయుద్యోగమును జూచుకొనుటయే వారికిఁ గష్టమయ్యెను. మేమిరువురము నత్యల్పదూరముననె యుండినను నాకు వారిదర్శనము లభించుటయే కఱవయ్యెను. వారేదో రోగమువలన బాధపడుచున్నారని కొందఱనుచుండిరి; మఱికొందఱాయన కేదియో యాకస్మికబాధవలన హృదయముభేదించె ననుచుండిరి. ఇత్తెఱంగున వారి దేహాస్వస్థతకాలమున నాకుఁ గలిగిన చింతయు, నిరాశవలన దుఃఖమును, నెమ్మదిగ నొక్కనెలవఱకు నోపికతో నేనోర్చుకొనవలసివచ్చినది. ఒకనాఁటి ప్రాతఃకాలమున—ఆహా! నేనాప్రాతఃకాలము నెన్నఁటికైన మఱవఁగలుగుదునా?— వారు నాకొక యుత్తరము వ్రాసియుండిరి, ఆయుత్తరమున వారి విషయములు కొన్ని వ్రాసియుండిరి. తాము కళాశాలలోనుండ నొకకన్నియతోఁ తమకు వివాహము నిశ్చయింపఁబడుటయు, పిమ్మట నన్నుఁజూచినప్పటినుండియుఁ దమహృదయమునఁ బ్రేమోదయమై యదివికాసము

నొందుటయు మొదలగు విషయములన్నియు నందుండెను. అంతే కాక, యా యుత్తరమున నింకను "పుష్పలతా! ఈమధ్య తఱచుగ నిన్ను నేను చూడకుండుటకును, నీతో మాటాడకుండుటకును గారణ మిదియే. నాహృదయము నీకడకుఁ బరుగువారుచున్నను, నేను మాట యిచ్చిన యాకన్నియను మోసపుచ్చునట్టి యధమకృత్యముననే నెన్నటికిని బాల్పడువాఁడఁగాను. కావున వ్యర్థముగ నీకుఁ గపటమోహమున నాసఁజూపి, పిదప నిన్ను దుఃఖసాగరమున ముంచుటయు — నేను మునుఁగుటయు నాయభీష్టములు కావు. కాని, కొన్నాళ్ళకుముం దాకస్మికముగ నొకవిషయము సంఘటిల్లినది. నేనేతరుణిని వివాహమాడ నుంటినో, యాబిడ్డ స్వైచిత్త్యము చేతను ఆమెమాతాపితరులయిచ్ఛానుసారముగను, ఆవివాహము నిశ్చయమయ్యెను. అందు నాయం దావంతయు దోషములేదు. ఇత్తెఱఁగున నేనామాటనుండి విముక్తుఁడ నైతిని. నిన్నుఁ బ్రేమించు నధికారస్వాతంత్ర్యములు నాకిప్పుడు ప్రాప్తములై యున్నవి. ప్రియా! పుష్పలతా! ఇంతకన్న నింక నెక్కుడు వ్రాయుటలో లాభమేమున్నది? నీవు నామనోగత మెట్లు తెలిసికొని యుంటివో, నేను నట్లే నీమనోగతము నెఱుంగుదును. నీవీయుత్తరమునకుఁ బ్రత్యుత్తరము వ్రాయకుండినను మౌనంసమ్మతిలక్షణమ్మని నేను భావింతును." అనియు వ్రాసియుండిరి.

"నళినీ! ఆతనియందు దోషము లేదని నీతోఁ జెప్పసాహసింపను. ఆతఁ డతికోమలహృదయుఁడు. సుకుమారశరీరుఁడు. ఆతని కిష్టము కాని పలుకు లెవ్వరైన నాడుట నాతఁడు వినెనా వెంటనె యాతని ముఖము నిస్తేజమగును. ఎన్నఁడైన దేహమున కొంకింతయాయాస మయ్యెనా యాతఁడు కడుంగడు భయపడుచుండును. డాక్టరు విద్య నభ్యసించి యుహాన్నిత లాయుద్యోగమున మునిఁగియుండు నాతఁడు నైత మిట్టిస్థితికిఁ బాల్పడుట నాకత్యంతాశ్చర్యమగుచుండెను. ఆతని యందీయల్ప దోషముతక్క మఱెట్టిదోషములును లేవు. ఆతనికి సద

సద్వివేకబుద్ధి యతితీవ్రముగనుండెను. ఇందువలన నాతఁ డనేకములగు కష్టముల ననుభవింపవలసివచ్చెను. ఇట్లు దీర్ఘకాలమునుండియు బాయ కున్న మానసికవ్యథ యెప్పుడెట్లు నివారితమైపోయినదో — నన్నాతఁడు ప్రేమించుట కెప్పుడు స్వతంత్రుఁడయ్యెనో. యప్పుడు నాకెట్టి యానం దము కలిగినదో, నీవే యూహించుకొనుము! ఇది జరిగి యిప్పటికి మూఁడే వారములైనది. ఈ సమయమున నాతఁడు తనజీవితము నీరీతిగ నంత మొనరించుకొని స్వనామమునకుఁ గళంకముఁ దెచ్చుకొనునని నీకుఁ దోఁచుచున్నదా? చెలీ! అనుమానమువలదు. నీ మనసులోని మాటను జెప్పుము."

"అట్లు చేయఁడు. నిశ్చయముగ నాతఁ డెన్నఁడు నట్లుసే యఁడు" అని తటాలున నేనంటిని.

ఆమె: ఈమధ్య నాతఁ డస్వస్థుఁడై యుండెను. ఎప్పటివలె నాకతనిదర్శన మగుచుండుటలేదు. కారణమేమన — వివాహమునకుఁ బూర్వమే యాతఁ డొకగ్రంథము వ్రాసి ముగింపవలయుననుటయే. కాని, అది — ఇంకెన్నటికిని ముగియదు — నేఁడే వివాహదినము. వధువు సిద్ధముగనున్నది. నళినీ! (గట్టిగా) ఇంతలో నేను పోవఁజాలను. ఆతఁ డాత్మహత్య చేసికొనలేదని యొక్కమారు నీవనుము! అనుము!" అని మరల నుత్సాహపూర్ణస్వరమున "ఆతఁ డాత్మహత్య చేసికొనలేదని నేను మనస్ఫూర్తిగ నమ్మియున్నానని యనుము" అనియెను.

నేను: ఆతఁ డాత్మహత్యఁ గావించుకొనలేదని నేను మనః పూర్వకముగ నమ్ముచున్నాను" అని యంటిని. ఆమె దృష్టియందలి మెఱుపును, ఆమెవిలక్షణ స్వరూపమునుగాంచి నేను భయపడుచుంటిని.

"మఱియు, నళినీ! ఎవ్వరైననుసరే; ఎంతచెప్పిననుసరే; నేను నీ పక్షము నుద్యజింపనని నాకుమాటయిమ్ము. లోకు లాతనిస్మృతి కెన్ని తెఱఁగులఁ గళంకముఁ దేఁ బ్రయత్నించినను, నేను వాని నిరపరాధిత్వ మును, గౌరవమును లోకమున శాశ్వతముగ నుండునట్లు చేయఁ బ్రయ

త్నింతునని యనుము. నీవీవిషయమున నా ప్రాతినిధ్యమును స్వీకరించుట కాయత్తవగుము. అప్పుడు నిన్ను నేనత్యధికముగఁ బ్రేమింతును; నీ యక్షయసుఖమును గోరుచుందును" అనియెను.

అప్పుడు "పుష్పలతా! పుష్పలతా!" అని నేను గద్గదస్వరముతోఁ బలికితిని.

"నీవు నావిన్నపము మన్నింతువుకాదా! నీపై నేను విశ్వాసముంచవచ్చునని, నా హృదయమున నమ్మిక ముదయించిన యాక్షణమే మహానందముతో నేను బ్రాణములను విడుతును!"

నేనామె చేతులను బట్టుకొని యామె చెప్పిన తెఱఁగునఁ బ్రవర్తించెదనని మాటయిచ్చితిని. ఏలన — లోకుల కొకరి విషయమున నెట్టి యభిప్రాయమైనఁ దొలుతనుదయించెనా, దానినిమార్చుట కష్టకార్యము! అటులొనర్పఁ బ్రయత్నించుటయు నిరర్థకమని నేనెఱిఁగియుంటిని.

"ఆతనికి శత్రువనువాఁ డొక్కఁడైన లేఁడు. కాని, యాతఁ డాత్మహత్యఁ గావించుకొనెననుటకన్న నాతనికిని శత్రువుండెనని నేనానందముతోఁ జెప్పుదును" అని పుష్పలత చెప్పెను.

ఇత్తెఱఁగున నామె తన యుదంతమంతయు నాకు సంపూర్ణముగఁ దెలిపి సంతుష్టచిత్తయై ప్రకంపితగాత్రముతో లేచి బల్లకడ కరిగి యేమో వ్రాయసాగెను. పిమ్మట "గోపికాబాయినిఁ బిలువుము." అని చెప్పెను.

మేమున్నగది కానుకొనియున్న గదిలో గోపికాబాయి నివసించుచుండెను. ఆమె పతివిహీన; మంత్రసానివృత్తితో నుదరపోషణముఁ గావించుకొనుచుండును. నాకునప్పు డామెసాంగత్య మవశ్యమై యుండెను. ఏలన — పుష్పలత రూపము క్షణక్షణమునకు మిగుల నిస్తేజమగు చుండెను. ఆమె యింతకుమున్నే "నేఁడే నావివాహదినము" అని చెప్పియుండెనుగదా! అది నిజమగునేమోయని నాకుభయమగుచుండెను. నేను గోపికాబాయిని బిలువఁబోయిన యల్పావకాశము

నని యామెయు నేనును గలిసి మరల మాగదిలోనికి వచ్చితిమి. పుష్పలత యిప్పటికింకను వ్రాయుచునే యుండెను. పుష్పలత మహా శాంతస్వరమున "రంభ" అనియెను. ఈ స్వరము చెవినిబడినంతనె గోపికాబాయి యులికిపడెను. నేననినట్లు పుష్పలతరూపము నిస్తేజముగా నుండెనో లేదో యని యామె పుష్పలత ముఖమువంకఁ బాఱఁజూచెను. ఈ కాగితముపై మీరిరువురు సాక్షులుగాఁ జేవ్రాలు సేయుఁడు" అని పుష్పలత చెప్పెను.

ఆమె తన చేవ్రాలు చేసి యా కాగితము గోపికాబాయిచేతి కిచ్చెను. ఆమెయు మాఱుమాటాడకుండ నందుఁ జేవ్రాలు చేసెను.

"ఇయ్యది నా మరణశాసనము" అని పుష్పలత విషణ్ణహాసము చేసెను. మరల "ఈసమయమున న్యాయవాది యభిప్రాయమును గైకొనుట దుస్తరము. అయినను, నా తుదికోరికకు విరుద్ధముగా నెవ్వరును బాధింపరని నాకుఁ బూర్ణవిశ్వాసము కలదు" అనియెను. నేనా కాగితముపైఁ జేవ్రాలు చేసి యామె చేతికిచ్చితిని. దానినందుకొని యామె వడఁకుచు నన్ను విలక్షణదృష్టితో వీక్షింపసాగెను. అప్పుడు నా హృదయము కరఁగి నీరయ్యెను. ఆమె నన్నుఁగని "నాకు నీయెడలఁ బూర్ణవిశ్వాసము కలదు" అని లేచిపోయి, మంచముపైఁ బరుండెను.

గోపికాబాయి యనిష్టసూచకదృష్టితో నన్నుఁ గాంచి "నీవు పోయి డాక్టరు కృష్ణారావుగారినిఁ దోడ్తెచ్చిన బాగుగనుండును" అనియెను. అందువలన లాభమేమియుఁ గలుగఁజాలదని నేనెఱింగియుఁ దత్క్షణమే లేచి వెడలిపోయితిని. డాక్టరు కృష్ణారావుగారింటియొద్ద లేక పోయిరి. అక్కడనుండి మఱియిద్దఱుముగ్గురు డాక్టరులయిండ్లకును వైద్యులయిండ్లకును బోయితిని. అదేమి వేళయో — అప్పుడొక్కరును గృహమున నుండరైరి. చేతులాడించుకొనుచు నేనింటికి వచ్చితిని. నేనెంతోసేపు బయటనుండలేదు. తత్క్షణమే వేవేగముగ నడచివచ్చితిని.

ఇప్పుడు నాకామెపై నెంతో ప్రేమ యుదయించి యుండెను. నాకామె సహవాస మింకఁగొన్నినిమిషములకంటె నెక్కుడు సేపుండఁ జాలదని నేననుకొంటిని. కావున, నీయల్పకాలమైన నామెసహవాసమున నేను కాలము గడపవలయునని యాసపడితిని—అది నాకత్యంతావశ్యకమును, విధాయకకృత్యమునై యుండెను.

గోపికాబాయి ద్వారముకడనె నన్నుఁ గలిసికొనియెను. ఆమె విన్నఁదనముతో నన్నొకప్రక్కకుఁ దీసికొనిపోయి మంచమువంకకు వ్రేలుసూపెను. ఆమంచముపైఁ బుష్పలత శయనించియుండెను. ఆమె దేహము తెల్లనై యుండెను. ఆమె కనులు మూసికొనియుండెను. ఆమెకనుఱెప్పల కదలికవలన నామె జీవించియున్నదని తోఁచుచుండెను. పుష్పలత సమీపమున నామెప్రియుని చిత్తరు వుండెను. ఆమె యనూనప్రేమకును, ప్రియునిమరణమువలన నామెకుఁ గలిగిన గాఢవిషాదమునకును, అతిశోచనీయస్థితికిని, నాహృదయము ద్రవీభూతమగుచుండెను. ఆమె సర్వాంగముల శాంతి సామ్రాజ్యము సేయుచుండెను. మరణమువంటిదుఃఖ మింకొకటి లేదని లోకులనుచుందురు. అది నిజమని నాకిప్పుడు తెలిసెను.

నేనామెను సమీపించితిని. అప్పు డామె శాంతతకు భంగమయ్యెను. కనులు తెఱచి యామె తడవుగ నన్నుఁ జూచెను. అటు వీక్షించుటచే సంతుష్టయైకాఁబోలును, మరలఁ గనులు మూసికొనియెను. ఒక్కసారి మాత్రము నిట్టూర్పువిడిచెను-ఆయుత్తరక్షణముననె-

## నాలుగవ ప్రకరణము

ఈనాఁడుజరిగిన వన్నియు భయంకరకృత్యములే. కాని, యీ భయంకరకార్యము లింతటితో ముగియలేదు. కాదు—ఇంతకన్న నతి భయంకరస్థితి నాయనుభవమున నింకను ముందున్నది. నేనొక్కరితనే

యాశవమున్న గదిలోఁ గూరుచుండియుంటిని. నడిరేయి మీఱుచుండెను. అప్పుడాకస్మికముగా నాగదితలుపులు తెరవఁబడియెను. వెంటనే గోపికాబాయియు డాక్టరు కృష్ణారావుగారును లోనికేతెంచిరి.

డాక్టరుగారు లోనికివచ్చుచు మెల్లగ "ఇదిమిగుల విచిత్రమే! ఒక్కకారణముననె యొక్కరు మరణించుటయు, మఱొక్కరు మరణశయ్యనుండుటయు మహాశ్చర్యముగాక మఱేమి?" అని నుడివిరి.

అతని మనోగతి యిట్టిదని నేనూహింపలేనైతిని. కావున, విస్మితురాలనై యాతనిం జూచితిని. కాని, యాతఁడు మాత్రము నాదృష్టి నవలోకింపఁడయ్యెను. అతఁడు పుష్పలత పరుండియున్న మంచముచెంత కరిగెను; సంతప్తదృష్టితో నొక్కింత సేపాతఁడు పుష్పలతను జూచెను. పిదపఁ దటాలున గోపికాబాయివంకకుఁ దిరిగి యాతఁడు—

"ఇటనుండవలసినపనిలేదు. ఈకాంత యిహలోకమును వీడి యెంతోసేపైనది. ఆవల నింకొకగొప్ప రోగికడకుఁ బోవలసియున్నది. అక్కడకు నీవును రావలయును" అనియెను.

గోపి : మఱి—

డాక్ట : నేను నీకొఱకే వచ్చితిని. రానని చెప్పఁబోకుము. వారు చాల గొప్పవారు.

గోపి : కాని, డాక్టరుగారూ! నేనిప్పుడు రాఁజాలను. నేనరుణోదయముననేలేచి మఱొకచోటి కరుగవలయును. కావున, సంతకుఁ బూర్వము నేనొకనాల్గుగడియలు విశ్రాంతికై పరుండఁబోవుచుంటిని. ఇంతలో మీరు వచ్చితిరి.

డాక్ట : నీవు డాక్టరువిష్ణుపంతుగారిరోగికడ కేగుదువు కాఁబోలును!

గోపి : అవును.

డాక్టరుగారి ముఖమునఁ గోపచ్ఛటలు ప్రసరించెను. అతఁడేదియో తనలో గొణుగుకొనియెను. ఆనిముసముననె నేను డాక్టరును సమీపించి "డాక్టరుగారూ! మీరునాయెడ విశ్వాసముంతురేని నేనీ

కార్యము నొనర్ప సంసిద్ధనై యున్నాను. నాకు నొకింత యనుభవముం దుటయేకాక—అని నేనింకను మాటలాడఁబోవ నింతలో నాతఁడొక విధముగ నన్నుఁ జూచెను. నేనాచూపువలన భయపడితిని. నానోట మాట రాదయ్యెను. నావాక్య మసంపూర్తిగనె యుండిపోయెను. ఇంతలో డాక్టరు "నీపేరేమి?" అని యడిగెను.

నాపేరు చెప్పితిని. గోపికాబాయియు నాయెడల నాదరభావమగపఱచుచు "విశేషానుభవముగల మనుష్యుల యావశ్యకత లేనిచో శ్రీమతి నలినీబాయి మహోత్తమరీతిఁ దనకార్యభారమును నిర్వహింపఁ గలదు!" అనియెను.

కాని, డాక్టరుగారి నిర్వికారస్వరూపమువలనను, స్థిరదృష్టివలనను, నాతని కామె పలుకులయందుకన్న, స్వాభిప్రాయమునందే యధిక విశ్వాసమున్నదని నాకుఁ దెలిసెను.

"ఏదైన రహస్యము నెట్లు గుప్తముగా నుంచవలయునో నీవెఱుఁగుదువా?" అని యతఁడు నన్నడిగెను.

నేనులికిపడితిని. ఇట్టియసందర్భ ప్రశ్నమునువిని యెవ్వరులికిపడకుందురు?

డాక్టరు నాయాకృతియుఁ గలవరపాటునుఁ గని "నీవు రహస్యమును రహస్యముగా నుంపఁగలవనినాకుఁ దోఁచుచున్నది. బయలుదేరి వచ్చుటకు నీకింకనెంత యవకాశముండును? ఒకవేళ నీవటఁ గొన్నినాళ్ళవఱకు నుండవలసివచ్చును. లేదా, మూఁడునాలుగు గంటలలో నీకార్యము సమాప్తి నొందవచ్చును." అనియెను.

"పది నిమిషములలో సర్వము సిద్ధపఱచుకొని బయలుదేరినచో నాలస్యమైనదని యనరుగదా!" అని నేనడిగితిని.

ఆతఁడు మందహాసము చేసెను. ఆహాసమున నేదియో రహస్యభావము నిండియుండెను.

" పదునెనిమిది నిమిషముల వ్యవధి నిచ్చెదను " అని యాతఁడు తలుపుకడకరిగెను. ఆతఁడు తటాలునఁ దలుపుకడ నిలిచి వెనుదిరిగి " రోగియెవ్వరైనదియు, ఎవ్వరికడ కరుగుచున్నదియు నడుగలేదేమి ?" అనియెను.

" నేనది మఱచిపోయితిని. "

" కాని, రోగినాదరించుట మఱతువేమో ! " అట్లు జరుగరాదు సుమా ! ఆరోగి యొకస్త్రీ. ఆమెపేరు కమలాబాయి, నారాయణరావు గారి తల్లి. "

" నారాయణరావుగారి కమలాబాయి ! ఈపేరువిని గోపికాబాయియు నేను నాశ్చర్యనిమగ్నులమైతిమి. మేమొండొరులవంకఁ జూచుకొన సాగితిమి.

కొంతసేపటికామె " కమలాబాయియా, ఆమె జబ్బుగానున్న దని నేను వినలేదే " అనియెను.

" నేఁడు రెండుజాములవఱకు నామె బాగుగనేయున్నది. అటు పిమ్మట నాకస్మికముగ రోగగ్రస్తయైనది. ఈవ్యాధిని మేము రక్తజమూర్ఛ (హిస్టీరియా) యందుము. డాక్టరు ప్రభాకరరావుగారి మృత్యువార్త విని యామె వ్యాధిగ్రస్త యయ్యెను.

ఇవ్విధముగా నాతఁడు కడపటి బాణప్రయోగమును జేసి గది నుండి వెడలిపోయెను. నాకొకించుక యాయాసముగా నుండి మంచముపైఁ బరుంటిని. మరలలేచి కూర్చుంటిని. నాలో నేనిట్టులనుకొంటిని.

" ఏమైననేమి ? పుష్పలతయిచ్ఛయించినకార్యము నాచేతఁ బడుట మంచిదియే. ఇట్టికార్యార్థము నేను శవమునైన విడిచిపోవలయు ననియే పుష్పలత యిచ్ఛయైయుండఁబోలును ! "

నాడెందమునఁ గొంచెము సంశయముండెను. డాక్టరు ప్రభాకరుని మృత్యువార్త వినుటతోడనే కమలాబాయి యాకస్మికముగా ధరణిపైఁ బడుటఁజూడఁగా నామె యధికసుకుమార మనోవృత్తికలదని తేటపడుచుండెను. కాని, యామె నైజముచేఁ బాషాణహృదయ ; కే

కేవల స్వహితతత్పర; స్వార్థపరయని నేను వినియుంటిని. ఇత్యాది వ్యర్థారోపణ మేల కాకూడదు? ఆమె నిశ్చయముగఁ గోమలహృదయ కాదని గుండెలపైఁ జేయిడి చెప్పసాహసించువా రెవరు" కమలాబాయి వైభవ పన్నులలోఁ జేరినయామె యగుటచే బీదలామెయందలి దోషములను లెక్కపెట్టుచుండుట స్వాభావికమే. కావున, నామె విషయమై యిప్పుడేయభిప్రాయము నుంచుకొనరాదు, కొంతకాలమునకుఁగాని యిట్టిదని నిర్ణయింపరాదు.

పావుగంటలో నేను బయలుదేరుటకు సిద్ధపడితిని. శవదహన కార్యమంతయు గోపికాబాయి తనపైఁ బెట్టుకొనినందున నాహృదయమందలి విచార మించుకతగ్గెను. డాక్టరు కృష్ణారావుగారు నాకొఱకు నడవలో నిరీక్షించుచుండిరి. నేను సమయమునకు వెడలుటఁగని యాతఁడు పట్టరాని సంతోషమునందెను.

"నడువుము; దీనికే సమయపాలనమని యందురు" అని చెప్పుచు డాక్టరుగారు ముందునడువసాగిరి. నేను వెనువెంటనె వెడలితిని.

బయట మాకై నిలిచియున్న డాక్టరుగారిబండినెక్కి కూరుచుంటిమి. కొంతసేపు మేమేమియు మాటాడుకొనలేదు. ఆతఁడు విచారాక్రాంతుఁడై యున్నట్టు లగపడెను. ఇఁక నేనో-తలపైనిడికొన్న దుర్ఘట కార్యభారమునకై, ధైర్యము నవలంబించుటలో మగ్నునై యుంటిని. ఏలన—డాక్టరు ప్రభాకరరావుగారి మరణవార్త వినినంతనె మృత్యుపథమునఁ జిక్కనున్న— కాక, చిక్కియున్న—స్త్రీయొద్దకు నేను పోవుచున్నానని నాహృదయము నాకుఁ జెప్పుచుండెను. ఈ కారణమున నాహృదయమున నొక విధమగు నజ్ఞాతభయ ముద్భవమైయుండెను. అంతియేగాక, తమోమయంబగు నారాత్రియు, అగమ్యమగు నామార్గమును, భయానకములుగా నుండెను. నిశ్చయముగనె యాప్రకరణమునందేదియో రహస్యమును, భయంకరమునైన కార్యము నిండియున్నదని నాకుఁ దోఁపసాగెను. మఱియు, నేగృహమునఁ బట్టపగలైనఁ బ్రవేశిం

చుటకు భయమగుచుండునో, యట్టి నారాయణరావుగారి పురాతన భవనమును — ఆ మందిరమును సమీపించుకొలంది నాహృదయము కంపింపఁ దొడఁగెను.

డాక్టరు కృష్ణారావుగా రీవిషయమై యేమియుఁ జెప్పరైరి. కాని, వారు నా హృదయావేగమును, మనస్థితియు, నెఱిఁగియున్నట్లుగపడిరి.

డాక్టరు: (సౌమ్యస్వరమున) నళినీబాయీ ! రోగిచెంత నూరక కూర్చుండియుండుటకన్న మహత్తరకార్యమేదైనఁ జేయవలసియుండు నెడల నిన్నుఁబోలినయనుభవస్త్రీపై నేనావంతయు నమ్మకముంచియుం డను — నేనిట్లనుటచే నీకుఁ గోపము రాదని తలఁచెదను. కమలాబాయి నిశ్చేష్టయై పడియున్నది. ఆమెకు మరలఁ జైతన్యము కలుగువఱకు నీవామె సమీపమునఁ గూరుచుండుటయేనీపని. ఆమెకుఁ జైతన్యము కలిగినఁ గలుగవచ్చును. ఒకవేళ కలుగకుండఁబోవచ్చును. ఎట్లును నిశ్చయము చెప్పఁజాలను. ఆమెవ్యాధి యసాధ్యముగ మారినది.

కార్యము బహుసులభముగ నుండినందున నేను ధైర్యముతో "సరే !" అని చెప్పితిని.

"కమలాబాయి కుమారు లచట సమీపముననె యుందురు. ఎప్పుడుపిలిచిన నప్పుడే వత్తురు. నేను నచ్చటనెయుందును. జేపటియుద యమునఁ గమలాబాయి కుమారిత సరస్వతి రానున్నది. నీవామె నెఱుఁగుదువా ?"

"నేనెఱుఁగ" ననునర్థము వచ్చునట్లుగఁ దలఁద్రిప్పితిని. నాకు సరస్వతితోఁ బరిచయముండుటకుఁ గారణమేముండును ! నేనెవ్వతెనని యట్టి గొప్పవారి పరిచయమును సంపాదింతును ! కాని — అయ్యో ! నా పూర్వవృత్తాంతములతోఁ బాఠకుల నాయాసపెట్టనని తొలుత నేటికి వచనమిచ్చితిని !

"సరస్వతి యాగమనము రోగికుపయుక్తముగానుండు ననికాదు; కాని, యామె వచ్చిన బాగుగనుండును !" అని డాక్టరనియెను.

నారాయణరావుగారి సోదరి సరస్వతి యత్యంతసుస్వరూప యనియు, నామె యొకజహగీరుదారుని బెండ్లాడియున్నదనియు నేను వినియున్నట్లు నాకు జ్ఞప్తియున్నది. కాని, నేనేమియుఁ బలుకలేదు. ఏలన— ఈనారాయణరావుగారి వంశమఁవారివిషయమై సంపూర్ణముగ వినవలయుననుకోర్కె చిత్రముగ నాహృదయమున జాగరిత మగుచుండెను. కావున, వారివిషయమై యెవ్వరేమి చెప్పినను నేను మౌనముతో వినుచుందును.

ఇంతలో నిర్ణీతస్థలమునకు — నారాయణరావుగారి భవనము ముందఱ నున్న తోఁటవాకిలికడకు మాబండివచ్చి నిలిచెను. అనంతరము ద్వారమువెంట బండి లోపలికిపోయెను.

మేము బండినుండి దిగితిమి. అచ్చటి భయంకరదృశ్యము లన్నియు నాహృదయమును వడఁకింపసాగినవి. స్వాభావికముగనె డాక్టరుగారిని ముందు నడువనిచ్చితిని. నేను వారివెంట నడువసాగితిని. లోని కేగినపిమ్మట మాకెదుటనె పున్ననున్న తలుపుచెంత నొకతరుణపురుషుఁడు నిలిచియుండుట నాదృష్టిఁబడెను. ఆతఁడు తటాలున ముందఱికి వచ్చెను. పైనిఁ ద్రేలాడుచున్న దివ్వియవెలుతురున నాతనిరూపము నాకు స్పష్టముగఁ గనఁబడెను. నేను బెదరితిని.

నేనెందులకు బెదరితిని ; కారణమేనెఱుఁగను. ఆతఁడు నాకన్నులకు రూపవంతుఁడై కనఁబడినందున నేనులికిపడియుందునా, కాదు. అట్టిది నాకెన్నఁడును గలుగఁజాలదు. ఆపురుషుని మొగమున నొక్క విధమగు విచిత్రచ్ఛాయ ప్రసరించియుండెను. అందువలన నాకతని యెడ ననూయవొడమెను. ఇంతమాత్రమున నిచ్చటి కేలవచ్చితినా యని నేను చింతించుచుంటినని యెవ్వరైన ననుకొందురేమో ? అట్లనుకొనరాదు. నాకట్టివిచార మదయింపలేదు. ఈపురుషుని రూపమును జూచినంతనె యతని హృదయమాలిన్యము, గూఢముగ నాతని మొగమునఁ బ్రతిబింబించుచున్నట్లు నాకగపడెను. ఆనిగూఢరహస్యమేమో,

యెట్టిదో, కనుగొనవలెనని, నాకెక్కుడు జిజ్ఞాసపొడమెను. అందులకై ప్రత్యక్షమృత్యుదేవత యడ్డపడినను నేఁగృహమువదలి రాఁబోను!

"సెబాస్! డాక్టరుగారూ! మీరు మీతో మంత్రసానిని (నర్సును) దోడ్తెచ్చుట మంచిపనియే!" అని మటనున్న పురుషుఁడు డాక్టరుతో ననియెను. ఆతని స్వరము నాతని రూపమువలెనె తీక్ష్ణముగ నుండెను. ఆతనిదృష్టియు, నాదృష్టియు, గలిసినప్పు డాతఁడు "ఏమీ! ఈమె గోపికాబాయివలెఁ గనఁబడుటలేదే!" అనియెను. పిమ్మట డాక్టరు నాతఁ డింపుక దూరమునకుఁ బిలిచికొనిపోయి మెల్లగా— (కాని. యది నాకు వినవచ్చుచుండెను)—"మీరీ తరుణస్త్రీ నేటికిఁ బిలిచికొని వచ్చితిరి! ఇట్టి చిక్కుసమయమున మనకొకప్రౌఢస్త్రీ యావశ్యకమనుమాట మీరు మఱచితిరేకాఁబోలును?" అనియెను.

"లేదు" అని డాక్టరు చెప్పిన వాక్యము నాకు వినవచ్చెను; కాని, యాతనివీఁపు నాప్రక్కనుండుటచే, వారి తరువాత సంభాషణము నాకు వినరాలేదు. కాని, "ఈమె తనకిచ్చవచ్చినటు లొకరిసంగతు లొకరితోఁ జెప్పునట్టిస్త్రీకాదు" అని డాక్టరు చెప్పిన యీయంత్య వాక్యము మాత్రము నాచెవినిబడియెను. దాన నామనసున నైజముగనె, అన్యులకు గోచరము కాఁగూడనంతటి రహస్యవిషయమేమై యుండునా యను ప్రశ్న యుదయించెను. నాకేమియుఁ దోఁచదయ్యెను.

పురు: "కాని, యిట్టితరుణస్త్రీని మాతల్లికడ నుంచఁదగదు. మాకెట్లు—" ఆపై శబ్దము నాకు వినరాలేదు. కాని, డాక్టరుగారివలన నేనావాక్యమందలి యర్థమును గ్రహించితిని.

డాక్టరు: "ఏలా! నీవును రాత్రియంతయు జాగరణము చేయుచుఁ గూర్చుందువా?" అని యాశ్చర్యముతో నాతని నడిగెను.

పురు: ముఖ్యముగా నేనును నాతమ్ముడును మాతల్లియొద్దఁ గూర్చుందుము! అది మాపవిత్రకర్తవ్యము, ఒకానొకయపరిచిత తరుణి

స్వాధీనమున మాతల్లినివిడిచి మేము స్వస్థముగాఁ బరుండియుందుమని మీకుఁ దోఁచుచున్నదా ?

అటుపై డాక్టరుగారేమియుఁ బలుక లేదు.

పురు : (సంతప్తభావముతో నన్నుఁగని) నాకిదేమియు బాగుగ నుండ లేదు. ఈ సమయమున గదిలోనొకయన్యస్త్రీ యుండుటయె యత్యావశ్యకమా "—ఇఁకనాతఁడేమియుననలేదు. అతఁ డత్యంతగంభీర భావముతో నాయొద్దకువచ్చి ప్రేమతో నాకు స్వాగత మొసఁగి మేఁడపై నాకొఱకు నియమింపఁబడిన గదికడకు నన్నుఁ దీసికొనిపోయెను. ఆగది తలుపుకడ నిలిచి యాతఁడు "త్వరగా లోనికిరమ్ము. నీవొనర్పవలసిన కార్యము లేవియో నాసోదరుఁడు చెప్పును" అని వెడలిపోయెను.

ఇంతవఱకు నాకాయింట నొక్కస్త్రీయు నగపడ లేదు.

కమలాబాయి యొక్కదాసీనైన నేటికుంచదయ్యెనో తెలియు లేదు. ఆ విషయమున నేనాలోచింపసాగితిని. ఇంతలోఁ దలుపుఁ దెఱచి యొకయువతి లోనికివచ్చెను.

"క్షమింపుము ! ఇప్పుడువచ్చిన (Nurse) పరిచారిక యిక్కడ నుండఁబోలు ననుకొని వచ్చితిని" అని యామె యనియెను.

"నేనే యాపరిచారికను" అని నేనామె వింతచూపుల కబ్బుర పడుచుఁ జెప్పితిని. "నీకు నాతో నేమైనఁ బనియున్నదా ? అని మరల నేనడిగితిని.

యువతి : (తిరస్కార దృష్టులతో) లేదు. నీకేమైనఁ గావలయు నేమో యడిగి తెలిసికొన వచ్చితిని.

ఇప్పుడు నాకేమియు నక్కఱలేదని నేనతిమృదుస్వరమునఁ జెప్పితిని. ఆయింట నెవ్వరితోడను శత్రుత్వము కలుగునట్లు ప్రవర్తింపఁ గూడదని నేను నిశ్చయించికొని యుంటిని.

ఆ యువతి "నిజముగా నీవే ?" అని నాకడకరుదెంచి పరీక్షా పూర్వకదృష్టితో నన్నుంగని యడిగెను.

నేను : ఔను, నిశ్చయముగా నేనే ! నీతో నన్నృతము చెప్పుట వలన నాకేమిలాభము !

యువతి : (ద్వేషముతో) ఇది మహాశ్చర్యమే ! కమలాబాయికి నాపై నెంతో ప్రేమయుండెను. ఆమె నిన్నటిదినమున జబ్బుపడువఱకు నేనే యామె సేవలుచేయుచుంటిని ; ఇప్పుడు నామెకు సేవలొనర్ప సిద్ధముగా నున్నదానను. కాని, వారు నన్నామెగదిలో నొకయుమైన నిడనీయరు. నేనందులకుఁ గారణము వారినడుగఁగా వారు "నీవింకను జిన్నపిల్లవు ; రోగికిసేవసేయువిధము నీకుఁ జక్కఁగఁ దెలియదు." అని చెప్పిరి. ఇఁక నీవో, నాకన్నఁ జిన్నదానవు—కమలాబాయికి, నీకు నించుకంతయుఁ బరిచయములేదు. వారు నన్నేటికిట్టులవమానించిరో ! చీ ! చీ ! ఇది నాకెంతమాత్రమును బాగుగలేదు.

ఆ యువతి నిజముగనె చాలఁ గోపించియున్నదని నాకుఁ దెలిసి యామె కోపమును శాంతింపఁజేయుటకై నేను "డాక్టరుకృష్ణారావు గారు వేఱొకస్త్రీనిఁ దీసికొనివచ్చుటకై ప్రయత్నించిరి. అప్పుడామెకు వేఱొకపనియుండినందున నిచ్చటికి రావీలుకలుగదయ్యెను. కావున, వారు నన్నుఁ దీసికొనిరావలసి వచ్చినది." అని వచించితిని. నాయీ సంభాషణమువలన నామె కోపము తగ్గెను. ఇంతలో మేఁడమెట్టులపై నెవ్వరిదో యడుగులచప్పుడు వినవచ్చెను. ఆయువతిబెదరి "అట్లయిన నీకేమియు నక్కఱలేదా !" యని బిగ్గరగా నడిగి పాఱిపోయెను.

నాకాగదిలో నిప్పు డెట్టిపనియును లేకపోవుటచే నేను నామె వెనువెంటనె బయలుదేరితిని. తలుపుదగ్గరకువచ్చి చూచుసరికచటిగోడ దగ్గర నల్లనిదేహకాంతితో, భయప్రదరూపముతో నొక పురుషుఁడు నిలిచియుండుట నాకుఁ గనఁబడెను. అతని నక్కడఁ గాంచినంతనె నేను భయపడి నిలిచినచోటనె నిలువఁబడితిని. ఈతఁడు నేను తొలుతఁ జూచినతరుణపురుషుని తమ్ముఁడు. ఈతఁ డెంతటినీచుఁడో, ఈతనికన్నులే చెప్పుచుండెను. ఈతని పెదవులు బలిసియుండెను. ఈతఁడు తనయుగ్ర జానివలెనే నిర్భయముగ నాచెంత కరుదెంచెను.

"నీ పేరు నళినీబాయియే కాదా?" అని నన్నడిగి వెంటనె యాతఁడు నన్ను రోగియున్నగదికిఁ దీసికొనిపోయెను. తొలుత నాతఁడు మూసియున్న తలుపుదగ్గర నిలిచి తలుపులఁ జెవినాని విని లోపల నిశ్శబ్దముగ నుండెనని తెలిసికొని పిమ్మట నాతఁడు తలుపుఁ దెఱచి లోనికరిగి యట శయ్యాపై నిశ్చేష్టయై పడియున్న తనతల్లివంక నొకవిధమగు విచిత్రదృష్టితో నీక్షించెను. ఆ దృష్టిలో మాతృభక్తిచ్ఛటలుండక, యేవో యజ్ఞాతభావనాకిరణములు దృగ్గోచరములగుచుండెను. కాలభుజంగముఁగనిన నెంతభయముద్భవించునో, యంతభయ మాతనిఁ గనినతోడనె నాకుద్భవమయ్యెను. ఆతఁడు నాయెడ నత్యంతసౌమ్యరీతినే వర్తించుచుండినను, నాకాతని జూచుట కసూయవొడముచుండెను.

ఈతని యుగ్రజుఁడప్పుడచట లేఁడు. ఈతరుణుని నేను మనసునందు ద్వేషించుచున్నందున, నీతనితో నొక్కమాటైన మాటాడకుండ నాపని నేను చూచుకొనుచుంటిని. కమలాబాయి నిజముగనె యతిరూపవతి. జను లామె సౌందర్యమునుగూర్చి యెంతయో వర్ణించుచుండిరి. అందావంతయు నతిశయోక్తి లేదని నాకిప్పుడు తెలియవచ్చెను. వయసుమీఱి, వదనముపై మరణచిహ్నము లగపడుచుండినను నామె సౌందర్యముమాత్రము కొఱవడియుండలేదు. ఆమెవదన మెట్టివారినైన నాకర్షించుశక్తి కలదై యుండెను. కాని, యామె యీసౌందర్యపరిణామము చూచువారి చూపుల నెయాకట్టును, ఆ సౌందర్యావలోకనమువలనఁ జూచువారిమనసునఁ బ్రేమోత్పన్నమగుటకు మాఱుగ, నామె విషయమున నొక్కవిధమగు నవిశ్వాసము జాగరితమగును. ఈ సమయమున నామె నిశ్చేష్టయై పడియుండెను. ఆగదిలో నామె, శ్వాసోచ్ఛ్వాసములకన్న నందలి శాంతతను భంగము గావింపఁజాలునది వేఱొండేదియును లేదు. ఆమెను జూచి నేను "పరమేశ్వరుఁడు నన్ను

రక్షించుఁగాక !" అని భయముతో ననుకొంటిని. నేనింతగ భయపడు చున్నను, అచటినుండి బయటికిఁ బోవుటకు నాకిచ్ఛజనింపలేదు, అచటఁ గూరుచుండియుండుటయె నాకర్తవ్యమని భావించితిని. కావున నచటి నుండి కదలుటకిష్టపడనని నేను దృఢముగ నెఱిఁగియుంటిని. ఆమెను జూచుచుండుట నాకొక్కవిధముగ నానందమే యగుచుండెను. కాని, యాయానందమున భీతిలేదనిమాత్రము వచింపఁజాలను.

ఈస్థితిలో నేనెంతసేపు కమలాబాయిదగ్గరఁ గూర్చుండియుం టినో చెప్పఁజాలను. నాకు భీతిగొల్పినయాతరుణ పురుషుఁడు నావెనుక నిలిచియున్నాఁడని నేనెఱుంగుదును. కాని, యొక్కమారైన నేను వెను దిరిగిచూడనైతిని. ఆ యువకునియెడ నించుకైన లక్ష్యముంపరాదని నేను సంకల్పించుకొని యుంటిని.

నేను శూన్యహృదయముతోఁ గమలాబాయివంకఁ జూచుచుఁ బైని చెప్పినయాలోచనలో నిమగ్నునైయుండఁగా, నింతలో నాతోడ్పై నొకవీవనపడెను. ఆశ్చర్యచకితనై నేను వెనుకకుమరలి చూచితిని. ఆ యువకుఁడు నాప్రక్కనె నిలిచియుండి నాదృష్టులఁబడెను.

"ఇక్కడఁ జాల నుష్ణముగా నున్నది." అని యాతఁడు నన్నుఁ జూచి పలికెను.

వీవననొసఁగినందులకై నేనాతనికి వందనమర్పించితిని. కాని, వీవననిచ్చుమిషచే నాతఁడు నాప్రక్కకువచ్చి కూర్చుండుట కిచ్ఛగించు చున్నాఁడని నేననుకొంటిని. ఏలయన—నామొగ మాతనికిఁ గనఁబడు కావున నాతఁడాసీనుఁడై యుండెను. కావున, నేను నామోమాతనికిఁ గనఁబడకుండుటకై నేనావీవన నుపయోగించుచుంటిని. ఇట్టు లసహ్యము గనె యొకగంటసేపు గడచిపోయెను.

ఇపుడు సూర్యోదయసమయమయియుండెను. రాత్రి జాగరణము మూలమున నేను గడుంగడు నలసియుంటిని. నాకీస్థలమునుండి యెప్పుడు విముక్తికలుగునా యని వేచియుంటిని. అంతలోఁ దలుపు

తెలచికొని యొకగృహస్థుఁడు లోనికరుదెంచెను. ఆతని నీక్షించినంతనే నా దేహమున విద్యుత్సంచారమైన తెఱఁగున నాకస్మికముగ రోమాంచ మయ్యెను. ఆ గృహస్థునిపేరు నారాయణరావు. ఆతఁడు లోనికేతెంచినతోడనే నాయొద్దఁ గూర్చుండియున్న యాతరుణుఁ డొక్కమాఱు నావంకఁ దీవ్రదృష్టిసారించి లేచి యావచ్చిన యాతనికడ కరిగెను ఆ సోదరులిద్దఱును జాలసేపొండొరులతో నేమియో మాటలాడుకొనుచు ద్వారముకడ నిలిచియుండిరి. అనంతరము నారాయణరావు తలుపుమూసివైచి నాసమీపమునకు వచ్చి కూరుచుండెను. వారియీ విచిత్రవర్తనము నాకొకింతభీతిఁ బుట్టించెను. నాహస్తమందలి వీవన తనంతటనజారి నేలపైఁబడెను. కాని యక్కడనుండి లేచిపోవుటకు నాకు మనసు గొల్పదయ్యెను.

తుదకెంచుక ధైర్యముం దెచ్చుకొని వారిముఖమువంకఁ జూచితిని. ఆతఁడు తీక్ష్ణదృష్టితో నన్నుఁ జూచుచుండెను. నాకు భయమయ్యెను నా హృదయము కంపింపఁదొడఁగెను. నాకేమో మహాదాపదసంభవింపఁగలదని నామనసు నాకుఁ జెప్పుచుండెను. అదెందులకో మాత్రము చెప్పలేను. నాయీభీరుత్వమునను నాకేసిగ్గుకలిగి నామనసును శాంతపఱచుకొంటిని. ఇప్పటివఱకు సిట్టియాపదలు లోకములో నెన్నిమాఱులో నాయనుభవమునకు వచ్చియుండెనుగాని, వానినన్నిటిని మహాధైర్యముతో దాటితిని. అత్తెఱఁగుననే నాకింకను గలుగఁబోవు సంకటపరంపరలనెల్ల నెట్టులైనఁ గడుపుదునని నాకాశయుండెను. కావున, నేనాతనిదెస సస్మితవదననై చూచుచు, నాతఁడేమనునో వినుటకు సంసిద్ధనైతిని—

"నలినీబాయీ! మాతల్లిగారి పరిచారిక కోకిల నీకుఁ గనఁబడియుండెనా?" అని నారాయణరావు నన్నడిగెను.

ఔనని నేను తలఁగదలించితిని.

"ఆమె మాతల్లి వ్యాధినిగూర్చి సవిస్తరముగ నీకుఁ జెప్పియుండఁ బోలును! అని యాతఁడు విషమదృష్టితో నన్నుఁ గాంచుచుఁ బ్రశ్నించెను. నేనేమియో ప్రత్యుత్తరమీయకుండ నింతలో నాతఁడు మరల "నాకుఁ గోకిలస్వభావము చక్కఁగఁ దెలియును. ఏమాటయైననేమి రహస్యముగా నుంపఁజాలదు. రహస్యమన నేమియో యది యెఱుంగదు." అనియెను.

"ఈయింట నింతటిమహత్తర రహస్యమేదియో యుండుట దురదృష్టమే!" అని నేననుకొంటిని. అచటిరహస్యము నెవరికిని ప్రత్యక్షముగ నారాయణరావుగారికైనఁ దెలుపనని దృఢపఱచుకొంటిని.

డాక్టరు ప్రభాకరరావుగారి యాకస్మికమృత్యువార్తవిని నాతల్లి వ్యాధిపీడితయయ్యెనని కోకిల నీతోఁ జెప్పియుండవచ్చును."

"ఔను. నేనిది యెఱిఁగియుంటిని."

"అయిన నావిషయమై నీకు నేను నొక్కింత చెప్పవలసి యున్నది. (అని యతఁడు మాతృముఖముపై నొక్కమాఱు తీవ్రదృష్టి సారించి) రెండునెలలకుఁ బూర్వము మా తండ్రి స్వర్గలోకమునుఁ జేరెను. అప్పటినుండియు నీమె క్షీణించుచునేయున్నది ఆమె యారోగ్యము నష్టమగుట కొకానొక యల్పకారణమైనఁ జాలియుండెను. డాక్టరుప్రభాకరుని మృత్యువార్తవినినంతనే యామెకీ దుర్దశకలిగినది. ఆమూర్ఖబాలికయె-అల్పవయస్కయగు నాకోకిలయె, యాఘోరవార్త-ఆమరణవార్త-మాతల్లికినివేదించినది. కావుననే మేమాపిల్లను ద్వేషించుచుందుము. మా యీకృత్యమునకై నీవు మమ్ములను దూషింపవని నాకాశకలదు."

ఈప్రశ్నకుత్తరముగా "లేదు" అనుటకన్న నాకు గత్యంతరము లేకుండెను. ఇటిస్థితియందింకెవరైనయుండిన నట్లేచేసియుందురు. కాని, పుష్పలత యుత్యకాలమునందలి దుఃఖాపూర్ణమును, హృదయద్రావకమునగు రూపము నామనశ్చక్షువుముందటనిలిచి నారాయణరావుగారి తియ్యనిమాటలయెడ విశ్వాసముంపకుమని మాటిమాటికి నన్నేటికిఁ బురికొల్పుచున్నదో నాకుఁ దెలియుట లేదు.

"ఈసుఖబాయక వృత్తాంతమువలన మాతల్లి కెట్టియుపాయమును గలుగఁజాలదని నాకాశకలదు," అని యాతఁడనియెను. ఆతఁడు తన స్వరూపమును నిర్వికారముగ నుంచుటకై యెంతో ప్రయత్నించెను! కాని, యీ కడపటివాక్య ముచ్చరించినప్పు డాతనిముఖము తెల్లవోయి నట్లు నాకుఁ దెలిసిపోయెను. అప్పుడు నేను—

"డాక్టరు ప్రభాకరుని మరణవార్త యిదివఱకే యొకయువతిని ధనమునకుఁ గారణభూతమై యున్నది" అని యంటిని.

"ఏమి! ఏమనుచున్నావు?" అని యాతఁడు గద్గదస్వరముతో నడిగెను. డాక్టరు కృష్ణారావుగారు పుష్పలతా మరణవృత్తాంతము వీరితోఁ జెప్పియుండలేదని యీతని యీ యాశ్చర్యప్రశ్నమువలన నాకుఁ దెలిసెను.

నారాయణరావు తీవ్రదృష్టితో నన్నుఁ జూచుచుండెను; తెల్లవోయిన యాతనికపోలములపై భయచిహ్నములు ప్రసరించియుండుటచే, ప్రాతఃకాలసంధ్యాప్రకాశమున నస్యోపనీలవర్ణముగాఁ గానఁబడుచుండెను.

నేను: (అత్యంతకష్టముతో) డాక్టరు ప్రభాకరరావుగారి నియుతవధు వాతనిమరణానంతరము దీర్ఘకాలము జీవముతో నుండలేదు. కొన్నిగడియలకుమున్నె యామె నశ్వరశరీరమును వీడి ఆలోకమును జేరినది. డాక్టరుగారికి నామెకు నొకేసమయమునఁ బరలోకక్రియలు జరుపఁబడును.

నారా: (ఆసనమునుండి లేచి) ఆతని నియుతవధువా? ఆతని భావిపత్ని యాతనిని ధిక్కరించినదని నాకు—

నేను: "మీరు చెప్పనామె వేఱుస్త్రీ!" అని యంటిని. నా చెల్లెలి—పుష్పలత—ఆమె పవిత్రప్రేమ కెవ్వరైనఁ గళంకమాపాదించుట విని యేనోర్వఁజాలను. కావుననే మధ్య నేను పరికించితిని, "తొలుత నాతఁడేదుష్టూరికతో వివాహమాడ సంకల్పించియుండెనో యామెకాతనిపై నిసుమంతయు ప్రేమముండలేదు. కాని

యాయువతి—" నా కంఠము కంపింపఁదొడఁగి యటపై మాట వెడల
దయ్యెను. నాశోకపూర్ణమనోవికారము దుర్భరమయ్యెను.

భీతహృదయముతో నారాయణరావు నాక్రేవఁజూచుచుండెను. భీతిచేఁగాఁబోలు, నాతనిఫాలముపై కురులునిలిచియుండెను. కొంతసేపు స్తబ్ధుఁడై యుండినపిమ్మట నాతఁడు—

"ఆమెపేరేమి! ఆమెను నేనెఱుఁగుదునా!" అనియెను. ఇట్టి దుఃఖదాయక విషయమునఁ దానింతకళవళపాటందుట యోగ్యముకా దనికాఁబోలును ముఖమున గాంభీర్యము నెరవుదెచ్చుకొని మరల "మాకువలెనే యింకొక్కచోటఁగూడ నిట్టియవస్థయే సంభవించెనని నీవు చెప్పుటచే నేనించుక బెదరితిని. వేఱొండుకాదు." అనియెను.

నేను: "అట్లగుట స్వాభావికమె!" అని మిక్కిలి మెల్లగ నంటిని. శిష్టాచారముననుసరించి నేనీపై మాట నాడితినేగాని, మనఃపూర్వకముగఁగాదు. నామన సాతనివాక్యములను విశ్వసింపకుమని నన్నుఁ బోధుచుచునే యుండెను.

"ఆకాంతపేరు పుష్పలత" అని నేనాతని ప్రథమప్రశ్నకుత్తర మిచ్చితిని. "ఆమె—"

"నాకిది తెలియును" అనిచెప్పి నారాయణరావు నావాక్యము పూర్తికాకమున్నె తనజేబులోఁ జేయిడి యాలోచనాధీనమానసుఁ డయ్యెను. అటులాలోచించుచు నడిచి గదికావలిప్రక్కకుఁ బోయెను. కొంతసేపక్కడనిలిచి యోచించి మరల నాసమీపమునకువచ్చెను. అప్పు డాతని రూపమునందలి భయంకరమగుమార్పు నాకన్నులకగపడెను.

భయంకరమును, నిస్తేజమును, శవసదృశమునగు నాతనిరూప ముంగాంచి నాడెందమున భీతియుదయించెను. నాయెదుటనె నిశ్చేష్టయై పడియున్న కమలాబాయికివలెనే నాకును నీసంవేదనాశక్తి నష్టమై పోయిన నెంతయో బాగుగనుండుననని నాకుఁ దోఁపఁదొడంగెను.

# అయిదవ ప్రకరణము

సూర్యోదయమయ్యెను. అప్పుడు డాక్టరు కృష్ణారావుగారు గదిలోని కరు దెంచిరి. ఆ సమయమున నేనాగదిలో నుండి బయటికివచ్చి నాగదిమార్గముఁ బట్టితిని. రోగియున్నగదిలోనుండి విసర్జనీయుఁడును, తిరస్కరణీయుఁడునగు నాతరుణునితో మాటలాడుచుండుట నాకసహ్యాకరముగా నుండెను. నాగదిలోఁ బూర్వాభిముఖములై యున్న కిటికీలను దెఱచి యామార్గమున స్వచ్ఛనిర్మలవాయువులు లోనఁబ్రవేశించుట కాటంకము కలుగకుండనుండుటకై తెరలనుదీసివేసితిని. ఆ తెరలను దీసి వేసినతోడనే ప్రాతఃకాలబాలార్కుని కోమలారుణకిరణములు లోపలికిఁ బ్రసరింపసాగెను. దినమణికిరణ సంస్పర్శమువలన నాభీతియంతయు నశించిపోయెను. నాకు మరల నుత్సాహము కలుగుటనునాసచే హృదయాహ్లాదకరమగు నాబాలభానుని కోమల ప్రకాశమున కేగి యాసీననైతిని. ప్రాతఃకాలమందుమలయానిలములచేతను శకుంతసంతానముల మనోహర కూజితములచేతను, కీటకముల యస్పష్టమధురధ్వనులు మొదలగువానిచేతను నాసంతప్తహృదయమున కొంకింతశాంతి యొదవెను. నాయుత్సాహము వృద్ధినందసాగెను. నాహృదయమునందలి భీతియు నిశ్శేషమయ్యెను. అత్యంతోత్సాహముతో నేనొకశయ్యపైఁ బరుంటిని. అప్పుడునాకు నాసెచ్చెలియగు పుష్పలత వ్రాసిన మరణ శాసనపత్రము జ్ఞప్తికివచ్చెను. నాకంచుకమున భద్రముగ దాచియుంచినదానిని నేనిప్పుడు బైటికిఁదీసి చదువఁదొడంగితిని. అది నాకన్నులఁ బడినంతనె నేనశ్రుపూరిత నేత్రనైతిని! ఆపత్రపఠనమున నొకవేళ నావిచారమడఁగి నాయాయువునందలికష్టతర మార్గము సుగమముగ గడుపుట కొకింతధైర్యము కలుగఁజాలుననునాసతో నేనెట్టులెట్టులో యాపత్రమును లక్ష్యపూర్వకముగఁ జదువసాగితిని.

ఈ క్రింద నుదాహరించిన యీ పత్రములోని పంక్తులు చదివినంతన నా మనస్సెట్టిస్థితికిఁ బాల్పడియెనో, పాఠకులే యోచించి నిర్ణయింపవలయును. ఆపత్రమున నిట్లు వ్రాయఁబడి యుండెను.

"నా సర్వస్వార్జితమును, నా పేర బ్యాంకులోనున్న యైదువందల రూపాయలును, నా ప్రాణమిత్రమగు శ్రీమతి నలినీబాయికిఁ జేరవలసినదని నా కడసారికోరిక. నా మరణసమయమున నామె నాకిచ్చిన వాగ్దాన మెన్నఁటికిని మఱవదని నాకు నమ్మకముకలదు."

ఈపత్రమును జదివినపిమ్మట నేనధిక దుఃఖముతో "ఏమీ! ఐదువందల రూపాయలా! నిన్నటిదినము నాయొద్ద నొక్క గ్రుడ్డిగవ్వయైన లేదు. ఆహా! పుష్పలతను బోలిననెచ్చెలి నాకు నేఁ డెక్కడనున్నది!" అని నేననుకొంటిని.

ఆపత్రమును జదువుటలో నేను అప్పటి నాస్థితినే మఱచిపోయి యుంటిని. కాని, యందలితుదిమాటలను జదివినప్పుడు నాకు నాసద్యస్స్థితి జ్ఞప్తికివచ్చెను. నా ప్రాణప్రియయగు పుష్పలత కొసఁగినమాట మూలముననే నేనిప్పటి యీ పరమరహస్యమును గనుఁగొనువిషయమునఁ బ్రవేశించితినని నాకిప్పుడు తెలియవచ్చెను. కారణము—నిన్నటి నుండియు నీయింటివారియందఱి విషయమునను నాకించుక సంశయము గనె యుండెను. ఆ సంశయము వారిపరిచయమువలనఁ గొఱవడక యధికాధికముగాఁ జొచ్చెను. ఈయింటినుంటి నేనెంతశీఘ్రముగ బయటఁబడిన నంతమేలని నామనోదేవత నాకుఁ జెప్పుచుండెను. కాని, నాయనుఁగునెచ్చెలిం గూర్చిన నాకర్తవ్యతాబుద్ధి నన్నాయింటనె యుండి యచటి సకలోదంతము నెఱింగి రహస్యమును బహిరంగపఱుచుమని నన్నధికముగ బాధించుచుండెను.

"జగమంతయు డాక్టరు ప్రభాకరా వాత్మహత్యఁగావించుకొనెనని చెప్పుచున్నది. అట్టియెడ నెల్లినోళ్ళను మూయుటకు నాయొక్కరితవలన నెట్లగును! ఆతని ధవళకీర్తికిఁ గలిగిన యీ కళంకమును

మడిచివేయుటకై యాతనిరహస్యము నెఱింగినయాతనిమిత్రుఁ డెవ్వఁడైన నొక్కఁడు ముందఱికి రావలసినదే.

ఈవిచారమున మగ్నుడనై యుండి శూన్యదృష్టితో నెదుటనున్న గోడవంకఁ జూచుచుఁ గొంతసేపచ్చటనె కూర్చుండియుంటిని. ఇఁకను గొంతసే పట్లులే కూర్చుండియుందునేమో! కాని, యంతలో నారాయణరావు నడుగులచప్పుడు వినవచ్చినందున నేనించుక తెలివిఁ దెచ్చికొంటిని. రోగిని వదలివేసి నేనింతసేపిచటఁ గూరుచుండియుండుట మంచిదికాదని తోఁచినందువఁ దత్క్షణమే యామె గదిలోనికేగుటకై బయలుదేరితిని. నేను కమలాబాయిగదిలోఁ బ్రవేశింపఁబోవుచుండ డాక్టరుగా రాఁగుమని సైగఁజేసినందున నిలిచిపోయితిని. అతఁడు నాకడ కరుదెంచి—

సరస్వతి యిక్కడకు వచ్చియున్నది. ఆమె తనతల్లినిజూచుటకై స్వాభావికముగనె యుత్సుకయైయున్నది. ఆమె వచ్చిపోవువఱకు నీవు లోనికిఁ బోవకుండుటయే యుత్తమము. అనియెను. ఎందుచేతనైననేమి యచట నుండకుండుటకుఁ గారణమొదవినందున నేనానందించుచు వెడలిపోయితిని. అదియునుగాక సరస్వతితోఁ బరిచయము కలుగఁజేసికొనుటకు నాకిష్టములేనందున నేను మెట్లవంకకు వెడలిపోయితిని. నేను మెట్లను సమీపించుచుండ సరస్వతి తనయిరువురి సోదరులతో మెట్లులెక్కివచ్చుచుండుట నాకన్నులఁబడెను. ఇవ్విధి నాకస్మికముగ సరస్వతి నాకుఁ గనఁబడుట లటస్థించెను.

సరస్వతి సౌందర్యమునుగూర్చి నేననుకొనియుండిన యంతకన్న నామె మిగులసౌందర్యవతియై యుండెను. ఆమె ధరించిన వస్త్రాదికముల యందును, దన్నెట్టునంటెటి దేమియు నగపడలేదు. ఆమె యొక బొమ్మను శృంగారించు తెఱఁగున నలంకరించుకొనియుండెను. కాని, తనకుఁ బ్రత్యక్షమాత —జన్మధాత్రి— పెంచిపెద్దచేసినతల్లి — మరణావస్థలో నుండ నింతగశృంగారించుకొనుట కీమె కెట్లు మనసంగీకరించెనో నాకుఁ గడుంగడు నాశ్చర్యముగా నుండెను. ఆమె నడవడింగని

యామె మార్ఖ్యముచేఁ జేయఁబడి నడయాడ నేర్చికొనిన యొక విగ్రహ మని నేననుకొంటిని. ఆమె కిరుపార్శ్వములను నడచుచున్న యామె సోదరుల గంభీరముఖములమధ్య నామె యారక్తముఖ చంద్రబింబము నేత్రపర్వమై కన్పట్టుచుండెను.

లక్ష్మీకృపాప్రసాదమున నున్మత్తమైన యాబాలిక సమక్షము నకు నాయంతట నేనుపోయినచో నేమైన నవమానము తటసించు నేమోయని నాకుఁ దోఁచినందున నేనొకప్రక్క కొదిగినిలిచితిని. నావంక నొకసారి క్రేగంటఁజూచి యామె సోదరులిద్దఱును ముందటికి నడచిపోయిరి. ప్రథమునిదృష్టియం దనుకంపయు, మాగ్దనము నిండి యుండెను. ద్వితీయుని దృష్టియందో—సంపూర్ణాభావము నిండియుం డెను—వీరి కఠోరదృష్టి క్షేపమువలన నామనమున భయాక్రాంతమ య్యెను. నిన్నటినుండియు సంతప్తమగుచున్న నామనసున కొకింత విశ్రామ మొసంగు నుద్దేశముతో నేను తోఁటకేగితిని. ఆసోదరులనడ వడులయందును, ఆసోదరి ప్రవర్తనమునందును నెంతయో తారతమ్య ముండెను. అనుజుఁడు సోదరితో నధికప్రేమతో మాటలాడుచుండెను. కాని, యగ్రజుఁ డొకటి రెండుపచారవాక్యములుతప్ప మఱేమియు మాటాడుట నాకు వినరాదయ్యెను. సరస్వతీ స్పర్శనమున ననుజుని శరీరము కంపితమగుచుండెను. ఒక్కసోదరియెడనైన నీయనుజుఁడు ప్రేమముతోడను అనుకంపతోడను నున్నాఁడుకదా ! దీనిని బరికింప నీతఁ డగ్రజునికంటె శ్రేష్ఠుఁడై యుండవలయునని నాకనుమానము తోఁచెను.

నాయనుమానమునకు సమాధానోక్తిని వెదకికొనుట నాకశ క్యముగా నుండెను. వ్యర్థముగా నిట్టికుశ్శంకలతో నామెదడును బాధ పెట్టుటలో నేమిలాభమున్నదని యావిచారమునువీడి నేను తోఁట లోనికేగితిని. ఆవనము మిగులఁ గన్నులపండువగ నుండెను. పచ్చిక చేనిండియున్న భూభాగముపైఁ బడియున్న చిత్రవిచిత్రవర్ణ పుష్ప

సమూహము, పచ్చనిపట్టువస్త్రముపై సరిగపనిచేసినట్లు విరాజిల్లు చుండెను. వేయేల ? ఆవనమన్ని విషయములయందు నానందదాయకమై యుండెను. ఆయింటి నలువైపులను దట్టముగు పొదరిండ్లుండుటచే నా గదిలోనికి బహిష్ప్రభవాయువులు ప్రవేశించుట యసాధ్యమని నేను భావించితిని. ఆగది యంధకారమయమును, ఇఱుకునై యుండుటచే నందలి యపరిశుభ్రవాయువులు వెలుపలికిఁ బోవుటలేదనియు భావించి తిని. ఆ యుద్యానవనమున క్షణకాలము విహరించుటకు నాకనాయాస ముగా నవకాశము దొరకెను. ఇదే తగినయదనని యావనమంతయుఁ దిరిగి తిలకింప నెంచితిని.

ఆ వనము నడియూరనున్నందున నది నేను భావించుకొన్నంతటి విస్తీర్ణముగా నుండలేదు. కావున సుందరములును, మనోహరములు నగు నందలి వస్తువిశేషములఁ దిలకించుటకు నాకెంతయో సేపు పట్ట లేదు. ఆ యుద్యానవనమంతయుఁ జూచినవెంటనే నేను గృహమునకు బయలుదేరితిని. మార్గమున ద్రాక్షలతాచ్ఛాదిత మనోహరలతామం డపమొకండు నాకు దృగ్గోచరమయ్యెను. ఈ రమణీయ ప్రదేశమునఁ గూరుచుండుట కాసనములేవైన నున్నవేమోయని యాదిక్కునకుఁ దొంగిచూచితిని. అట నాకంటెముందుగ నొకవిచిత్ర బాలకుఁడు కూర్చుండియున్నట్లు నాకగపడియెను. ఆబాలుఁడు పొట్టిగనుండి యొక్క విధమగు చమత్కారవస్త్రమును ధరించియుండెను. అతని రూపము సురూపముగనుండి యవయవములన్నియు దిద్దినట్లుండెను. నేత్రముల నితరుల సహజరీతి నాకర్షింపఁజాలు విలక్షణతేజము తొలుకాడుచుం డెను. నేనటుచూచినప్పుడా బాలుఁడొకలతాకుంజముక్రింద మోకాళ్ళ మీఁదఁ గూరుచుండి యటనున్న యేదో యొకవస్తువు ననిమిష లోచనములతోఁ జూచుచుండెను. ఆతఁడేమి చూచుచుండెనో చెప్పుట కష్టముగా నుండెను. ఏలయన—అతని సమక్షమున నాయింటిగోడలు తప్ప వేఱొండేమియుఁ గనఁబడుచుండలేదు. అచ్చటి కిటికీలలో నొక్క

నా గదిగవాక్షము తక్క నన్నియు మూయఁబడియుండెను. ఛాయావృతమగు నాతనివదనముం గాంచినచో నాతఁడేదో వస్తువును లక్ష్యపూర్వకముగఁ జూచుచుండెనని తోఁచఁజేయుచుండెను. ఆ యువకుని ఫాలభాగమున గనఁబడుచున్న ముడుత లాతఁ డేవస్తువును గనుచుండెనో యయ్యది మహత్తరమైనదని సాక్ష్యమొసఁగుచుండెను. ఇంతటి ప్రాతఃకాలమున నల్పవయస్కుఁడగు నాబాలకుని—(ఆతనివయసు పదునాలుగేండ్లకు మించియుండదని నేననుకొంటిని)—అట్టి విచిత్రస్థితిలోఁగాంచి నేనత్యంతాశ్చర్య మగ్నమానసనైతిని.

ఈ నూతన రహస్యమును గనుఁగొను నుద్దేశముతో గట్టిగా నడుగులు చప్పుడు చేయుచు నడచి యాలతామండపమునఁ బ్రవేశించితిని. నన్నుఁజూచి యాతఁడులికిపడి లేచి నిలుచుండి క్రోధోద్రిక్తదృష్టులతో నావంకఁ జూడసాగెను. కాని, యొక్కత్రుటిలోనే యాతని రూపము మారెను, ఆతని యోష్ఠములపై వెలయు నరుణకాంతు లంతర్హితములై పోయెను. గడియకుఁ బూర్వ మెంతో మనోహరముగనుండిన యాతని రూప మప్పు డొక్కత్రుటిలో విరుద్ధభావమును వహించెను. వాని వర్తనము నన్నిటినిజూడ నాతఁ డున్మాదకుఁడై యుండఁబోలునని నాకుఁ దోఁపసాగెను.

పిచ్చిపిల్లవాఁడొకఁడీ ప్రాంతమున సంచరించుచుండునని లోకులనుకొనుచుండుట నాకిప్పుడు జ్ఞప్తికి వచ్చెను. అప్పు డీకుఱ్ఱవాని విచిత్ర వర్తమునందలి యర్థము నాకు బోధపడియెను. నేను మందహాసవదనముతో వానిని జూచితిని. నేను వానితో స్నేహమైన మాటలాడవలెనను కొనుచుండ నంతలో వాఁడు బిగ్గరగా నవ్వఁదొడంగెను. పిమ్మట నన్నుఁ జూచి యాతఁడు "నీ వెవ్వరు ?" అని యడిగెను.

వాని యీ ప్రశ్నమున కుత్తరముం జెప్పిన నెట్టియుపాయమును గలుగఁజాలదని తలఁచి నేను "నాపేరు నళిని. నీవెవ్వఁడవు ?" అని యడిగితిని.

వాఁడు: నేను పొంచిదాఁగియుండు నొక విలక్షణప్రాణిని. (ఇంచుక యోచించి) నీ విక్కడ నేయుందువా ?

నేను: లేదు. ఇక్కడ నాకుఁ గొంచెముపనియుండి ప్రస్తుత మిక్కడ నేయున్నాను. కమలాబాయి వ్యాధిగ్రస్తయై యున్నందున—

వాఁడు. ఇక్కడివారందఱు నీతో నెట్లు ప్రవర్తించుచున్నారు ?

వాని యీ ప్రశ్నకుఁ బ్రత్యుత్తరము చెప్పుటకు నాకేమియుఁ దోఁచదయ్యెను ! ఏమి చెప్పుదును ! నిమిషమాలోచించి మనసునుస్థిర పఱుచుకొని హాస్యవదనముతో నిట్లంటిని.

"నిన్నరాత్రియే నేనిచ్చటికివచ్చి యున్నందున నావిషయమై యిప్పుడేమి చెప్పుటకును శక్యముగాదు —" అని నేనింక నేమియో మాటాడనుంటిని, ఇంతలో నాబాలుఁడు బిగ్గరగా—

"ఈమె నిన్నరాత్రియే యిక్కడకు వచ్చినది" అను వాక్యమును మరలమరల నుచ్చరించుచు నచ్చోటువాసి పరుగెత్తుకొనిపోయెను. అతఁడు కొంతదూరముపోయి నిలిచి ఏమో గొణుఁగుకొనుచు నవ్వుచుఁ గొంతసేపచటనుండి పిమ్మట తోఁటతలుపుదగ్గరకుఁ బరుగెత్తెను.

ఇంతయల్పముగ గనఁబడు వాక్యమువలన నాహృదయము మతి విచిత్రస్థితినందెను. రాత్రి జరిగిన విషయమువలనఁ బెదరియున్ననా మనసిప్పుడు నెమ్మదివహించెను.

నేను గ్లసితహృదయముతో నింటిలోనికరిగి నాపనిపాటలఁ జేసికొనఁదొడఁగితిని. నేనుదయమునఁ గమలాబాయి గదిలోనుండి వెలువడినప్పు డచ్చటి వస్తువులన్నియు నెట్లుండెనో యిప్పుడు నట్లేయుండెను. కాని, నారాయణరావునకు మాఱుగా నాతని తమ్ముఁడుమాత్ర మచటఁ గూర్చుండి యుండెను. సరస్వతి యటనెందును గనఁబడలేదు. నారాయణరావామెను ఫలహారమునకుఁ బిలిచికొనిపోయి యుండునని నేను తలంచితిని,

అంతలో నన్నును ఫలాహారమునకు రమ్మని వార్తవచ్చెను. ఇప్పుడు నేనొక్కతెనే పోవలసివచ్చెను. నారాయణరావు తమ్ముఁడు గదినుండి వెలుపలికివచ్చుట కంగీకరింపలేదు. నేను క్రిందికిదిగి వచ్చునప్పటికి సరస్వతీ నారాయణరావు లింకను వచ్చుటనే కూర్చుండియుండిరి. వారికి ముందుగాఁబోవుటకుఁ దొలుత నాకు భయమగుచుండెను. సరస్వతి యెంతసుందరియో యంతగర్వపూరితయని నాకుఁ దెలిసియుండెను. ఆమె ధనమదోన్మత్తయై యుండినందున నొకవేళ నన్నవమానపఱుచునేమోయని నాకు భయమగుచుండెను. ఇప్పుడేమిసేయుదమో యని యాలోచించుచు ద్వారముకడఁ గొంతసేపు నిలిచియుంటిని. అప్పుడు గదిలో నాకెదుటనున్న యద్దమున నా ప్రతిబింబము నాకుఁ గనఁబడెను. అందు నావదనముపై వెలసియున్న నిర్మలతకు నాకధికోత్సాహము కలిగెను. అప్పుడు నేను నాలో "సరస్వతి యెంతసుందరియైయున్నను, ఎంతయుద్భటయైయున్నను, నన్నేమిచేయఁగలదు; నేనామె కెందులకింతభయపడవలయు? నేనామె నేమియు యాచింపవలసినది లేదుగదా! ఆమెతోఁ బలుకకున్నంతమాత్రమున నామె నన్నేమి చేయఁగలదు." అని యోచనచేసి ద్వారమునకు వేసిన తెరను తొలఁగించుకొని, ఎట్టిధీరునైన భయపెట్టఁజాలు వారిదృష్టి విక్షేపములను గమనింపకయె గదిలోఁ బ్రవేశించితిని. నాయీప్రస్తుత దృఢనిశ్చయము మూలమున నీకఠినసంధినుండి బయలువడుట నాకు సులభమయ్యెను.

నారాయణరావు రూపయుతుఁడు. ఏతరుణియైనసరియే, యాతని రూపముఁ గాంచినంతె మోహితయగును. నన్నుఁగని యాతఁ డాసనమునుండి లేచి నాకడకువచ్చెను. ఆతఁడు మర్యాదననుసరించి నాకు సరస్వతితోఁ బరిచయముఁ గలుగఁజేసెను. సరస్వతియు నౌపచారికరీతి నాకు స్వాగత మొసంగెను. ఆమె సారించినయర్థపూర్ణదృష్టివలన నేనెట్టి స్త్రీనో కనుఁగొన నామెయిచ్ఛగించుచున్నట్లు నాకుఁ దోఁచెను.

నేఁటియుదయమునుండియు నేను కల్పనాసృష్టిలో మగ్ననై యుండినందున నాకిట్లు తోఁచియుండఁబోలును! ఏలయన— ఫలాహా

రము సేయుచున్నయంత సేపు నామె నావైపునకుఁ గన్నెత్తియైనఁ జూడదయ్యెను. అటుపిమ్మటమాత్ర మామె సంశోధకమునను, సంశయాత్మకము నైనదృష్టితో నన్నుఁ జూడసాగెను. అట నన్నును నారాయణరావు విడిచిపోఁదగునా తగదా యని యామె యాలోచించుచుండినట్లుండెను. ఈ వర్తనము నాకెఱుకపడినంతనె లజ్జచే నాకపోలము లెఱ్ఱవాఱెను. నాయీమనస్థితి చాలసేపుండలేదు. సరస్వతి యడిగిన యొకప్రశ్నవలన నాయీమనసున వేఱొకవిచారతరంగ ముద్భవింపఁ దొడంగెను. ద్వారముచెంత నిలిచి సరస్వతి నారాయణరావు నిట్టులడిగెను

"మాఱి, ఏమున్నయ్యా! డాక్టరు ప్రభాకరరావుగారెచట మున్నారు? సంకటసమయములలో వారిచట నుండితీరుదురుగదా!"

నేనాశ్చర్యముతో నామెవైపునకుఁ జూచితిని. ఆమెయన్నవైపునకుమాత్రము నేను చూడఁజాలకపోయితిని. "అదేమి!" అని యెవ్వరైనఁ బ్రశ్నింతురా? అందులకు "నాకుఁ దెలియదు!" అనియే నేనుత్తర మీయవలసివచ్చును. "డాక్టరు ప్రభాకరుని మరణవార్త యీమె కింకను దెలియలేదేమి? ఇచటివా రెవ్వరు నెందులకుఁ జెప్పలేదు? డాక్టరు ప్రభాకరునితో నీమె కేదైన సంబంధముండెనా? పుష్పలతపై, బ్రేమముద్భవించుటకుమున్నాతఁడు పెండ్లియాడఁదలంచిన కన్నియ యీమెయా?" ఇత్యాదిప్రశ్నల నేను నామనసు నడుగుచుంటిని.

సరస్వతి మొగముపై నెట్టివికారమును దృగ్గోచరముకాలేదు. నారాయణరావు తనచెల్లెలివంకఁ జూచుచు నిశ్చలుఁడై నిలిచియుండెను. ఆమెకు జరిగిన వృత్తాంతమంతయుఁ దెలుపవచ్చునా కూడదా యని యాలోచించుచుండఁబోలును!

"గోపాలరావు నీకేమియుఁ జెప్పనేలేదా! అమ్మగారివ్యాధికి మూలకారణము నీకింకను దెలియనేలేదా!" అని యాతఁడనియెను.

"లేదు. నాకుఁ దెలియనే లేదు" అని యామె గదిలోనికి వచ్చుచు ననియెను.

"డాక్టరు ప్రభాకరుని మృత్యువే మనయమ్మ కిట్టిదుర్దశఁగలుగఁ జేసినది" అని నారాయణరా వనియెను.

"డాక్టరు ప్రభాకరుని మృత్యువా! అతఁ డెప్పుడు మరణించెను" అని యామె యాశ్చర్యముతో నడిగెను. ఆశ్చర్యముతక్క మఱెట్టి మనోవికారము నామెవదనముపై నగపడకున్నందున నల్పకాలమునకుఁ బూర్వము నాకుదృవించిన యనుమానము నిరాధారమైనదని నాకు నమ్మిక కలిగెను.

"వారు వ్యాధిపీడితులైనదియే నాకుఁ దెలియదు! వారేదైన నాకస్మికోపద్రవముచే మరణించిరా?" అని సరస్వతి ప్రశ్నించెను.

నారాయణరావు శిరఃకంప మొనర్చెను. వారిరువురును మాటాడు కొనుచున్నప్పుడు నేనచటనుండకున్న బాగుగ నుండెడిదని నాకుఁ దోఁపసాగెను.

"డాక్టరు ప్రభాకరరావుగారి యాకస్మిక మరణమున కేమి కారణము?"

"నీటమునిఁగి మరణించెను."

"ఏమి! నీటమునిఁగియా?

"ఔను."

"ఎపుడు?"

"నిన్న రెండుజాములవేళ"

"ఎచ్చట?"

ఈ ప్రశ్నకు నారాయణరావు బదులు చెప్ప లేదు. అతఁ డవలంబించిన యీ మౌనవృత్తి కేమికారణముండనోపును; ఆ స్థలముపేరు చెప్పుట కాతనికి భయమగుచుండెనా? ఈ యనుమానములవలన నారాయణరావు ముఖమువంకఁ జూచుటకు నాకు ధైర్యము కలుగ లేదు.

"యంత్రాలయ ప్రవాహమునఁబడి మునిఁగి చావలేదుకదా ?" అని యామె మరల నడిగెను.

"లేదు."



పరిశోధకపూర్వములగు నిట్టివిషమ ప్రశ్నలకు విసిఁగియే కాఁబోలును నారాయణరా వచటినుండి లేచి—

"సరస్వతీ ! ఆ విషయము బహుదుఃఖదాయకము. డాక్టరుగారి ప్రేత మా పురాతన యంత్రాలయమందలి యొకచావడిలోని తొట్టిలో దొరకినది. అతఁ డాత్మహత్య చేసికొనియుండవలయునని లోకులనమ్మిక. ఆత్మహత్య చేసికొనుట కేమికారణమో యదిమాత్ర మెవ్వరికిని దెలియదు.



"ఆత్మహత్యయా ?" నాకుఁ దెలియకుండఁగనే యీవాక్యము నానోటినుండి బహిర్గతమయ్యెను. ఆశ్చర్యముతో నన్నుఁగని నారాయణరా విట్లనియెను.

"అందుల కనుమానమేమున్నది ? మఱేవిధమునను నీవిషయము తెలియుటకు మార్గము లేదు. ఆతనివంటిసచ్ఛీలున కొకశత్రువుండెననుట సంభవము కాదుగదా ! పోనిమ్ము ; పొరపాటునఁ దెలియక యాతఁ డందుఁబడి మరణించెననుకొందమన్నను, ఆతఁ డచటికిఁ బోవుటకుఁ గారణమేమున్నది ?"

"కాని—" అని ప్రకంపిత గాత్రముతో సరస్వతి పలికెను.

"అదేమియునుగాదు. ఆతఁ డాత్మహత్యయే చేసికొనియుండవలయును" అని యాతఁడు సోదరివంక నొకసారి తీక్ష్ణదృష్టితోఁ జూచి పలికెను. అనంతరము నావంకకుఁజూచి యిట్లనియెను. "ఈ విషయ మింకేవిధముగను బయల్పడదని నాయభిప్రాయము — ఇఁకముందును శక్యముకాదు. ఆతఁ డీకృత్య మెందులకుఁ జేసెనో మాత్రము నేనే కాదు, మఱెవ్వరును జెప్పలేరు. ఆతఁ డాత్మహత్య చేసికొనెననియే చెప్పవలసియున్నది. అదియే నాయుద్దేశము. ఆతని యీ భయం

కరకృత్యమునకుఁ బురికొల్పినకారణ పరంపరల శోధించు కార్యము, నాకన్ననతిధూర్తులగువారిపై మోపుచున్నాను." అని భయచకితయైన తనసోదరినిఁ దీసికొని యాతఁడు వెడలిపోయెను.

నారాయణరావు బైటికిఁబోయినందున నాకుఁ గలిగినయానందము చాలసేపుండలేదు. ఏలయన — సరస్వతిని మేడపై విడిచి యుల్పావకాశమునను యాతఁడు మరలఁ గదిలోని కరుదెంచెను. ఆతఁడు నవ్వుచుఁగని—

"నేనిప్పుడు వచించిన వృత్తాంతముపై నీకు విశ్వాసముదయింప లేదని నీముఖభావమువలన నాకు స్పష్టముగఁ దెలియవచ్చినది. ఆతని మృత్యుసంబంధమున నీమత మెట్టిదో తెలియఁజేయఁగలవా?" అని ప్రశ్నించెను.

నారాయణరావుగారి యీయనపేక్షిత ప్రశ్నవలన నేను జ్ఞానశూన్యనై పోయితిని. ఇదియే సమయమని లజ్జయుఁ దనప్రభావమును నాపైఁ బ్రదర్శించెను. కాని, యాతనిప్రశ్న కుత్తరమీయకుండుట భావ్యము కాదని తోఁచి నామనసును నెమ్మదిపఱచుకొంటిని. నాచాపల్యముఁగని యాతఁడు భీతిచేఁ గంపింపసాగెను. అందువలన నాకొకింత ధైర్య మొదవెను.

నేను: ఇట్టి మహత్తర విషయమున మీరు నాయభిప్రాయము నడిగి నన్ను గౌరవించితిరి. మీ రెందులకై నాయభిప్రాయమును విననుత్సుకులై యున్నారో యందులకై నేను నాహృదయాభిప్రాయమును స్పష్టముగఁ దెలుపవలసివచ్చినది. డాక్టరుగారి గుప్తశత్రు వెవ్వరైన నాతని నంధుఁబడఁద్రోసి వధించియుండవలయును. కాక, యాతఁడే యేయుపద్రవమువలననైన నీటమునిఁగి మరణించియుండవలయును. ఆతనిని జక్కఁగ నెఱిఁగియున్న యేమనుష్యునకైన నీరెండు కారణములయందును జనింపఁగల యంతవిశ్వాస మాతఁ డాత్మహత్యఁ గావించికొనెనను విషయమున జనింపఁజాలదు. ఏలయన — నీజగ

మున నింకను జాలఁగాలము బ్రతుకవలయునని యాతని కిచ్ఛయుండె ననుట కెన్నియో బలవత్తర కారణములున్నవి ”

“ అట్లయిన నాతఁ డతిసౌఖ్యవంతుఁడై యుండవలయును ”

“ఆతనికి రూపగుణసంపన్నయు, సుకుమారహృదయయు నైన యొక తరుణిపై నిరతిశయప్రేమముండెను. శీఘ్రముగనె యాతఁ డామెను వివాహమాడనుండెను. ఈ యుదంతము సుఖదాయకము కాదా ? ”

ఆతఁడు తీవ్రదృష్టి నావంకకు సారించెను. అప్పు డాతఁడు తన నేత్రముల మూలమున నాపై నగ్నివర్షమే కురిపించుచున్నట్లు నాకుఁ దోఁచెను.

“ అట్లే యగపడుచున్నది. నిజమే !” అనుచు నాతఁడు నవ్వుటకుఁ బ్రయత్నించెను. కాని, యందాతనికి విజయము కలుగలేదు. హాసమునకు మాఱుగా నాతని హృదయస్థితదుఃఖమే యాతనివదనముపైఁ బ్రతిబింబితమయ్యెను.

“ అదే నిజము ” అని నేను నొక్కి పలికితిని. ఆతనిఁ బ్రేమించుచుండిన యువతియే, తాను మరణశయ్యపైఁ బడియుండి నాకీవృత్తాంతమంతయుఁ దెలిపినది. జగమంతయు నైకకంఠ్యముగ నేమైన ననుగాక ! ఆమె వచించిన యాకడసారిమాటలపై నేను విశ్వాసముంపక మానను.

“ సుఖవంతులు నైతము—”

“—ఆకస్మికోపద్రవమువలన మృత్యుముఖమునఁ బడుదురు. ” అని నేనాతనివాక్యమును బూర్తి చేసితిని.

“ అట్లయిన నీ వాతఁ డాకస్మికోపద్రవమువలన మరణించెనని చెప్పెదవా ! ”

ఆతఁ డీప్రశ్న నెంతిసహజరీతి నడిగినను, నాప్రశ్నమడుగుట కాతని కేదైన రహస్యకారణ ముండవలయునని నాకు శంక వొడమెను. నేనశాంతవృత్తితో—

“ అట్లనుట కేనంతమూర్ఖురాలను గాను. పరిశోధాంతమున నాతనికి శత్రువొకఁ డుండెనని—”

"డాక్టరు ప్రభాకరరావున కెవ్వరియెడలను వైరములేదు. అతని సుస్వభావమునకు మోహితులై పురవాసులెల్లరు నాతనిని ప్రేమించు చున్నారు"

"అది నేనెఱుఁగుదును."

"అతని మృత్యువున కింకొకమనుష్యుఁడు కారణభూతుఁడై యుండునని నాకుఁ దోఁచుటలేదు. అతఁడు బుద్ధిపూర్వకముగనైన, కాక, ఆకస్మికోపద్రవముననైన నీటఁ బడియుండవలయును. అతని నెవ్వ రైన నీటఁద్రోసియుండవలయుననుట కేవల మసంభవనీయము — నళినీబాయీ! నాయీమాటలకు నీ వొప్పికొందువా!"

నాకాతనిమాటలయెడ విశ్వాసముండెనా? అతఁడిట్లు నన్నడుగు టకుఁ గారణమేమియుండును? ఏకృత్య మెవ్వఁడును జూడలేదో, యది యీ విధముగనె జరిగియుండవలసినదని నిష్కర్షగాఁ జెప్పుటలో నర్థ మేమి? తనయీవృత్తివలన తానే సంశయాస్పదుఁడ నగుచున్నాఁడ ననియు, తనపలుకుల నెవ్వరును నమ్మఁజాలరనియు నాతనికిఁ దెలియు చుండ లేదాయేమి? నాయభిప్రాయమునకై యాతని కింతభయ మెందు లకు? ఇఁకనాతనితో సంభాషించుచుఁ గాలముపుచ్చుట కిష్టము లేనట్టు లాతనికిఁ దెలియుటకై నేను నాయాసనమునుండి లేచి—

"క్షమింపుఁడు! ఈ విషయమున న్యాత్రపడి యిప్పుడే యిఁక నధికముగాఁ జర్చించుట నాకిష్టములేదు. దాన మనకిరువురకును నిష్కారణముగా నధికాయాసము కలుగును. అంతియేకాక, మీజననీ యుటఁబరుండియుండ నేనిచట మీతో వాదవివాదముల ప్రొద్దుపుచ్చు టుచితముకాదు. కావున నేనిప్పటికి సెలవు పుచ్చుకొనియెదను." అని చెప్పితిని.

"దయచేసి యిఁకఁగొంచెము సేపుండుము." అని దీనముగ నారాయణరావు నన్నుఁ బ్రార్థించెను. నేనాతని విన్నపము నంగీకరిం

చుట యశక్యముగానుండెను. అప్పు డాతఁడు "నిన్నింక నొకటి రెండు ప్రశ్నలడుగవలసి యున్నది. దయచేసి వానికుత్తరమిచ్చినపిదప మా తల్లి గారికెంత కనుకుము. పుష్పలతను నీవు చక్కఁగ నెఱిఁగియుంటివని చెప్పియున్నావు. మీరిద్దఱు నొక్కఁ గడిలో నేయుంటిరా? మీరిదఱు నాంతరంగికమిత్రములే యైయుందురా?" అని యడిగెను.

"అవును. మేమిరువుర మొక్క చోఁగదియుండుచుంటిమి."

నా ప్రత్యుత్తరమును వినినపిమ్మట నాతని కొకింతకష్టముగా నున్నట్లు నాకుఁ దోఁచెను. నేనీవిధముగ నుత్తరమిత్తునని యాతఁడు కలనైన నెంచియుండలేదు. నేనాతని జయించుచుంటిననియు, నామాటల కాతనికిఁ దత్తరపాటు కలుగుచున్నదనియు, నాకుఁ దెలిసి, నేనానందముతోఁ బలుకనాగితిని!—

"నాకుఁ బుష్పలతపై నధికప్రేమముండెను. ఆమెయు నన్నతి ప్రేమముతోఁ జూచుచుండెననుటకు దృష్టాంతముగా నామె తనస్వార్జిత ధనమంతయు నాకిచ్చియున్నది. కావున, దాన నామెకు నాయందెంతటి ప్రేమముండెనో స్పష్టపడుచుండ లేదా?"

"అలాగా" అని యాతఁడు తలుపుదగ్గరకరిగి "అటులయినచో మీమీరహస్యవిషయములు మీకుఁ దెలిసియుండవలయును." అనియెను.

"అవును, తెలిసియుండుటయు సంభవనీయమే"

"ఆమెయే ప్రభాకరుఁడు సుఖముగా నుండెనని నీకుఁ దెలిపి యుండఁబోలును!"

"ఆమాట నేనప్పుడే చెప్పితినిగాదా!"

"నళినీ!" అని పిలిచి మహాగంభీరభాషణములతో నారాయణరా విట్లనియెను.

"నేను వ్యర్థజిజ్ఞాసగలవాఁడనని నీకుఁ దోఁచును. అంతియేగాక మర్యాదహీనుఁడనని నీవు నన్ను మనసున దూషించుచుందువు. కాని, యీ విషయమున సత్యమిట్టిదని తెలిసికొనుటయే నాయపేక్ష

కావున దయచేసి ప్రభాకరుఁ డాత్మహత్య చేసికొనలేదని నిర్ధారణము సేయుటకు నీకే యాధారములున్నవో నాకుఁ జెప్పిన బాగుగనుండును."

"ఇప్పుడే నాకుఁగల కారణములను మీకు నివేదించియుంట లేదా! మరలమరలఁ జెప్పవలయునా?"

"అక్కఱలేదు— చెప్పనక్కఱలేదు, మీరిప్పుడు చెప్పిన కారణములు కాక యింకను నేకారణములనైన నీవు చెప్పఁగలవా?" అని యాతఁ డధికారయుక్తదృష్టితో నన్నుఁ జూచెను.

ఆతని ప్రశ్నకుఁ బ్రత్యుత్తరమిచ్చుటకన్న నాకుఁ గత్యంతర మగపడలేదు. కావున నేను "ఇవితప్ప మఱేకారణములును నాకుఁ దెలియవు. తెలిసికొనుటకైన నాకేమగత్యమున్నది!" అని యంటిని.

"అగత్యము లేదని నీకుఁ దోఁచుచుండవచ్చును. ఏలయన— స్త్రీలకుఁ బ్రేమముందర మఱేమియుఁ దోఁచదు"

ఈవాక్యము నాతఁ డౌపరోధికభాషలో నుచ్చరించెనని కొందఱికిఁ దోఁపగలదు. కాని, నాకీవిషయమున విశేషమేమియుఁ దెలియదని గ్రహించి యానందభరమున నాతఁ డీవాక్యము నుచ్చరించి యుండవలయునని నాకుఁ దోఁచినది.

నేను మఱేమియుఁ బలుకక తటాలున ద్వారముకడ కేగితిని.

ఆతఁడు నావెంటనెవచ్చుచు "నాయీపలుకులవలన నీకుఁ గోపమువచ్చెనా!" అని యడిగెను.

"ఇంకను మీరు నన్ను బాగుగ నెఱుఁగరు" అని నేను గంభీరముగఁ బలికితిని,

"ఆ లోపమును గ్రమముగఁ దీర్చికొనఁగలను" అని యాతఁడు సస్మితుఁడై పలికెను.

"మీ తమ్ముఁడు మీకై యెదురుచూచుచుండును" అని నేను తటాలున గడపదాటి బయటికి వచ్చితిని. పైకి నేనించుకశాంత భావమునే వహించియుంటినిగాని, లోపల నా హృదయము మొక్కవెట్టనఁ

గంపించుచునే యుండెను. నారాయణరావుగారికిని నాకును జరిగిన సంభాషణములవలన, డాక్టరు ప్రభాకరరావుగారి మరణమునకును నీ యింటివారలకును ఏదేనొక పరమరహస్య కారణ ముండకమానదని నాకుఁ జక్కఁగఁ దెలిసెను. ఇచ్చటివారి, యిట్టి భయంకర స్వరూపము హృదయమునకుఁ దట్టినతోడనే యింకమఱొకరైనచో నొక్కనిమిషమైన నీయింటనుండుట కొప్పుకొనియుండరు. కాని, యజ్ఞేయముగునొక భావనా బంధమువలన సంకటపూరితమును, దుఃఖదాయకమునగు నీ విషయమును బరిశోధించుటకు నాకు స్ఫూర్తి కలిగెను.

## ఆఱవ ప్రకరణము

ఆ దివసము నా జీవితమున నత్యంతస్మరణీయదివసమై యుండెను. దినరాజాదినమంతయు నతిమందగతితోఁ దన యాకాశమార్గమునఁ బ్రయాణము సేయుచుండినట్లు నాకుఁ దోఁచెను. ఆ దివసమును దలంచుకొన్న నిప్పటికిని నాశరీరమున రోమాంచము లెగయుచున్నవి. ఆ భయానక ప్రాసాదమందలి భయప్రదశాంతభావము నా హృదయమును శరీరమును బ్రకంపితములుగాఁ జేసివేసెను. శ్మశానమున—నంధకారసమయమున—నొకభీరువు గూరుచున్నప్పుడు, తన చెంతకేదియో పిశాచము వచ్చుచున్నట్లగపడ, నాతఁ డెంతగ దిగులొందునో, యత్తెఱఁగున భీతిజనక ప్రశాంతతను, అంధకారభయంకర స్వరూపమును, నధికముగాఁ జేయు మందప్రకాశమున, అంతకన్న—ఆ శ్మశానమునకన్న—కమలాబాయిగదిలో నతిభయంకరమగు నజ్ఞాతభీతిచే నేను దిగులొందసాగితిని. ఆగదిలో నాకుఁ దోడుగ నారాయణరావైనను అతని యనుజుఁడగు గోపాలరావైన నుందురు. కాని, వారిసహవాసమున నా భీతి తొలఁగుటకుమాఱుగ మఱింత వృద్ధియగుచుండెను. ఆ దివాన్‌ఖా నాలోని భయానకశక్తి యాయిరువురియందును నావేశించు

చుండెనేమో! వారెన్నోట నొక్కమాటయు వెటువడుటలేదు. ఆయిరువు రును దమలిల్లి ప్రీతసదృశముఖములవంకఁ గాంచుచుఁ బాషాణవిగ్రహ ములవలె నామెశయ్యకడ నాసీనులైయుండిరి, వారికిరూఱుగ సరస్వతి నాకుఁ దోడుగ నీగదిలోనికివచ్చియున్నచో, హాసపూరితమును, సుంద రమునైన యామెవదన సందర్శనమువలన నాకెంతయో సుఖముగ నుండి యుండును. కాని. నా దురదృష్టముకొలఁది నామె యాదినమున నొక్క మాఱైన నాగదిలో నడుగిడలేదు. ఆమె గర్వస్వభావయు, స్వార్థ పరాయణయునగుటచే రోగికెట్లుశుశ్రూష సేయవలయునో తెనకుఁ దెలియక, రాలేదో, కాక యా మెసోదరు లామె నాగదిలోనికి రానీయని కారణమున రాలేదో నేను నిశ్చయము చెప్పఁజాలను. ఆవిషయము మెఱుంగుట కింకొకయుపాయమును లేదు. శిష్టాచార నియమము లామెకుఁ జక్కఁగఁ దెలిసియుండెననియు, నితరుల ప్రోత్సాహమువలనఁ గాని, కాక, యట్టియేమహత్కారణముచేనైనఁగాని, యామె యానియ మముల నతిక్రమించుటలేదనియు నేను వినియుండలేదు. ఈ విషయ మిక్కడ ముఖ్యముగఁ జెప్పుటయావశ్యకమే—

ఇట్టిస్థితిలోనే సూర్యాస్తమయమయ్యెను. చావడిలోనున్న మందప్రకాశముకూడ నిప్పుడంతరించెను. గోపాలరావున కచటఁ గూరుచుండుటకు విసుఁగుజనించియేకాఁబోలు, నాతఁడగ్రజుని చెవిలో నేదియోచెప్పి లేచిపోయెను. ఆతఁడచ్చోటువాసి వెడలిపోయినందున నాకు మిగుల నానందమయ్యెను. అప్పటికిని నారాయణరావు స్వస్థ ముగాఁ గుర్చిపైఁ బరుండియుండెను. సంభాషణమునకు నేనే తొలుతఁ బ్రారంభించుటకన్న గత్యంతరములేకుండుట యెఱింగి నేను నాయాస నమునుండిలేచి దీపము వెలిగించితిని. కిటికీతలుపులన్నియు మూసివేసితిని. దీపము వెలిఁగించినతోడనే నారాయణరావుగారి మౌనమునకుఁ గార ణము నాకుఁ దెలియవచ్చెను. మానసిక శారీరక శ్రమలచేఁ గడునలసి యున్న యాతఁడు గాఢముగ నిద్రించుచుండెను. గోపాలరావు గది నుండి వెడలిపోవుటయే యాతనికిఁ దెలియదు.

ఆతని యాననముపై నిద్రాదేవి ప్రశాంత సామ్రాజ్యము నెఱపుచుండెను. ఆతనియిప్పటి నిర్వికార స్వరూపమును దిలకించుటచే నాకనిర్వాచ్యానంద ముద్భవిల్లెను. ఆతనియాత్మ నిద్రాదేవిపవిత్ర సామ్రాజ్యమున విహార మొనర్చుచుండినందున జాగ్రదవస్థయం దాతని వదనముపైఁ గనఁబడుచుండిన యజ్ఞాతసంశయచ్ఛటలిప్పుడు పూర్ణముగ నంతర్హితములై పోయెను. దుష్టత్వ మాతనికి స్వభావజన్యదుర్గుణము కాదనియు నేవో యనపేక్షిత కారణములవలన నది యాతనియందుద్భవించియుండెననియు నాకుఁ దోఁపసాగెను. గోపాలరావునెడల కంటె నారాయణరావునెడల నామన సేటికిట్టు లధికముగ మరలుచున్నదో యాకారణముకూడ నాకుఁ దెలియవచ్చెను. సౌందర్యమున నాతఁడనుజునికంటె నొక్కింతతక్కువయేయైనను నాతనివర్తన మత్యంత సౌమ్యమును, ఆతనియుచ్ఛపదవి కనురూపమునై యుండెనని చెప్పట యతిశయోక్తి కానేరదు.

నేను భయపడుచునే నారాయణరావువంకఁ గనుచుంటిని. కుమారికాజనోచితలజ్జ నన్నాతనివైపున కనిమిషలోచనములతోఁ జూడనిచ్చుచుండ లేదు—ఆతని నటులే నిదురవోవనిచ్చుట యోగ్యము కాదు — ఏలయన — కమలాబాయికడ నేనొక్కరితనె కూర్చుండియుండుట యాతనికిష్టములేదని నాకుఁ దెలిసియుండెను— కావున, నాతని నట్లు నిదురపోనిచ్చుట మంచిదికాదని నామనసు నాకుఁ జెప్పఁదొడంగెను. కాని, వారి రహస్యమంతయు నెఱుఁగవలయునను నుత్కటేచ్ఛ నన్నెడబాయకున్నందున నేనాతని నిద్రనుండి లేపుటకుఁ బ్రయత్నింపనైతిని.

ఇట్టులించుమించుగ నొకపదినిమిషములు గడచెను. నిద్రించుచున్న నారాయణరావుగారి హాసయుత ప్రశాంతవదనముం గాంచి నాహృదయమున నానందతరంగము లుద్భవించెను. అల్పావకాశమునకుఁ

బూర్వము శ్మశానసన్నిభముగనుండిన యాగది యిప్పుడు నాకానంద మందిరముగ నాకన్నులకుఁ దోఁపసాగెను. ఆగదిలోని సామగ్రులన్నియు నాకిప్పుడు నూతనముగఁ బొడగట్టుచుండెను. గదిలోని యంధకారము పూర్ణముగ నశించియుండెను. ఇంచుకైన గాలిచొచ్చుట కెడములేని యాగది యిప్పుడు మధురమందమారుతముతో నిండియుండెను. వేయేల! గడియారపు టిక్ టిక్ శబ్దముసైత మిప్పుడు నాకు శ్రవణానంద కరముగా నుండెను. నా సమక్షముననె శయ్యపైఁ బరుండియున్న కమలాబాయి నిర్వికార స్వరూపము—

అయ్యో! ఇదేమి! కమలాబాయి నావంకఁ జూడ్కులుసిగుడించుచున్న దేమి! ఆమె నేత్రములు శుభ్రముగఁ గనఁబడుచున్నవి. నావంకఁ గనుచున్నదామె కాక, యామెపిశాచమే క్రోధపూరిత నేత్రములతో నన్నుఁ జూచుచున్నట్లు నాకుఁ గొంతసేపు తోఁచెను ఆశ్చర్యప్రథమావేగము నశించినపిమ్మటఁ గమలాబాయి కిప్పుడు చైతన్యము కలుగుచున్నదని నాకుఁ దెలియవచ్చెను. ఆ సమయమునకుఁ దగిన యౌషధోపచారము లతిత్వరితముగఁ జేయుట నాముఖ్యకర్తవ్యమని నాహృదయము నాకుఁ జెప్పఁదొడంగెను. కాని, యెంతధైర్యముఁ దెచ్చికొనినను నాపాదములు శరీరభాగమును వహించుటకు సంసిద్ధములు కాలేదు—ఒకయడుగైన నిడుటకు నాకు ధైర్యము కలుగదయ్యెను. అదృశ్యముగనున్న భయపిశాచము నన్నావహించియుండెను. అంతలో గమలాబాయి మాటలాడఁ బ్రయత్నించెను. ఆమె దేహమున నవీనజీవన సంచారమైయున్నదని నాకుఁ దోఁచెను. ఇట్లు నాకుఁ దోఁచుటల్లో నాభయము నన్నువీడిపోయెను. లేచినిలిచితిని. కాని, నాపాదములుమాత్రము ముందడుగిడుచుండలేదు. ఒకానొక యదృశ్యశక్తి నన్ను వెన్నంటి పట్టుకొనియుండఁబోలును! కమలాబాయి యేమిపలుకునో విందమని నేను లేచి మౌనముతో నిలిచియుంటిని. ఇంతలో నాగదిలోనిశాంతికి భంగముకలిగెను. కమలాబాయి

నోటవెడలిన భీషణవాక్యములు నలుదంకలకును బ్రతిధ్వనించుచు నా కర్ణఫుటములు వ్రయ్యుకొనిపోవు చుండెను.

ఆమె : నారాయణా ! గోపాలా ! నేను పిశాచరూపమున మిమ్ము వెన్నాడఁగూడదని మీ కాసయున్నచో, ఆ పురాతన యంత్రకార్యాల యమున మీకును డాక్టరు ప్రభాకరునకును జరిగిన విషయ మెవ్వరికిని దెలియఁజేయమని శపథము చేయుఁడు.

కమలాబాయి వాక్యము ముగిసినతత్క్షణమే "అమ్మా !" అని పిలిచినశబ్ద మాగదియంతటను బ్రతిధ్వనించెను. ఈశబ్ద మెవ్వరుచ్చ రించిరో నాకుఁ దెలియుటకుమున్నె నారాయణరావు తటాలున నొక్కగంతునఁ దల్లిసమీపమునకుఁ జేరెను. తనమాతృ మస్తకమును హృదయమునకుఁ జేర్చికొని యధికారయుక్తస్వరమున నాతఁడు నాతో "పోయి గోపాలునిఁ ద్వరగాఁ బిలిచికొనిరమ్ము ! ఆతఁ డాయావలి గదిలో నున్నాఁడు. అమ్మ పలవరించుచున్నదని వానికిఁ దెలుపుము" అనియెను. ఆతని యీ యాజ్ఞను నెఱవేర్చుటకై నేను వేగముగ నడచిపోవుచుండ నారాయణరావు నన్ను మరలఁ బిలిచి "ఈ మాట లితరుల కెవ్వరికిని దెలియనీయకుమని నీతో నేననవలసినపనిలేదు" అనియెను.

"లేదు" అనుమాట నా పెదవులదాటి వచ్చెను. కాని, యయ్యది స్పష్టముగ నుండలేదు. నా హృదయమున నిప్పుడే యుత్ప న్నములగుచుండిన యాశావిశ్వాసములు కమలాబాయి యాడినయా వాక్యములవలనఁ బిడుగుచే భస్మీకరింపఁబడిన యంకురముల చాడ్పున నొక్కక్షణములో భస్మావశేషములయ్యెను. భీతిమరల సంపూర్ణముగ నన్నావహించెను.

నారాయణరావు చూపిన గదిలోనికిఁ బోవునప్పుడు నాహృ దయ మొకింతశాంతి వహించెను. నా హృదయావేగము చంచలవృత్తి, భీతిజనితవిస్మయము, ముఖాభావము, మున్నగునవి గోపాలరావు

దృష్టిని బడనీయఁగూడదని నేను నిశ్చయించుకొంటిని. కాని నేన పిలిచినపిలుపువలన నవిబయలుపడియెను. గోపాలరావుగారి తీవ్రదృష్టి ప్రచారమున నావహించిన గాంభీర్యము విగళితమయ్యెను. నేనాతఁ కాతనియాగ్రజునాజ్ఞఁ దెలిపినతోడనే యాతఁడు కనుఁగొనల నగ్నికణములఁ గురియుచు నాతో—

"ఏమి ! మాయమ్మ కలవరించుచున్నదా ? ఆమె యేమనియెనో చెప్పెదవా ?" అనియెను.

అసత్యమాడుటకు నామనసొప్పలేదు. కావున నున్నదున్నట్లు పూసగ్రుచ్చినరీతి వచించితిని. అదివిని యాతఁడు శాంతహృదయుఁడై మందహాసముతో "ఆలాగా ! కలవరించుచుండెనా !" అనియెను. ఈశబ్దముచ్చరించునపు డాతఁడత్యంతశాంతి భావముతో నుండెను. స్వమనోవృత్తి స్వాధీనమున నుంచుకొనుటయం దాతనికిఁగల సామర్థ్యమునకు నాకించుక కౌతుకమయ్యెను. కాని, తత్క్షణమే యాతని యీ శక్తివలన నాతఁడెంత భయంకర మనుష్యుఁడో యనునీకల్పనముగూడ నాకుఁ దోఁచెను. అపుడు నాకాతనియందలి భీతి యధికాధికము కాఁజొచ్చెను.

మేము కమలాబాయి గదికిఁ బోవుచుండ నాతనిమనమున జరుగుచుండిన యాలోచన నాకుఁ దెలిసియుండినయెడల నేనధికముగ భయపడియుందును. కాని, యేయంతస్స్ఫూర్తివలన నాకాతనియెడల నంతటి భయము కలుగుచుండెనో, ఆయంతస్స్ఫూర్తి సాహాయ్యముననె యాతని మనసునందలి విచారము నెఱుంగుట శక్యముకాదు. మేము గదితలుపు దగ్గరకుఁ జేరితిమి. అతఁడు తలుపు తెఱచి తొలుత లోనికి నన్నుఁ బోనిచ్చి పిదపఁ దాను లోనికరుదెంచెను. ఇట్టి సమయమున సైత మాతని యత్యంతాదరాయుత్త వర్తనముం గాంచుటచే నాకాశ్చర్యము కలుగసాగెను.

నారాయణరావుమాత్ర మీవిషయమున వ్యతిరేకముగ నుండెను. మేము లోపలకుఁ బోయినతోడనే యతఁడు లేచి నాయొద్దకు

వచ్చెను. అతిశాంతభావముతో నాతఁడు నన్నచట నొకమూల మౌనముతోఁ గూరుచుండ నియమించెను. ఒక్కసారి నలువంకలఁ దిలకించితిని. సహజముగా నాదృష్టి రోగిపైఁబడెను. అప్పుడామె నిశ్చలభావముంగని యింక నామెకు నాపరిచర్యలక్కఱలేదని నేననుకొంటిని. ఏలయన — ఇఁక నఱగంటలోనె యామె తనయీనశ్వర దేహమును విడిచి మృత్యులోకమున కరుగఁగలదని నేననుకొంటిని. తన కొడుకులతోఁ గడసారి యొక్కమాట నాడవలయునను నాశతో నామె ప్రాణములు త్వరపడుచుండెను. నారాయణరావు చెప్పినతీరున నేనొక గదిలో మంచముపైఁ బరుంటిని. అట్లు పరుండి తలుపు మూయుదునా, లేక యట్టే తెఱచియుంచుదునాయని యాలోచించుచుంటిని. మూయుటయే మంచిదని యొకసారి తోఁచెను. కాని, తత్క్షణమే పుష్పలతా దయామయమూర్తి నాయంతశ్చక్షువుముందర నిలిచి తనయంత్యకాలపు విన్నప మేమఱకుండుమని జ్ఞప్తికిఁ దేఁదొడంగెను. ప్రియపుష్పలతకై — ఆమెకిచ్చిన నా వచనమునకై — మాతాపుత్రుల సంభాషణమును మఱుఁగుననుండి వినవలెనని నాసదసద్వివేకబుద్ధికిఁ దోఁచెను. అచ్చట నేనొకవిధముగఁ జెఱసాలలో నుంటినని చెప్పవలయును. ఏలయన, అచటినుండి బయటికి పోవలెననిన నేనిప్పుడువచ్చిన మార్గము తక్క వేఱుమార్గము లేదు. భీతిచే గడగడవణఁకుచు వారి సంభాషణము వినఁదొడంగితిని.

ఆకస్మికముగఁ గమలాబాయి క్షీణస్వరమున నిట్లనియెను. అందుఁ గ్రోధభావము నిండియుండెను—

"ఆ — శీఘ్రముగ వాగ్దాన మొసంగుఁడు. నారాయణా గోపాలా! చూచుచున్నారేమి? నాయంత్యేచ్ఛ—"

తమతల్లి యిష్టముచొప్పున నామె కభయమిచ్చుటయె శ్రేయస్కరమని భావించి గోపాలరావు "అమ్మా! ఆ వృత్తాంతము మేమె

వ్వారికిని దెలియనీయమని నమ్ముము. నీకంతగఁ గావలసినయెడ నిదిగో శపథము సేయుచున్నాఁడను" అనిపూతఁ డామెచేతిలోఁ జేయివైచెను

సమాధానసూచక నిశ్వాసమువిడిచి యత్యంత దీనస్వరమునఁ గమలాబాయి తనజ్యేష్ఠపుత్రు నుద్దేశించి "నారాయణా!" అనుచుండఁ దటాలునఁ దలుపు తెఱవఁబడెను. ఒకవ్యక్తి లోనికిరుదెంచెను. అటు చూచి యామె ద్వేషభావముతో "ఈమెను బయటికి వెడలఁద్రోలుఁడు! మీరీమెనెందులకు లోనికిరానిచ్చితిరి? దీనినిజూచిన నాయొఱ కాలిమంట తలకెక్కుచున్నది. దీనిజన్మదివసము జ్ఞప్తికివచ్చి నాజీవము పరిపరివిధములఁ బరితపించుచున్నది. పో! వెడలిపొమ్ము!" అనియెను.

తత్కాలజనితాశ్చర్య ప్రేరితనై నేనాక్షణమె మంచమునుండి లేచి యాగదిలోని కరిగితిని. అచ్చట నేఁజూచినదృశ్య ప్రతిబింబ మిప్పటికిని నాస్మృతిపటమున స్పష్టముగ నెలకొనియున్నది. ఏమనుష్యుపై మృత్యువు నిజచ్ఛాయను ప్రసరింపఁదొడఁగియున్నదో, యాకమలాబాయి క్రోధోద్రేకమున, సరస్వతిని దిరస్కారపూర్వకముగఁ దిలకించుచుండెను. జననికొఱకు— శబ్దతాడనజనిత దుఃఖావేశయైన సరస్వతి— యామె సమక్షముననె నిలిచియుండెను. తనకాశీర్వాదము నొసంగవలసిననోట నిట్టివిషమయ శబ్దములు వెడలుటచే నామె మిగులభీతిల్లెను. ఆమె కపోలములపై ననవరతమును విలసిల్లుచుండు రక్తవర్ణ మొక్కత్రుటిలో నిర్మూలమయ్యెను. పక్వబింబమునుసైతము లజ్జింపఁజేయఁజాలు నామె యధరము భీతిచే వెల్లబాఱెను. ఆమె నిలువఁజాలక పోయెను. దేనినైన నూతగఁగొను నుద్దేశముతో నామె ఫేనసదృశ్యమును, కోమలమునైన తనబాహుదండమును ముందఱికిఁ జాచెను.

ఒక్కక్షణమైన నాలసింపక నేను సరస్వతి కడకేగితిని. నేనామెను సమీపించుటకుఁ బూర్వమె యామె మూర్ఛిల్లియుండెను. ఎవ్విధినైన నామెను గమలాబాయి సన్నిధినుండి తీసికొనిపోవలెనను నుద్దేశముతో నేనామెనెత్తికొని బయటికివచ్చితిని. నేనటు లామెనెత్తుకొని

పోవుచుండుటఁ గమలాబాయి కాశ్చర్యమయ్యెను. ఆమెవదనముపై నొక్కనిముసమునకుమున్ను ప్రజ్వలించుచున్నక్రోధాగ్ని ప్రేమముగఁ బరిణమించెను. ఆమె దృష్టియందలి క్రోధాగ్నికణములుగఁ బ్రేమామృత మంకురింపసాగెను. ఆమె యీ విచిత్రస్థితిఁ గని సరస్వతిని బయటికిఁ గొనిపోవలయునో, లేక, కమలాబాయి శయ్యయొద్దకుఁ గొనిపోవలయునో నాకుఁ దోఁచదయ్యెను. కాని, నేనిట్టిస్థితిలో చాలసేపుండవలసిన యక్కఱలేకపోయెను. కమలాబాయికి వెక్కిళ్ళువచ్చెను— ఆమె యాత్మ యమలోకమునకు వెడలిపోయెను. సర్వదా క్రోధోద్రిక్తరూపమునఁ గన్పడు నామె రూపమున నిప్పుడు ప్రేమచ్ఛట విలసిల్లెను.—

# ఏడవ ప్రకరణము

సరస్వతి గదిలో మంచముపైఁ బరుండియుండెను. నేనామె శయ్యపైఁ గూరుచుండియుంటిని. ఆమె యింకను సేదఁదేఱియుండలేదు. ఆమెని స్తైజస్వరూపముం గాంచుచు నిప్పుడే సంఘటించినదాని విషయమై యాలోచనసేయుచు నేనందు నిమగ్ననై యుంటిని. ఇంతలో నాయాలోచనకు భంగపాటు కలిగెను. ఎవరో "నలినీబాయీ!" యని పిలిచినసవ్వడి నాకు వినవచ్చెను. ఆ సోదరులలో నెవ్వరైన నాకై యిటకువత్తురని నేననుకొనియుంటిని. కాని, నారాయణరావునకు మాఱుగ గోపాలరావు వచ్చునని మాత్రము నేను తలఁచియుండలేదు.

"నీతో నొక్కింతమాటాడవలసియున్నది. నీవొకసారి యీవలికివచ్చెదవా?" అని గోపాలరావు నన్నడిగెను.

నేను లేచి సరస్వతివంకఁ జూచుచు నిలిచితిని. అప్పు డాతఁడు మరల "కోకిల బయటనున్నది. ఆమె సరస్వతి విషయమై శ్రద్ధతీసికొనును" అని చెప్పి యాతఁడు నన్నుఁ దనవెనువెంటరమ్మని ముందు

నడవసాగెను. నేను నాతనిమాట కడ్డుచెప్పక యాతని వెనువెంట నడవఁ దొడంగితిని.

"ఇంకను నచ్చట దీపములు వెలిగింపలేను. మన మాకచేరి చావడి కరుగుదుముపద," అని యాతఁ డనియెను.

ఆతని యీ సూచన మిగులఁ జిత్రముగ నుండెను; కాని యెంతమాత్రము నేనాతనికి భయపడుదాననుగానని నేను నిశ్చయించికొనియుండినందున—"మీయాజ్ఞ నాకు మన్నింపఁదగినదియే" అని యంటిని. ఆవాక్యముచ్చరించునప్పుడు నాకు సాధ్యమగునంత శాంత స్వరమును దెచ్చికొనుటకై ప్రయత్నించితిని. కాని, నాకందు విజయము కలుగలేదు.

గోపాలరావు నన్నిప్పుడు తోడ్కొనిపోయినగది యాభవనము నందలి మొదటి యంతస్తున నుండెను. మేమచటికిఁ బోవునప్పటి కచట నంధకారము బంధురముగా నుండెను. గాలియు లేకుండెను.

మేము లోనికరిగినవెంటనె గోపాలరావు దీపమును వెలిఁగించెను. ఎల్లెడల నావరించియున్న యంధకారరూప శత్రువునుండఁ దాను నిలువఁగలనో లేనో యనుభయముచేఁగాబోలు నాదీపము కంపింప సాగెను. అంధకారస్వరూపము నధికభీషణముగఁ గనఁబడఁజేయు చున్న యీమందప్రకాశమున నచట రెండు మహాద్వస్తువులు నాకు దృగ్గోచరములయ్యెను. ఒకటి — కమలాబాయి పూర్ణతారుణ్యమున నుండునప్పుడు తీయించుకొనిన రూపపటము; వేఱొకటి—ఎదుటియద్దమునఁ బ్రతిబింబించుచున్న నారూపము'—ఆమె పూర్ణతారుణ్యమున నున్నప్పుడు చక్కఁదనంబున నామెకు సాటివచ్చువారుండరని యీ పటమునుగని నేననుకొంటిని. నిశ్చయముగా నామె మిగుల సౌందర్యవతియై యుండెనని యీపటమే సాక్ష్యమిచ్చుచుండెను. కాని, యీ సౌందర్యముచాటున నమానుషదౌష్ట్యమును, మహాదీర్ష్య, కాపట్యము మొదలగునవి దాగియుండునని యీకాలమున నెవ్వరనుకొనియుండురు!

అద్దమునఁ బ్రతిఫలించుచున్న నారూపము చటి మందప్రకాశమున విస్పష్టముగ నాకుఁ గనఁబడకుండినను దానిని జూచుటవలనఁ గలక బాఱిన నామనసొకింత శాంతివహించెను. శ్రమవలన నాయొడలంతయు వెల్లబాఱియుండినను, నామోమున దృఢనిశ్చయము, పూనిక గాంభీర్యము స్పష్టముగఁ బ్రతిఫలించుచుండుట నాకగపడెను. అప్పుడు నాయెదుట నిలిచియుండిన గోపాలరావును గూర్చినభీతి నాకెంతమాత్రమును లేకుండెను.

భయప్రదమగు నాగదిలో నొకపిశాచరునిభంగిఁ గూర్చుండియుండు గోపాలరావునకుసైత మావిషయము తెలియవచ్చెను. ఆతఁడనేకపర్యాయములు తనదృష్టి నద్దమువైపునకుఁ బోనిచ్చియుండెను. ఆతఁ డట్టె చాలసేపు నిలిచియుండెను. తుదకాతఁడు నావైపునకుఁ జూచి నాతో సంభాషించుటకు ధైర్యము దెచ్చికొనియెను. ఆతనిదృష్టి తీక్ష్ణమును, కఠోరమునై యుండెను. ఆతఁడు బలవంతముగ నెఱవుఁ దెచ్చికొనినహాస మోష్ఠములపైఁ బ్రకటితమగుచుండెను తనకంఠస్వరమున సాధ్యమయినంత గాంభీర్యముం గూర్చికొని యాతఁ డిట్లు పలుకసాగెను—

"నలినీబాయీ! నేఁడీగృహమున మహాత్త్వమును, దుఃఖదాయకమునగు విషయము సంఘటిల్లలేదనుట మూర్ఖత్వమునకు మూలమగును. మాతల్లి మరణము సృష్టినియమానుసారమైనదని ప్రతిపాదనము సేయుటయందును నర్థము లేదు. అంతేకాక, నేనట్లుచేయ సాహసించితినేని, నీసదసద్వివేకబుద్ధికి విభ్రమము గూర్చినట్లులగును. నేనును నాయగ్రజుఁడును నీదృష్టుల కతిహీనులవలె నగపడుదుము. ఇప్పుడు మేమతికష్టస్థితిలో నున్నారము. ఇప్పటికిని మే మేమియుఁ జెప్పక మౌనముతో నూరకున్నచో నీకు మాయెడల వ్యర్థముగ ననుమానము కలుగఁగలదు. మఱియు మేమెన్నఁడో—ఈనాఁటిమాట యెవ్వరితోనైనఁ జెప్పినచో, నీకుఁగాని, యితరులకుఁగాని, విశ్వాసముదయించు

వని యెవ్వరనుకొనఁగలరు ? మాతల్లి తన యంత్యకాలమున నుడివిన నుడువులయొక్కయు, మే మొసఁగిన వాగ్దానములయొక్కయు, వరము విస్పష్టముగ నీకుఁ దెలుపఁదగినదిగనే యున్నది. నిన్నుఁ బోలిన పవిత్రాంతఃకరణముగల సుందరసుకుమార స్త్రీమనంబున సంశయపిశాచ మునుండనిచ్చుట తగనిపనియె. ”

నేనింతవఱకు నొక్కమాటయు నాడనైతిని. అంగుల కాతఁ డొకింతతడ వూరకుండెను. ముందుఁ జెప్పవలసినదానిని జెప్పుమని నేను నాతలగదలించితిని. ఆతనిమనసున నెంతయొ భయంకరవిచారము నిండి యున్నను, నావర్తనమున నాతని కొకింతసమాధానమైనట్టులగపడెను. ఏమో ! పైకట్లు కనఁబడెనేమో నేను జెప్పఁజాలను. విశ్వాససూచక స్వరమున నాతఁడు మరలఁ జెప్పఁదొడఁగెను—

“ మూఁడుమాసములకుఁ బూర్వము మాతల్లి కాపత్సరంపరలు సంభవించెను. దీర్ఘకాలమునుండియు వ్యాధిపీడితుఁడై యున్న మాతండ్రి దుస్థితివలన మాయమ్మ మిగుల దీనదశనందియుండెను. ఆపిమ్మట నాతని మరణమును, అమీఁద వెంటనె సరస్వతీ వియోగమును—ఇట్టి వని చెప్పనలవికాని కారణములచే మాచెలియలి కతిశీఘ్రముగ వివాహము చేయవలసివచ్చెను. ఈకారణద్వయముచే నామె మిగుల క్షీణదశకు వచ్చెను. ఆమె క్రమక్రమముగ నుపేక్షభూతమయ్యెను. తుదకు మానసికాశక్తతవలన నామెపలుమాఱు మూర్ఛిల్లుచుండెను. కడకు దానివలననె యామెకాల మంతరించినది ! సరస్వతి మూలమున మనవంశమున కొకభయంకర సంకటము రానున్నదని యిటీవల నామె తనహృదయమునఁ దలఁపసాగెను. పాపము ! సరస్వతియో మాయిష్టము ననుసరించియే సకలము నెరవేర్చుచుండెను. మాత్రాజ్ఞవలననె యామె యంతత్వరలోఁ బెండ్లియాడి యంతదూరదేశమునకేగ సంసిద్ధ యయ్యెను. నిశ్చయముగ మాయమ్మకు సరస్వతియన్న బ్రాణాధికగ నుండెను. ఆమె నెంతయో ప్రేమించుచుండెను. అట్టియెడ నామె

దూర దేశమున కేగుట తటస్థించినప్పుడు మాయమ్మ కెట్లులుండునో యించుక యోచించిచూడుము ; శరీరము రోగగ్రస్తమయ్యెను. అప్పటి యామె మనోదౌర్బల్యమువలన సర్వదుఃఖములకును సరస్వతియే కారణ భూతయని మాయమ్మకుఁ దోఁచెను. కారణమిట్టిదని యెఱుఁ గుటకైన నామె మనోవృత్తి నశించియుండెను. సరస్వతీ ప్రయాణ మును, మాతృరోగవృద్ధియు, నొక్క-సమయముననె తటస్థించెను. కావున గాకతాళీయముగ మాయమ్మ తనవ్యాధికి సరస్వతినె మూలకారణముగ నెంచుచుండెను. డాక్టరు ప్రభాకరరావు విషయమై మాయమ్మ మాచేఁ జేయించుకొనిన ప్రమాణమునం దర్థమేమియును లేదు. డాక్టరుగారి యాకస్మిక మరణవార్త వినుటచే భ్రమించి యామె యా విషయమై యేమేమియో మాటాడుచుండెను — అంతియే. మేమట్లు శపథము సేయుటవలన మాలో నెవ్వరైన నాజీర్ణయంత్రాలయమున కెన్నఁడైన బోయియుండుమనిగాని, కాక, యాతని మరణమువిషయమై మాకధిక ముగ దెలిసియుండవలయుననిగాని నీవనుకొనుచున్నచో నది కేవ లము భ్రమయగును. ఏవిధముగానైనను, మాయమ్మను శాంతచిత్తను జేయవలయునను తలంపుతో మేమట్లు శపథము చేయవలసివచ్చినది. ”

ప్రశాంతగంభీర స్వరమున గోపాలరా విట్లుపలుకుటవిని నేనా శ్చర్యముతో, నర్థపూర్ణదృష్టితో, నాతనివైపునకుఁ జూడసాగితిని. ఏలయన— ఆతనినోట వెడలిన యీవాక్యములే నారాయణరావునోట వెడలియున్న నెంతయో బాగుగ నుండునని నాకుఁ దోఁపసాగెను. ఇట్లే నారాయణరావు చెప్పియున్నచో నేనానందముతో నీమాటలను విశ్వసించియుందును. నాహృదయమున నీతలంపు పుట్టినతోడనే కుమారీ జనోచితమగులజ్జ నన్నావహించెను. నాకపోలము లరుణము లయ్యెను. నాయీస్థితి గోపాలరావునకుఁ గనఁబడునేమోయను భీతిచే నా హృదయము కొట్టుకొనసాగెను. నాయీమనస్థితి నా నేత్రములలోఁ

ప్రతిబింబించియే యుండునను కొనియెను. ఏలయన — నేనేమియును మాటాడకుండఁగనే యాతఁడు సమాధానభావముతో నాదగ్గఱకువచ్చి నాతో మరల నిట్లు మాటాడఁదొడఁగెను.

“నీవీగృహమున నడుగిడి పూర్ణముగ నింకను నిరువదినాలుగు గంటలుకాలేదు. అయినను నిన్ను నేను చిరపరిచితురాలివలెఁ గాంచుచున్నాను. ఇంతకన్న నింకను నెక్కుడు పరిచయము కావలెనని నాకిచ్ఛ కలదు. నలినీబాయీ! నీవు నాయీమైత్రిని స్వీకరింతువా?”

నన్ను మోసగించి! తనవలలోఁ బడవేసికొనుటకై యాతఁడిట్టి పన్నాగములఁ బన్నుచున్నాఁడని నా హృదయము నాకు సూచించెను. అతని సూచనను కఠినవాక్యములతో ధిక్కరింపవలెనని నాకుఁ దోఁపసాగెను. కాని, యేకానొక యజ్ఞాతభావనకులోనై నేనట్లు చేయలేనైతిని. ఆభావన భీతిజనితమైనదనిమాత్రము తలంపఁగూడదు. మఱియా భావము యెట్టిది? గోపాలరావు నేఁటింతటి కోమలహృదయుఁడయ్యె నేమిటికో యనునాలోచనయే? అవును—అదియే కానోపు! అందులకుఁ గారణ మెఱుఁగవలెనను నపేక్షయే—ఏమైనగానిండు! నేనాతని విన్నపమును బహిరంగముగ ధిక్కరింపనైతిని. నేనాతనివంకఁ జూచుచునూరక నిలిచియుంటిని. “మౌనమ్సమ్మతిలక్షణ” మను న్యాయముననుసరించి యాతఁడు నేను సమ్మతించితిననియే భావించి యిట్లనియెను.

“నీవు నన్నొకగొప్ప విచారమునుండి విడిపించితివి. నీవుకాక, మఱి యేయితరస్త్రీయైనచో మమ్ము నిష్కారణముగ నధికకష్టముల పాలుచేసియుండును.”

“నేను మిమ్ముఁ గష్టపెట్టనని మీకు నమ్మకమెట్లు కలిగినది?”

“నీ సోగకన్నులును, తేజోమయముఖమండలము నందులకు సాక్షులు!” అని యాతఁడు మందహాసము చేసెను. ఆపిమ్మట నాతఁడర్థపూర్ణమును ప్రేమమయమునైన దృష్టితో నన్నుఁ జూచెను. ఆదృష్టిక్షేపమువలన నాతని హృదయమున నెట్టివిచారణ జరుగుచుండెనో

నేను తెలిసికొనఁగలిగితిని. అప్పుడు ద్వేషోద్రేకముచే నావదన మెఱ్ఱఁబడిపోయెను. బహిరంగముగ నాతనిదూషించి యాతని వాక్యముల నిషేధింపవలెనని నాకొకసారితోఁచెను. కాని, నేనాతనివలలోఁ జిక్కుపడియుంటిని గావున, దానినుండి విముక్తనగుటకై యసాధారణకౌశలమును ధైర్యమును నుపయోగింపవలయునేగాని, మూర్ఖముతో నాతని దూలనాడుట యోగ్యముకాదనియు, నట్లుచేసినచో నుఱియు నధిక కష్టములు సంప్రాప్తమగుననియు వెంటనే నాకుఁ దోఁచి నేను కొయ్యవలె నైపోయితిని.

ఆ గదిలోఁ జీఁకటిచే నిండియున్న యొకమూలకుఁ జూచుచు మౌనముద్రాధారిణినై కూరుచుండియుంటిని. ఇంతలో నట నొకవింత జరిగెను. దానింగని "నేను జాగ్రదవస్థయందున్నానా లేక, నిద్రావస్థయందున్నానా" యనుటయే తోఁచదయ్యెను. అది మహావిచిత్రతరమును ఆచ్చర్యజనకమునై యుండి నమ్ముటకు వలనుగాకుండనుండెను. నేను స్వప్నసృష్టిలో నున్నట్లును, గోపాలరావాడిననీచ సాహసవాక్యమును నావీనులఁబడుచున్నట్లును, గాన నాహృదయ మిట్టిదశనంది యున్నట్టును నాకుఁ దెలియవచ్చెను. కావున, "నారాత్రి జరిగిన యీ వింతవిషయమై — అచట నార్యాతి నాకేమియగపడినను నేను దాని యందు విశ్వాసముంపఁబోనని నిశ్చయించుకొంటిని. నామౌనమునకును, నాదృష్టిక్షేపమునకును దనకిష్టమువచ్చిన విధమున నర్థముచేసికొని యాతఁడు వెండియుఁ బలుకసాగెను.

"నీకిచ్చట నెట్టులోయుండఁగలదు. అందునీదోష మేమున్నది! నీవంటితరుణసౌందర్యలతికకిట్టి భయానకస్థలమింపుగా నుండకుండుటలోనాశ్చర్య మేమియును లేదు. కాని, నాకు విశేషాశకలదు–" అనుచు నాతఁడు నాసమీపమునకువచ్చి నిలిచెను. ఆతని స్వరూపము భ్రమఁజెందినట్టులుండెను — నేత్రము లొకవిధమగు తేజమును వెడలఁగ్రక్కుచుండెను—"ఇప్పు డింత భయప్రదముగను, నసహ్యాకరముగను దోఁచు

నీస్థలమే నీకు శీఘ్రకాలముననె యానందమునకుఁ బుట్టినిల్లుకాఁగలదు. ఇప్పు డంధకారబంధురమైనట్లు లగపడు నీగదులప్పుడు స్వచ్ఛసూర్య ప్రకాశమునఁ బ్రకాశితములగుచున్నట్లు కాన్పింపఁగలవు. వేయి మాటలేల? ఇప్పుడేస్థానము నూతనజీవన సంచారమును, త్రాసదాయకమునై యున్నదో, యాస్థానమే నీకప్పుడు సౌఖ్యనివాసస్థలము కాఁగలదు. మనమైత్రికిఁ బ్రారంభమున దుఃఖదాయకమును, సంశయాస్పదమునగు విషయములు సంఘటిల్లినవిగదా, అవియన్నియు నాయానందభరమున నీవు మఱచిపోఁగలవనుటలో నాకణుమాత్రము ననుమానములేదు" అనిపలికి మిగుల నమ్రభావముతో నాతఁడు నన్నభినందించి యచ్చోటువాసి వెడలిపోవ నుద్యుక్తుఁడయ్యెను. ఏదియే నావశ్యకకార్యమునకై యాతఁ డతికష్టముతో నన్ను విడిచిపోవలసి వచ్చినదని యాతని ముఖభావమువలన నేనెఱింగితిని. ఆతఁడు ద్వారము తెఱవఁబోయెను. ఇంతలోఁ దలుపుతీసికొని నారాయణరావు లోనికిఁ బ్రవేశించెను.

గదిలోఁ బ్రవేశించినవెంటనే నారాయణరా వొక్కమాఱు తన యనుజునివంకకును దరువాత నావంకకును సంశయాస్పదదృష్టితోఁ జూచెను. ఆతని యప్పటిముఖ భావముంజూచి నా హృదయము కళవళపాటందెను. నారాయణరావు తన సోదరునిపైఁ గోపముతో నుండెనా యను యోచనచే నాకెంతయో సంతసము కలిగెను. కాని యప్పు డాతని మనసున నేమియుండెనో, ఎట్టివిచారముపుట్టెనో యది మాత్రము నేను చెప్పఁజాలను. ఏలయన—తత్క్షణమె యాతఁడు వెడగు నవ్వు నవ్వుచు మాసంభాషణమున కంతరాయము కల్పించినందులకై తన సోదరుని క్షమాపణము వేడెను. పిమ్మట నాతఁ డనుజుని చెవిలో నేమియో చెప్పెను. అనుజుఁడు తీవ్రదృష్టితో నొక్కసారి నావంకకుఁ జూచి గంభీరభావముందాల్చి యచ్చటినుండి వెడలిపోయెను! అచ్చట నేనును నారాయణరావు నిద్దఱమే యుంటిమి.

నా హృదయమునందువలెనె యాతని హృదయమునసైత మేదియో విచారము వ్యాపించియుండఁబోలును! అతఁడు చాలసేపటి వఱకు నాతో నొక్క మాటయునాడకుండ నాగదిలో నటునిటు తిరుగుచుండెను. తుద కాస్థితికాతఁడు విసిఁగియేకాఁబోలును ప్రకంపనస్వరమున నిట్లనియెను.

"నళినీబాయీ! గోపాలరావు నీతో నేమి సంభాషించుచున్నాఁడు? అల్పావకాశమునకుఁ బూర్వము నీవుచూచిన దుఃఖప్రద విషయమును గూర్చి యాతఁ డేమైనఁ జెప్పెనా?"

నేనౌననునర్థము వచ్చునట్లు శిరసును గదలించితిని. నేనిఁక నేమైన మాటాడవలయునని యాతనికిచ్ఛయున్నట్లు లాతని మొగమునఁ గనఁబడుచుండెను. కాని, యేమి మాటాడవచ్చునో యేనెఱుఁగకున్నందున నోరికివచ్చినట్లెల్ల మాటాడుటకన్న మౌనమే యుత్తమమని తలంచి నేనూరకుంటిని.

"గోపాలరావించుక యుద్ధతుఁడు; అవిచారపరుఁడు;" అని తదేకదృష్టితో నావంకఁజూచుచు నారాయణరావు మరల నిట్లనియెను.

"మా విషయమున నీకు సదభిప్రాయము కలుగునట్టి వర్తనముల నాతఁడు నీకడ మెలఁగుచుండెనా?"

గోపాలరావు నాతో నేమిచెప్పెనో తెలిసికొను నుద్దేశముతో నాతఁడీప్రశ్నము నన్నడిగెనని యెఱింగి నేను మందహాసముతో—

"ఇదేమి! ఇట్లులనుచున్నారు? గోపాలరా వెన్నఁడు నాతో సవిచారముగఁ బ్రవర్తించియుండలేదు. ఆతఁడు నాకడ సన్మార్గముతోడను, ఆదరభావముతోడను మెలంగుచున్నాఁడు" అని నేనంటిని.

నారా: మాతల్లి యుత్తరక్రియలు ముగియువఱకు నీవు మాయింటనె యుండవలయునని మాకందఱకు నపేక్షయున్నదని మాతమ్ముఁడు నీతోఁ జెప్పినాఁడుగాదా?

నేను: ఆవిషయమై యాతఁ డేమియు ననలేదు.

నారా : అట్లయినచో నేను నీతో విన్నవించుకొనుచున్నాఁడను. నీవు మాయింటఁ గొంతకాలము వసింపవలయును.

నాకేమియుఁ దోఁచకపోయెను. ఈ విన్నపము నంగీకరింపవచ్చునా ; తృణీకరింపవచ్చునా ? నేను మందమతినైతిని ; అనపేక్షితముగ నిట్టి యీ మంత్రణమున కచ్చెరువందితిని ; ఆశ్చర్యపాటొందితిని. ప్రత్యుత్తరమీయవలయును — ఏమని ? ఉత్తరమీయకుండుట ధర్మముగా నగపడలేదు. ఎట్లయిన నేమైన జెప్పనేవలయునని తలంచి తుదకు " నేనాలోచింపవలసియున్నది. పుష్పలతా ప్రభాకరులయంత్యక్రియల కేనచ్చట నుండకతప్పదు. అంతియేకాక — " అని చెప్పి నామనసునందలి సంశయమును విస్పష్టముగఁ దెలియఁజేయవలయు ననుతలంపుతో నేను " నారాయణరావుగారూ ! మీరు కోపపడవలదు. నాహృదయముననున్న విచారము స్పష్టముగఁ జెప్పెదను. అది మిమ్మవమానపఱచుటగా మీరెంతమాత్రమును దలంపకూఁడదు. అంత్యకాలమునందలి మీజనని విచిత్రప్రవర్తనముంగూర్చి నాహృదయమున మీవిషయమై యొకభయంకరసంశయ ముత్పన్నమైయున్నది. దానిని రహస్యముగా నుంచుటలో నర్థములేదు. మీవలన నట్టి శపథమును దీసికొనుటకు మాతల్లి కేదైన రహస్యహేతు వుండనేవలయును. కమలాబాయి యెంతయు నశక్తయై యుండుఁగాక ! డాక్టరు మరణవార్త వినినంతనె యాకస్మికముగ — నిష్కారణముగ — నిశ్చేష్టయై పడిపోవుటయు, నందువలననె యామె కంతముకలుగుటయు నసంభవముగా నగపడుచున్నది. ప్రభాకరుని మరణముతో నీమె కేదైన దృఢసంబంధముండినఁగాని యీమె కిట్టిదుస్థితి సంభవింపనేరదని నాహృదయము నాకుఁ జెప్పుచున్నది. కాని, యింతవఱకు మీయనుజుఁడనినయట్లు మీరును " డాక్టరు మృత్యువుతో మాకెట్టి సంబంధమును లేదు. అతఁ డాపురాతన యంత్రాలయమున నాప్రాంత తొట్టిలోఁబడి మరణించెను. మేమెన్నఁడు నాతని నాయాలయమునఁ గలిసికొనలేదు—

ఊరక నూయమ్మ వ్యాధివిహ్వలయై యేమేమియో ప్రేలినది. ఆమెను సంతుష్టురాలిం జేయుటకై మేమప్పు డట్టి శపథమును జేయవలసి వచ్చినది" అని వచించినచో మహానందముతో నేను నామనస్సునందలి సంశయమును దూరముగావింతును. అంతేకాదు; మీయందఱకు నిష్టమైనచో మీ వేడికోలున కేనంగీకరించి కొంతకాలమువఱకు నిచ్చట నుండ నంగీకరింతును" అనియెను.

"నీవిప్పుడనినట్లే నాతమ్ముఁడు నిశ్చయముగా నీతోఁ జెప్పె నాఁడా!"

"అవును"

"అయినచో, ఆమాటలే నానోటినుండికూడ విన నిచ్ఛగింపుటకు హేతువేమియో చెప్పఁగలవా?"

ఈప్రశ్న కేనేమని యుత్తరమీయఁగలదాననో సుజ్ఞులగు పాఠకులే యాలోచింతురుగాక! నేనేమియు నుత్తరమీయకుండుటచే నారాయణరావు మరల నిట్లనియెను.

"గోపాలరావు వచించిన యుదంతమున నీకు విశ్వాసము లేకపోయినది. మఱి, యాయుదంతమే నానోటవినినంత మాత్రమున నీవెట్లు విశ్వసింపఁగలవు?"

లజ్జ నాయంతఃకరణమందలి యభిప్రాయము నెఱ్ఱరంగునఁగలిపి దానిని నాకపోలములపైఁ బ్రతిబింబింపఁజేసినందున నాకేమియుఁ దోచఁదయ్యెను. నేను మౌనముద్రాధారణము చేసికొంటిని.

నారా: నీవు నామాటలయందు విశ్వాసముంచెదవా?

ఔననుటకు నాకు ధైర్యము కలుగదయ్యెను. కాని, యట్లనుటకుమాఱుగ నింక నేమైననన్నచో నామనసు సమాధానపడుటయా వశ్యకమే.

"వలిసీ! నీవేమియుఁ బలుకుటలేదు. కాని, నాకుఁ దోచుచున్నది—నీవు నామాటలయందు విశ్వాసముంతువు," అని యాతఁడుత్కంఠుఁడై పలికెను.

నేను : (శాంతముగ) నేను నా యభిప్రాయము మీకుఁ దెలిపితినిగదా !

ఆకస్మికముగా నారాయణరావు రూపము ఱిచ్చపాటంది వెలవెలఁ బాఱెను. ఆతఁడేమియో పలుకయత్నించుచుండెను. కాని, నోటమాట వెడలకుండెను. ఆతని యీయవస్థంగని, నా యంతఃకరణము భయప్రపూరిత మయ్యెను. ఆతఁడటనుండి లేచి దూరముగాఁబోయి యా గదిలోనటునిటు విమనస్కుఁడై తిరుగసాగెను. తుదకు ధైర్యముఁ దెచ్చికొని గంభీరముద్రతో నా వైపునకుఁజూసి నిశ్చయాత్మక స్వరమున నిట్లనియెను.

“ నలినీ ! నీవారోపించినది కాదనఁజాలను. నాయభిమానము నన్నటుచేయనిచ్చుటలేదు. నీవడిగినదానికి లవలేశమైన వ్యతిరేకముగఁ జెప్పఁగలనా ! నేను గోపాలరావువంటి యవిచారపరుఁడను గాను—కపటాచరణుఁడఁగాను ! ”

“ఇక్కడనుండుటచే నేను పుష్పలతకొసఁగినబాస కెట్టిబాధయుఁ గలుగనేరదని మీరు మనసార చెప్పినెడ నేనిచట నుండుట కొప్పుకొందును ”

“ అయిన నీకుఁదోఁచునది.—”

“ సరి ! సరి ! నాకేమియుఁ దోఁచుటలేదు—తోఁచవలయునని యైన నేనుగోరను. కృపచేసి మీరు నా మనసున మఱేసంశయమును బ్రవేశపెట్టకుఁడు ! ”

ఒక్కసారి విషాదపూరిత హాస మొనర్చి యాతఁడు మరలగదిలోఁ దిరుగసాగెను. ఆతఁడు మరల నాకడకువచ్చినప్పుడు నేనొకపాషాణ విగ్రహమువలె నిశ్చలనై—ఇంచుమించుగ నశ్లే—సంజ్ఞావిహీననై యుంటిని.

“ నలినీ ! నేనుదయమునఁ బలికిన వాక్యములు నీకు జ్ఞప్తియందున్నవా ? ”

"ఉన్నవి. నేను వాని నింకను మఱవలేదు." అని తటాలున నేనంటిని. నాయాశకింకను గొంచెము స్థలముండుట తెలియవచ్చినంతనె నా హృదయ మానందప్రపూర్ణమాయెను. కన్నులానందబాష్పములఁ గురియింపసాగెను.

"అప్పుడు నీకు నేను మాటయిచ్చి యుంటిని. దానిని నీవింకను మఱచియుండవు!

"లేదు—ఆవాక్య మింకను నాకర్ణరంధ్రముననె యున్నది"

"మఱల నేనావచనమె యిచ్చినచో నీకుఁ జాలునా?"

నారాయణరావుగారి యీ మాటలకు నేను సంతుష్టచిత్తనైతిని. నా మనసునందలి యొకగొప్ప భారము తగ్గినట్టులయ్యెను. నాడెందము కొలఁదిపెట్టరాని ప్రేమరసము నాస్వాదింపఁ దొడఁగెను. ఉచ్చకుల సంభూతుఁడును, అభిమానియు, నిర్మలస్వభావుఁడునైన నారాయణరావు ముఖముసైతి మా సమయమున లజ్జచే నారక్తమయ్యెను. అతనికిఁ గూడ నాఁడొక మహాసంకటమునుండి విముక్తినందినట్లుగ నానందోదయమయ్యెను. అతని భావములను గ్రహించి తెలియఁబడని యొక భావ శృంఖలమునుండి విడివడి నేనిట్లంటిని. "నారాయణరావుగారూ! నే నిచట నుండుట కొప్పుకొంటిని."

## ఎనిమిదవ ప్రకరణము

జీనసిపరుషవాక్యముల కోర్వఁజాలక నిశ్చేష్టమైపడియున్న సరస్వతికిఁ ద్వరలోఁ జైతన్యము కలుగనందున నామఱునాఁ డంతయు నాకామె ప్రక్కనే కూర్చుండవలసివచ్చెను. సాయంకాలముగుసరి కామె తెప్పిరిలు శుభచిహ్నములు పొడకట్టెను. ఇప్పుడచటఁ గోకిలను గూర్చుండఁబెట్టి కొంతసేపు మంచిగాలిలోఁ దిరిగివచ్చుట కేమియు నభ్యంతర ముండదని

తలఁచి నేను బయటికి వెడల నుద్యుక్తనైతిని ఆ యింట నెల్లెడలనిండి యున్న దుఃఖవాతావరణమునుండి నా కెప్పుడు విముక్తి కలుగునా యని వేచియుంటిని. అంతియేకాక యా యూరిలోని జనులందఱు పుష్పలతా ప్రభాకరుల మరణమునుగూర్చి యేమనుకొనుచున్నారో యెఱుఁగుట కేనుత్సుకనై యుంటిని.

వనమందలి వాలుకామయపథమున నడచిపోవుచుండ నామన సున ననేకవిధములగు సందేహము లుద్భవింపసాగెను భోజనము వేళ నేనీదినమున బయటికిఁ బోవనున్నానని తెలిపితిని. అప్పు డాసోద రహ ద్వయము "పోవల" దనుటకు సాహసింపలేదు. వారట్లు మౌనముతో నుండుటచే వారికి నావెనువెంటవచ్చు నుద్దేశ మున్నదేమో యని నేననుమానించితిని. కావున, నాతోఁటలో నడచిపోవుచుండ వారిలో నెవరైన నా యెదుటికి వచ్చి నిలుతురేమో యని నేను భయపడుచు నడచుచుంటిని. కాని, నాభయ మాధారవిరహితమైనది. చాలసేపటి వఱకు నా కెవ్వరును గనఁబడలేదు. అప్పటికి నాభీతి నిరాధారమైనదని నే నెఱింగితిని. ఇప్పు డింక రెండుమూఁడు గంటలవఱకు నాయిచ్ఛవచ్చిన తెఱంగున స్వాతంత్రముగ విహరింపవచ్చుననియు, గోపాలరావును గూర్చిన భీతి కింకగారణము లేదనియు, నిశ్చయించుకొని నేను నామనో రాజ్యమున విహరించుచుంటిని. అంతలో నా తోఁటలో నెవఁడో తలుపు నానుకొని నిలిచియున్నట్లు నాకగపడెను.

ఆ సోదరు లిద్దఱుఁ బొడువున సమానులుగా నుండుటచే నాతోఁట వాకిలిదగ్గఱ నిలిచియున్న మనుష్యుఁ డాసోదరులలో నొక్కఁడై యుండఁబోలునని తలఁచితిని. కాని, వారిలో నెవ్వరైనదియు గుఱుతింపలేనైతిని. భయకంపితనై యట్టెనిలిచితిని. బయటఁ దిరుగుట మాని మరల నింటికిఁ బోవుదుమాయనియుఁ దోఁచెను. వెనుకకుఁ దిరిగి తిని. అంతలో నామనుజుఁడు వెనుదిరిగి నావంకఁ జూచెను. ఇఁక నాతని బలుకరింపకయె వెడలిపోవుట భావ్యముకాదని నాకుఁ దోఁచి నేను

సాధ్యమైనంత వఱకు గాంభీర్యమును శాంతమును గూర్చుకొని మౌనముతో నాతని సమీపింపఁ బోయితిని. ఆతఁ డెవ్వఁడై నదియు నేనాలోచింపనైతిని. ఆతఁడు నారాయణరావో, కాక, గోపాలరావో, యైయుండు నను కొంటిని. కాని, యాఁత డితఁడేయని మాత్రము నాకు నిజము తెలియలేదు. శీఘ్రముగ నా యనుమానము నివృత్తియగునని వడివడిగ నడచి యాతని సమీపించితిని. కాని, నాసంశయనివృత్తియగుట సంభవింపలేదు. నేను తన్ను సమీపించుచుంటంగని యాతఁడచట నేమిచేయో చేసి—యేమిచేసెనో చెప్పఁజాలను—వేగముగ నడచి వచ్చి నాకభివాదన మొనర్చి, యా సమీప లతానికుంజములలో నదృశ్యుఁ డయ్యెను.

"ఆతఁడు నారాయణరావే! కాదు — నారాయణరావైనచో నాతో మాటాడకుండ నట్లు వెడలిపోవునా? ఆతఁడు గోపాలరావై యుండవలయును." ఈ విధముగ పరస్పర విరోధకారణములగు నాలోచనములు నా మనమున సందడించెను. ఒక్కసారి యా వెడలి పోయిన యాతఁడు నారాయణరావై యుండవలయుననియు, నుత్తర క్షణమున నె యాతఁడు గోపాలరావై యుండవలయుననియుఁ దోఁచుచుండెను. ఆ గృహస్థుఁ డెవ్వఁడైననేమి? నాకాతనితో నేమిపనియున్నది? ఇఁక మీఁద నేనీ యన్నదమ్ములతో నెట్టి సంబంధము నుంచుకొనఁ గూడదని నామనసున నిశ్చయించుకొంటిని. కాని, నాయీనిశ్చయము చాలసేపుండలేదు. నేనాతలుపు దగ్గఱకు వచ్చుటతోడనే యాక వాట స్తంభముపై నొక సుందర పుష్ప ముండుట నాకగపడెను. ఆ పుష్ప మతి మనోహరమై యుండెను. వసంత శ్రీసౌందర్యమంతయు, నా కుసుమమునందె యేకాకారత నందినట్లుండెను. ఈపుష్ప పరిమళము ముందా వనమందలి యితరపుష్ప పరిమళము తుచ్ఛముగనుండెను. అ య్యది తానున్నతావును శోభింపఁజేయుచు సగర్వముగ హాసముచేయుచుండినట్లు నాకుఁదోఁచెను. ఆగృహస్థుఁడు నిష్క్రమించునప్పుడు చేతినొక

విధముగ నాడించెను. ఆహస్త సంజ్ఞకర్థ "మీ పుష్పమును స్వీకరింపు" మనియే యని భావింపవచ్చును. నారాయణరావే యీ కుసుమము నిచట వేసియుండెనా! ఆహా! అది నాకెంత సంతోషకరముగ నుండును! దానినిదాల్చ నాకెంతటి యానందముగ నుండును! దాని సుగంధముతోఁ గూడిన వాయుసంస్పర్శవలన నాహృదయమున నొక విధమగు నానందతరంగ ముద్భవించును గదా! గర్విష్ఠుఁడును గపటుఁడు నగు గోపాలరావే వేసినచో — పోనిండు! నిశ్చయపఱుపఁజాలని విషయమును గూర్చి యాలోచించుట యేమిలాభము? ఎవ్వరుంచియున్న నేమి? ఆ పుష్పమును స్వీకరింపుమని నాహృదయము నాకుఁ జెప్పఁ దొడంగెను. పుష్ప మతి సుందరమైనది! దానిని స్వీకరింతును. పిమ్మట గోపాలరావే దానినిట నుంచియుండెనని నాకెప్పుడైనఁ దెలియవచ్చు నెడ మరల దాని నాతని కిచ్చివేయుదమని నిశ్చయించుకొంటిని. పిదప నేనత్యుత్సుకతతో నా పుష్పమును స్పృశించి నాకేల ధరించితిని. ఆహా! పరిమళ శోభితంబగు నిట్టి మనోహర పుష్పము నీ విధముగఁ ద్రోవలోఁ బాఱవేయునంతటి యరసికపూరుషు లా గోపాలరావు కన్న నింకెవ్వరుందురు? నిజముగ నీజగమున నింతటివాఁ డుద్భవింపఁడు — నారాయణరావే దీని నాకర్పింప నెంచి యిటఁ బెట్టియుండునా? అసంభవము! అతఁ డట్లు తలంచియే యున్నచో నాతఁడే దీనిని దనకరకమలముచే స్వయముగ నాకర్పించి యుండఁడా!

ఇట్టి విచారము లుద్భవించినంతనే నామనస్సెట్టులో యయ్యెను. ఈ పుష్పమును స్వీకరించుట సాహసకార్యమనియు, మూర్ఖకృత్యమనియు, నాకుఁదోఁచి వెంటనే దానిని గ్రిందఁ బాఱవేయఁ బోయితిని. ఇంతలో నేను పూర్వము వర్ణించిన బాలకుండు నాయెదుట ప్రత్యక్షమయ్యెను. విచిత్రదృష్టితో నాతఁడు నావంకకుఁ జూడసాగెను. ఫేనసదృశములగు నాతని పరిశుభ్ర హస్తములు మారుతవశమున నటునిటు కదలుచుండెను. అతని వర్తనముం గాంచి యాతనికి నా చేతిలోని పూవును

గై కొనవలెనను నిశ్చయముండెనని తలంచితిని. అతని గనినంతనే నేనానందముతో "బాలుఁడా! ఇదిగో! దీనిని స్వీకరింపుము! నాకంటె నీకిది మిగుల నానందకరముగా నుండును" అని చెప్పితిని.

"ఆహా! ఆశ్చర్యము! నేఁదలంచినట్టు లా బాలుఁడు పుష్పమును దీసికొనుటకై ముందఱికిరాక తటాలున వెనుకకుఁ దిరిగి వెడనటు నిటు త్రిప్పుచు, పకపకనవ్వుచు—

"ఏమియీవింత! అది నీ ప్రియుని బహుమానము! దానిని నీ తుఱుమునఁ దుఱిమికొనుము!" అని పలుమాఱు వచించుచుఁ గరముల నూరక త్రిప్పుచుఁ జేతులఁ జప్పటులఁగొట్టుచు నా చుట్టును దిరుగసాగెను. తుదకు నాకుఁ గోపము వచ్చెననియనుకొని యాతఁడు నేను పోవఁజాలని యొక స్థలమున కేగి నిలిచెను.

ఇట్టి స్థితిలో నా పుష్పమును గ్రిందఁబడవేయుట మంచిది కాదని తలంచి దానిని నా చేతిలోనున్న సంచిలో వేసి వేగముగ నడవసాగితిని. ఆ వెఱ్ఱికుఱ్ఱవాఁడు నా వెనువెంటనె రాఁదొడంగెను. ఒక్కొక్కప్పుడా బాలుఁడు నన్ను సమీపించును; మఱొక్కప్పు డతిదూరమునకుఁ బోయి యేమేమియో గొణఁగుకొనుచు, వాఁడెక్కడనున్నను వాని తీవ్రదృష్టి మాత్రము నావైపునకే నిశ్చలముగ నుండెను. ఒక్కసారి నేను సాహసించి కోపదృష్టుల నాతనిపైఁ బఱపించితిని; కాని, యందుల కాతఁ డిసుమంతయును జంకక బిగ్గరఁగా "ఇప్పు డిచ్చటివారందఱును నిన్నుఁ బ్రేమించుచున్నారా? చెప్పుము! వారిచర్యల కిప్పుడు నీవు సహించుచున్నావా?" అని నోటికివచ్చినట్లెల్ల నఱచుచు దొమ్మరివానివలె గంతులిడుచు నా వెంటనె వచ్చుచుండెను. అట్లులాతఁడఱచుచు నా వెనువెంట వచ్చుచుండుటచే నాకామార్గమున నడచిపోవుటకు సిగ్గగుచుండెను; "ఇది యెంతలజ్జాకరముగా నున్నది!" అని నేననుకొంటిని. ఇంతలో నాయదృష్టవశమున "ఒక్కనాఁడు, రెండుదినములు, పది దినములుండుము. అప్పుడు వారికి నీయెడఁ బ్రీతికలుగును. తెలిసెనా!

వింటివా ?" అని యాతఁడు బిగ్గరగా నఱచి తటాలునఁ బ్రక్కనున్న వనమున మాయమైపోయెను.

ఈ బాలుని పలుకులు వీథిలో నెవ్వరైన వినియుందురేమో యను భీతిచే నేను ద్వరగ నడచుచుఁ దొలుత నేనుండిన యింటివైపున కేగుచుంటిని. పదినిముసములలో నిల్లు చేరితిని. అప్పు డదృష్టవశమున నా యింటిలో నుండు వృద్ధుఁడును, వ్యవస్థాపకుఁడు నింటనే యుండినందున నఱగంటలోనె కావలసిన సంగతులు నాకుఁ దెలియవచ్చెను.

డాక్టరు ప్రభాకరరావుపడి మునిఁగి మరణించిన యాతొట్టిలో నొక్క మనుష్యుఁడు మునిఁగి చచ్చునంతటి నీరెక్కడనుండి వచ్చెనని యాలోచించుటకచట పంచాయితీదారులు చేరిరఁట. ఆతొట్టియంతయు శోధించిరఁట. తొట్టిగోడలు పడిపోయియుండెను. గొప్పగాలిచే నాగోడలు కూలిపోయి యుండవలయుననియు, గాన, వర్షజల మాతొట్టిలో నిండియుండవలయుననియు, నాకస్మికోపద్రవమువలన డాక్టరు ప్రభాకరరావుగా రందుమునిఁగి మరణించిరనియుఁ బంచాయితీలో ధృఢపఱచి వ్రాసిరఁట! ఇది సహజమే! సయుక్తికమె! కాని, బహుజనసమూహమీ తీర్మానమును నమ్ముటకు వీలులేకుండెను — చాలమంది యీ మాటలను నమ్మరైరి. డాక్ట రాత్మహత్యఁ గావించుకొనియెననియే యెల్లరు నమ్మియుండిరి. జనులు తమయనుమానమును ధృవపఱుపఁ బ్రభాకరరావుగారి వంటలక్క (ముసలామె) చెప్పినదాని నాధారముగఁ దీసికొనుచుందురు. ఇటీవల డాక్టరుగారి వర్తనమున మిగులఁ బరివర్తన ముండెనని యామె చెప్పుచుండెను. కాని, యా పలుకులను నేను నమ్మలేదు. ఏలయన — ఆతని వర్తనమున నెట్టి పరివర్తనమున్నను, పుష్పలతకు—ఆతని ప్రాణేశ్వరికిఁ దెలియకుండఁ జాలదు. తెలిసియున్నచో నామె నాతోఁజెప్పక యుండదు. ఆమె నాతోఁ జెప్పలేదు. కావున, నేనీముదుసలి పలుకులను నమ్మలేను.

ఇంతేకాక, డాక్టరుగారి మృత్యువునకుఁ బిమ్మట వెంటనే మరణించిన మఱియిరువుర మరణమును గూర్చియు లోకు లనేకవిధములఁ జెప్పుకొనుచుండిరని నాకుఁ దెలిసెను. కమలాబాయి మృత్యువు విషయమై యందఱకుఁ దెలిసియున్నను నామెకు డాక్టరుగారి యాకస్మిక మరణముతో సంబంధముండెననిమాత్ర మెవ్వరికిని దెలిసియుండలేదు. దీనివలన జనులకందఱకుఁ గమలాబాయియెడ నతిభక్తియుండెనని మాత్ర మెవ్వరు ననుమానింపఁదగదు. సంభాషణమున జనులామె పేరు నత్యాదరముతో నుచ్చరించుచున్నను, నది వారి కామె యందలి సద్గుణములవలన, బుట్టినభావము కాదు. ఆమె యున్నత పదవియు, సంపదయు, వారి యాదరమునకుఁ గారణభూతములై యుండెను. కమలాబాయి కుమారు లిరువు ఱింకను గుమారులై యుండుటచే సహజముగనె వారియెడ జను లీర్ష్యవహించియుండిరి. ఆ సోదరు లిప్పుడు మహా ధనసంపన్నులైరి. ఆ ధనమంతయు వారేమి చేయుదురో యని జనులాలోచించు కొనుచుండిరి. తుదకు పుష్పలతా ప్రభాకరుల యాకస్మిక మృత్యువునకై తమదుఃఖమును బ్రదర్శించుటకు జనులు రేపటి యుదయమున నొక మహాసభను గూర్చుచున్నారనియు నాకుఁ దెలియవచ్చెను.

కొలఁదిసేపటిలోనే నాకీవిషయములన్నియుఁ దెలియవచ్చినందున నన్ను నేనభినందించుకొనుచు మహోత్సాహముతో నేను మరల నారాయణరావుగారి గృహమునకుఁ బోవ బయలుదేరితిని. చీఁకటిపడకమున్నె నేనాయిల్లు చేరవలెనని వడివడిగ నడచుచుంటిని. అప్పటికి — ఆ గృహావరణముననున్న తోఁటవాకిలికడ కేగునప్పటికి, దినమణి పశ్చిమదిగ్వధువును విరహవారిరాశిలోముంచి యస్తాంబుధిలోఁ బడిపోయెను. పతివియోగ విహ్వలయగు నాకాంతయెడఁ దమ సహానుభూతిని వ్యక్తపఱచుటకే కాఁబోలు నటనున్న మహోన్నతవృక్షములపై వివిధవిహంగసమూహము సభగూడియుండెను. తమదుఃఖమును గవితారూపమున నుపన్యసించుటమాని, యధ్యక్షుని పేరఁ

దంత్రీసందేశముల నంపి తమ సహానుభూతిని ప్రదర్శించు ప్రస్తుత సంస్కర్తలపద్ధతి యెఱుఁగకుండుటచేఁ గాఁబోలు, నాపక్షిగణము లత్యుచ్చస్వరమున నఱచుచుఁ దమతమదుఃఖమును సహానుభూతిని బ్రకటింపఁ దొడంగెను. కాని, దుర్విధి నేమనవలయు! ఈపులుంగులన్నియుఁ దన్ను వెక్కిరించుచుఁ బరిహాసము చేయుచున్నవని పశ్చిమదిక్సతికిఁ దోఁచియుండనోపు! ఆమె ముఖమున క్రోధోద్రేకమున నారక్తమై యుండెను. ఇట్టివేళ నేనాతోఁట తలుపుదగ్గర కరిగితిని. అటనెవ్వఁడో పురుషుఁడు నిలిచియున్నట్లు నాకుఁ దోఁచెను. నేనింటినుండి బయటికిఁ బోవుసమయమునసైత మక్కడనే యొక పురుషుఁడుండెనని వచించి యుంటిని. అప్పుడు నన్ను గనినంతనే యాతఁడు తటాలున వెడలిపోవుటచే, నాతఁ డెవ్వఁడైనదియు నాకుఁ దెలియలేదు. తెలిసికొనవలయు ననునాజిజ్ఞాస యట్టులే యుండిపోయెను. ఇప్పు డెట్టులైన నాతని సమీపించి యాతఁ డెవ్వఁడో, యూరెద్దియో, పేరేమో, యన్నియుఁ దెలిసికొనకుండఁ బోఁగూడదని నిశ్చయించుకొంటిని. ఆ పురుషుఁ డదృష్టవశమున మునుపటివలె మఱుగుపడక, నన్నుఁ జూచినంతనె నాకడకు సస్మితవదనముతో నెదురువచ్చి యాదరభావముతో,

"నలినీ! ఒక్కరితవై యెక్కడికో పోవలెనని నీకుద్దేశముండి యున్నందున నీతో వచ్చుటకు నేను సాహసింపనైతిని. చీఁకటిపడక మున్నె నీవిల్లు చేరినందున నాకెంతో సంతసమగుచున్నది" అనియెను.

"నేను మీయెడ నత్యంతకృతజ్ఞనై యున్నాను." అనియుంటిని. నన్నుఁ బలుకరించిన యాపురుషుఁ డింకెవరునుగాక నారాయణరావే యైయుండుటచే నప్పుడు నాకు జనించిన యానందభరమున నేనట్లుంటిని. కడచిన యఱగంటనుండియు నామనసును వేధించుచున్న యనేకవిధశంక లిప్పుడు మటుమాయమైపోయెను. నేను మాఱల నిట్లుంటిని. "ఇట్టిసమయమున నొంటిగ బయటికిఁ బోవుట సుఖదాయకము కాదని నేనెఱిగియుండియు నత్యంతావసరకార్య నిర్వాహణమునకై

నేనటు పోవలసివచ్చెను. మఱియు, నాహీనస్థితి ననుసరించి యెల్లప్పుడు నొంటరిగా సమయాసమయములు గమనింపక బయటికి పోవలసి వచ్చుచుండుటచే నాకు భీతియుఁ దోఁపకుండును"

"నీవతిసాహసికవ్యుసుషూ" అనుచు నాతఁడు నాచేతినున్న తోలుసంచిఁ దీసికొనెను.

ఆతని హస్తస్పర్శనమున నాదేహము పులకించెను. ఆయానందాంధకారమున నా రోమాంచము లాతనికగపడకున్నందున నేను సంతసించి "నాకు ధైర్యముతో నుండుటకన్న గత్యంతరము లేదు. కఠినస్థితితోఁ బోరాడునప్పు డనేకపర్యాయములు నేను హతాశను గావలసి వచ్చెనని ప్రాంజలినై యొప్పుకొనుచున్నాను. కాని, యాహతాశాస్థితి దీర్ఘకాలముండదు. తత్క్షణమె నానైసర్గికాభిమానము నాకుఁ గలుగుచుండిన యాపదలయందు ధైర్యముతోఁ బోరాడుచుండుటకై స్ఫూర్తి కలిగించుచుండును. కావుననే నేఁటివఱకు నాచెక్కులయాధారముననె స్వోదరనిర్వాహణముఁ గావించుకొనుచున్నాను. ఇఁకముందు స్వోదరపోషణార్థమై యితరులసాయ మపేక్షింపక నాకు దొరికిన పనులను జేయుచుండవలయునని నేనుద్దేశించియున్నాను" అని యంటిని.

నారా: నీవటులొనర్పవలసిన యవసర ముండఁజాలదు. ప్రస్తుతస్వావలంబనకాలము నందలి నీయీ సరళవర్తనముచే నీ విషయమై నాయట్టి హితచింతకుని యాదరము వృద్ధియగుచున్నది.

అని యాతఁడు మందగమనమున నడవసాగెను.

నేనును బ్రస్తుతప్రసంగము మార్చు నుద్దేశముతో "నిజముగ నీ ప్రదేశ మతిరమణీయముగ నున్నది" అని యంటిని.

"అవును; నిజమె! అని యాతఁడు విమనస్కతతో ననియెను. ఆతని భ్రూలతపై వెలసియున్న ముడతలవలన నాతఁ డేదియో దీర్ఘవిచారమునఁ జిక్కుకొని యుండెనని తెలియుచుండెను. లతాని కుంజము సందులనుండి కొంచెము కొంచెముగ నాతని గృహముఖద్వారము

కనఁబడువఱకు నాతఁడు నాతో మెల్లగ నడచివచ్చుచుండెను. ఆ గృహ ద్వారము బాగుగఁ గనఁబడినంతనే యాతఁడు నాతో నేమియో పలుక నిచ్ఛగించువానివలెఁ జటాలున నిలిచెను. నేనును నిలిచితిని. తుదకాతఁ డొకసారి ప్రేమైనవీక్షణముల నాపై సారించి మహాదరభావముతో నిట్లనియెను. "నలినీ! నీవు నాతో నెంత గౌరవాదరములతో నెంతగ మాటాడుచుండినను, నీ మనసున నా విషయమై యేదో గూఢసంశయ మున్నదని నేనెఱుంగుదును—అందులకు నేను నిన్ను దూషింపఁబోను, దూషించుట నావలనఁగాదు. ఏలయన—నిన్నుఁ గాంచినప్పటినుండియు నా హృదయ మొకవిధమగు భీతిచే నావరింపఁబడి యున్నది. కావున, నీతో నొక్కటియే విన్నవించుకొనుచున్నాఁడను. సన్మార్గమునఁ బ్రవ ర్తింపవలెనని నాకు మహాకాంక్ష కలదని నీవు నిశ్చయముగ నమ్ముము. జగమంతయు సత్కృత్యమని దేనిని మెచ్చునో దానినే చేయువాఁడను. నీయట్టి సన్మార్గగామినులగు స్త్రీలు సైతము దేనిని సదాచారమని చెప్పుచుందురో యామార్గమునే యవలంబించుటకై నేను కృతనిశ్చ యుఁడనై యున్నాఁడను. నీవు నన్నట్టివానిగాఁ దలంతువా? నీకు నా పలుకులయెడ విశ్వాస ముద్భవించునా?

ఈ ప్రశ్న యతికఠినమైయుండెను. ఆతనిచే నటనుంపఁబడిన పుష్పమును స్వీకరించితిని. ఇట్టి స్థితిలో "మీపలుకులను నేను నమ్మ" నని యెట్లు చెప్పఁగలను? బహిరంగముగా నెట్లు చెప్పఁగలను? మఱి యా ప్రశ్నమున కేమని ప్రత్యుత్తర మీయఁగలను? ప్రత్యుత్తర మిచ్చుటకు నాకేమియుఁ దోఁచుటలేదు. ఈ విషయమై చింతించుచుఁ జాలసేపటివఱకు నేనాలోచనానిమగ్నమానసనై నిలిచియుంటిని. అస త్యము పలుకవలెనన్న నా ప్రాణముమీఁదికి వచ్చును. ఏగృహస్థుని యందు నామన సనేకవిధశంకలనంది యుండెనో యా గృహస్థుతో నీ విధముగ సరళరీతిని సంభాషించుచు నిలుచుట యోగ్యముకాదని నాకుఁ దెలియసాగెను.

నా మౌనము ద్రాధారణమునకుఁ గారణమెఱింగియే కాఁబోలును, నారాయణరా వొకింతభీతిల్లి వెనుకకుఁ దొలఁగెను. అప్పు డాతఁడు దుఃఖ నిశ్వాసముల విడుచుచుండెను. ఆదీర్ఘోష్ణ నిశ్వాసమారుతము నాహృదయమునఁ బ్రవేశించి నన్ను దహింపసాగెను. ఆతని నింతగ దుఃఖపెట్టితినిగదా యని నాకప్పుడు పశ్చాత్తాపము కలిగెను. శోకపూర్ణమును, హృదయభేదకమునగు నాతని రూపమును జూచుటకు నాకు భయమగుచుండెను. అప్పుడు శోకరుద్ధస్వరమున నాతఁ డిట్లనియెను.

" అట్లయిన నా వినయవిజ్ఞప్తిని నీవు మన్నింపవా ? "

ఈవాక్యము వినినంతనే నేను తటాలున నాతని చెంతకరిగి యాతని చేతిలోనున్న కరపేటికయందలి పుష్పమువంక వ్రేలుచూపుచు—

" మీయీ విన్నపమును నేను స్వీకరింపలేనా ? " అని యంటిని.

ఇంతలో నాలతారాజినుండి తిరస్కారయుతహాసధ్వని యొకటి వినవచ్చెను. ఆయనపేక్షితహాసధ్వనివలన మేమిద్దఱమును భీతచేతస్కులమైతిమి. సంతప్తచిత్తముతో నారాయణరా వావైపునకుఁ జూచెను. ఆతఁ డాపుష్పమువంక నొకవిధమగు నాశ్చర్యదృష్టితోఁ జూడసాగెను. అందువలన నాపుష్పము విషయమై యాతని కేమియుఁ దెలిసియుండదని నేనూహించితిని.

" ఎవ్వరో ధూర్తులు నన్నుఁ గనిపెట్టియేయున్నారు " అని యాతఁడు కోపముతో ననియెను. తదనంతర మాతఁడు నన్నుఁ ద్వారము కడకుఁ బొమ్మని సైగచేసెను. భయవిహ్వలతచే నాపాదమస్తకమును గంపించుచుండు నన్నుంగని నాకు ధైర్యముచెప్ప నుద్దేశముతో నాతఁడు " ఈయింట నెవ్వరును నిన్ను భయపెట్టి కష్టపెట్టఁజాలరు. ఒకవేళ నితర నీచుఁడెవఁడైన నిన్నాయాసపెట్టుటకుఁ బ్రయత్నించెనా, తత్క్షణమె వానిని నేను శిక్షింతును " అనియెను.

" ఆయాకస్మికహాస ధ్వనినివిని నేనించుక బెదరితిని. ఇంక నింటిలోనికేగుదమురండు ! " అని యంటిని. ఏదైననొక యేకాంతస్థలమునఁ

గూరుచుండి శాంతభావముతో నెల్లవిషయముల నాలోచింపవలయునని నాకపేక్ష కలుగుటచే నేనీపై మాటనంటిని.

తత్క్షణమె యాతఁడు నా వినతిని మన్నించెను. మేమిద్దఱము నింటికడ కేగితిమి ; ఇఁక మెట్టులెక్కనుంటిమి ; ఇంతలో మానుపటి కర్ణకఠోరహాసధ్వని మరల వినవచ్చెను. ఆ వెంటనే వెనుకఁజెప్పిన వెఱ్ఱికుఱ్ఱవాని కంఠస్వరముతో నీక్రింది వాక్యములు మాకు వినవచ్చెను.

"ఇప్పుడైన సీతఁడు నిన్నుఁ బ్రేమించుచున్నాఁడా ?—చెప్పుము—ఇప్పుడైన సీతనికి నీపైఁ గృపాదృష్టియున్నదా ?"

నేను బయటికరుగునప్పుడు నిట్లే—నన్నడుగుచు నా బాలకుఁడు నా వెంట వచ్చియుండెను. కాని, యప్పు డామాటలఁ బరిహాసస్వరమున నుచ్చరించెను. కాని, యిప్పుడు పరిహాసస్వరముకాదు — అధికార స్వరము ! కావుననే నారాయణరావుసైతము భయపడియెనన్న నం డాశ్చర్యమేమున్నది ; అతనికి ధైర్యము కలుగఁజేయవలయునని తలఁచి నేను—

"వీథిలోఁ దిరుగుచుండు నా వెఱ్ఱికుఱ్ఱవాఁ డేమేమియో ప్రేలుచుండును. వాని కేల భయపడవలయును ? ఆ బాలునకు నాయం దెక్కుఁడాదరమున్నట్టు లున్నది. నేనీసాయంకాలమున వెలుపలికిఁ బోయినప్పుడు సైత మిట్లే ప్రేలుచు నన్ను వెంబడించి యుండెను" అని యంటిని.

"ఆ పిచ్చివాఁడా ! అట్లయినసరే ! వాని నిక్కడ నిట్లే విడిచి పోవుదము రమ్ము" అని యాతఁ డాశ్చర్యముతోఁ జెప్పుచు వేగముగ నింటఁ బ్రవేశించి తలుపు మూసెను. ద్వారమును బంధించిన వెనుక నాతని కేదో మహాత్సంకటమునుండి విముక్తియైనట్లు లుండెను !—

* * * * * *

ఆ రాత్రి నేనొక నింద్యకార్యము సేయవలసివచ్చెను. ఇతరుల రహస్య సంభాషణములు పొంచివినుట తటస్థించెను. సరస్వతి చెప్పిన యొకపనిని నెఱవేర్చి నేను మేడమెట్లెక్కి పోవుచుంటిని. ఎదుట నొక

గదినుండి నారాయణరావు వచ్చి దాని కెదుటనున్న మఱొకగది తలుపులు మూయుచున్న మనుజుని సమీపించి—

"సదాశివా! తోఁటలోని లతామండపముననున్న యొక పుష్పము నీకుఁ జూపియుంటిని; జ్ఞప్తి యున్నదా?" అని యడిగెను.

"అవును ప్రభూ! జ్ఞప్తి యున్నది" అని తెచ్చపాటుతోఁ దన యజమానునకు సదాశివుఁడు ప్రత్యుత్తరమిచ్చెను.

"రేపు నాకది కావలయును. ఉదయమున నె దానిని నాగదికిఁ దీసికొనిరమ్ము"

"సా — సా — మీా — నన్నిమాఱు క్షమింపవలయును. ఆ పుష్పము నొకరు కోసికొనిపోయిరి. ఇంకొకపుష్పము వికసించుట కొక్క వారము పట్టును"

ఇఁక నచటఁ బొంచుండివినుట యోగ్యముకాదని నామనసు నాకు బోధింపసాగెను. అందునను వారికిఁ గనఁబడకుండ వెడలిపోవుటకు నాకు వేఱుమార్గ ముండినందున నచ్చట నిలుచుట యనావశ్యకమని నేనెంచితిని. కాని, వారి సంభాషణము సంపూర్తిగ వినవలయునను కౌతుకమునాకు హెచ్చయ్యెను. ఆ పుష్పము విషయమై నాడెందమునను న్న సంశయమె నారాయణరావు మనసునఁగూడ నుండెనేమో యెఱుంగుటకై నేనుత్సుకనై యుంటిని. ఇంతలో వారు మరల సంభాషింపసాగిరి.

"ఆ పుష్పమునుగోసిన యాభాగ్యవంతుఁ డెవ్వఁడో?"

"చిన్నబాబుగారు. నేను వారి నా పుష్పము కోయవలదని యెంతో ప్రబతిమాలితిని. నామాటవినరైరి. ఇంక నాతప్పేమున్నది? నేను సేవకుఁడనుగదా!"

"అయిన నాకిఁ డాపుష్పమును జూచెను!" అని నారాయణరావాతోఁటకాఁపరికడనుండి వెడలిపోయెను.

అటనుండి కదలిపోయిన నారాయణరావు తనసోదరుని గదికరి గెను. అతఁడచటికేఁ బోయినకారణము నేనూహించితిని. ఆ పుష్పము విషయమై యాతని నడుగవలయుననియే నారాయణరావు గోపాల రావు కడకుఁ బోయెనని నేను తెలిసికొంటిని.

## తొమ్మిదవ ప్రకరణము

అదృష్టవశమున మఱునాఁడు ప్రాతఃకాలభోజన సమయమున నాకు గోపాలరావు కనఁబడలేదు. ఇందువలన రాత్రి నారాయణరావు గోపాలరావులకు జరగిన సంభాషణవిషయమై నాకేమియు నిశ్చయము తెలియదయ్యెను. కాని, నారాయణరావుగారి యానందముద్రచే గోపాలరావుతోడి సంభాషణమువలన నాతఁడు సంతృప్తుఁడై యుండ వలయునని నాకుఁ దెలియవచ్చెను.

అతని యానందవృత్తిచే నా హృదయమున సంతోషము భీతి యను రెండుపరస్పర విరుద్ధభావములు పెనఁగులాడఁజొచ్చెను. నిన్న పుష్పలతా ప్రభాకరుల మరణమునుగూర్చి నిశ్చయింపఁబడిన సభకుఁ బోవలయునని నేను గృహమువీడి వచ్చునప్పు డీపై యాలోచనలు నా మనసున జరుగుచుండెను. ఈపాడింట మరల నడుగిడుటకుమున్నె నేన నేక సంకటముల పాలుకావలసివచ్చునని నాకుఁ దెలిసియున్నచో నీ విచారము నాకింకను వృద్ధియైపోవును.

సభాకార్యనిర్వాహణ మతిశాంతముగ నెఱవేఱెను. సభాధ్యక్షుఁడు డాక్టరు ప్రభాకరరావుగారి పరోపకారతత్పరత, పరమసహిష్ణుత, యుజ్జ్వలస్వార్థత్యాగము, నిశ్చలదేశాభిమానము, న్యాయనిష్ఠ, మొద లగు సద్గుణములనుగూర్చి తనయుపన్యాసమున స్పష్టముగను, హృద యాహ్లాదకరముగను, ఆంగ్లభాషలో విశదీకరించెను. అతనికి మాతృ భాషలో నుపన్యసించు నభ్యాసములేదు. ఈ డాక్టరుగారి గుణములలోఁ గొన్నిటినైన ననుకరింపుడని సభాసదుల కధ్యక్షు డతి ప్రేమతో

విన్నవించెను. స్వార్థత్యాగమునెడ నాతని కధికాభిమాన ముండెను. స్వార్థత్యాగ మొనర్పకున్న నే యున్నతరాష్ట్రీయ కార్యములును జరుగఁజాలవని యాతనికి దృఢాభిప్రాయ ముండెను. సభాధ్యక్షుఁడగు సర్ శ్యామారావుగారి వయ సఱువదేండ్లు. ఆతఁ డున్నతన్యాయాధీశులలో నొక్కఁడై యుండి యా యుద్యోగమునకు రాజీనామా యొసఁగి లోకహితకార్యముల నొనర్చు నుద్దేశముతో భార్యాప్రేరితుడై విసరపుర ప్రభువునొద్ద నమాత్యపదవిని స్వీకరించెను. ఆతనికి నెల కైదువేల రూప్యముల జీతము దొరకుచుండెను. అంతటి యున్నత పదవిని వదలి కేవల మైదువేల రూప్యముల జీతమునకుఁ గుదురుట స్వార్థత్యాగమునకు కుదాహరణము కాదని చెప్పుట కెవ్వరు సాహసింతురు? సభలో నితరులనేకులు కరుణరసముట్టి పడునట్లుగ నుపన్యసించుచు డాక్టరుగారి సద్గుణములను ప్రశంసించిరి. ఆ యుపన్యాసములలోఁ గరుణము పూర్తిగ నుండెను. వినినవారెల్లరును గన్నీటిధారలఁ గురియసాగిరి. ఇఁక నా కెట్లులుండునో యాలోచింపుఁడు! నా నెచ్చెలియగు పుష్పలతా విగ్రహము నాకన్నులయెదుట నిలిచెను. ఆమె యంత్యకాల సుస్వరములు నాపీనుల సంచరింపఁదొడంగెను. కడచిన మూఁడు దినములలో ఘటించినవన్నియు స్వప్నమునందువలె భాసిల్లెను. ఉదారహృదయయగు పుష్పలత తనమరణకాలమున నిచ్చినయాజ్ఞను బాలించుటయె నాయాయుష్యమందలి పవిత్రాంతిమధ్యాత వ్యాంశమని నాకుఁ దోఁపసాగెను.

సభముగిసినపిమ్మట నేనింటికి బయలువెడలితిని, ఈపై విధముగ నామనసున నాలోచించుకొనుచు నడచుచుండుటచే నారాయణరావుగారి యింటిత్రోవమాని వేఱుత్రోవను బోయితిని. అప్పుడు నాకుఁ దెలియలేదు. ఎంతదూరమరిగితినో నేనెఱుంగను. అంతియేగాక, నారాయణరావు, గోపాలరావు, సరస్వతియు నెచ్చటనో విహరింపఁ బోయినందున నొకటిరెండు గంటలు బయటఁదిరిగి యింటికేగుదమని తలఁచియేయుంటిని—ఇప్పుడు దానికిఁ దగినట్లే సంభవించెను.

నేను నడచిపోయిన త్రోవ జనులు సాధారణముగా నడచుఁ త్రోవ కాకుండుటచే నాకెవ్వరును గనఁబడరైరి. ఆబాట నేను చక్కఁగ నెఱుఁగని దగుటచే గతవృత్తాంతములను స్మరణకుఁ దెచ్చి నన్ను దుఃఖ పెట్టుట కనువుగ్గమైన దైయుండెను. నేనవనతవదననై మౌనముతో నడచుచుంటిని. చాలదూర మరిగియుండును — చాలసేపు నడచియుండును— వృక్షపంక్తులచే నావృతమైయున్న యొక ప్రదేశముకడ కరిగితిని. అచట నున్నతముగను దట్టముగను బెఱిఁగియున్న వృక్షపంక్తులను జూడవలెనని తలపైకెత్తితిని. ఆ వృక్షములసందున నేమియో నాకగపడెను. పరికించిచూచితిని — యంత్రాలయముల పొగపోవు గొట్టములు! ఒకవేళ నాకట్లు తోఁచుచున్నదేమోయని యనుకొని కన్నులు నులిమికొని చూచితిని. అప్పటికి నాగొట్టములు నాదృష్టికగపడుచునే యుండెను. ఆలోచనాధీనమానస నగుటచేఁ త్రోవదప్పి యీ మార్గమున వచ్చితినా! ఇచటనేకదా డాక్టరు ప్రభాకరరావు శవము పడియుండినది!— ఔను — ఇచ్చటనే—ఇచ్చటనే — యీ ప్రేతము దొరకినది” అని నేననుకొంటిని.

ఆ యంత్రాలయమును జూచినంతనె నామనసున నొకవిధమగు విచిత్రాలోచన యుద్భవించెను. దైవప్రేరితనై నేనిటకు వచ్చితినని నాకుఁ దోఁపసాగెను. అంతట నడినడిగ నడచి నేను చాలఁగాలము నకుఁ బూర్వమె విడిగిపోయిన యీ యంత్రాలయద్వారమును సమీపించితిని. తృణావృతమైయున్న ప్రథమ పటాంగణమును దాటి యంత్రాలయముఖ్య భవనముకడ కేగుటకు నాకెంతయో సేపు పట్టియుండదు. కాని, యీనిర్జనస్థలమందలి భయప్రదస్వరూపము మనసునకుఁ దోఁచినంతనే నేనిఁక ముందడుగుటమాని తటాలున వెనుకకు మరలితిని. అట్లు తిరుగుచుండ నచటఁ దెఱచియున్న తలుపున నొకకాగితమంటింపఁబడి యుండుట నాకగపడెను. ఆ కాగితమున నేమి వ్రాయఁబడి

యున్నదో తెలిసికొనవలయునని నాకభిలాషకలిగెను. నగరాధికారులైనను, కాక, యంత్రాలయాధికారులైనను ఈచీటి నీ తలుపున కంటించియుందురని స్థిరపఱచుకొనుట కెంతయో ప్రయత్నించితిని; కాని, వ్యర్థమయ్యెను. ఆ కాగితమున నేమి వ్రాయఁబడియున్నదో యెఱుఁగవలయునను నాకౌతుక మధికాధికమై భరింపనశక్యమై పోయెను. అది చదివినచో నామనసొక విధమగు వ్యథకు లోనగునని నాకప్పుడు తెలియకపోయెను! — తోఁచకపోయెను! త్వరితముగ నాతలుపు చెంతకరిగి యా కాగితమును జదువఁదొడంగితిని.

"డాక్టరు ప్రభాకరరా వాత్మహత్యఁ గావించుకొనెనని చెప్పు లోకులందఱును కేవలమసత్యమునే పలుకుచున్నారు. ఉన్నతకులోద్భవులైయుండి యసామాన్య ధనవంతులైయుండి తమ్మొరు లనుమానించుటకు వలనుగాని పురుషులె డాక్టరును హత్యచేసియున్నారు?"

ఈచీటీపై నెవ్వరిచేవ్రాలును లేదు. కాని, పరమేశ్వరా! ప్రభాకరరావు హత్య!—ఈ యక్షరములు ప్రత్యేకవస్తువుపై నెఱ్ఱ సిరాచే వ్రాయఁబడియున్నట్లు నాకుఁ గనఁబడఁదొడంగెను. అయ్యవి నేత్రముల కగ్నిగోళములవలె నాయాసపెట్టసాగెను. వజ్రములవలె నవి నా హృదయముపైఁ దీవ్రాఘాత మొనర్పసాగెను. నేనానిర్జన ప్రదేశమున నిలిచి యాకాగితమునె చూచుకొలంది నయ్యది పెద్దది కాఁదొడంగెను. ఆ యక్షరములు గొప్పవై యంతటను "హత్యా! హత్యా!" యను నక్షరములె నాకగపడుచుండినట్లుండెను. ఇఁక నేమి చేయవలయునో నాకుఁ దోఁచదయ్యెను. అప్పుడచటికిఁ దటాలున నెవ్వరైన వచ్చి యా కాగితమును జూచి, నేనే యాచీటి నచట నంటించితి ననియు, నేనే యాహత్య చేసితిననియు భావించి నన్నుఁ బట్టుకొని దోషారోపణ మొనర్తురేమో యని నాకు భయము వేయసాగెను. ఈకాగితమున వ్రాయఁబడియున్న సంగతులే నిజమైయుండెనేని, నేను పుష్పలతకిచ్చినమాట చొప్పున నాదోషినిఁ గనుఁగొనవలయుననియు, వానిపైఁ

బగసాధింపవలెననియు, నాకుఁ దోఁపసాగెను; నేనాసమయమున జ్ఞానశూన్యనై యుంటిని. ఆలోచనలవెంట నాలోచన లుదయింపసాగెను. వానిలో నొక్కటియు దృఢముగ నిలుచుటలేదు. నేనేదో యొక విధమగు స్వప్నమునే కనుచున్నట్లులును, గాన నాకేయాలోచనయుఁ దోఁచకున్నట్లును, భావించితిని. ఇట్టిస్థితిలో నావలి వృక్షపంక్తుల నడుమ కరిగి యట నొక భూరుహమ్ముక్రిందఁ గూరుచుండి మోకాళ్ళసందునఁ దలనిడి యేడ్చుటకన్న నాకితరము తోఁచదయ్యెను. ఇందాశ్చర్యమేమున్నది?—ఇఁక నేనేమి చేయఁగలను?

ఇట్లు కొంతసేపు ప్రశుపాతమైన పిమ్మట నామనసొకింత నెమ్మది వహించెను. అనేకసమయముల దుఃఖాఘాతమువలనఁ దమకుఁ దెలియకయె హృదయమం దెక్కడనో యున్న గుప్తభావములు పైకివచ్చి తమ సత్యస్వరూపమును బ్రకటించునన్న సంగతి యెల్లరకును దెలిసియే యుండవచ్చును — ఇది యనుభవజ్ఞులకే యెఱుక — ఇప్పుడు నాస్థితి యట్టులుండెను. ఆ కాగితమును జదివినంతన నామనసున నిట్టి విచారము — భీతి — నానావిధాలోచనములు — ఏమిటికుదయించెనో యిప్పుడు నాకుఁ దెలిసెను. నాకు నారాయణరావునందలి ప్రేమభావము జాగరితమగుచుండి యాప్రేమాంధకారభరంబున నె యిట్టియవస్థ కలుగుచున్నదని యిప్పుడు స్పష్టముగఁ దెలియవచ్చెను. నా హృదయమున గుప్తరీతి నివసించుచున్న విచారముల సత్యస్వరూపము నాకన్నులలో నిలిచినంతనే, భయవిహ్వలనై నా పెదవులదాఁక వచ్చిన పలుకుల నాకాగిత పరీక్షచే నిలిపి రెండుచేతులతో నోరు మూసికొని నేను మఱల నేడువఁదొడంగితిని. నామనోదౌర్బల్యము ననేకవిధముల దూషించుకొంటిని — శపించితిని. ఇఁకముందైన క్షమింపరాని యిట్టి తప్పు నొనర్పక రానున్న కష్టములకు ధైర్యముతో నెదురేగవలయునని నిశ్చయించుకొంటిని.

ఇప్పుడు నామనసు నిమ్మళించెను. కాని, నా హృదయమున వసించియున్న నారాయణరావునందలి ప్రేమభావము సమూలముగ నశించెనని మాత్రము చెప్పఁజాలను. ఆ కాగితమున లిఖింపఁబడియున్న వృత్తాంతములును నందలి యారోపణములును నిశ్చయములని తెలియకున్నందున నవి నాహృదయ సింహాసనమున నధిష్ఠితుఁడై యున్న నారాయణరావును బదచ్యుతునిఁగావింప నసమర్థములై యుండెను. కాని, వానినన్నిటిని నెమ్మదితో శాంతభావముతో నాలోచించి పుష్పలత నాపై మోపిన కార్యభారమును దగురీతి నిర్వహించుటకు నేనిప్పుడు సమర్థనై యుంటిని.

ఈకాగిత మెవ్వరు వ్రాసిరో శోధించి కనుఁగొనువఱకు నీవిషయమై నేనేమియుఁ జేయకుండుటకు నిష్కర్ష చేసికొంటిని. ఈకాగిత మొక సన్మాన్యగృహస్థుఁడు వ్రాసియుండెనా! ఛీ! ఛీ! గౌరవము కలవాఁ డెవ్వఁడు నిట్టిచోరకృత్య మొనర్చియుండఁడు. ఏప్రామాణిక మనుష్యుఁడును నొకనీచుని యపరాధముల వెల్లడికిఁ దేనెంచియున్నప్పు డిట్టికుమార్గమునఁ బ్రవర్తించియుండఁడు; ఇట్టిచౌర్యవృత్తికి లోఁబడి యుండఁడు; సరళరీతిని బహిరంగముగనె వెల్లడికిఁ దెచ్చియుండును. లోకుల మనసున సంశయముత్పన్నముచేయు దుష్టోద్దేశమున నెవ్వఁడో కపటాచరణుఁడును, భీరువునగువాఁ డొనర్చిన కృత్యమేయిది.

మఱి యీకృత్య మొకనీచుఁ డొనర్చియున్న నేమాయె? నీచు లెప్పుడును సత్యము వచింపరనుటకును నాధారములేదు. ఆ యుత్తరమున సూచింపఁబడిన సంశయవిషయము నామనసునమాత్ర మస్పష్ట రూపమున దోఁచుచుండలేదా? నారాయణరావునకును, గోపాలరావునకును, బ్రభాకరరావుగారి మరణముతో నేదియో సంబంధముండవలయునని నాకుఁ దోఁచుచుండలేదా? ప్రత్యక్షముగ నామనసె యిట్లు చెప్పుచుండ, నిఁకనీకృత్య మేనీచుఁడో, దుష్టబుద్ధితో నొనర్చెనని నేనేల నిందింపవలయును? ఈకార్యనిర్వహణమున నాకెట్టిసంకటము లొదవిననుసరియే, నేనెంతటి యాయాసమునకుఁ బాల్పైననుసరియే,

యెట్టి విఘ్నములు కలిగిననుసరియే, నారాయణరావుగారి వంగడమున కిట్టి భయంకర నీచారోపణ మొనర్చిన జనుని శోధించి బహిరంగస్థితికి దేక మాననని నేను దృఢనిశ్చయనైతిని !

ఆ పత్రికయందలి విషయముల నేనుదక్క నితరులెవ్వరును జదివి యుండరు — కేవల సంశయముకన్న నధికముగ నా వ్రాయసగానికిఁ దెలిపియుండకుండెనా ? వానిని వెదకి వాఁడు పోసిన యీ యారోపణ విషయము జనులమనసుల కెక్కకమున్నె, పొంచి బాణముల ప్రయోగించు నారణశూరుని వెల్లడిలోనికిఁ దెచ్చి యాతని యారోపణ మెంత నిరాధారమైనదో తెలుపుటకు సమయమొదవినచో నెంతో సంతోషముగా నుండునని నాకుఁ దోఁచసాగెను.

కాని, నేనెంత చతురమతినైనను, ఎంతధీరహృదయనైనను, అప్రౌఢనేకదా !—ముగ్ధనేకదా ! అబలనేకదా ! మహారహస్య రక్షక భటులకును, అపరాధపరిశోధకులకును నిర్వహింప నశక్యమగు నీపరమ రహస్యము నెఱుంగుట నావలనఁగాఁగలదా ? ఆపత్రమునందలి యక్షరములను బట్టియైన నేమియు నుపయోగించునట్టు లగపడలేదు. లేఖలను బట్టి మనుజుఁడిట్టివాఁడని యెఱుంగుట దుస్తరముకదా ! అందు నీ యుత్తరమో విచిత్రముగ వ్రాయఁబడియున్నది. దీనినిబట్టి వ్రాసిన వాని నెట్లు గుర్తింపనగును ? కావున నాయభీష్టకార్యమును సాధించు కొఱకు నేను వేఱుగ నేయుక్తినైన యోచింపవలసియున్నది. కాని, యేనేయుక్తి నాశ్రయింతును ?—ఉపాయ మేమున్నది !

అంతవఱకు నాకనేక కష్టము లొదవియుండెను. కాని, నేనొక్క నాఁడైనఁ గపటమార్గ మవలంబించియుండలేదు. లోపల నొకటి యుంచుకొని పైకొకవిధముగ మాటాడుట—ప్రవర్తించుట—నేనెఱుఁగను. కాని, యీ సమయమున నేనాకాగితమువంక దృష్టినిడియుండ నొక యదృశ్యశక్తి ముందఱికివచ్చి నాకొకయుక్తి దోఁపఁజేసెను.

ఆ కాగిత మీ తలుపుపై నిప్పుడే క్రొత్తఁగ నంటింపఁబడి యుండవలయును. ఏలయన — ఆ కాగితము క్రొత్తగా వ్రాయఁబడి నట్లుండెను, అదియునుగాక, అప్పటి కతివేగముగ నేతెంచుచున్న గాలిచే నా కాగిత మట రెండుమూఁడు గంటలకన్న నధిక కాలము నిలిచి యుండుట యశక్యమే యగును. కావున దీనినిబట్టి చూచినను ఆ కాగితము క్రొత్తగ వ్రాయఁబడి యుండవలయుననియే తోఁచుచున్నది. ఇచటి వారందఱు నేఁడు సభకుఁ బోయియున్నందున నిదియె మంచి యదనని దీనినిప్పుడే యంటించియుండును! దీనినిచట నంటించుటకు హేతువేమైయుండును! ఆఁ! సభాస్తారులెల్లరు నొకవేళ డాక్టరు ప్రభాకరరావు మరణించినచోటును జూడఁదలంచి యిచ్చటికివత్తురేమో? వచ్చిన వారికీచీటి కనఁబడవలయుననియే యీ కాగితము నిచట అంటించినవారి ముఖ్య దురుద్దేశమై యుండవలయును — వేఱేముండును?

ఈతఁడు తలంచినట్లుగ నిచ్చటి కనేకులు వచ్చియుందురు. కాని యాకస్మికముగ నాకాశమంతయు నభ్రాచ్ఛాదితమై ముసలధారగ వర్షము కురియసాగెను. కావున నిచ్చటి కెవ్వరును రారైరి. ఈవర్షమింకను గొంతసేపిట్లే కురియుచుండిన నా కాగితము నంటించినవాఁడు తక్క నితరులెవ్వరు నిచటికివచ్చుట సంభవింపదు. కాగితము నంటించిన మనుష్యుఁడు మాత్రము తానుచేసిన కార్యమెట్లు పరిణమించునో చూచు నుద్దేశముతో నిచటికి వచ్చుననియు, ఇతర జనులకుమాఱుగ నేనే యనాయాసముగ నాకపటాచరణుని జూడఁగలుగుదుననియు, నాకుఁ దోఁపసాగెను. అదియునుగాక జనసముదాయ మిచటికి బయలు దేరినప్పుడు ముందుగ నాపురుషుఁ డిటకువచ్చును. ఆ కాగితము తానంటించిన స్థలమున నుండకుండుటకు వాని రూపమున భయంకరమగు మార్పు కలుగును. దానివలనఁగూడ వానిని గుర్తింపనగును. కావున, నిఁకఁ గొంచెము సేపు___వాననిలుచువఱకు —ఆస్థలముననే, తలుపు వెనుక నిలిచియుండ నిశ్చయించితిని. ఆ కాగితము నాచేతనున్నయెడల నెవ్వరైనఁ దటాలునవచ్చి నామీఁదనే ఈ నేరము నారోపింతురేమో యని

నాకు భయము తోఁపసాగెను. ఆ కాగితమును వర్షజలప్రవాహమునఁ బడవేసితిని. అది తడిసిపోయెను — వర్షపాతమున నాకాగితము తడిసి కవాటమునుండి క్రిందఁబడిపోయెనని లోకులనుకొనుటకై నేనట్లు చేసితిని.

నేనిదియంతయుఁ జేసితినిగాని యట్లు చేయుచుండఁగ నన్నెవ్వరైనఁ జూతురేమో యని నాకు భయమగుచుండెను. ఔను — అది సహజమె — ఆ కాగితము నంటించినవాఁడక్కడనె యొక రహస్యస్థలమున నిలిచియుండి నాయీ కృత్యములన్నియుఁ జూచుచుండుటఁ గూడ సంభవమేగదా !

కాని, వేళదాటినకొలఁది నాభీతియు క్షీణింపసాగెను. చాల సేపటివఱకు నేనాతలుపుకడనె నిలిచియుంటిని. అచట నుఱుములసవ్వడి తక్క నితరధ్వనులేవియు వినవచ్చుచుండలేదు. కుంభవృష్టిగ వర్షము కురియుచుండెను. గాలి యతిభయంకరముగ వీచుచుండుటచే నచటి చెట్లకొమ్మలన్నియుఁ బెళపెళమని విఱిగిపడుచుండెను. ఆ సమయమున సృష్టిదేవత మహోగ్రరూపమును ధరించి ప్రాణిమాత్రుల సంహరింపఁ దలంచియుండెనో యనునట్లుండెను. ఇఁకఁ బాపము, దిక్కులేని — నోరులేని పక్షులగతి యేమనివచింపనగును ? నేనొకించుక చంచల హృదయుఁడనై యుండినచో, నాయుద్దిష్టహేతు వప్పుడున్నదానికన్న నల్పమైయున్నచో, ఆప్రకృతిదేవత యంతటి యుగ్రరూపమును ధరించుటకుఁ బూర్వమే నేనచటినుండి పాఱిపోయియుందును. చంచలసోపానములపైఁ గట్టఁబడియుండునెడల మేఘరాజు ప్రథమగర్జనముతోడనె నాధైర్యరూప భవనము నేలపాలై యుండును.

కాని, నాయుద్దిష్టకార్యము మిగుల మహత్తరమైనది. ఎట్టిసంకటములకైన సరకుగొనక నేను నిశ్చలుఁడనై యాకష్టముల కెదురునిలువ వలసినదే — తప్పదు. ఆకార్యము, నాశీలము, ప్రేమ కర్తవ్యము మొదలగువానికిఁ గళంకము నాపాదించునట్టిదై యుండెను. కావున, స్వాభా

వికముగనె నిశ్చలచిత్తనై ముందేమిజరుగునో చూతమని నిరీక్షించు చుంటిని.

కొంతతడవునకు నాయెదుటనున్న వృక్షపంక్తులలో నెవ్వఁడో తిరుగుచున్నట్లు నాకుఁ దోచెను. అల్పావకాశముననె యొకవ్యక్తి పొంచిపొంచి వృక్షములలోనుండి కదలివచ్చుట నాకగపడెను. ఆవ్యక్తి యింకను బూర్ణముగ నాకగపడనందున నేను భీతిచే వణఁకసాగితిని. కాని — మీకుఁ జెప్పినచో నిదినిజమనియు మీకుఁ దోఁపదు — ఆ యాకృతి పూర్ణముగ నాదృష్టులఁబడినంతనే నాభీతియంతయు నాకస్మికముగ నశించిపోయెను. బెదరుచూపులతోఁ గాగితమంటించియున్న వైపునకుఁ గాంచుచు నాపూర్వమిత్రుఁడు—కావలెనన్న మీరు వానిని నాశత్రువేయనుఁడు ! — ఆయున్మత్తబాలకుఁ డట్టిస్థితిలో దటాలున నాయెదుటఁ బ్రత్యక్షమైనప్పుడు నాకెంత యాశ్చర్యము కలిగియుండునో—చదువరులారా ! మీరే యాలోచింపుఁడు ! ! !

వానిపై వస్త్రములు తడిసి ముద్దలై యుండెను. కాని, యాతఁడు వానియెడ నించుకయు మనసుంపఁడయ్యెను. అంతటి భయంకరవాయు వునకును, దేహమునందలి రక్తమును ముద్దగఁజేయునట్టి చలికిని, వాఁడు లక్ష్యపెట్టఁడయ్యెను ! నేను తొలుదొల్త వానింగాంచినప్పుడాతఁ డెంత సంతోషముగా నుండెనో యిప్పుడు నంతటి సంతోషముతోడనే యగపడెను. వాని శక్తియంతయుఁ గెంపులవలె మెఱయుచున్న వాని నేత్రములలోఁ బ్రకటితమగుచుండెను. వాఁడు కొంచెముసేపా గోడ వైపునకె చూచుచుండెను. వాఁడు చూడఁదలఁచిన వస్తువు వానికిఁ గనఁబడలేదని వాని ముఖభావమువలన నేను తెలిసికొంటిని. పిమ్మట నాతఁడు క్రిందికిదృష్టి సారించెను. అచట దగ్గర నెపడియున్న కాగితము కనులఁబడినంతన తటాలున వాఁడు దానిని దీసికొనియెను.

తడిసిన కాగితమును దీసికొని చూచినంతనె వానిరూప మొక వింతమార్పు నందెను. అతిభయంకరముగ నుండెను అప్పుడు కోప ముతో నేను నాలో "ఈ యున్మత్తబాలకుఁడా నారాయణరావు

గారి వంశమున కిట్టి భయంకర దోషారోపణ మొనర్చువాఁడు!" అని యనుకొంటిని. దీనివలన నావిచారమున కొకింత విశ్రాంతిఘటిల్లెను. ఇంతవఱకు నారాయణరావుగారి యెడల నామనసుననున్న యనుమానము మెల్లమెల్లగ దూరమునకుఁ దొలఁగసాగెను. కాని, యీ వెఱ్ఱివాని మనసున నిట్టికల్పనము లేమిటికిఁ బుట్టవలయును! ఈతఁడు నారాయణరావును, అతని తమ్ముని నింత ద్వేషించుట యెందులకు! ఈవిధముగ ననేకాలోచనములు పురల నాహృదయసీమను గలవరపెట్టసాగెను.

ఆ బాలకుఁడా కాగితమును జింపి తుత్తునియలు చేసి పాఱవేసెను. ఒక్కమాఱు నలువంకలఁ బరిశోధనదృష్టితోఁ దిలకించి యాతఁడు నగరమార్గమును బట్టెను. వానినచట నాపుటకు నేనిష్టపడలేదు. తొలుత వాని విషయములన్నియుఁ దెలిసికొనకయె వానినిచూడఁ గూడదని నిశ్చయించుకొంటిని. విచారణాంతమున వాఁడు నిజముగఁ జిత్తవిభ్రముఁడని ధ్రువపడినచో, నీకార్యము విషయమై సమస్తమును దెలిసికొనుట కష్టము కాదుగదా! కాని, వాఁడు నిజముగఁ బిచ్చివాఁడు కాక, యేదో కార్యసాధనమునకై యిట్టి యున్మత్తవేషమును వేసికొని యుండెనేని ఈరహస్యము నెఱుఁగుటకై నేను నాసర్వశక్తులను, బుద్ధిని, వినియోగపఱుపవలసివచ్చును. నిన్న సాయంతనము వీనిహాసధ్వనివిని నారాయణరావెంతో భయపడెను. గాన, నాతఁడీబాలకునకు భయపడుచుండవలెనని స్పష్టమగుచున్నది. వీనినన్నిటిని బరికింప, నాయున్మత్తుఁడు నిజమగు నున్మత్తుఁడుకాక, యేదో కార్యమును సాధించుటకైన బిచ్చివాఁడై యుండవలయునని నాకుఁ దోఁపసాగెను. అయినను, ఇప్పుడు వానితో నేమియు మాటాడకూరకుండి వానిని మెల్లగఁ బోనిచ్చుటయె మంచిదని తలఁచితిని.

# పదియవ ప్రకరణము



కొంతతడవున కాకాశమంతయు నిర్మలమయ్యెను. వానయు నాఁగి పోయెను. దినమణి యాకాశమధ్య భాగమునఁ బొడకట్టసాగెను. అప్పుడు నేనూరివైపున కేగఁదొడంగితిని. ఇంతదనుక నేనాయంత్రా లయు ద్వారముకడ నిలిచియున్నందున నాకట్టుబట్టలు తడియలేదు. నేను తిన్నగ నాయింటికరిగితిని. మరల నేను మీయింటికి నేఁడు రానని నారాయణరావుగారితోఁ జెప్పియుండలేదు. వారు నారాకకై యెదురు చూచుచుందురని నాకుఁ దోఁచెను. కాని వానిపై నామనసునఁ బుట్టు చున్న సంశయములు తీరిననేగాని వారియింటనడుగిడుట నాకుఁ బ్రశస్త ముగ నగపడలేదు. ఒకతొందర పనివలన నేఁడు నేను మీయింటికి రాఁజాలనను నర్థమువచ్చునట్లుగ నొక జాబును వ్రాసి నారాయణరావు గారి కంపివేసి, యాయున్మత్తబాలుని గూర్చి యాలోచింపఁ దొడంగి తిని. కొలఁదిసేపటిలోనే నాకుఁ గొన్ని యాశ్చర్యకర విషయములు తెలియవచ్చెను. వాఁడు నిజముగనె యున్మత్తుఁడై యుండెను — లోకులు వానిని పుట్టుకనుండియే పిచ్చివాఁడని చెప్పుచున్నారు. కాని, వానిపిచ్చి యట్టిదిమాత్రము కాదు. ఇతరోన్మత్తులవలె వాఁడు పరుల నాయాసపెట్టుచుండలేదు — తిట్టుచుండలేదు — బాధించుచుండ లేదు — బిగ్గరగా నవ్వుట, యర్థశూన్యవాక్యములను గొణఁగుకొను చుండుట, వీథి నాడుచున్న పసిపిల్లల నెగతాళిచేయుట, మార్గమునఁ బోవువానిని వెక్కిరించుట — మొదలగు నిట్టిసామ్యచేష్టలనే వాఁడు చేయుచుండెను.

వానికి మాతాపితరులులేరు. వాఁడు నిరాధారుఁడుకాఁడు. అన్న పానాదుల కితరుల నాశ్రయింపనక్కఱలేనివాఁడే! వానికొక యగ్రజ యుండెను. ఆమె యతిజాగరూకయు, తీక్ష్ణబుద్ధియునై యుండెను. కుట్టుపనులు చేసియు, కూలిపనులుచేసియు నామె తనకును, నిర్బోధకుఁ

డగు తనతమ్మునకును గావలసినధనము సేకరించి యుదరనిర్వాహకముఁ గావించుకొనుచుండును. ఊరివెలుపల నొకచిన్నగుడిసెలో వారిద్దఱు నివసించుచుండిరి. వారియెడఁ బౌరులకును ప్రేమలేకున్నను, విశేష జనులు వారినిరాశ్రితస్థితికి జాలిపడుచుందురు. కుముద—ఆబాలికపేరు—ఒకవిచిత్ర స్త్రీయైయుండెను. నేఁటివఱకు నామెస్వభావ మెవ్వరు నెఱుంగరు—ఆమెవిషయమంతయు గూఢముగనుండెను. ఆమెనైజము గనె హర్షప్రఫుల్లయు, సుందరియునై యుండుటచే నందఱు నామె యెవ్వరో, యామెచరిత్ర మెట్టిదో యెఱుఁగ నపేక్షించుచుందురు. ఆమెయు నించుమించుగ సోదరునిఁ బోలియుండెను. పొడుగునను, దేహసౌష్ఠవమునను, సోదరునిఁబోలియున్నను నామెవిశేషరూపవతి ; కాని, యితరస్త్రీలలో—ఆయీడుతరుణులలోఁ—గానవచ్చుమనోహరలావణ్యమా మెయెడ నగపడుచుండుటలేదు. ఆమెయవయవములన్నియు విలక్షములై యుండెను. అందునను నామెనేత్రముల యందలితేజము చమత్కారబంధురమైయుండెను. ఆమెవంకఁ గాంచినతోడనే యనేకవిధ శంక లుద్భవించుచుండును. ఆమె ధరించువస్త్రములు విచిత్రముగ నుండును. దీనివలన లోకులసంశయ మధికాధికమగుచుండును. కొంద ఱామెను మాంత్రికయనుచుందురు ; మఱికొందఱామె యొకభయంకరస్త్రీయనుచుందురు. ఒకకాలమున నారాయణరావుగా రామె యింటికేగుచుండెనని లోకులనుకొను చుండిరి. కాని, యట్లుపోవుట కాతని కొక నీచహేతు వుండెననిమాత్ర మెవ్వరుననలేరు.

నారాయణరా వొకప్పు డామెయింటి కరుగుచుండి యిప్పుడు పోవుటలేదని నాకుఁ దెలిసినందున నావెఱ్ఱికుఱ్ఱవాని—ఆమెతమ్ముని—యర్థరహితవాక్యముల యందలిభావము నామనసునకుఁ బొడకట్టెను. నారాయణరావు తనసోదరి నవమానపఱిచెనని యాబాలుఁ డనుకొని యుండును. ఈకారణమువలన మఱియొకస్త్రీ నాతఁడు ప్రేమించు

చుం టె తనదృష్టులఁబడినంతనె సామాన్యముగ నాతఁడా స్త్రీని ద్వేషిం చుచుండుటలో నాశ్చర్యమేమియును లేదు. నారాయణరావు నన్నుఁ ప్రేమించుచుండెనని తలఁచి—అనుమానించి—వాఁడునన్నిట్టులాయాస పెట్టుచున్నాఁడు ! నాకు దొరకిన యీ యంశములవలన నిజమిట్టిదని నేను తెలిసికొని కుముదను సందర్శించుట మానితినని యెవ్వరును దలఁపఁగూడదు. నేనామెసందర్శనమునకై మిగులనుత్సుకనై యుంటిని.

శక్యమగువఱకు శాంతభావమును వహించి నేను కుముదగృహ మునకు బయలుదేరితిని. నేనుపై కెంతటిగాంభీర్యమును—ఎంతటిశాంతిని ధరించియున్నను, నంతరంగమున మాత్రమనేకవిధ విచారపరంపరలు కలవర పెట్టుచుండెను. ఇంచుమించుగ మూఁడు గంటలగు నప్పటికే నేనామెయిల్లు చేరితిని. లోకులువర్ణించినట్లుగ నామెగృహవాటిక మిగుల రమణీయమును, మనోహరమునై యుండి యాయింటనివసించుయువతి యిచ్ఛాభిరుచు లిట్టివని సాక్ష్యమిచ్చుచుండెను. నేనాయింటితలుపును దట్టినతోడనే కుముదసోదరుఁడు తలుపుఁదెఱచి నన్ను దర్శనగృహము నకుఁగొనిపోయెను.

అచటియేర్పాటుల నన్నిటినిగాంచి నేనాశ్చర్యపడితిని. ఆగదిలో నమూల్యములగు వస్తువులెవ్వియు నాకగపడలేదు. కాని, సాధారణ సామగ్రులు లాయాస్థలముల యథోచితముగ నుంపఁబడియుండెను. నామనసత్యానంద భరితమయ్యెను. కూలిపనులచే జీవించునీతరుణి తన యిల్లింత పరిశుభ్రముగను, మనోహరముగను, ఉంచియుండునని నేనెన్నఁడును దలంపనైతిని ! గదినిజూచినపిమ్మట నేనావెఱ్ఱికుఱ్ఱవాని వంకఁ జూడ్కులుసారించితిని. కాని, యేమాశ్చర్యము ! రెండుగంటలకు ముందా యంత్రాలయముచెంత నేను చూచినబాలుఁ డీతఁడు కాఁడని నాకుఁదెలిసెను. ఈబాలునిరూపము నేనుచూచినవానిరూపమునుబోలి యున్నను నీతనివర్తన మాతనివర్తనమునకును భిన్నముగ నుండెను. ఈ

బాలుఁడు స్మితవదనుఁడై యానందహృదయుఁడై యుండినను, పూర్వము నాకుఁ గనఁబడిన బాలునిముఖమునఁ దేజరిల్లుచుండిన క్రోధవికారచ్ఛాట లేవియు నీతని వదనకమలముపైఁ బరిదృశ్యమానము లగుచుండలేదు. నేను వానివంకఁ దదేకదృష్టితోఁ జాలసేపు వీక్షించితిని. కాని, యాతఁడించుకయుఁ జలింపఁడయ్యెను. వాని రూపము తొంటివలెనె హాస పూరితమును, ఆనందమయమునై యుండెను.

"నేను చూచినబాలుఁ డీతఁడు కాఁడు!" అని నాలో నేనను కొంటిని. తత్క్షణమె నా వెనుకనున్న యొకతలుపు తెఱవఁబడి, లోనికొక వ్యక్తి రాఁగండు నెడ నామనసున నెట్టి విచారతరంగము లుత్పన్నములై యుండునో యిపుడు చెప్పఁజాలను.

లోనికరుదెంచిన తరుణి యత్యంతసుందరియై యుండెను. ఆమె యవయవములన్నియు మలచిన ట్లగపడుచుండెను. కాని, యామె సుందరరూపముపై నామెదుష్ట విషాంతఃకరణము ప్రతిబింబించియున్నందున, నామెను జూచినవారి కానందమునకుమాఱుగ నాయాసమె కలుగుచుండెను. ఆమె వస్త్రధారణము సామాన్యస్త్రీల వస్త్రధారణమునకు భిన్నముగ నుండెను. అది దాక్షిణాత్యులపద్ధతి కాదు — ఉత్తర దేశపద్ధతియునుగాదు — కంచుకము దక్షిణదేశపద్ధతి — కట్టుచీర ఉత్తర దేశపద్ధతి — అన్నిటికిని వెలియైన యీ భయంకరస్త్రీయే యనేక సమయములయందు నాకుఁ గష్టమిడుచుండెననియు, నారాయణరావుపై మహాభయంకర దోషము నారోపించెననియు, నాకుఁ దెలిసినప్పుడు నామనస్థితి యెట్లుండవలయునో — ఎట్లుండునో సహృదయులగు పాఠకులే యూహించుకొనసమర్థులు — దానిని వర్ణించుశక్తి నాలేఖిని యందు లేదు.

తమ్మిని వేషమున నామెనే నేను పూర్వము చూచితినని గ్రహించుటకు నాకెంతయో యాలోచింపనక్కఱలేక పోయెను. నన్నుఁ జూచినంతనే యామె తననయనములను వాల్చుకొని తిరస్కారభావ

ముతో భ్రూలతలగుంచించెను. ఆమె నేత్రము లగ్నికణములఁ గ్రక్కు-చున్నట్లుండెను. ఫేనసదృశంబగు తన పరిషుభ్రహస్తమును ముందఱికిఁ జాచి బెదరించుధ్వనితో నామె—

"మీ రెవ్వరు ! నాతో మీ కేమిపని యున్నది ?" అని నన్నడిగెను.

ఆమె యసభ్యవర్తనమునకు నేను చలింపక గంభీరస్వరమున నిట్లంటిని.

"నాపేరు నళినీబాయియందురు" ఈ స్త్రీముందు గౌరవముగఁ బ్రవర్తించుటవలన లాభము లేదని తలంచి నేను మరల నిట్లంటిని. "నేని క్క-డకు వచ్చిన కారణము నీ వెఱుంగియుందువని తలంచెదను."

"ఆహా ! నీ కారణము నేనూహించితిని !" అని యామె కోపముతోఁ బలువరుసలఁ బటపటలాడించెను. అనంతరమామె తనసోదరుని బయటికంపివేసి నాసమీపమునకు వచ్చి "నళినీబాయీ ! నీవు వచ్చిన యుద్దేశమేమో స్పష్టముగఁ జెప్పెదవా ?" అనియెను.

ఆమె దేహము వెల్లబాఱియుండుటఁ గని నేనించుక మెల్లగ నిట్లంటిని. "చెప్పకుండుట కేమివచ్చినది ? నేనెందులకు వచ్చితినో నీకుఁ దెలిసియే యున్నది. మనకిదియే ప్రప్రథమ దర్శనము కాదుగదా ! అదియునుగాక, దర్పముతో మాటాడుపద్ధతికిఁ బ్రథమపాఠము నీవే యిప్పుడు నాకు నేర్పితివి. ఆయున్మత్త బాలకుఁడు—"

"మన సంభాషణమున మాతమ్ముని విషయము నెత్తకుము !"

"నేను నీతమ్ముని విషయమేమియుఁ బలుకుటలేదు !"

"ఆలాగా ! ఆఁ ! ఇప్పుడు తెలిసినది" అని యామె రూక్షేక్షణములతో నన్నుఁ జూచి "నీవు నాపై నారోపించిన—" అనునంతలో నేను—

"ఔను — వేషాంతరమున నీవు నారాయణరావుపై నొక కన్నుంచిన దోషము నేను నీపై నారోపించుచున్నాను." అని చెప్పితిని.

నా యీసంభాషణ మా మెయెడ బాగుగఁబనిచేసెను. భీతిచేఁ బులకితమైె యామె కొంచెము వెనుకకుఁ బోయెను. తత్క్షణమే యాత్మ సంయమనముఁ గావించుకొని, యామె, నావంకకుఁదిలకించి పరిహాస ముగానవ్వుచు "నీసాహసము నిజముగ నెప్రశంసనీయముసుమా! మన మొండొరుల కోడిపోవువారముకాము! నీకు నావలన నేమికావలసి యున్నదో చెప్పుము" అనియెను.

లజ్జ నన్నావరించినందున నా మెప్రశ్న కేముత్తరమీయవల యునో నాకుఁ దోఁచదయ్యెను. అచట నొకమూలను నిలువఁబెట్టిన పఱపుపై నాసీనుడనై నేను—

"నా కేమికావలయును? రెండుగంటలకుముందా యంత్రాలయ ద్వారమున కంటిటి భయంకరవృత్తాంతలేఖ నంటించుటను నీవేటికి సాహసించితివో యెఱుంగవలెనని నాకుఁ గోరికకలదు" అని యంటిని.

ఆమె : (విషాదపూరితహాసముతో) అట్లయిన నా ప్రయత్నము— నా శ్రమ — వ్యర్థము కాలేదుగదా! నీవు చూచిన వృత్తాంత పత్రిక—"

నేను : ఆ వృత్తాంత పత్రికను, దానినివ్రాసి యటనంటించిన వారినిగూడ నేను చూచితిని. ఆపత్రిక గోడపైనున్నప్పుడే చూచితిని. తరువాత నది వానవలనఁ దడిసి క్రిందఁబడియుండఁ దడిసినిరుపయోగమైన యాపత్రిక నెత్తికొనునప్పుడు దానిని లిఖించినస్త్రీనిగూడ చూచితిని.

ఆమె : (సంతోషముతో నవ్వుచు) అట్లయిన నచట నిగూఢ కార్యావలంబకు లిరువురుండిరా!

నేను : నీ దుష్టోద్దేశ మిరువురుస్త్రీ లెఱుంగుదురు.

ఆమె : (ఆలోచించి) నీవా యంత్రాలయముకడ కెందులకుఁ బోయితివి ?

నేను : త్రోవఁదప్పి—

ఆమె : అచ్చట నీవొక్కరితవే యుంటివా ;

నేను : ఔనా.—నేనొక్కరితనే.

ఆమె : నీవుతప్ప మఱెవ్వరు నాపత్రికను జూడలేదా ?

అని యామె యొక విలక్షణ దృష్టితోఁ జూడసాగెను. కాని, యామె చూపులయందలి యర్థము నాకుఁ దెలియలేదు.

నేనేమియుఁ బలుకకుండుటచే నామె నన్ను బలుకరించెను.

ఆమె : నీ వాగలి వృత్తాంతము నెవ్వరితోనైనఁ జెప్పితివా ?

నేను : ఆమాట నే జెప్పఁజాలను.

ఆమె : సెబాసు ! ఆరితేరిన న్యాయవాదివలె నీవు మహాదర్పముతోఁ బలుకుచున్నావే !

నేను : నీవేమైన ననుకొనుము—

ఖిన్నవదనముతోఁ గుముద యొకింత వెనుకకొదిగెను. ఆమె రూపము నిస్తేజమయ్యెను.

మెల్లమెల్లగ నామె క్రోధాగ్ని ప్రదీప్తముకాసాగెను. మాకు మధ్యభాగముననున్న యొకపెట్టెపైఁ జేతినానుకొని యామె—

“నీ వాతనిని—నారాయణరావును—ప్రేమించుచున్నావా ? ఆతని ధవళకీర్తికిఁ గళంకము కలుగఁగూడదనియు, నాతనిపదవికి గొఱంత రాఁగూడదనియు తలఁచి నీవు నాతో వైరము పెట్టుకొనసిద్ధపడుచుంటివా ?” అనియెను.

ఈ ప్రశ్నకు నేనుత్తరమీయలేనైతిని. ప్రశ్నరూపమున నామె నాముందటఁ బఱచిన విషయమునుగూర్చి నామతమెట్టిదో నేనే చక్కఁగ నెఱుగనైతిని. నేను మౌనముతో నుండుటచే—

“నీవు నాతో వైరము పెట్టుకొనుటకుఁ దగినదానవుకావు. ఒకవేళ నీవు నావలన నేమియుఁ గానేరదని తలఁచియుందువు !” అనునప్పుడామె నేత్రములనుండి కురియుచున్న యగ్నివర్షమువలన నా హృదయమున నప్పుడే తలసూపుచున్న యాశాంకూరము కాలిభస్మమైపోయెను.

నేను : నీవు మిగుల దుష్టస్వభావవువలె నున్నావు ! నీకు దేనివలన నానందము కలుగకున్నదో దానిని నీవు తత్క్షణమే నాశనము సేయ నుద్యుక్తవగు చుందువా ? ”

కుముద : నీకు నా చరిత్రము తెలియునా ? నారాయణరావు నీతో నా విషయమేమియుఁ జెప్పలేదా ?

నేను : లేదు లేదు. నీ విషయమై యాతఁడు నాతో నొక్క మాటయుఁ జెప్పియుండలేదు. నీ నేత్రములవలనను, నీవర్తనములవలనను, నాకుఁ గనఁబడుచున్న దానికన్న నెక్కుడుగ నాకేమియుఁ దెలియదు.

కుముద : అట్లయినచోఁ దొలుదొల్త నీకు నా చరిత్రమును విశదపఱుపవలయును. నాకుఁ బ్రేమపుటాసఁ జూపి యాతఁడు నన్నెట్లు మోసగించెనో యదినీకు మొదటఁ జెప్పవలసియున్నది. నా జీవితము నీ విధముగ నేలపాలుచేసిన యానీచుని దౌష్ట్యము నీ వీనులఁ బడినచో నీకాతని నిజరూపము తెలియఁగలదు.

అప్పు డొక్కమాఱు నేను తలయెత్తి యామెవైపునకుఁ జూచితిని. ఆచూపున కామె విపరీతార్థము చేసికొని “ నీకాతనియందుఁ బ్రీతి లేదుగదా ? ” అని ప్రశ్నించెను.

“ నేను నా జీవితము నాతనివలన నేలపాలు చేసికొనుదానఁ గాను ! ”

క్రోధాతిరేకమున నామె పెదవులు కొఱికికొనుచుఁ దనహస్తముల నడుమున కానుకొని —

“ నీకింకను నాతనితో నెక్కుడు పరిచయముకాలేదు. నీయందాతఁ డింకనువంగి మోకాళ్ళపైఁ గూర్చుండి ప్రేమయాచన చేయ లేదు. ఆతని స్పర్శసుఖమింకను నీవనుభవింపలేదు ! ”

“ లేదు. ”

ఆమె కొంకింత సమాధానమయ్యెను. ఆమె యొకవేళ నానోట నిశ్చయమగు వృత్తాంతమెఱుంగఁగోరి యీప్రశ్నల నన్నడిగియుండ వచ్చు ననుకొంటిని.

కుముద : అట్లయిన నీవు నీ మనోధైర్యమునుగూర్చి గర్వింపకుము.

నా చెక్కులపై నరుణకాంతి నశించెను. నా కన్నులు తమంతట తామే మూసికొనిపోయెను. వేగముగ నేను నా ముఖము నొకప్రక్కకుఁ ద్రిప్పుకొంటిని. అప్పుడు విచిత్రదృష్టితో నామె నావైపునకుఁ జూచుచు నిట్లనియెను.

"నేను సాధారణముగ నాతనిచేతఁబడి యుందుననని నీకుఁ దోఁచుచున్నదా? చూడుము? నన్ను బాగుగఁ జూడుము! ప్రప్రథమ సందర్శనముననే పురుషుని యతిమధుర భాషణములకు మెచ్చి చటాలున నాతని పత్నినగుట కంగీకరించునట్టి స్త్రీనా నేను? చక్కఁగ నాలోచింపుము! సుందరరూపము, మధురసంభాషణము, అత్యంతమునింపగు సంపద, తగినయున్నతపదవి — మొదలగు నిట్టి బాహ్యప్రదర్శనముల వలన నా ప్రేమ నొకనికి లభింపఁదగినదా? కుముదా! ప్రేమము, సహజముగ సాధారణముగ లభింపఁ జేసికొనుట యశక్యము. నెలలపర్యంతము నాతఁ డిచ్చోటఁ గూరుచుండి నాయొద్దఁ బ్రేమభిక్షను యాచించుచుండెను. అప్పుడైన నేనాతనికి నా హృదయము నర్పించితినా! నేను నాతమ్ముని బోషించుచు వాని సుఖదుఃఖముల నరయుచుండవలయును. కావున నాకుఁ బెండ్లియందపేక్ష లేకుండెను. కాని, యాతఁడు మెల్ల మెల్లగ నా మనసు నాకర్షింపసాగెను! తదనంతర మాతఁడు నన్నుఁ దన ప్రేమశిఖరముపై — అత్యంతోన్నత శిఖరముపై నధిరోహింపఁ జేసి— ఆ నీచుఁడు — ఆ దుష్టుఁడు — ఆ యువతీపవిత్ర వ్రతవినాశకుఁడు— చటాలున నన్ను, అగాధమునకుఁ ద్రోసివేసెను! ప్రత్యక్షపరమేశ్వరుఁడైనను నాయీ దుఃఖమును, ఈతాపమును, దీర్పఁజాలఁడు! ఇదంతయు జరిగి రెండేండ్లయినది! నేఁడు—"

ఆమె కంఠము డగ్గుత్తికపడినందున నికనామె పలుకఁజాలక కొంచెము సేపూరకుండెను. ఆమె తనమనసున దుర్భరవేదన ననుభవించుచుండెను.

"అతఁడు నన్ను వశపఱచుకొనుటకై పన్నిన మాయలకును, చూపిన యాశలకును నేనాతనిపై దోషారోపణము సేయను. నేను ప్రప్రథమముననే యాతని విన్నపమును దిరస్కరించియున్నచో నాతఁడు నన్నేమియుఁ జేసియుండఁడు. నా ప్రసక్తియైన నెత్తియుండఁడు. అందు వలన నేమియు నష్టము కలిగియుండదు. కాని, "నీవులేని నాజీవనము వ్యర్థము ; నీవు నాప్రేమ నంగీకరింపకున్న నే బ్రదుకుట యశక్యము" అని యాతఁడనియెను. అక్కటా ! అప్పుడు నామనసు నీరైపోయినది-నేను సుఖపడుదుననుకొంటిని — అతఁడంతగఁ బ్రేమయాచన సేయుచుండ నిరాకరించుట — నిర్దయతఁజూపుట నాకశక్యమయ్యెను. అతని ప్రేమ కపటప్రేమయని నేనెఱుఁగలేనైతిని. మోసపోయితిని ! ఆప్రేమ యాచనకు సమ్మతించితిని—అక్కటకటా ! ఆనాఁటఁగోలె నన్నాతఁడు తిరస్కరింప మొదలిడెను. నాయందనాదరణ వహించెను. కాని—" (ఆమెగట్టిగా) "దీనమును, వ్యర్థమునగు నాయీ చరితము వలన నేనాతనిపైఁ జేసిన హత్యారోపణము వెలికిఁ బ్రాకినది కాదు"

నేను : (భయముతో) ఔను.

"చిరకాలమునుండి యేవిధినైనఁ బగదీర్చుకొనవలయునని నాకు దృఢసంకల్పముండెను. ఆ సంకల్పమును నా హృదయమునందె దాచి యుంచితిని. కాని, నేఁటికి నాసంతాపము దీరునట్లుగ నాకీమార్గము కనఁబడినది. కావున నేఁటికాతని నాశనముచేయుటకై యీనాచేతిని పైకెత్తితిని—"

"చాలు !" అని యామె పైకెత్తిన చేతిని బట్టుకొంటిని. "చాలు నూరకుండుము ! ఇంత బిగ్గరగా నఱవకుము. నారాయణరావు గారి యేకృత్యమునకై నీవిపుడాతనిని, అతని తమ్ముని—"

"హంతకులనుచున్నానా ! అవును ; వారు డాక్టరు ప్రభాకర రావును జంపిరి"

భయమువలన నేను గడగడవడఁకఁ దొడఁగితిని. ఆమె నాచేతి నుండి తనచేతిని విడిపించుకొని నావంకఁ గొంతతడవు తదేకదృష్టితోఁ జూచి యిట్లనియెను.

"నిజముగనే నీవు దృఢచిత్తవుసుమీ! అతఁడు నిన్నొక యాఱు నెలలైన, కాక, యొకవత్సరమైన నధికముగఁ బ్రేమించును."

ఆమె యీ వాగ్బాణాఘాతమువలన నా యభిమానము జాగరిత మగుటచే నేనిట్లంటిని—

"నీవనునట్లు నారాయణరావు నిజముగనె హంతకుఁడై యున్నచో నాతని సహచరత్వమున నాకెన్నఁడును సౌఖ్యముకలుగదు."

"ఏమి!" అని యామె తటాలున నాయొద్దకు వచ్చి యానంద ముతో నిట్లనియెను. "నారాయణరావు, గోపాలరావు, కమలాబాయి యీ మూవురును డాక్టరు ప్రభాకరరావును ప్రత్యక్షముగ వధింప కున్నను, వీరే యాతని మరణమునకుఁ గారణభూతులగుటయు, నాతని నాశనమునకు వీరే సర్వమును పూర్వమే సిద్ధపఱిచియుంచిరనియు నేను నిదర్శన పూర్వకముగ నీకుఁ జూపినచో నీవు నారాయణరావును ప్రేమించుటమాని యాతని ద్వేషింతువందువా!"

"ద్వేషమా! నేనేమని యాతని ద్వేషింతును!" అని యామె నేత్రములలో నృత్యమొనరించుచున్న యాసురానందమునెడ నిర్లక్ష్య మును వహించి గంభీరభావముతో నేనంటిని. "నేనాతని మఱచుటకుఁ బ్రయత్నింతును, కాని, యిదిమాత్రము మనసునవుంచుము. కేవల నిరాధారవాక్యములపై విశ్వాసముంచువానను మాత్రముగాను!" ఉత్సుకతతో నామె పెదవులు పలుకఁదొడఁగుచుండుటఁగని నేను "నా ప్రేమను నాశముచేయ నీవుత్సుకవై యున్నట్టు లగపడుచున్నది!" అని యంటిని.

"నీకుఁ బరిపూర్ణవిశ్వాసము గలిగించుటకు నాకెంతయో సేపు పట్టదు. పురాతనయంత్రాలయమందలి తొట్టిలోనిరంధ్రమున నడ్డము

వైచిన వస్త్రము లెవ్వరివని నీవు నారాయణరావు నడిగినచో నాత' స్థితి యెట్లగునో యదినీకుఁ గనఁబడఁగలదు " అని యామె నొక్కిపలికెను.

"వస్త్రములా! వస్త్రములా!" అని నేనాశ్చర్యముతో నఱచితిని.

" ఔను; వస్త్రములే. ఈ ప్రశ్నమును వినినవెంటనె యాతని రూపము మారి నిస్తేజము కాకున్నచో నన్ను మూర్ఖురాలిఁగా నెంచి నా పలుకులయెడ నిర్లక్ష్యభావమును వహింపవచ్చును. కాని, యాతఁడు బెదరి__"

ఆమె రక్కసివలె నవ్వుచు సైగచేతనె తనవాక్యమును బూరించి ద్వారమువైపునకుఁ జేయిచాచి నన్ను బయటికిరుగుమని సూచించెను.

మా సంభాషణ మింతటితో ముగియుచున్నదని తలంచి ఖిన్న వదననై నేను—

" ఇంతకంటె నధికముగ నాకేమియుఁ జెప్పవా?" అనియడిగితిని.

" నేనుచెప్పినది చాలదా? నారాయణరావును దర్శించినపిమ్మట మరల నొక్కమాఱు నన్నుఁ జూడవత్తువా? రమ్ము! అప్పటివఱకుఁ గొంచెమోపిక పట్టలేవా?"

" ఓపికపట్టలేను" అనువాక్యము నాపెదవులపైకి వచ్చెను. దాని నుచ్చరింపవలయునను నపేక్ష దుర్భరముగ నుండెను. కాని, మా వృత్తాంతమును వినునుత్సుకతఁ బ్రకటించి స్వపరాజయము నంగీకరించు టకు నా యభిమానము నన్నడ్డుపెట్టెను. అత్యంత ప్రయాసతో నే నాత్మ సంయమనము గావించుకొని—

" నాకు నారాయణరావును దర్శించుట కిష్టము లేదు. వారియింటి కరుగుటకైన నాకిష్టములేదు" అని యంటిని.

" అయినను నీకాతని దర్శనము లభించితీరును. నీకాతని సందర్శనమగువఱకు నేనాసంగతి తెలుపఁజాలను" అని యామె మరలఁ దలుపుదెసకుఁ జేయిచాచి, నన్ను వెడలిపొమ్మని సూచించెను.

" నీవు రక్కసివి!" అని నేనామెతో స్పష్టముగఁ జెప్పియుందును. కాని, యట్లనుట యసంభావ్యమని తలంచి యావాక్యమును

నా మనసునుండి పైకిరానీయనైతిని. అదియునుగాక యా సమయమున నామె నేత్రములు వెలసిన యద్వితీయ తేజమువలన నేను బెదరినందున నిఁక నెక్కువతక్కువ మాటలనాడుటకు నాకు సాహసము కలుగలేదు. "ఇంకొకప్పుడు సమస్తవృత్తాంతమును నీవలనఁ దెలిసికొందును" అని నేను విషణ్ణహృదయముతో బయటి కరుదెంచితిని.

నా కడపటి వాక్యమునకు "నిస్సంశయముగ" నని యామె తనసమ్మతిని ప్రకటించెను. ఆమె యాశబ్దము భీషణఘంటానాదమువలె నా నిర్జన ప్రదేశమున నా వీనులు బ్రద్దలగునట్లుగ వినిపింపసాగెను. మార్గమున నడచుచుండునప్పుడుసైత మావాక్యమె నా వీనులలో ధ్వనించుచుండెను. నేను నామనసు నెన్నివిధములనో కుదుటపఱచుచుకొంటిని. నా యంతఃకరణమున — నొక రహస్యభాగమున నాయాశ యించుక ప్రాణములతో నున్నదని నాకుఁ దెలియవచ్చెను.

రాత్రి స్వప్నముసైతము కుముదయె నాకుఁ గనఁబడుచుండెను. ఆమె యుత్తమ సౌందర్యమునకు మెచ్చి నారాయణరావామె వలలోఁ బడినందులకు నాకాశ్చర్యము కలుగలేదు. కాని, యీయామె వలలోఁ బడినపిమ్మట నాతఁడు దానినుండి యెట్లు తప్పించుకొనెనో యనునదియే నాకాశ్చర్యముగా నుండెను.

## పదునొకొండవ ప్రకరణము

నేను మిగుల ధైర్యవతిననియు, సాహసికననియుఁ జెప్పుకొనుచుండలేదు. కాని, సూర్యోదయమగులోపల మరల నొక్కమారా పురాతన యంత్రాలయమున కరిగి కుముద వచించినరీతి నటనెచటనైన వస్త్రములు దాచియుంచఁబడినవో లేవో కనుఁగొనవలెనని నాకు మిక్కుటమగు నిచ్ఛ కలిగెను. ప్రొద్దెక్కుకొలఁది నాయపేక్షయు నధికాధికము కాసాగెను. దీనివలనఁ దొలుత నావస్త్రముల విషయమున

నిజమెఱింగి, యటుపిమ్మట నారాయణరావును దర్శించి యాతని సేవిక యమై యనుగనెంచుచుంటినని మీరెంతమాత్రమును దలఁపవలదు. ఆ వస్త్రమును గన్నారఁ జూడవలయునను నుద్దేశమే తప్ప నామనసున నాసమయమున వేఱొక యుద్దేశము లేదు. ఆ యంత్రాలయమున వస్త్రములు నాకు దొరకినచోఁ బిదప నేమిచేయవచ్చునని యాలోచించుటకైన నాచిత్తవృత్తి యప్పుడు స్థిరమైయుండలేదు. ఆ క్షణమున నామనసునకుఁ దోఁచిన తెఱంగునఁ బ్రవర్తించుటయే నాకర్తవ్యమని తలఁచి కౌతుకోద్వేగమున నేను బయటికి కదుగుటకు సంసిద్ధనగుచుంటిని.

పడకనుండి లేచి వేగముగఁ గాఫీ కాయఁదొడఁగితిని. ఇంతలో నెవరో తలుపుఁదట్టిరి. ఇంత ప్రాతఃకాలముననె నాయింటికెవరుత్తురా యని మనసున నాలోచించుకొనుచుఁ దలుపుఁ దెఱచితిని. నారాయణరావుగారి దాసి కోకిల నాయెదుటఁ బ్రత్యక్షమయ్యెను!

ఆమె తటాలున లోనికేతెంచి "నళినీబాయీ! నేను మీదర్శనమునకై వచ్చియున్నాను. మిమ్మేకాంతముగ సందర్శించుటకు నేనత్యంతోత్సుకనై యుంటిని. నేఁటియుదయమున నాకించుక వీలుకలుగుట వలన నిచ్చటికి వచ్చుటకు సాహసించితిని. నేనిప్పుడు మీయొద్దకు మీకు లాభకరమగు సంగతిని చెప్పవచ్చియున్నందున నాయీ యాకస్మికాగమనమునకు క్షమింపకపోరని నాకు నమ్మకముకలదు." అనియెను.

ఆమె యీ ప్రలాపములకు నాకు విసుఁగుజనించెను. కావున నామె నొకకుర్చీపైఁ గూరుచుండుమని చెప్పి నేనామెవైపునకు మూపుఁ ద్రిప్పి జడవేసికొనుటకుఁ బ్రారంభించితిని.

"కోకిలా! నీకు నాతోనున్న మహత్తరకార్యమేది? నీవు చెప్పునది మహత్తరమైనదై యున్నచో వేగముగ వచింపుము. నేనింకొక పనిమీఁదఁ బోవలసియున్నది"

ఆమె మోమున వెలసిన చిఱునగవు నాముందున్న యద్దములో నాకగపడెను. తనచేతిలోనున్న పూవులచుట్టను తోఁచనియట్లిటునటు

త్రిప్పుచుఁ గొంతసేపటివఱకు స్తబ్ధమైయుండెను. ఆమె చిత్తవృత్తి నిశ్చలముగా నున్నట్లగపడలేదు. కాని, అట్టి స్థితిలో నామె చాలసే పుండలేదు. వెంటనే తెలివిదెచ్చికొని యామె నిర్భయముగాఁ బలుకసాగెను.

"నా యజమానురాలికి సేవసేయు మొదటిహక్కు నాదై యుండఁగా మీరు దానిని బలాత్కారముగ లాగికొంటిరి. అందులకై మిమ్ము నేను దూషించుటకు రాలేదు. అంతియేగాక, మీకుపకారము సేయుటకు నేను సిద్ధముగా నున్నాను. శక్తియున్నంతవఱ కితరులకు సాహాయ్యము సేయుటయే పరమపవిత్రమగు మొదటిపనియై యున్నది"

ఆమె యీ యుదార వాక్యములకు విరుద్ధముగ మాటలాడుట కవకాశము లేకుండుటచే నేనేమియుఁ బలుకకుంటిని. అందువలన నామె కలవరపడి వెంటనె మనసు కుదురుపఱుచుకొని పరిహాసస్వరమున నిట్లనియెను.

"మీరు నిన్న నాకస్మికముగా బయలుదేరి వచ్చితిరి. ఈవిషయమై నేనేమియు ననుచుండలేదు. ఏలయన — మీకిష్టమువచ్చిన తెఱంగునఁ బ్రవర్తించుటకు మీరు స్వతంత్రులు. కాని, యచటనుండు నెడ మీకెంతలాభము—" అని వాలికచూపులతో నామె నావంకఁ గాంచెను. నేనేమైన ప్రత్యుత్తర మీయవలయునని యామెకోరిక — కాని యామె యేమిపలుకుచున్నదో, యామె యభిప్రాయమేమియో నాకింకను దెలియకున్నందున నేనేమియు మాటాడలేదు. అందువలన నేనామెకోర్కెను దృప్తిపఱుపలేక పోయితిని.

"మేము పైవారమని మీరు భావించుటలేదుగదా! మీరు మాకు యజమానులైనచో మాకెంతో సంతోషముగ నుండును. ఆ దువ్వెన నిటు తెండు. నేనెంతచక్కఁగ జడవేయుదునో యొక్కమాఱు చూడుఁడు!" అని కోకిల యనియెను.

కేవల మొకదాసి నింతవఱకు మాటాడనిచ్చుట నాదేతప్పు. నాతప్పు తెలియవచ్చినందున నాకుఁ బశ్చాత్తాపము కలుగసాగెను. నేను కోపముతో నామెవంకఁ జూడఁదొడంగితిని.

"చాలు! చాలింపుము నీవాచాలత!" అని నేనంటిని. కాని, యామెపైఁ గోపించి, యామె పరిహాసమునకు నేనలుకఁ జెందితినని యామెకుఁ దెలియునట్లు మెలంగుట మంచిదికాదని యోచించి నేను మరల నిట్లంటిని, "క్షమింపుము! ఇఁక నెప్పుడును నాయెదుట నిట్టివాచాతుర్యము నగపఱుపకుము. నీపలుకులయందు సత్యమెంతవఱకున్నను, ఇట్టివిషయములు నాతో మాటలాడునంతటి పరిచయము మనకు లేదనుట మఱచిపోవకుము. ఇంతకన్న మఱేమియు నీవు చెప్పవలసి యుండనిచో—"

ఆపై నేనేమన నెంచితినో తెలిసికొని యామె తటాలున లేచి నిరాశతో ఖిన్నహృదయముతో ద్వారముకడకరిగెను.

"మిమ్మవమానపఱుచు నుద్దేశముతో నేనిచటకు వచ్చియుండ లేదు" అనుచు నామె తలుపుకడకరిగెను.

నేను కోపముతో భగ్గున మండుచుంటిని. కాని, యీకోకిల యాడినమాటల కర్థమేమో తెలిసికొనవలయునని నాకపేక్ష కలిగెను. ఆమె యేదో యుద్దేశముతో నాకడకు వచ్చినందులకు నేను శంకింప లేదు. ఆదాసి యేదో సందేశమును గొనితెచ్చి యుండవలెనని నాకుఁ దోఁపసాగెను. ఆయాజ్ఞ—ఆసందేశ మెట్టిదో యెఱుంగ వలయునను నాయపేక్ష పైకి—కోకిలకుఁ—దెలుపుట యోగ్యముకాదని నాయభిమానము నాకుఁ జెప్పుచుండెను. కాని, యామె తెచ్చిన సందేశము నెఱుంగవలయునను నాస, నాయభిమానము నొకప్రక్కకుఁ ద్రోసివేసి కోకిలనొకమాఱు మరలఁ బిలుచుటకుఁ బ్రోత్సాహపఱిచెను.

నా మనసులోని యాలోచన కోకిలకెట్లో తెలిసెను. కోకిల మరల నొకమాఱు వెనుకకుఁదిరిగి—

"ఒకసారి గోపాలరావు తనయన్నతో" అని యూరకుండెను. దాని చేతిలోని పూలబుట్ట వడఁకసాగెను. ఆమెకు నారాయణరావు విషయమై యేమియుఁదెలియు లేదను నాలోచనచేఁ బుట్టిన యానంద భరమున, పెన్నెఱిగుంపు నట్టెవిప్పి, నేనామెవైపునకుఁ గాంచినంతనె యామె మరల "నలినీబాయీ! నీ పెన్నెరుల గుంపతిసుందరముగా నున్నది. "మనలోనెవ్వరమైన నాయువతిని వివాహమాడిన బాగుగ నుండును." అని గోపాలగా వన్నతోఁజెప్పుట కాశ్చర్యమేమున్నది!" అనితటాలున నెగిరిపోయెను. అప్పుడు నేనట్టె తలుపువంకఁ జూచుచుఁ జాలసేపు నిలిచియుంటిని,

పిలువని పేరంటమునకువచ్చి యామె యిట్లాడి పోవుటవలన నాహృదయమున విచారతరంగములు పుట్టసాగెను. "మనలో నెవ్వర మైన నాయువతిని వివాహమాడిన బాగుగనుండును" అను నీ వాక్యము కోకిల వెడలిపోయిన పిమ్మటఁగూడ నా చెవుల కెంతయోసేపు వినఁబడు చుండెను. గోపాలుని యానీచాభిలాషవలన నాహృదయమునఁ బుట్టిన వేదన యధికముకాఁజొచ్చెను. కాని, కోకిల దర్శనమువలనఁ గొంచెము మేలే యయ్యెను. ఆమె వచించిన మాటలు వినుటచే నాకాయంత్రా లయకడ కరుగునపేక్ష యధికమయ్యెను,

ఆ యంత్రాలయమున నెట్టికష్టము లొదవునోయనుభీతి నాకు లేకుండెను. ఈశ్వరకృపచే నచట నాకెవ్వరు నగపడకుండినచో నేనెట్టి భయమును లెక్కపెట్టను. ఆనగరమున నన్నెఱింగినవారు కొలఁదిగనే యుండుటచే నేనట్టు లామార్గమున నడచుచుండ వారెవ్వరును నాకెదురు పడరైరి.

మార్గమునఁ గుముద గృహమున్నది. ఆగృహముకడనుండి వేగముగ వెడలిపోవుటకు నేను జాగ్రత్త పడితిని. ఆసమయమునఁ గుముద యింటనుండెనని నాకుఁదెలిసియున్నచో నాయుత్సాహము ద్విగుణీకృతమై యుండును. ఆమెయింకెప్పుడైన నాయున్మత్తసోదరుని వేషముతో నాకుఁగనఁబడినచో నేనామెను గుర్తింపగలను. కాని

యామెను జూడఁబోవుదమను నాసకూడ నన్ను భయపెట్టుచున్నందున నామె యింటనె కూర్చుండియుండినదేమోయని నాకుఁ దోఁపసాగెను. యంత్రాలయ ద్వారమునఁ బ్రవేశించునపుడు నాకెవ్వరు నగపడనందున నే నత్యానందభరితనైతిని.

లోపలఁ బ్రవేశించి తొలుత "ఆఫీసు" గదిలో శోధనకుఁ బ్రారంభించితిని. అచటి నేలయంతయుఁ బరీక్షించితిని. యచట నెందును వస్త్రము లుంచియుండుట నాకగపడ లేదు. వేఱుగదిలోఁ కరిగితిని అచ్చటి నేల బల్లలచేఁ గట్టఁబడియుండెను; అవిగడగడలాడుచుండెను. బల్లలన్నియు వేఱువేఱుగఁ దీయుటకు వీలుగ నుండెను. నే నివన్నిటినిఁ దీసి చూచితిని. అచట ధూళితప్ప వేఱేదియుఁ గానరాదయ్యెను. ఏమైనను ధైర్యమువిడువక యచటి గదులన్నియు వెదకవలెనని నేను నిశ్చయపఱుచుకొని యున్నందున నంతటితో నిరాశచెందక నేనింకొక గది కరిగితిని. అచటఁగూడ నాయిష్టవస్తువు నాకుఁ గనఁబడదయ్యెను. కాలవిలంబము సేయక వెంటనె నేనింకొకగదిలోని కేగితిని. అటు లేగి నంతనె యచట నొకచావడిలోని తొట్టిలో డాక్టరు ప్రభాకరరావుగారు మరణించిరని నాకుఁ దోఁచసాగెను. నేను తటాలున నచటనె నిలుచఁ బడిపోయితిని.

సమీపముననె యాచావడిలోని కరుగుటకు సోపానములుండెను. ఆ సోపానపంక్తింగసినంత నాయొడలుఁ గంపమెత్తసాగెను. దేహమునఁ జెమ్మట లూరసాగెను. డాక్టరు ప్రభాకరుని మృత్యువును ప్రత్యక్షముగ నాకన్నులతోఁ జూచుచున్నట్లు నాకుఁ దోఁచెను. ఆ వస్త్రము లీగదిలోనె యెందైన దాచియుంపఁబడియుండునను ననుమాన మప్పుడు దృఢపడియెను.

ఆ కారణమువలన నేనచటి నేలయంతయు నతిజాగరూకతతో శోధించితిని. చాలసేపట్లు శోధించినపిమ్మట నటకపలక కదలుచుండుట నాకగపడెను. ఇప్పుడిచట నాకు వస్త్రము దొరుకుటని శ్చయమని

తోఁపసాగెను. శీఘ్రముగనె నాకన్నులయెదుట నొక భయంకర విషయము ప్రత్యక్షము కానున్నదని నేననుకొనినంతనే నాహృదయము తీవ్రముగఁ గొట్టుకొనసాగెను. క్రిందికివంగి నేనాపలక నెత్తితిని. అచట నేదో కట్టివైచియున్నట్లు నాకుఁ గనఁబడెను. రూపవతియగు కుముద వాక్యములు నిజమయ్యెను. ఆ యంత్రాలయమున నేవో గుడ్డలు దాఁచఁ బడియుండుట నిశ్చయమని నాకుఁ దెలిసెను.

నేనాగుడ్డల మూటను బయటికిఁ దీసితిని. ఆమూటవిప్పి చూచు సరి కందుండి మహమ్మదీయస్త్రీలు బయటికరుగునప్పుడు కప్పుకొనునట్టి నల్లని వస్త్రమొకటి క్రిందఁబడెను. ఆ వస్త్రముం గాంచినంతనె నేను భయభ్రాంత నై పోయితిని !

“ నారాయణరావున కీవస్త్రము విషయమై తెలిసియుండునా ? ఈవస్త్ర మాతనిదేయైయుండు నెడ నాతఁడు దీని నిందేమిటికి వేసియుం డెనో చెప్పఁగలఁడా ? ” అను నిట్టిప్రశ్నలు నామనసునఁ బుట్టెను. “ కాని, నారాయణరావున కీవస్త్రమునుగూర్చి తెలిసియుండు నెడ నీ వస్త్రాచ్ఛాదనము మఱుఁగున జరిగిన దుష్కృత్యము విషయమైకూడ నాతనికిఁ దెలిసియే యుండవలయును. ఆతనిఁబోలిన యున్నతకులో ద్భూతుఁడును, విద్యావంతుఁడు నైన మనుష్యున కిట్టి నీచకృత్యముతో సంబంధముండుట సంభవమా ? ఛీ ! నారాయణరావుగారివలన నిట్టి దుష్కృత్య మెన్నటికిని జరుగనేరదు. ఆతని ప్రశాంతగంభీర రూపము, నాతని సోగకన్నులు, నాతని విద్యాధికత, ఇవన్నియు నాతని యుదా రతకును, సహృదయతకును సాక్ష్యములై యున్నవి. కాని — కాని, సుశి క్షితులనియు సుప్రతిష్ఠులనియుఁ బేరుగన్నవారునై తము నింద్యమార్గ మును స్వీకరించుటలేదా ? బ్యాంకుల వ్యవస్థాపకులు సుశిక్షితులు కారా ? పలుకుఁబడి కలవారుకారా ? కాని, వారును బ్యాంకులలోని ధనము విషయమున నొక్కొకప్పుడు చిక్కులఁబడుచుండ లేదా ? బ్యాంకులలోని ధనము నపహరించుట గడిదేఱిన చౌర్యముకాదా ? మఱి

నారాయణరావు డాక్టరు ప్రభాకరరావును హత్య—" ఈ తుది వాక్యము నేనతి తీవ్రముగ నుచ్చరించితిని. కావున, నావాక్యముల భీషణధ్వని నావీనులలోఁ బ్రతిధ్వనించుచుండెను. "హత్య! హత్య!" అనుగర్జనములె నావీనులపై మాఱుమ్రోగుచుండెను. ఎల్లెడలనావాక్యములె వినఁబడుచుండెను, ప్రభాకరుని పిశాచమె నారాయణరావునందలి నాపక్షపాతబుద్ధిని బోఁగొట్టుటకై భయపెట్టుచు "హత్య! హత్య!" అనుచున్నట్లు నాకుఁదోఁపసాగెను.

ఈవిచారమున నేను స్తంభితనై పోయితిని. తుదకిచట నిలుచుట యపాయకరమని తలఁచి యావస్త్రపు మూటను యథాస్థానమునఁ బెట్టుటకుఁ బ్రయత్నించితిని. నేనామూట నాస్థానమున నుంచుచుంటిని. ఇంతలో సమీపమున నడుగులచప్పుడు విననయ్యెను. భయముతో వేగముగా నామూట నాపల్లమునఁ బాఱవేసి దానిపై నాటాతిపలకను మూసివేసితిని. ఆయడుగులచప్పుడు మఱింతిస్పష్టముగ వినఁబడుచుండెను. పాఱిపోవుటకు మార్గములేదు. ఇచటికెవ్వరో వచ్చుచుండవలయును. ఇప్పుడండే యెందైనడాగుటకన్న గత్యంతరములేదు. కాని, యెచట డాగుకొనవచ్చును? అచటనెందైన రహస్యస్థల మున్నదేమోయని పలుసంకలఁ దిలకించితిని. డాక్టరుప్రభాకరుని ప్రేతముదొరకిన చావడిలోని కరుగుసోపానశ్రేణి నాకు సమీపముననె యుండెను. ఆసోపాన మార్గమున నేనాగదిలోని కరిగినచో నందలిచీఁకటి వలన నేనెవ్వరికిని గనఁబడను, కాని, యాచావడిలోని కరుగుటయన నామృత్యువును నేనే కొనితెచ్చుకొన్నట్లగును. ఆలోచించుటకైన నాకువ్యవధిలేదు. నేనొక్కపరుగున నామెట్లనుదిగి యాచావడిలోని కరిగితిని. అచటి కరిగిన తోడనె డాక్టరుప్రభాకరరావుపడి మరణించిన యాతొట్టిని జూడవలెనని నాకాశ జనించెను. నేనొకానొక మాంత్రికునిచే మంత్రింపఁబడిన బొమ్మవలె నాయిష్టమునకు విరుద్ధముగ నాతొట్టికడకుఁబోవసాగితిని.

ఆతోట్టిని బరిశీలించి నేను వెంటనె మరలి పరుగుపరుగునవచ్చి యుందును. నేను ముఖముత్రిప్పి పరుగెత్తుటకై ప్రయత్నించుచుండ నాకుఁ బైభాగముననున్న యంతస్తున నెవ్వరో నడచుచున్నట్లు విన వచ్చెను. నాకీసంశయము జనించినంతనె నావిచారము వేఱువిధముగ మాఱెను. అప్పుడు పాఱిపోవుట భీరుత్వమగును. ఏలయన—పైనింతకుఁ బూర్వము నేను దాఁచియుంచిన వస్త్రము నెవ్వరో తీయుచుండవలెనని నాకుఁ దోఁచెను. కాని, యావ్యక్తి యెవరు? కౌతుకము, ప్రేమ, స్వాభి మానము, మొదలగునవి యామనుష్యుఁ డెవ్వఁడో చూడుమని నన్నుఁ బ్రోత్సాహపఱుచు చుండెను. ఒకానొక పిశాచమువలె నేనా మెట్లకడ కరిగితిని. ఆమనుజుఁ డెవ్వఁడో చూడవలెనను పట్టుదలచే నేను మెల్లగ నా మెట్ల నెక్కఁదొడఁగితిని. ఇఁకనొక మెట్టు నెక్కియున్నచో నాతల పైకిఁగనఁబడియుండును. కాని, యాయజ్ఞాతవ్యక్తి కుఱుదగాక మఱొక రైనను—ఆవ్యక్తి మొగము మెట్లవంకకున్నను, ఏమగునోగదా యను విచారము నామనసునకుఁ దోఁచెను. ఆయడుగుల చప్పుడు పురుషుని దే కాని, స్త్రీదికాదనియుఁ దోఁపసాగెను. ఇంతలో నొకయస్పష్ట స్వరము నాకు వినవచ్చెను. దీనినిబట్టి యెవఁడో పురుషుఁడు పైనున్నాఁడని నాకుఁదెలియ వచ్చెను.

పురుషుఁడగుటయు నాతండింత చోరమార్గమున వచ్చియుండు టయుఁ దలఁచి, నామనసెట్టులో యయ్యెను. ఆతఁడచట నేమిచేయు చుండెనో!—అతఁడెవఁడో?—నాకుఁదోఁచదయ్యెను. ఆతఁడా తొట్టిలో నున్న నల్లనివస్త్రమును దీసికొనుచుండవలెనని నాకించుక సంశయ ముదయించెను. కాని, నిజము తెలియదు. ఇట్టివిషయముల సంశయ మును నమ్ముట వ్యర్థము. ఏమైనఁగానిండు; పైకరిగి, నాకన్నులతోఁ గాంచి పూర్ణవిశ్వాసముఁ గలుగఁ జేసికొనవలెనని నేను నిశ్చయించు కొంటిని. అదృష్టవశమున నామెట్లదగ్గర నొకచిన్న పల్లముండినందున మేలేయయ్యెను. లేకున్ననాకుఁ గపాలమోక్షమై యుండును. ఏలయన- మెట్లపైనుండి తలపైకెత్తి చూచినప్పుడు నాకుఁ గనఁబడిన దానివలన

నేను నిశ్చేష్టనైతిననుట యతిశయోక్తి కాఁజాలను. అయిన నిది కొండఱ కతిశయోక్తియే యని తోఁచును. కాని, మెట్లవైపునకు వీపుఁ ద్రిప్పి, చేతనల్లనిమూట ధరించి నారాయణరావు—నా ప్రేమధనము— అచట నిలిచియుండుట నాకన్నులఁ బడినంతనే నాకేమి తోఁచియుండ వచ్చునో పాఠకులే యాలోచించి తెలిసికొందురుగాక !

## పండ్రెండవ ప్రకరణము

నారాయణరావు సోపానముల దెసకు వీపుఁద్రిప్పి నిలిచియుండెను. తనకృత్య మెవ్వరైనఁ బొంచిచూతురనియైన నాతనికిఁ దోఁచియుండ లేదు. ఈ కారణమువలనఁ బైకరుదెంచి చెదరిన నాహృదయమును శాంతింపఁ జేసికొనుటకు నాకు వలనుపడెను. ఈ మంచిసమయమును నేను సాధ్యమైనంతవఱ కుపయోగపఱుచుకొంటిని. నేనిప్పుడు భీతినంతను దూరముచేసి నారాయణరావు కట్టెదుట నిలువఁదలంచితిని ! నారాయణరావింకను వెనుకకుఁదిరిగి చూడలేదు. కొంచెముసేపా గుడ్డను బరీక్షించి తొందరగా దానిని మడఁచెను.

అప్పుడు నేనాతని వెనుకనె కొంచెము దూరమున నొకానొక పాషాణ విగ్రహమువలె నిశ్చలముగను, నిస్తబ్ధముగను నిలిచియుంటిని. నిశ్వాసోచ్ఛ్వాసములుసైత మతిమందముగ వెడలుచుండెను. అంతఁ గొంతతడవునకు నారాయణరావు సహజముగనె వెనుకకుఁ దిరిగి చూచెను — నేనాతనికిఁ గనఁబడితిని ! నన్నుఁ గాంచినంతనె యాతఁడు భీతచేతస్కుఁడై బిగ్గరగాఁ గేకలిడఁ బ్రయత్నించెను ; కాని, యాకేక బయటికి వెడలదయ్యెను. నాయాకస్మిక దర్శనమువలన నాతని కెట్టులుండునో, ఆతని డెందమున కెంతవేదన కలుగునో, ఎవ్వరైన వర్ణించి చెప్పఁగలరా ? ఆతని నిశ్చలాకృతియు, దేహముననావరించిన నీలవర్ణమును, ఆతఁ డెంతగ భీతిల్లియుండెనో సాక్ష్యమిచ్చుచుండెను. ఏదైన

నొకపిశాచముం గనినమనుజుఁ డెట్లు భయపడునో యట్లే నారాయణరావు భయపడిపోయెను. నాకుఁగూడ నదియంతయు స్వప్నసదృశముగఁ దోఁచుచుండెను. ఈ యంత్రాలయముతోపాటు నేనును నారాయణరావును స్వప్నదృష్టిలోని వారమనియు, ఆ స్వప్నము శీఘ్రముగనే భంగము కాఁగలదనియు నేననుకొనుచుంటిని.

కాని, నా దురదృష్టము—ఇంతకుఁ బూర్వము నాజీవితమున సంభవించిన దుఃఖదాయక విషయము లెంతసత్యమైనవియో, యిప్పటి సంఘటనముకూడ నంతసత్యమైనదియే యయ్యెను. నారాయణరావును నేనును స్వప్నగతులముగాక, నిజముగనే చూచుకొనుచున్నామను సంగతి మా కిరువురకు నిప్పుడు తెలియవచ్చెను. మేమిద్దఱ మొండొరులము సంశయదృష్టులఁ జూచికొనుచుఁ గొంచెముసేపు నిలిచియుంటిమి. ఆతని చేతిలోని నీలవస్త్ర మెప్పుడో జారి క్రిందఁబడిపోయి యుండెను. ఎట్టకేల కాతఁడే మొదటఁ బలుకరించెను.

"నళినీబాయీ!" శాంతభావముతో మాటాడవలయునని యాతఁడు చేసిన ప్రయత్నము నిష్ఫలమయ్యెను. "ఈ నిర్మానుష్యస్థలమునకు నీవు వత్తువని నేనెన్నఁడును దలంచియుండలేదు. ఏకార్యార్థమై నీవిటు వచ్చుటకు సాహసించితివి?"

"ఏకారణము మిమ్మిచ్చటికిఁ దీసికొనివచ్చినదో యాకారణమే యిచటికి వచ్చుటకు నన్నును బ్రేరేపించినది. ఈ యంత్రాలయమున నొకవస్తువు దాఁచఁబడియున్నదని నేను వినియుంటిని. దాని సత్యాసత్యముల నారయుటకై వచ్చియున్నాను, ఇదియే యావస్తువు!" అని నేను నాపాదములకడఁ బడియుండిన మూటను జూపితిని.

నేను చేతినెత్తినప్పు డాతనిదృష్టి నాచేతివంకనే యుండెను. చేతిని క్రిందికిదింపి వ్రేలితో నామూటను జూపినంతనే యాతని దేహము నల్లఁబడెను; రూపము నిస్తేజమయ్యెను!

నారా: ఈమూట నాస్థలమునుండి కదలించినది నీవా?

నేను : ఔను. నేనే దానిని బయటకుఁ దీసియుంటిని. ఒకరు మీపై నీచనింద నారోపించి యున్నందున దానిని దొలఁగించు నుద్దేశముతో నీమాటను దాకియుంటిని. కావున, నందులకై నాకు మిమ్ము క్షమాపణము వేఁడు నగత్యము లేదు.

నారా : ఏమీ ! నీచనిందారోపణమా ? నామీఁదనా ?

నేను : ఔను.

నేనతి కష్టముతో ఔనంటిని. నారాయణరావా నిందను దొల, గించుకొన వలయుననునిచ్ఛయు, పుష్పలతకు నేనొసంగినమాట కెట్టి బాధయుఁ గలుగఁ గూడదనుకోర్కెయు, పరస్పర విరుద్ధములగు నీ రెండును నాహృదయమునఁ బ్రవేశించి నాకు మరణావేదనను గలిగింప సాగెను.

“ నిందారోపణము ! నారాయణరావుగారూ ! మీమీఁద, అతినీచమును అత్యంత భయంకరమునైన నిందారోపణము—”

నాయీ సంభాషణమున కాతఁడు మిగుల బెగడందుటఁగని నేను మరల నిట్లంటిని.

“ మీకీయూరిలో నెవ్వరైన విరోధులున్నారా ? ”

ఆతఁడు మనసును గుదుటపరచుకొని, నావైపునకు దేరిపాఱఁ జూచుచు నొకవిలక్షణ స్వరమున—

“ విరోధులా ! ఉండిన నుండవచ్చును. ” అనియెను.

“ ఆవిరోధి పగసాధించు కొఱకు ద్వేషపిశాచ ప్రేరితుఁడై, మీప్రాణ — కాదు—వంశనాశన మగునట్టినింద నారోపించుటకు సమర్థుఁడైయుండునా ?

“ సమర్థుఁడు కాఁడని యెవరు చెప్పఁగలరు ? ”

ఇప్పుడాతని లోచనములు క్రోధోద్రేకమున నగ్నికణములవలె నయ్యెను. ఆతఁడు నామీఁది కోపమున నటుండ లేదు. ఇంకొకరి మీఁది కోపమున నాతఁడట్టులయ్యెను. అయినను, అప్పటిస్థితిం గని నాపంచప్రాణము లెగిరిపోయినట్లయ్యెను.

"వేగముగ వచింపుఁడు! మీయొకమాటవలననే నాహృదయమునందలి దుఃఖభారము తగ్గిపోఁగలదు. చెప్పుఁడు! ఈమాటకును, ఈ యంత్రాలయమున జరిగిన హృదయవిదారక కృత్యమునకును నేమైన సంబంధమున్నదా!"

"నలినీబాయీ! నీయీప్రశ్న కుత్తరమిచ్చుట కష్టము."

"ఉత్తరమిచ్చుట కష్టమా?"

"ఔను. నిజముగ నట్లే."

"మ——మఱి——" అని నేను గద్గదస్వరమున నిల్చితిని. "నే నిచ్చోటు వాసిపోవుటయే మంచిది. ఇంక నాకిక్కడ నేమిపనియున్నది?"

నారాయణరావు దీనవదనముతో "హా! దైవమా!——నిలువుము! ఇప్పుడే వదలిపోకుము! నన్నించుక యాలోచించుకొననిమ్ము. సమస్తసాధక బాధక ప్రమాణములనుగూర్చి విచారించుకొని, నీదృష్టికి నేనెట్టి మనుజునిగా నగపడుదునో చూతును. నావిరోధి నీతో నేమి చెప్పెనో నాకుఁ జెప్పఁగలవా?" అనియెను. ఈ కడపటి వాక్యము నుచ్చరించునపు డాతని సర్వాంగములును క్రోధాతిరేకమునఁ బ్రకంపితములగు చుండెను.

"మీ శత్రువు మీపై నరహత్యారోపణము——"

ఈమాటవినినంతనే యాతఁడు భయపడుననుకొంటిని. క్రోధావిష్టుఁడై సంతాపభరంబున నాతఁ డేమైనఁ దారుమారులాడునని, నేననుకొనియుంటిని. కాని, యాతఁడేమియు ననలేదు. వికాసముతో నవ్వెను. ఆహాసకర్కశధ్వని యాగదిలో నెంతోసేపు నెలకొనియుండెను.

"ఏమీ! నామీఁదనా నరహత్యారోపణము!"

ఆతని విలక్షణ వర్తనమువలన నేను హతబుద్ధినైతిని. ఏమన వచ్చునో తెలియక నేనాతని ముఖముపైపునకుఁ జూచుచు నూరకుంటిని. నాస్థితి నెఱింగి యాతఁడు తత్క్షణమె మనసుకుదుటపఱుచుకొనెను.

ఆతఁ డాదరైకవీక్షణముల నన్నుంగని యాపరోధక స్వరమున నిట్లని యెను.

"కాని, నీవు నావిరోధిని సందర్శించి నేను నరహంతకుఁడనను నీ యమూల్యవార్తను—ఈనూనృతవార్తను—నీ వెప్పుడు సంపాదించితివి?"

"నిన్న రెండుజాములవేళ మీరు సరస్వతితో వాహ్యాళికై వెడలి యున్నప్పుడు"

నారా: (మొగముపైఁ జేతినిఁ ద్రిప్పికొనుచు) నీమాటలయం దలి యర్థమేమో నాకుఁ దెలియ లేదు. నీవు వానిని సందర్శించితివా? ఆతనితో మాటాడితివా? అశక్యము— అసంభవము—"

"నేనేపురుషునిగూర్చియు మాటలాడుచుండ లేదు. ఒకస్త్రీని గూర్చి మాటాడుచున్నాను. మీపై హత్యారోపణముచేసిన దొక యువతి. మిమ్మిట్లు కష్టపెట్టుటయే తనపవిత్ర కర్తవ్యమని యామె తలంచుచున్నది; ఏలయన — మీరామెకు భయంకర నష్టమును గలిగించి యున్నారఁట!"

"స్త్రీ! ఏమి! స్త్రీయా!" అప్పుడాతని దేహము తెల్లబడెను. అది యెందులకో — సర్వాంతర్యామియగు నా పరమేశ్వరునికే యెఱుక!

"స్త్రీజాతిలో మిమ్ము ద్వేషించువా రెవ్వరును లేరా!"

"ఆఁ—ఇప్పుడు తెలిసినది! ఒకయువతి నా నాశమునకు బ్రయత్నము లొనర్చుచుండుట సంభవము"

"మఱి, మీరింతవఱకుఁ బురుషుల విషయమై చేయుచుండిన యాలోచన యెట్టిది? మీరహస్యము లోకస్త్రీకిఁ దెలిసియుండెననుట మీరు మఱచియుంటిరా? స్త్రీజాతి యింతస్వాభిమానశూన్యమైనదని మీకు—"

నా సంభాషణ మంతటనాఁగిపోయెను. ఏలయన — తటాలున నారాయణరావు నాచేతిని బట్టుకొని "నీవెవరివిషయమై మాటాడు

చున్నావు ? నారహస్యోదంతమే స్త్రీకిఁ దెలియును ? కృపవహించి యామె నామము నెఱిఁగింపఁగలవా ?" అనియెను.

"ఆమెపేరు మీకుఁ దెలియదా ? అట్లు తెలియకుండుట సంభవనీయమా ?"

"చెప్పుము—తొలుతఁ జెప్పుము ! ఆమెపేరు తొలుత నాకుఁ జెప్పుము !"

"రూపవతియగు కుముద !"

"అశక్యము — అశక్యము ! అని నాచేతినివదలి నారాయణ రావు "కుముదయా ! ఏమి ! కుముదయా !" అనుచు నొకింతదూర మేగెను.

"మీకు భీతికలుగుట నైజమే. అందులకు నాకాశ్చర్యము కలుగుచుండ లేదు. కుముద భయంకరస్త్రీయనుట కావంతయు నను మానము లేదు."

నిశ్చలదృష్టితో నాతఁడు నామోమునె చూచుచుండెను. నామాటలాతనికి వినఁబడెనో లేదో చెప్పఁజాలను.

"ఇట్టులెట్లగును ?" అని యాతఁడు తనదృష్టుల నలుకెలంకులఁ బ్రసరింపఁజేసి తుదకామూటపై నిల్పెను. " ఆమెయే యీవస్త్రము లిక్కడ దొరకునని నీతోఁ జెప్పెనా ?" అని యాతఁడు కర్కశ స్వరముతో ననియెను.

నేను : "ఔ" ననునట్లుగఁ దల ద్రిప్పితిని. ఏలయన— పలుకు టకు నాకిష్టము లేకపోయెను.

ఆమె ప్రత్యక్షమాంత్రిక ! కాదు—ప్రత్యక్షరాక్షసి ! ఎప్పుడైన నొక్కనాఁడిది వెలికిరాకమానదులే" అని తనలో గొణఁగుకొనుచు నాతఁడు గదిలో నిటునటు తిరుగసాగెను.

ఆతని కంఠము గద్గదికమైయుండెను. నేత్రములలో నశ్రువులు నిండియుండెను. ఆతనియాదీనస్థితి నేను చూడలేకపోయితిని. నేను వెను

కకుఁ కరిగి గవాక్షమార్గమున బయటికిఁ జూచుచు నిలిచితిని. ఒకసమయ మున నాకు దేవునివలెఁ బూజ్యుఁడై యుండిన యాతని యిప్పటిదైన్యావస్థను జూచుటవలన నా హృదయము విదీర్ణమయ్యెను. అట్టిస్థితిలో నేను గవాక్షముచెంత నిలిచియుండ నాతఁడు నన్ను సమీపించి "నీకును ఆ కుముదకును బరిచయము కలదని నాకుఁ దెలియలేదు" అనియెను.

"నిన్న రెండుజాముల వేళవఱకు నేనామె నెఱుఁగను. పిమ్మట నాకస్మికముగ నాకామెదర్శనము కలుగుయోగము తటస్థించినది."

"నీవామెను సందర్శింపనేగితివా, లేక, యామెయే నిన్ను సందర్శింపవచ్చినదా?"

"నేనామెయింటికరిగి యామెను జూచితిని." అని యంటిని. మఱియొక విధముగ నాతనికా విషయము నెఱింగించుట దుస్తరమని యెంచి యొక్క మాటలోనే సమస్తమును ఆమె ప్రకటన పత్రికావిషయ మును చెప్పివైచితిని. ఆ ప్రకటనమునకై నాహృదయమున నాకే యే యాలోచనలు తోఁచెనో, వానివలన నేనేమని యనుమానించితినో, కుముద నేవిధముగ నేను శోధించితినో మొదలగు వృత్తాంతమంతయు నాతనికిఁ దెలిపితిని. కుముద తనసోదరుని వేషమున నచటికివచ్చి యుండెనని మాత్రము చెప్పనైతిని. ఆమె నిజరూపముతోనె యచటికి వచ్చి యున్నట్లాతఁడు భావింపవలెనని యూరకుంటిని.

ఇవన్నియు వినిన నారాయణరావునకు మిగుల నాశ్చర్యమయ్యెను. నన్ను నొక్కినొక్కి యడిగి, కుముదనాతోఁ జెప్పినదానికన్న నధికముగ నామెకుఁ దెలిసియున్నదనియు, నామెకుఁ దెలిసియున్న విషయములలోఁ గొన్నిమాత్రమే నాకుఁ దెలిపినదనియు, నాతఁడు నావలన నెఱింగెను. ఈ రెండవ విషయమున కాతని కానందోదయమగునట్టులుండెను. ఏలయన—కుముదపేరు చెప్పినప్పటినుండియు నాతని మొగమున గనపడుచున్న విరుద్ధభావ మిప్పుడు నశించెను. అతఁడిప్పుడు పూర్వము వలె సంశయగ్రస్తమును, భయపూర్ణమునగు రూపమునతో నావంకకుఁ

జూచుటలేదు. స్వరము సౌమ్యముగ నుండెను. ఈక్రింది వాక్యమువలన నాతని చిత్తవృత్తియందైన భేదము చదువరులకుఁ దెలియఁగలదు. అతఁడు "నీవు నాహితముకొఱకింత కష్టపడుచున్నందులకు నేను నీయెడ నెంతయుఁ గృతజ్ఞుఁడను. స్త్రీదాక్షిణ్యము—అంతకన్న నించుక గొప్పఫలము నీవు నాకొసంగెదవా? న్యాయదృష్టితో నీవిషయమున నెట్టి నింద్యకృత్యమును నేనొనర్పలేదు. — ఈ సంబంధమై నేటివఱకు నీతో నొక్కయసత్యవాక్యమైన వచింపలేదు—నీకు నాయీ పలుకుల యెడ విశ్వాసము కలుగునా?" అనియెను.

నేను : (ఆనందముతో) మీరు నాతో శపథముచేసి చెప్పుదురా?

ఆతఁడు : నీకట్లే యిష్టమైనచో శివలింగముపైఁ జేయిడి బాస చేసి చెప్పుట కణుమాత్రమును వెనుదీయను.

ఆశాదేదీప్యమాన కిరణములు నాకు నయనగోచరములు కాసాగెను. ఎంతైనను, ఎంతచేసినను, నేనబలనేగదా! ఆతని యిప్పటివాక్యములు విన్నచో నెట్టిపాషాణహృదయునకైన దయకలిగియుండును. అటులుండ నేనాతని మాటనువిని యానందసాగరమున నోలలాడితిననుటలో నాశ్చర్యమేమున్నది?

"నాకు మీవాక్కులయెడఁ బూర్ణవిశ్వాసము జనించినది. నాకింకను జాలసంగతులు తెలియకుండినను, నాడెందమునందలి యనుమానము సమూలముగఁ బెల్లగించివేయుటకు మీరింకను నెన్నియో చెప్పవలసియుండినను, నేను మీయెడ విశ్వాసముంచెదను. మీవచనములపై విశ్వాసముంపకపోవుట మీసౌజన్యమును దురుపయోగమొనర్చినట్లగును. కాని—" మాటలాడు సందర్భమున నాకంఠస్వరము తీక్ష్ణముగ నుండఁబోలును! ఏలయన — లజ్జితుఁడై నారాయణరావు తలవంచుకొనియెను. ఆతని నిఁకఁ గష్టపెట్టుట నాకిష్టములేనందున నేను నావాక్యము నంతటితో నాపివేసితిని.

"నేను నీచుఁడననియే నీకుఁ దోఁచుచున్నదియా?"

"మీరు సద్గృహస్థులని మహానందముతో నేనొప్పుకొందును" అని నేను నొక్కి పలికితిని.

నారాయణరావు తలపైకెత్తెను. అతనివదనమున మరల దుఃఖ చిహ్నము లగపడుచుండెను.

అతఁడు దుఃఖముతో "రెండు సంవత్సరములకుఁ బూర్వమే నాకుఁగనఁబడియున్నచో నెంతబాగుగనుండును!" అనియెను.

అతనిస్వరమువలన నాతనికేదో గతకాలవృత్తాంతము నెడఁ బశ్చాత్తాపము కలుగుచుండెనని స్పష్టమయ్యెను. అతనియీమాటలవలన నామనసున నాతనిపై మరల సంశయముజనింపఁదొడఁగెను.

"రెండుసంవత్సరములకుఁబూర్వము నాదర్శనమువలన మీకేమైన విశేషలాభముకలిగియుండునా? స్త్రీలకభిమానము లేదనియా మీ యభిప్రాయము? తక్షైకవిచారభరమున స్త్రీలెల్లరును దమశాశ్వత సౌఖ్యమును, ప్రతిష్ఠను మంటఁగలుపుటకు సిద్ధపడుచుందురనియా మీయూహ?" అని నేనడిగితిని.

"అదేమో నేఁజెప్పలేను. కాని, నీవొకయసాధారణస్త్రీవని మాత్రము నేనంజలిబద్ధుడనై యొప్పుకొనుచున్నాఁడను" అనియాతఁ డనియెను. నేను నిర్వికారచిత్తముతో నించుక వెనుక కరిగితిని. అప్పుడు నారాయణరావు మరలఁజెప్పదొడంగెను. "కాని, దుర్యోగవశమున, రెండుసంవత్సరములకున్ను, నీకుమాఱుగ కుముదనాకంటఁ బడినది. నేను నిన్నిప్పుడు పూర్ణముగ నెఱుంగుదును; నీసద్గుణములకు నేను మెచ్చుకొనుచున్నాఁడను. నేను త్రికరణశుద్ధిగ నీసేవసేయుటకు సంసిద్ధుఁడనై యున్నాఁడను. నాగతజీవితమెట్లుండినను, ఇఁక నీజీవితశేషము నీసావాసమున సన్మార్గమునఁగడపుట కుత్సుకుఁడనై యున్నాఁడని నీవు మనసులోనుంచుకొనుము! నేను నీప్రేమకు—నీదయకైనఁ—బాత్రుడనై యున్నాఁడను—నీవీమాట కాదనఁజాలవు!"

అనిపలికి నారాయణరావింకఁ బ్రసంగమును బెంచుట కిష్టము లేకయె కాంబోలును కొంతదవ్వరిగి, యటనున్నవస్త్రమును మడత పెట్టసాగెను.

"ఇఁక నీవస్త్రము నిచట నుంచుట మంచిదికాదు" అని నారాయణరావనియెను.

కాని, నామనస్సెట్టిస్థితిలో నుండెనో! నాహృదయము సందేహముచే నిటునటు నూగులాడుచుండెను. మాయీసందర్శమున వెలువడవలసినవిషయము లింకను వెలువడియుండలేదని నామనసు బాధించుచుండెను. కావున, అంతరిక్షేపమును దూరముగఁద్రోసివేసి కార్యసాధనమునకై నేను ముందంజవేసితిని. ఆతని చెంతికరిగి యాతని చేతనున్న వస్త్రమువంకఁ జేయిచాచి నేనిట్లంటిని.

"ఈ వస్త్రము మూలమున మీరొకప్పుడు చిక్కునఁబడవచ్చును; పడకుండఁబోవచ్చును. కాని, యీకుముదమాత్ర మీశోధనమువలన నెంతో మేలైనది. ఆమె స్వస్థతముగఁ గూర్చుండియుండు స్త్రీకాదని మీరెరుంగుదురుగదా! ఒకవేళ నామె యీవిషయము లన్నియుఁ గోర్టుముందిడి నన్ను సాక్ష్యము వేసికొన్నచో, అపుడు మాత్రము నేనెల్లవిషయములును జెప్పవలసివచ్చును. మీయందలి దయయుఁ బ్రేమయు నన్నాకార్యమునుండిమరలింపఁజాలవు. ఏలయన—డాక్టరుప్రభాకరుని మరణకాలమునుశోధించి పరిశీలించుటయె నాముఖ్యకర్తవ్యము. అందుకై నేను గంకణముఁగట్టికొనియున్నాను. ఈవిషయమున నాసర్వసౌఖ్యములను నాప్రాణములను నేనించుకయైన సరకుఁగొనను. ప్రభాకరునియం దాత్మహత్యాకళంక మాపాదింపఁబడియున్నది. ఏయుపాయముచేనైన నాకళంకమును దుడిచివేయుటయె నాపరమపవిత్రకర్తవ్యమని నేనెంచుచున్నాను; ఈమాట మీమనసున నుండనిండు. పరమేశ్వరుఁడు రక్షించుఁగాక! కోర్టునకెక్కునవసర మొదవకుండుఁగాక!" ఆతనికి నేనిట్లు సూచించితిని—వలసినచో

దీనిని మీరు భయపెట్టుటయనియైనఁ బిలువుఁడు — నేనిట్లుండునని యాతఁడనుకొనలేదు. నాయీ యాకస్మికాడంబర వాక్యములవలన నాతఁడు నిర్భ్రాంతుఁడై పోయెను. ఉన్మత్తునివలె నాతఁడు నన్నుఁ జూచుచుఁ దలపైఁ జేతిని ద్రిప్పుకొనుచు నిట్లనియెను.

"నీవిట్లు విస్పష్టముగ మాటాడినందులకు నీకు నేను కృతజ్ఞుఁడను. నీవనినవిషయము మీవలనకే నాకుఁ దెలియవలసియున్నది— కాని, (కొంచెమాలోచించి) నాస్థితి నేననుకొనుచున్నదానికన్న మిక్కిలి హీనముగ నున్నదని నాకిప్పుడు తెలియవచ్చినది. ఇంతవఱకు, నీయొక్కరిత సమక్షముననే నాకృత్యములనుగూర్చి సమర్థించుకొనవలసియున్నదని నేననుకొనుచుంటిని. కాని, నిజమూహింపఁగా న్యాయమందిరములయొక్కయు, జగముయొక్కయు, నారోపణములనుండి నన్ను నేను రక్షించుకొనవలసియున్నట్లు కనఁబడుచున్నది. (వాక్యసరణి మార్చి) "కుముదకీ వృత్తాంతమెట్లు తెలిసెనో నీవెఱుంగుదువా?"

"ఎఱుంగను." అని నేనుత్తరమిచ్చితిని. అదివిని యాతఁడు ద్వారముచెంతకు మోముఁద్రిప్పి క్రోధకంపితస్వరమున నిట్లనియెను.

"ఈవృత్తాంత మెఱుంగుట కామె కొక్కమార్గమున్నది. ఆమెకు నిజముగనె సర్వముఁ దెలిసియుండెనా; నానాశము—"(అని యాతఁడు భయభ్రాంతి నటునిటు చూచి) నాకీర్తికిఁ దవిలిన కళంకము నీప్రాప్తిచే నేను తొలఁగించుకొనఁగలనా? నేను శపథపూర్వకముగ వచించుచున్నాఁడను; వినుము; నీవలననె నాకిట్టిస్థితి కలిగినది."

"పరమేశ్వరుఁడు నన్నుఁ బ్రోచుఁగాక!" అని నేనంటిని.

"నీవిప్పుడున్నదానికన్నఁ గొంచెము తక్కువ చక్కనిదానవై యున్నచో — తక్కువ లావణ్యవతివై యున్నచో —తక్కువశీలవతివై యున్నచో — నాతమ్ముఁడు — (నాలుకఁ గఱచుకొని) చాలు! నేనేమనుచున్నాను! ఇఁకమీఁద నౌదార్యము, క్షమ, యను నీరెండు తత్త్వముల ననుసరించియె నేను ప్రవర్తింతునని నీతో నింతకుఁ బూర్వ

మే చెప్పియుండుటయుఁ ఉచితని—మాయిద్దరను క్షమింప వేడుచున్నాను. ”

ఈతనిసంభాషణములవలన సీపనిలో గోపాలరావునకుఁగూడ సంబంధమున్నట్లు స్పష్టమగుచుండెను. అది యింతకంటెభయంకర మైనను, దానివలన నాహృదయమున కించుకసమాధానమయ్యెను. నారాయణరావుగారియీవిభ్రమమునకుఁగారణ మేమైనదియు నాకుఁ గొంచెముగఁ దెలియుచుండెను, అప్పుడు నేను—

“ ఒకబుద్ధిహీనునికొఱకై మీరు మీవినాశమును దెచ్చుకొను వంటివారు కారని నాకాశకలదు. సంశయాస్పదముగఁ గనఁబడు మీవర్తనమునకు నిజమగు వేఱొకకారణము మీరిప్పుడు చెప్పినట్లుగ నే యుండినచో నౌదార్యమనుడంబమునకుబలియై మీరు మీనాశన మును దెచ్చుకొనకుఁడు ” అని యంటిని.

కాని, యాతనివర్తనమునుగూర్చి నేనాడినమాటలనుమన్నిం పక యాతఁడు తలనాడించుచు—

“నాతమ్ముఁడు—నీవు నాతమ్మునిగూర్చియే పలుకుచున్నా వని నేను తలఁచెదను—శిక్షాస్మృతులదృష్టిలో నేనెట్లో నాతమ్ముఁడు గూడ నట్టినిర్దోషియే. ప్రభాకరునిమరణముతో నాకుఁగాని నాతమ్ము నకుఁగాని యెట్టిసంబంధమును లేదు. ” అనియెను.

పిమ్మట “ అయినను— ” అనునొకధ్వనివినవచ్చెను. “ ఎవ్వతె యెడనిప్పుడు నీకుఁబ్రేమకలదో యామెసమక్షమునను, వెనుక నొక కాలమున నెవతెను నీహృదయేశ్వరిగభావించి మన్నించియుంటివో యామెయెదుటను, డాక్టరు ప్రభాకరరావుగారిమరణముతో నీకును నీతమ్మునకును నెట్టిసంబంధములేదని ప్రమాణపూర్వకముగ శపథము చేసి నీవు చెప్పఁగలవా ? ” ఈధ్వనివచ్చినదిక్కునకు—తలుపు దెసకు— మేమిద్దఱమును జూచితిమి ! అదినారాయణరావుగారి పరమశత్రుస్వరూ పిణి ! — నాప్రతివాదినియగు కుముద వాకిటనిలిచి, యగ్నికణములం బోలు నేత్రముల మూలమున మాపై నగ్నిస్ఫులింగముల వెదజల్లు చుండెను !

మానహీనయగు నారక్కసింగనినంతనె నారాయణరావాక స్మికముగ దిగులొంది వెనుకంజవేసెను, అతనినాలుక యెండిపోయెను ; నోటమాటయేరాదయ్యెను ; దండతాడితభుజంగినిరీతి ఘూత్కారము సేయుచుఁ గుముద మాయిరువురిమధ్యకును వచ్చి నిలిచెను !

“చెప్పుము నీవైన ! —నీతమ్మునితో మాయిరువురకు నెట్టి సంబంధమును లేకున్నందున నాతని విషయమై మాటలాడుట మాకన గత్యము. ప్రభాకరుని హత్యవిషయమున సంపూర్ణముగ నీవు నిర్దోషివా ?” అని యామె కోపముతో నడిగి యాతని మొగమువంకఁ దీక్షదృష్టిం దిలకింపసాగెను. అగ్నిజ్వాలలఁ గ్రక్కుచున్న యామె విష వీక్షణములుసోకి నారాయణరావు హృదయము విదారణమయ్యెను. అతని రూప మధికాధికముగ నిస్తేజమయ్యెను. అవనతివదనుఁడై యాతఁడు మెల్లగ నిట్లనియెను;

“అది పరమేశ్వరున కెఱుక. నేనైన—లేదనుటకు సాహసింపఁ జాలను.”

## పదుమూఁడవ ప్రకరణము

నిర్మానుష్యమై, భయప్రదమై, శ్మశానమువలెఁ గనఁబడు నాస్థలమున కాకస్మికముగాఁ గుముద యరుదెంచుటచే మేమిద్దఱమును గడుంగడు నడలితిమి. కుముదను బూర్వ మెప్పుడును నేను చూడక యుదియె నాకామె ప్రథమదర్శనమైనచో నామె యేదో పిశాచమే యని భావించి యుందును, ఏలయన—ఆ నిర్జనస్థలమున కేదేనట్టి మహత్తరకార్యముండ ననేగాని యేస్త్రీయు వచ్చుట సంభవింపదని నాకుఁ దోఁచెను.

పై ప్రకరణమున జరిగిన సంభాషణమున కనంతరము కొంతతడవు మేమెవ్వర మేమియు మాటాడలేదు. కొంచెముసేపైన పిమ్మట

నారాయణరా విట్లనియెను. "దేనిని నేనెన్నఁడు నొప్పుకొనఁదలఁచి యుండలేదో దానినే యిప్పు డొప్పుకొనుచున్నాఁడను. ఎవ్వతె నన్నటు లొప్పించుటకుఁ గారణభూతియైనదో యామెకు నాయొప్పుదలయందలి మహత్త్వము పూర్ణముగఁ దెలియును. ఆమెయే సర్వము నీకుఁ జెప్పఁ గలదు. ఇఁక నాకిచట నేపనియులేదు" అని యాతఁడు మావంకఁ జూడకయె త్వరితముగ నడచి ద్వారముకడ కరిగెను.

కాని, యాతఁడు వెలుపలికరుగ నశక్తుఁడయ్యెను. కుముద యడిగిన ప్రశ్న కుత్తరమీయకయె వెడలిపోవుట కాతనికి శక్యముకాక పోయెను.

కుముద : (తీక్ష్ణస్వరమున) ఇచట నీకేమియుఁ బనిలేదా? నీ ప్రాణము — నీ మరియాద — నా చేతనున్నదని నీకుఁ దెలియుచుండ లేదా?

నారా : (మావంకఁ జూడకయె) నా ప్రాణముకన్న నాకధిక ప్రియమగు నొకవ్యక్తియెదుట నాసత్కీర్తియంతయు నాశనమైపోయి నది. ఇఁక నా ప్రాణమును గూర్చియా—నీవెన్నఁటికిని నాకుఁ బ్రాణా పాయముఁ దేజాలవు—నీకంతటిశక్తి లేదు— ఇఁకనాతనికా? ఆతనిజీవ మున కపాయము సంభవింపఁజాలదని నాకు విశ్వాసముకలదు.

కుముద : (ఆశ్చర్యముతో) ఆతఁడా! ఆతఁ డెవ్వఁడు? (అని యామె విద్యుద్వేగమున నాతనిచెంత కరిగి కోపముతో నాతనిగడ్డముఁ బట్టి) చెప్పుము! ఆతఁ డెవ్వఁడు!

నారా : (తిరస్కారభావముతో) నేనెవ్వరినిగూర్చి మాటాడు చున్నానో నీకుఁ దెలియదా? ఎవ్వఁడు నీకీవృత్తాంతములు తెలియఁ జేసెనో యావిశ్వాసఘాతుకునిపేరు నీకు జ్ఞప్తిలేదా? నాపైఁ బ్రయో గింప నిట్టి భయంకరశస్త్ర మెవ్వఁడొసంగెనో యానాతమ్ముని బరమే శ్వరుఁడు క్షమింప—

కుముద : చాలు ! నీ తప్పునకు దీనితో నెట్టిసంబంధమును లేదు. ఆదుష్టునిమాటలయందు నేను నమ్మకముంతునని నీకుఁదోఁచుచున్నదా ? నారాయణరావూ! నాకుఁదెలిసియున్నవిషయములు ప్రత్యక్షముగ నాకన్నులారఁజూచినవేయని నమ్ముము!—ఇప్పుడు నీప్రాణము నా చేతులలోనున్నదో లేదో యాలోచించుకొనుము.

అనివచించి యామె తనఫేనసదృశహస్తము నాతనిముందఱ నతిచిత్రముగఁద్రిప్పనారంభించెను. ఆమెమోమున నప్పుడు విలసిల్లుచుండినహాస మేమానిసి మొగమునను మరల నాకెప్పుడును దృశ్యమానముకాఁజాలదు !

నారాయణరావు తొలుత నామె హస్తమువైపునకును, బిమ్మట నామె మొగమువంకకును, దృష్టిసారించెను. విజయసూచక వికటహాస మొనర్చి కుముద యిట్లనియెను.

" నేనిప్పుడు గైకొనిన ప్రతీకారచర్య మాబోంట్లకు దుస్సాధ్యమని నీవుతలంచుచుంటివా ? నారాయణరావు ! ఇప్పటికైన—ఇంతవరకు వచ్చినప్పుడైన—నాస్వభావ మెఱుఁగనిమందుఁడవా ? మూర్ఖుఁడవా ? గోపాలరావు నాకీవృత్తాంతమేల చెప్పును ? అతఁడు నన్నుఁబ్రేమించుచున్నాఁడని నీకుఁదోఁచుచున్నట్లున్నది. గోపాలరావు నీవనుకొనునంత సరసుఁడు కాఁడు. కాని, నాకు—ఎవతెకునీవుసరసము నెఱుఁగ జేసితివో—ఛీ! ఆవిషయమిప్పుడెందులకు ? నేనిచటికివచ్చినకారణము నీకుఁ దెలియనలయునుగదా ?

నారా : చెప్పుము ! నీకీవృత్తాంత మెట్లు తెలిసెనో చెప్పుము ! నీకదియెట్లుకనఁబడినది ? కులటా ! నీవప్పు డెక్కడదాగికూర్చుండి యుంటివి ?

కుముద : (నవ్వి) కొంచెము లోపలిగదిలోనికివత్తువా ? వలదు—అటువచ్చుటకునీకు ధైర్యములేదేమో ! ఈగవాక్షమార్గమున నీవొక్క మాఱు వెలుపలికిఁజూచినను జాలును.

అనియామె యొకకిటికీకడకరిగి దానితలుపులు తెఱచి బయట నున్నయొకవృక్షమువైపునకు వ్రేలుసూపి "నీకాచెట్టుకనఁబడుచున్నదా? అదిగో! చూడుము! ఆవృక్షశాఖయొకటి యీప్రక్కింటికిటికీవైపునకు వ్రాలియున్నది. నీవనిన తెఱంగుననొకరక్కసికి ఒకమాంత్రికకు—ఒక్క పిశాచికి—రెండుగంటలసేపాకొమ్మపైఁగూరుచుండి యీగదిలో జరిగిన దంతయు గవాక్షమార్గమునఁజూచుటకు సాధ్యముకాదా? దట్టముగ నలుముకొనినచిన్నకొమ్మలచే నాచెట్టుపైఁగూర్చున్న యాపిశాచినిగనుఁ గొనుట కితరుల కశక్యము. అగపడుననుభయమునూమెకు లేదు. ఆయాకు లామెదృష్టికడ్డముగనుండ లేదు. పిశాచములకు జాతిగోడలమరుఁగున నున్నవియేకనఁబడుచుండ, నింకనీపత్రములలెక్కయేమి?" అని యామె విజయోన్మత్తవీక్షణముల నారాయణరావును నన్నును జూడసాగెను. అనంతర మొకకొంతతడవున కాతఁ డామెచేయివదలి వెనుకకు జరిగి నిలిచెను. కుముదయుఁ బూర్వమువలెనె నిశ్చలయై శాంతభావముతోఁ దనవృత్తాంతమును జెప్పఁదొడంగెను.

"ఉన్మత్తుఁడగు నాతమ్ముని వేషమును ధరించుట నాకనేకవిషయములలో మేలయ్యెను. ఆవేషమున నాకనేక విషయములు తెలిసికొనుట కవకాశము కలిగెను. అంతియేకాక, నిశాసమయముల బయటఁ దిరుగుట కంతటిమంచివేస మింకొకటిలేదు. ఆవేషధారణమున నేనెచ్చటికైనఁ బోవఁగలుగును. ఆ వేషముననుండుటవలననె నేనిప్పుడు వచింపఁబోవుసంగతులు తెలిసికొనుటకు నాకు వీలుకలిగెను. ప్రత్యక్షముగ నాకన్నులతోఁ జూచుటయుఁ దటస్థించెను. నళినీబాయీ! నాతమ్ముఁడు—ఆయున్మత్తుఁడు—వార్తావహుఁడై ఏవార్తయైన, నేయుత్తరమైన, నెవరికొప్పఁజెప్పవలయునో, వారికే తగురీతి నొప్పగించును; కాని, యొప్పఁజెప్పిన పదినిముసములలో మఱచిపోవును. ఎవరికే సందేశమిచ్చినదియు వానికి జ్ఞప్తియుండదు. ఒకయక్షరమైన జ్ఞప్తి యుండదు. ఈవిషయ మూరిలోనందఱకును దెలియును. ఒకనాఁటి

రాత్రి కటికచీఁకటిగ నుండెను. ఎప్పటివలెనె నేను నాతమ్ముని వేసమున నొకమార్గమువెంట నడచిపోవుచుంటిని. ఇంతలో నల్లని యుడుపులు ధరించిన యొక మనుష్యుఁడు నాకడకరుదెంచి "నాసందేశము డాక్టరు ప్రభాకరరావున కందఁజేయుదువా! అని యడిగెను. అందులకు నేనిష్టపడనైతిని. కాని, యామనుజునియెడ నాకు సంశయ ముదయించి నందున, నాచేతికఱ్ఱను ద్రిప్పుచు, నాతమ్మునివలెనె నేనును మొగముఁ ద్రిప్పుకొనుచు, నాతనివిన్నపము నంగీకరించితిని. తత్క్షణమా గృహస్థుఁడు వంగి నాచెవిలో రహస్యముగ నిట్లనియెను.

"డాక్టరు ప్రభాకరరావుగారి నిజీర్ణయంత్రాలయమున కతిశీఘ్రముగ రమ్మనుము. "ఒకమనుష్యుఁ డొకబండిలోనుండిపడి నిశ్చేష్టుఁడై యున్నాఁడు, అతనికి మీసాహాయ్యమత్యావశ్యకమై యున్నది" అని వచింపుము. జ్ఞప్తియున్నదా!"

తలఁగదలించి నేనచ్చోటువాసి పరుగిడసాగితిని. అచట నొకింత తడవు నిలిచిన నాపురుషుఁడు నన్ను గుర్తించునేమోయని నాకు భీతి కలుగుటచే నేనట్లుపరుగిడ సాగితిని. ఆ సద్గృహస్థుఁడు తన కంఠస్వరమును మార్పవలయునని యెంతప్రయత్నించినను, అతఁడు గోపాలరావగుట యాధ్వనిమూలమున నాకుఁ దెలిసిపోయెను. కావున, నా యంత్రాలయమున నిశ్చేష్టుఁడై పడియుండు నాతఁడు నారాయణరావై యుండునని నేననుకొంటిని. కాని, డాక్టరుగారి యిల్లుచేరులోపల నా హృదయమున వేఱొకసంశయ ముత్పన్నమయ్యెను. గోపాలుని విచిత్రవర్తనమునందలి యర్థమే నాకుఁ దెలియదయ్యెను. ప్రప్రథమము నుండియు నేనాతని ద్వేషించుచున్నందున నాతని యీవిచిత్రవర్తనమునకు నేను విపరీతార్థము కల్పించుకొంటిని. డాక్టరు ప్రభాకరు నర్ధరాత్రమున నిచటికిఁ బిలువనంపుట కాతని కేదైన దురుద్దేశ ముండవలెనని నాకుఁ దోఁపసాగెను. కాని, యీ సంశయముకొఱకు నేనాసందేశమును వీడఁజాలకపోయితిని—ప్రభాకరునియిల్లు సేరితిని. అతఁడచటి కరిగినచో

నాతని వెంటనె మెల్లగ నాతావునకు నేనుకూడఁ బోయి యేమి జరుగునో చూతమని నిశ్చయించుకొంటిని. నేనొక్కసారి పిలిచినంతనె దైవానుగ్రహమున డాక్టరుగారే బయటికి వచ్చిరి. ఆతనిచేత నొకచిన్న పాత్రముండెను. నేను నాసందేశమును వినిపించితిని. ఆతఁ డొక్కింత యాయాసపడినవానివలెఁ గనఁబడెను. కాని, దానివలన నాతఁ డచ్చోటికిఁ బోవుట మానెనని మాత్ర మెవ్వరును దలంపకుఁడు. ఆతఁడు సరళస్వభావుఁడును, దయాంతఃకరణుఁడునై యుండెను. అంతేకాక పరోపకారము సేయవలసిన సమయము తటస్థించినప్పు డాసమయము నాతఁడు వ్యర్థముగఁ బోనీయఁడు.

దుస్తులను ధరించి యాతఁడు తత్క్షణమె బయలుదేరెను ; ఆతఁడు నాతమ్మునిఁ జక్కఁగ నెఱిఁగియున్నందున, నావిషయమున నాతనికి సంశయము కలుగఁగూడదను తలంపున నేను వానివలెనె యిటునటు పరుగులిడుచు నడవసాగితిని. అదియునుగాక, డాక్టరుగారి కనతిదూరమున నుండవలెనని నేననుకొనియున్నందున, నాతమ్మునిపద్ధతి ననుసరించి యొకప్పుడు ముందఱికరిగి నిలుచుచుంటిని. ఆతఁడు దూరమగుడు కొంతదూరము పరుగిడి నిలుచుచుంటిని. నేననుకొనిన తెఱంగున డాక్టరు ప్రభాకరరావు కొంతసేపటికి నన్ను మఱచిపోయెను. నేను వెనుకనె వచ్చుచున్నానని యాతనికి జ్ఞప్తి లేకపోయెను ! అయ్యది గాఢాంధకార బంధురమగు రాత్రియైయుండుట, నారాయణరావుగారూ ! మీరు మఱచియుండఁజాలరు ! ఆ భయంకరాంధకారమున నాయంత్రాలయ ద్వారము వెనుక నిలిచిన నాకృశాకృతి డాక్టరునకుఁ గాని, ఆతని లోనికిఁ దోడ్కొనిపోవుటకై ద్వారముకడ కరుదెంచిన యాగృహస్థునకుఁగాని, కనఁబడలేదు. ఒకవేళఁ గనఁబడియున్నను ఆతనికి, నాయం దనుమాన ముదయించియుండఁజాలదు. ఏలయన— బహుమానాపేక్ష వలననె యీబాలకుఁ డిచట నిలిచియుండునని యాతఁ డనుకొనుట కవకాశముండెను. ఈబాలకుఁడు పురుషుఁడుకాక స్త్రీయైయుండునని

యాతఁడనుమానించుటకైన నెట్టియవకాశమును లేదు. ఈవిధముగ నేనటనిలిచియుండుటవలన నాకెట్టియుపాయమును గలుగలేదు. అచటి నుండి లోపల జరిగినవన్నియు నాకగపడుచుండెను. వారిమాటలును నాకు వినఁబడుచుండెను. ఒకదీర్ఘకాయుఁడు చేతనొకలాంతరును బట్టుకొని బయటికివచ్చెను. ఆలాంతరులోని దీపకాంతి తనపైఁబ్రసరింపకుండ డాక్టరు మోమునమాత్రమెపడున ట్లాతఁడాలాంతరునుబట్టుకొనియుండెను. ఆదీపకాంతిమూలమున నాప్రభాకరరావుమోముపైఁదోచిన తెచ్చపాటు నాకు దృగ్గోచరమయ్యెను. అతనికీలాంతరు ధరించినవానియెడ భీతికలుగ లేదయియు, ఆయంత్రాలయమున కరుదెంచినందులకు భీతికలుగుచుండవలయుననియు, నేననుకొంటిని. ఏలయన—ఈపాడుగోడలంగాంచినంతనె యాతనిరూపము నిస్తేజమయ్యెను. ఆలాంతరునుదెచ్చిన వ్యక్తింగని ప్రభాకరరావు "నీపేరేమి! వ్యాధిపీడితుఁడెందున్నాఁడు?" అని ప్రశ్నించెను. ఈప్రశ్నల కేవో యసందర్భప్రత్యుత్తరముల నొసఁగి యాగృహస్థుఁడు డాక్టరును లోనికిఁ బిలుచుకొనిపోయెను. ఆగృహస్థుని ప్రత్యుత్తరమునుబట్టి యిచట నేదియో మోసమున్నదని నాకుఁ దెలియవచ్చెను. కావున, వారి వెనువెంటనె మెల్లగ లోనికరుగుటకై నేనుత్సుకనైతిని. చాలసేపాలోచించి యెట్టకేలకు లోనఁ బ్రవేశింప నిశ్చయించితిని. ఇంతలో నెవ్వరో దీర్ఘనిశ్వాసము విడుచుట నావీనులకు వినవచ్చెను. నేనాద్వారము వైపునకుఁ జూచితిని. ఆకృష్ణవస్త్రధారి యచట నిలువఁబడియుండుట నాకు గోచరమయ్యెను. అతనిరూపము నాకుఁ జక్కఁగఁ గనఁబడకుండినను, అతని దీర్ఘోచ్ఛ్వాసధ్వనినిబట్టి యాతఁడెవ్వఁడైనదియు నేను గుర్తించితిని. ఇంతకుఁబూర్వ మాధ్వని ననేకపర్యాయములు నేను వినియుంటిని. అతఁడు నాకుఁ బరిచయుఁడే. ఈనవీనశోధనమువలన నాసంశయము మఱింత దృఢపడియెను. నేను డాగియున్న ప్రదేశము విడిచి ద్వారముకడ కరిగితిని. కాని, యచట నడుగులచప్పుడు నాకు వినవచ్చెను.

ఇప్పుడేమి చేయనగునాయని యాలోచించుచు నేనచ్చటనె ప్రాన్పడి నిలిచిపోయితిని. లోనికరుగుటకు నాకశక్యమయ్యెను. తుదకీ భవనము చుట్టును దిరిగి చూచినచో నేగవాక్షమార్గముననైన దీపకాంతికనఁబడు నేమో చూతమని తలంచితిని. ముండ్లపొదలు, మిట్టపల్లములు, మొదలగు వానిచే నిండియున్న యాప్రదేశమున రాత్రివేళఁ దిరుగుట యెంత యపాయకరమో, యెంతకష్టమో, మీరే యాలోచింపుఁడు! కాని, యాసమయమున నాకెట్టిభయమును దోఁచలేదు. తప్తహోహము పైఁబడుచుటఁ దటస్థించినను, నేనాసమయమున వెనుదీసియుండను. యంత్రాలయమునకు వెనుకభాగమునఁ జేరువఱకు నేనెన్నియో కష్టములకు లోనుగావలసి వచ్చెను. అంతమాత్రమున నేనించుకేనియు నిరాశ నందలేదు. కాని, యాప్రదేశమునకరిగి యటనెందును దీపకాంతి కనఁబడకపోయినందున నేను హతాశనైతిని. ఇంక నాకాయంత్రాలయ పశ్చిమదిశకరుగుటకన్న వేఱుపాయము లేదయ్యెను. కాని, యక్కడ నుండియైన నాయిష్టవస్తువు నాకగపడునని నేను విశ్వసింపలేకపోయితిని. తత్క్షణమె నడవసాగితిని. ఈమార్గము, పూర్వమార్గమునకన్నను గఠినమైనదియు, నపాయకరమైనదియునై యుండెను. ఇప్పుడు నేనొక నదిలోదిగి నడవవలసియుండెను. అందెక్కుడుగ నీరు లేదు; కాని, దాని యుభయతీరములు నత్యున్నతములై యున్నందున వాని నెక్కుటకును దిగుటకును జాలఁగష్టముగ నుండెను. ఈమాఱుమాత్రము నాకు నిరాశకలుగలేదు. అచట నాగవాక్షమార్గమున దీపకాంతి నాకగపడుచుండెను. తొటాలున నెదుటివృక్షముపై మిణుగురుపురుగులుండఁ బోలునని యనుకొంటిని. కాని, సమీపించిచూడ నది మిణుగురుపురుగులకాంతికాక, నిజముగనె యాలాంతరునందలి దీపకాంతియని నాకుఁ జక్కఁగఁ దెలిసెను. అంత నేనాత్రముతో నావృక్షము నెక్కి యాకులమఱుగున డాగి యాగవాక్షమార్గమున భూగర్భమున జరుగుచున్న యా దుష్కృత్యములన్నియుఁ జూచుచు నేనెంతసేపు కూర్చుండి

యుంటినో, నలినీబాయీ ! నీవే యూహించుకొనుము ! నలినీబాయీ! ఆ స్థలమునుండి నాకేమగపడియుండునని నీవు తలంచెదవు ? తొలుత నాకేమియు నగపడలేదు. ఏలయన—లోపలనున్న దీపము మందముగ వెలుఁగుచుండెను. అచటనున్న గవాక్షమును భూమికిఁ జాల నెత్తుగ నుండెను. అటులొకింతసేపేమియుఁ గనఁబడకుండి, చీఁకటికలవాటు పడిన నాకుఁ గొంచెము కొంచెముగ నన్నియుఁ గనఁబడసాగెను. లోపలి చావడిలో దీపముండెను ; మూవురు మనుష్యులుండిరి ; వారిలో నిరువురినిఁ దత్క్షణమే గుర్తించితిని. వారు డాక్టరు ప్రభాకరరావును, గోపాలరావును, మూఁడవవ్యక్తి చీఁకటిలో నిలిచియుండుటచే నాకుఁ గానరాలేదు. ఇప్పటికైన నాతఁడీతఁడని నిశ్చయముగఁ జెప్పఁజాలను, ప్రభాకరుని మోమున భయచిహ్నము లప్పుడు కాన్పించుచుండలేదు. ఆతఁడు గోపాలరావుతో నేమియో మాటాడుచుండెను. అనంతర మాతఁ డంధకారమున నిలిచియున్న యామూఁడవవ్యక్తి వంకకు దృష్టి నిగుడించెను. తనసంభాషణమువలన నావ్యక్తి కెట్టిపరిణామమును గలుగకుండుటచే నాతఁడు నిరాశతోఁ దల వ్రేలవేసెను.

అది రాత్రివేళ యగుటచేతను, ఇయ్యది భయానకప్రదేశ మగుటచేతను, నిందేదో మోసముండక మానదని నాకు దృఢనిశ్చయము కలుగుటలో నాశ్చర్యమేమున్నది ! డాక్టరు నిత్తెఱంగున మోసపుచ్చి గోపాలరావిచ్చటకుఁ బిలిపించుటకుఁ గారణమేమైయుండునాయని యాలోచించుచుంటిని. ఇంతలో గోపాలరావు ప్రభాకరునిచేతిని బట్టుకొని యచటనున్న యొకతొట్టికడ కీడ్చుకొని పోయెను. అప్పుడు భీతిచే నాప్రాణము లెగిరిపోయినట్లయ్యెను. ఇవన్నియుఁ జూచుచున్న నాక ప్పుడు కలగనుచున్నానాయని సంశయముగలిగి నాచేతిని గిల్లుకొని చూచితిని. వారిద్దఱునింకనాతొట్టిదగ్గరనే యుండిరి. ఇప్పుడుమాత్రము డాక్టరు ప్రభాకరరావుగారి మొగమున భయభావము సంపూర్ణముగ నగపడుచుండెను. భయంకర విషోరగముం గాంచినంతనె మనుష్యుఁడెట్లు

బెదరి వెనుకంజవేయునో యట్లే డాక్టరు రెండుచేతులతోఁ గన్నులు మూసికొని ప్రకంపితదేహముతో వెనుకకరిగెను. అదిచూచి గోపాల రావా మూఁడవవ్యక్తి కేదియో సంజ్ఞచేసెను. తత్క్షణమె యావ్యక్తి ముందఱి కరుదెంచెను. వెంటనె యాయిరువురు నాడాక్టరు నాతొట్టిలోఁ బడఁద్రోసిరి. ఆరాక్షస కృత్యముంగని భయముతో నేను బిగ్గరగా నొక్క కేక వేసితిని. అప్పుడు కృష్ణవస్త్రముం గప్పికొనియున్న యావ్యక్తియు గోపాలరావును మాత్రమె యాతొట్టికడ నిలిచియుం డిరి. ఆతొట్టిలోనుండి యొకయస్ఫుట ధ్వని నాకు వినవచ్చెను. అప్పుడు తొట్టిలోనికివంగి గోపాలరావు డాక్టరు నేమోయడిగెను. గోపాలరావు మోమునఁ దోఁచిన తిరస్కారయుతమును పైశాచికమునగు హాసము వలన నాతనికి డాక్టరునొద్దనుండి సరియైన ప్రత్యుత్తరము లభించియుండ లేదని నేనూహించితిని. కృష్ణవస్త్రాచ్ఛాదితమగు నావ్యక్తి లాంతరుదీసి కొని ముందునడవసాగెను. గోపాలరావును వెనువెంటనె పోవఁదొడం గెను. లాంతరునందలి దీపకాంతి మందమై క్రమక్రమముగ బొత్తిగఁ గనఁబడకపోయెను. ఔను! నలినీబాయీ! నేను వచించినదానిలో నావంతయైనఁ గల్పనము లేదు. ప్రత్యక్షముగ నాకన్నులతో నేఁ గాంచి నదే నీకుఁ దెలుపుచున్నాను. వారిద్దఱు నాచావడిపైడి వచ్చుచుండ డాక్టరుగారి హృదయభేదకస్వరము నాకు వినవచ్చెను. వారిద్దఱు వెనుకకు మరలిరి. మరల గోపాలరావువంగి డాక్టరునేమో యడిగెను ఆతఁడేమి యడిగెనో తెలిసికొనుటకు నాకు మార్గము లేదు. ఈసమయ మునమాత్ర మాతనికిఁ గావలసిన యుత్తరము లభించెను. ఆనందముతో నాతఁ డటనుండి వెడలిపోయెను. ఆ రెండవవ్యక్తి మాత్ర మచ్చటనె యుండెను. పోవునపుడు గోపాలరావు లాంతరు దీసికొనిపోయియున్నం దున నాస్థలము కటికిచీఁకటిచే నావరింపఁబడెను. ఆ యంధకారమున భయపడి డాక్టరింకొకమాఱు కేకవైచునని నేననుకొనుచుంటిని. కాని, యట్టిది సంభవింపదయ్యెను; కొంతసేపు గడచెను; మరల దీపప్రకా

శముకననయ్యెను. కృష్ణవస్త్రాచ్ఛాదితమగు నావ్యక్తి యిప్పటికి నచ్చటనేయుండెను. నళినీ! ఈ క్రూరకృత్యముతో నారాయణరావున కెట్టి సంబంధమును లేదని నీకానందమగుచుండఁబోలును! కాని, నీ యానందమున కిప్పుడు భంగము కలిగింపవచ్చినందులకు నాకు విచారముగా నున్నది. ఈమాఱు చేతలాంతరుఁగొని లోనికరుదెంచిన యా వ్యక్తి గోపాలరావుకాఁడు—నారాయణరావే!

నారాయణరావు నచ్చోటఁ గాంచినప్పుడు నాకేమి తోఁచెనో, అప్పుడు నాస్థితి యెట్టులుండెనో, కొంచెముగఁ దెలిపి నాయీవృత్తాంతము నింతటితో నాపెదను. ఇఁక నీవృత్తాంతమును బెంచుట నాకిష్టము లేదు. నారాయణరావు వర్తనము గోపాలరావు వర్తనమునకు భిన్నముగానుండెనని యిచటఁ జెప్పకతప్పదు. గోపాలరావునకీ రాక్షసకృత్యము నెడలను, అభయప్రద ప్రదేశము నెడలను, లవమాత్రమును భయముండ లేదు. అతఁడు స్వగృహమునందువలెనె యచట నిశ్చింతతో సకల కార్యములు నెఱవేర్చుచుండెను. నారాయణరావు స్థితిభిన్నముగ నుండెను. అచటికి వచ్చినతోడనె యాతఁడు బెదరుచూపులతో నిటునటు నలువంకలఁ బరికించెను. వనములలో స్వేచ్ఛగ విహరించునొకహరిణముం దెచ్చి యొకబోనులో నుంచిన నాహరిణమెట్టులుండునో యట్టులే నారాయణరావుగూడ నుండెను. భీతచేతస్కుఁడై యాతఁడిటునటుఁ జూచుచుండెను. డాక్టరు ప్రభాకరుఁ డిందో యెందో నిలిచియుండవలెనని యాతఁడనుకొని యుండెనేమో! కృష్ణవస్త్రాచ్ఛాదితవ్యక్తి యా తొట్టివైపునకు వ్రేలుఁజూపినంతనె యతనికిఁ గలిగిన భయాశ్చర్యములకు మేర లేదు! కాని, యాతని యాశ్చర్యము చాలసేపుండ లేదు. అది యాతని నిరాశలో నంతరించిపోయినది! అతఁడాతొట్టి చెంతకరుగఁ బ్రయత్నించెను; కాని, పాదములటు కదల లేదు; అతఁ డచ్చటనె నిలిచిపోయెను. కృష్ణవస్త్రాచ్ఛాదితమైన యావ్యక్తి ముందటికి వచ్చి యాతని చెవిలో నేమియో చెప్పసరి కాతఁ డొక్కసారి నిట్టూర్పు విడిచి యచ్చోటువాసి పోయెను.”

నారా : కుముదా ! నీకుఁ దెలిసినదింతియేనా ?

కుముద : (గర్వముతో) నేఁజెప్పవలసినదింతియే. అట్టిస్థితిలో మనుష్యునకు నిముసమొకయుగముగఁ దోఁచునుగదా ! అచట నేనొక గంటకన్న నెక్కువసేపు కూర్చుండియుంటిని. కావున, నాకు విసుఁగు కలుగుటలో నాశ్చర్యమేమున్నది ? ఇంకను జాలసేపచటనే కూర్చుండి యున్నచో నపాయము వాటిల్లునని నాకుఁ దోఁచి తత్క్షణమె నేనా వృక్షమునుండిదిగి యింటిమార్గముఁ బట్టితిని.

నారా : నీవిఁక నొకగంటసేపచ్చటనె యుండవలసి యుండెను. ఇంతలో నింటికరుగుట కేమివచ్చినదో నాకుఁ దెలియలేదు.

కుముద : ఒకగంటయా ! నిజమా ?

ఇదిసాధారణస్వరమే ; కాని, యామెయామాట నుచ్చరించినప్పు డొనర్చిన యంగవిక్షేపముంగని మేమిద్దఱమాశ్చర్య నిమగ్నులమైతిమి !

నారా : (కుముద పైకుఱుకఁబోయి కోపముతో) దుష్టురాలా ! లోకులకీ విషయములుమాత్రమే చెప్పి యనంతర వృత్తాంతముఁ జెప్పక మౌనముఁ దాల్చుటయె నీకిష్టమా ? అనంతరమేమి జరిగెనో చెప్పకయె—

కుముద : (తోకత్రొక్కిన పాముచందంబున బుసఁగొట్టుచు) కాని, యనంతరమేమి జరిగెనో నేను చూడలేదు.

నారా : (భయముతో) హా ! దైవమా ! దైవమా ! కుముదా ! నీవు చూడకున్నను నీకుఁ దెలిసిన—

కుముద : క్షమింపుఁడు ! స్వామీ ! నాకుఁ దెలిసినదేమో నేను చెప్పితిని.

అనివచించి కుముద తిరస్కారపూరితమగు తీవ్రదృష్టినాతనిం జూచుచు ద్వారముకడ కరిగెను. నారాయణరావు పాషాణవిగ్రహము వలె ననిమిషలోచనములతో నామెను గాంచుచు నిలిచియుండెను.

ఆమె నాపుటకై యాతఁడించుకయుఁ బ్రయత్నింపఁడయ్యెను. ద్వారము దాటుచుఁ గుముద యొక్కమాఱు వెనుకకుఁ దిరిగి చూచి "మీకుఁ దెలియకుండ మీరెట్లు నాచేఁ జిక్కియున్నారో మీకిప్పటికైనఁ దెలిసినదా! ఈవార్తలే—నాకుఁ దెలిసియున్న యీసంగతులే—నేను న్యాయవిచారణ సభలోఁ జెప్పితినా, మీవంశమున కెట్టి కళంకము కలుగునో యోచింపుఁడు!—అంతేకాదు—మీకుఁ బ్రాణాపాయము సంభవింపఁగలదు!" అనియెను.

నారా: కాని, నీవచట నావిషయమై జరగిన సంగతులు చెప్పవలసి—

కుముద: ఆపై సంగతులు నాకుఁ దెలియవనుచున్నానుగదా! అదియునుగాక, నేరము నణపఁజాలు విషయము లేని యున్నను నేనచటఁ జెప్పఁబోను!

అని యామె బయటికరుగ నుద్యుక్తయయ్యెను. కాని, ద్వారమునకు రెండువైపులఁ దనరెండుచేతులనుంచి నిలిచియున్న గోపాలరావు మాకును ఆమెకును గనఁబడెను. గోపాలరావు కుత్సితహృదయము నేనెఱింగి యుంటిని. డాక్టరు మృత్యువుతో నాతనికి దృఢసంబంధముండెనని నేనెఱింగియుంటిని. కాని, యా సమయమున నాతని మొగమున విలసిల్లిన మందస్మితమును గాంచినంతనె పూర్వమాతనిపై నున్నంత యసహ్యభావము నాకపుడు కలుగలేదు.

ఇప్పుడు తనకుఁ బ్రాణోపద్రవము కలుగకమానదని కుముదకు భయము తోఁచియుండఁబోలును! ఆమె ద్వారముకడనుండి యొక్కయడుగు వెనుకకువచ్చి, యాతఁడులోనికి వచ్చునేమోయని నిరీక్షించెను.

గోపాలరావా స్థలమునుండి కదలఁడయ్యెను. కుముద తనరూపమును నిర్వికారస్థితినుంచుటకై ప్రయత్నించుచుండెను; కాని, యామె హృదయమునఁ బ్రజ్వలించుచున్న క్రోధాగ్నిజ్వాల లామె మోమునఁ బ్రతిబింబితములు కాకుండవయ్యెను.

గోపాల : కుముదా ! నిన్ను బయటికిఁ బోనీయను. నీవిప్పుడు చెప్పిన సంగతులన్నియు నేదినమున జరిగినవో మాకుఁ దెలుపువఱకు నిన్నిచ్చటినుండి యొక్కయడుగైనఁ గదపనీయను.

కుముద : దినమా ! ఏమమ్మా ! నలినీబాయీ ! డాక్టరు ప్రభాకరుని ప్రేత మీతొట్టిలో నేదినమున దొరకినది ?

గోపాల : (కుముదచేయిఁ బట్టుకొని) నలినీబాయి యెందులకుఁ జెప్పవలయును ? నేను నిన్నడిగితిని ; ప్రత్యుత్తరము నీవే చెప్పవలయును. ఇట్టి కనుమూఁతలు నాయొద్దసాగవు. తెలిసెనా ? ఇఁకవచింపుము. శీఘ్రముగ వచింపుము ! డాక్టరు ప్రభాకరుని మేమీతొట్టిలోఁ ద్రోయుట నీవెప్పుడు చూచితివి ? —నా మొగమువంక నేలచూచెదవు ? నాకు ప్రత్యుత్తరమిచ్చుట కాలసించితివా—

అని యాతఁడామె చేతిని బట్టుకొని యిటునటుగుంజెను. అప్పటికి నామె మౌనముతోనె యుండెను. ఇఁకనాతఁడామెను గొట్టునేమో యను భీతిచే నేనొక్కకేక వైచితిని !

అప్పుడాతనికిఁ గలిగిన సంతాపమునకును, ద్వేషమునకును కుముద కూడ భీతిల్లెను. ఆమె వలలోఁజిక్కిన లేడిపిల్లవలె నాతనిచేతినుండి తన్ను విడిపించుకొనుట కనేకప్రయత్నములు చేసెను. కాని, యవి యన్నియు నిష్ఫలములయ్యెను. తుదకామె యిట్లనియెను.

"ఆగష్టు పదునేడవ తేది రాత్రి నేనాక్రూరకృత్యమును జూచితిని. తెలిసినదా ? ఇప్పటికైన నీకు సమాధానమైనదా ?"

గోపాలరావా పిమ్మట నేమియుఁ బలుకలేదు. ఆతఁడామె హస్తమును వీడి నావంకఁజూచి "కుముద యిప్పుడొసఁగిన ప్రత్యుత్తరము వలన నామె సంభాషణములకు వేఱొకరూపము కలుగుచున్నది" అనియెను.

నిజమే ! గోపాలరావనినది నిజమే. ఏలన—డాక్టరు ప్రభాకరరావుగారి ప్రేతము మాకాతొట్టిలో నాలుగు దినములకుముందు—అనఁగా—సెప్టెంబరిరువదియెనిమిదవ తేదీని దొరకియుండెను.

ఈ నూతన శోధనమువలన నేను జేచ్చపడితిని ; పిచ్చియెత్తిన చందమున నేనటునిటుచూచుచు నెంతసేపచటనుంటినో నాకిప్పుడు జ్ఞప్తి లేదు. ఏమిపలుకవచ్చునో నాకును దోఁచకపోయెను. ఈ స్థితిలోఁ గొంతసేపు గడచెను ఆ పిమ్మట—

"ఎట్లయిననేమి ! ఆరాత్రి డాక్టరు సుఖస్వరూపముతోడనె బయటఁ బడెనుగదా ! ఎవ్వరాతని లోనికిఁ ద్రోసిరో వారే యాతనిని బయటికిఁ దీసియుందురనుకొనియెదను !—కాని" ఆపిమ్మట నానోట మాటరాలేదు. నామనసునందున్న సంశయమును విప్పి చెప్పుటకు నాకు ధైర్యము కలుగదయ్యెను.

అప్పటి నాస్థితిగతుల నెఱింగి నారాయణరావిట్లనియెను. "నాలుగు దినములకుఁ బూర్వ మెవ్వరో డాక్టరును మరల నాతోట్టిలోఁ ద్రోసి యుందురని నీమన సనుమానించుచున్నది కాదా ?"

నేను : ఔను : ఆ ప్రశ్నయే నేనిప్పుడు మిమ్మడుగనుంటిని.

నారా : (మనఃపూర్వకముగ) నలినీ ! కుముదనోట మావిష యములన్నియు వినిననీకు మాపలుకులయెడ విశ్వాసము కలుగునని మేమనుకొనుట సాహసమేయగును. కాని, డాక్టరు ప్రభాకరుఁ డాతొట్టి లో మరల నెట్లుపడెనో మాకుఁ దెలియదని శపథపూర్వకముగ వచించు టకు నీయంగీకారమును వేఁడుచున్నాఁడను. మాకాతని మరణముతో నెట్టి సంబంధమునులేదు. ఆతఁడచట మరణించెననివిని నీవలెనే మేము నాశ్చర్యనిమగ్నులమైతిమి.

"మీ పలుకులు యథార్థములై యుండునా ?" అని నేను నా సంశయమును వ్యక్తపఱిచితిని. కాని, నారాయణరావుగారి నిర్దోషి త్వమును లోకమునకు వెల్లడిపఱుపవలెనని నేనెంతయో యాత్రపడు చుంటిని.

నాయీ మాటల కాతఁడు సహజముగనె విపరీతార్థము చేసికొని యెను. ఆతనికిఁ గష్టము తోఁచెను ! గోపాలరావుమాత్రము ద్వేష ముతో నావంకఁజూచుచుండెను. కుముద తిరస్కారస్వరమున నవ్వుచు—

"మేలు మేలు! చాలమంచిదే! నిశ్చయమే! మీమాటలనప్పుడే పంచాయితీదారులు నమ్మెదరు కాఁబోలును! అవును; మీవంటి గొప్పవార లసత్యభాషణము లాడుచున్నారని యనుట కెవ్వరు సాహసింతురు? అని మరల గట్టిగా నవ్వసాగెను.

"అవశ్యముగ పంచాయితీదారులకు నామాటలయెడల విశ్వాస మెందులకు జనింపరాదు? డాక్టరు ప్రభాకరుని మరల నిచటికి మోసము చేసి తీసికొనివచ్చుటకు మఱెవ్వరికైన సాధ్యమగునా? ఏదో గూఢ కారణమున నాతఁడే స్వయముగ నిచటికివచ్చి యిందుఁబడి మరణించి యుండునని తోఁచు—కాదు—నిశ్చయముగనేఁ జెప్పఁగలను."

కుముద: (పెదవులు గఱచుకొనుచు) అట్లయిన నాతఁ డాత్మహత్య గావించుకొనెననియే మీరనుచున్నారా?

తిరస్కారపూరితమును, వ్యంజకమునగు నీసంభాషణమువలనఁ దనకేమియుఁ గష్టము తోఁచలేదని తెలుపుటకై నిశ్చయాత్మకస్వరమున నారాయణరా విట్లనియెను. "ఔను. ఆతఁ డాత్మహత్యయే గావించుకొని యుండవలయును."

కుముద: (బిగ్గరగానవ్వి) నిశ్చయముగ మీవాగ్ధోరణి శ్లాఘనీయమైనదియే! మీయీమాటల కాతని నిర్మలచారిత్రము తోడుపడుచుండలేదనుఁడీ! మఱి, యిట్లు చెప్పుటకు మీకధికారమేమున్నది? ఆధారరహితమైన యేవిషయములను — కన్నారఁజూచిన విషయములనైనను — న్యాయాధీశులును, పంచాయితీదారులును విశ్వసింపరని నేవినియున్నాను గదా!

గోపా: మాయొద్దఁ గావలసినన్ని యాధారములున్నవి.

కుముద: (బెదరి) ఏమి! ఆధారములా?

గోపాల: డాక్టరు ప్రభాకరుఁ డీతొట్టిలోఁబడి మరణించిననాఁడును, అంతకుముందు రెండుమూఁడు దినములును మేమీయూర నుండలేదని రుజువుచేయఁగలము.

"అలాగా!" అని కుముద లేనినగవు తెచ్చుకొని నవ్వెను. కాని, గోపాలరావు చెప్పిన మాటవలన నామె కెట్టిమార్పుకలిగినదో నేనెఱుంగనైతిని.

గోపా: మాపై హత్యారోపణ మొనరించినందువలన నీ కెట్టి లాభమును కలుగఁజాలదు. వ్యర్థముగా నీవీవ్యవహారమునఁ జొరకుండుటయె యుత్తమము. ఇదియె నీకు నేను మైత్రితో నొసఁగు నుపదేశము. ఆపైని నీయిష్టము.

అని యాతఁ డింకొకమార్గమున వెడలిపోయెను.

గోపాలరావీ పై వాక్యములు తిరస్కారస్వరముతో నుచ్చరించి యుండెను. కాని, యీవాక్యములవలనఁ గుముద కెట్టిపరిణామమును గలుగలేదు. నిశ్చలదృష్టితో నామె కొంతతడవాతనిదెసఁ గాంచి "ఏమగునో చూచెదఁగాక!" అని యనుకొనియెను.

అనంతరము కుముద నాకడకరుదెంచి మెల్లఁగ "ఇప్పుడైన నీవు నారాయణరావుగారి సాంగత్యమును మానుదువా?" అని యడిగి తత్క్షణమె యచ్చోటువాసిపోయెను.

నేను నచట నిలువలేదు. అప్పుడు నాకును నారాయణరావుగారికిని నేమైనసంభాషణ జరిగినదేమో నాకుజ్ఞప్తి లేదు. ఆనాఁడు వెలువడిన భయంకరప్రకరణమువలన నాచిత్తవృత్తి స్తంభితమైపోయెను. శ్రమచే నానేత్రములు విగళితములయ్యెను. ఇంటికరిగినవెంటనె నాకుఁ జలిజ్వరము వచ్చెను. ఆనాఁడు నేనన్నముముట్టలేదు.

## పదునాల్గవ ప్రకరణము

నాకువచ్చిన జ్వరముభయంకరమైనదేయైనను వారము దినములలో లేచి గదిలో నిటునటుతిరుగుటకు నాకుఁ గొంచెము శక్తి కలిగెను. పదునేను దినములకు — నేనుజబ్బులో నున్నప్పుడు నాపేరవచ్చిన

రెండు త్తరములను జదువుకొనుటకు డాక్టరునాకు సెలవొసంగెను. అప్పటి నాక్షీణస్థితిలో నాయుత్తరములయందలి సంగతులు శక్తివిహీనము గు నామనోవృత్తి కధికాయాసము కలిగించెను. ఆయుత్తరములలో నొకటి కుముద వ్రాసినది; రెండవది నారాయణరావుగారు వ్రాసినది; ముందుగఁ గుముద యుత్తరమును జదివితిని. దానియందిట్లుండెను.

"నారాయణరావుపై నాకుఁగల ద్వేషము నెవ్విధముననైనఁ దీర్చుకొనవలయునని నాకుఁ గోరికయుండెను. కొంతవఱకు నాయీప్సితము నీడేర్చుకొంటినిగదా! అది చాలుననుకొనియెద. ఇఁకముందు నీవు నారాయణరావుపై విశ్వాసముంచవు. అతనిఁ బ్రేమించు దుర్బుద్ధి నీకిఁకఁ బుట్టఁబోదు. ప్రత్యక్షముగ నారాయణరావునకు డాక్టరు ప్రభాకరరావు మరణముతో సంబంధముండుఁగాక! ఉండకుండుఁగాక; ఆనాఁటిరాత్రి జరిగిన యానీచకృత్యమున కాతఁడు సమ్మతించి — సమ్మతి యొసఁగియేయుండుననుట నిర్వివాదాంశము!

ఒకానొక పాపండునివలె, నొకగౌరవ గృహస్థుని రాత్రివేళ నిర్జనప్రదేశమునకుఁ బిలిపించి, యాతని బాధపెట్టు నీచుని, నిట్టి సద్గుణసంపన్నయు, సుప్రవృత్తయునగు స్త్రీ వివాహము చేసికొనుట కెన్నఁటికి నంగీకరింపదని నేను చక్కఁగ నెఱుంగుదును. సద్గుణముతో దుర్గుణమునకును, న్యాయముతో నన్యాయమునకును, సత్యముతో నసత్యమునకును, సంబంధము కుదురఁజాలదు. నలినీబాయి యెవ్వరినైన వరించి చేపట్టుఁగాక! నారాయణరావును మాత్రము వివాహమాడఁజాలదు.

ఈవిషయమున నాకు సంపూర్ణవిశ్వాసము కలుగుటచే నా ప్రతీకారాపేక్ష నింతటితోఁ ద్యజించెదను. కోర్టున కరుగుటయు, నచట నీవృత్తాంతమంతయు వెలిపుచ్చుటయు, అతని నాశనము చేయుటయు నాయిష్టముకాదు — ఇందువలనఁ బ్రభాకరరావాత్మహత్య చేసికొనెనని లోకులాడు పలుకులయెడ నాకు విశ్వాసముకలదని నీవనుకొన

వలదు. గోపాలరావనినట్లు డాక్టరు మృత్యుకాలమునఁ దానీయూరలే కున్నను, ఆకార్య మితరులచే నాతఁడు చేయించియుండ రాదా? ఆతఁడు ప్రత్యక్షముగా హంతకుఁడుగాకున్నను, హత్యనుగావించిన వాఁడగును. ఒకప్పుడు నేనాతనిపై నిర్వ్యాజప్రేమను వహించి యుండినందున నాతనికెట్టి శరీరశిక్షయైనఁ గలుగుట కేనంగీకరింపను. అదినాయిచ్ఛ కాదు. నే నేమానసికవ్యథచే నహోరాత్రములు తల్లడిల్లుచున్నదాననో, అట్టి మానసికవ్యథయే యాతనికిఁగూడఁ గలుగునెడల నాహృదయము శాంతింపఁగలదు.

సాధారణముగా సర్వమానవ ప్రాణులలో విశేషించిన స్త్రీలు— దుర్బలహృదయులు; కావున, మరల నింకొకమాఱు నొక్కి చెప్పుచున్న దానను—నారాయణరావు మృదుమధుర వచనములను వీనులారవిని, మనసిచ్చి యాతనిఁ బెండ్లాడసిద్ధపడితివా — అప్పుడుమాత్రము నీకా యంత్రాలయమునఁ దెలిపిన సమస్తవృత్తాంతమును లోకమందంతటను జాటించుటకు నేనావంతయు వెనుదీయుఁదానఁగాను.

ఇట్లు నీహితమునభిలషించు

కుముద."

వెంటనె నారాయణరావు వ్రాసిన యుత్తరమును జదువఁ దొడంగితిని.

"నలినీ!

నీకు నేనీ యుత్తరమువ్రాయ సాహసించినందులకు నన్ను క్షమింతువని నమ్ముచున్నాను. నీకునునాకును బరిచయముకలిగి యెని మిది దినములైనఁ గాకపోయినను, నీవు నన్నుఁ దిరస్కరింతువను తలంపున నాహృదయమింత దుఃఖమునెందుల కనుభవించుచున్నదో నాకుఁ దెలియకున్నది.

నాయెడల నీకుఁ దొలుతఁబుట్టిన యాదరమిప్పుడు నశించియుండ వలయును — నేనేమిచేసినయెడల, ఆయాదరమును మరలసంపాదింపఁ

గలుగుదును? లేదు — నాకాయదృష్టము లేదు. మరల సంపాదించు కొనఁజాలను. ఆరహస్యము నీకానాఁడు తెలియవచ్చినందున నన్నుఁ దలఁచుటయె నీకసహ్యముగ నుండఁగలదు. మరణకాలమున మాజనని యేరహస్యమును వెలిపుచ్చవలదని మాచేఁ బ్రమాణమును జేయించు కొన్నదో యారహస్యమిదియే. ఆగస్టు పదునేడవ తేదీని మావలనఁ జేయఁబడిన యాభయంకరకృత్యము లోకమెఱింగినచో, సెప్టెంబరిరువది నాల్గవ తేదినాఁటి యీ కృత్యమునకు మేమే కారకులమై యుండవలయు నని లోకులనుమానింతురేమో యని దూరదర్శినియగు మాజననికి భీతికలిగినందున, నా విషయము వెలిపుచ్చకుండుటకై మాచేఁ బ్రమాణము చేయించుకొన్నది. మేమాసంగతుల నెవ్వరికిని దెలుపకున్నచో నవి వెలికి రాఁజాలవని యామెనమ్మకము. ఆరాత్రి కుముద యచటికి వచ్చి యవన్నియుఁ జూచియుండునని మాయమ్మకలనైన నెఱుంగదు. సర్వసాక్షియగు పరమేశ్వరుని రాజ్యమునఁ బాపము దీర్ఘకాలము దాగి యుండఁజాలదు. ఆ యీశ్వరేచ్ఛవలననె మావంశమునకు హత్యారోపణకళంకము కలిగినది.

ఈ విషయము నాహృదయము నెంతగ బాధించుచున్నదో—యెంత వేధించుచున్నదో—నీకుఁ దెలియఁజాలదు. కాని, దీనికై నేనీశ్వరుని దూషింపను. మమ్ముఁబోలిన విశ్వాసఘాతుకుల కెంతకన్నను కఠినతర శిక్ష కలుగవలసినదే—కుముద తలఁచినచో నటులొనర్పక మానదు. నా దుష్కృత్యమునకుఁ దగినఫల మనుభవింప నేను సిద్ధముగ నున్నాఁడను. అయినను నాదొక్కవిన్నపము కలదు. నీకుఁ దెలిసిన విషయ మెవ్వరికినిఁ దెలుపకుము— మఱియు, నవియసత్యములని నమ్ముము— అని నేను నీతోఁ జెప్పను. మేమాకృత్యము నొనర్చితిమి — లేదని చెప్పుకొని పాతకమున కేనొడిఁగట్టుకొనను. కాని, నా విన్నపమింతియే — నాపూర్వేతిహాసమెంత నీచముగా నున్నను, ఇప్పుడు తీవ్ర పశ్చాత్తాపాగ్ని జ్వాలలవలన, నాసదసద్వివేకబుద్ధిపై వైచినపుటము

కాలిభస్మమైపోయినది. నాజీవితశేషమిఁక సన్మార్గమునఁ గడపవలయు నని నేను నిశ్చయించుకొంటిని. ఇది మదీఁదలఁచియైన నన్నుఁ దిరస్కరింపఁదగదు. ప్రస్తుతమైన నన్నుఁ దిరస్కారభావముతోఁ జూడకుము. నీదర్శన మొదవిన నాఁటఁగోలె సత్యము, స్వార్థత్యాగము, మిత్రప్రేమ, సదాచారము మొదలగు సద్గుణముల విలువయిట్టిదని నాకుఁ దెలియ వచ్చుచున్నది. నీనేత్రములనుండి వెలువడుచున్న పవిత్రకిరణముల యుజ్వల ప్రకాశమువలన, నాయంతఃకరణమందెల్లెడ నల్లుకొనియున్న దుర్గుణాంధకారమునఁ బీతను వహించియున్న స్వార్థపరాయణతా మంగళస్వరూప మిప్పుడు పూర్ణముగ నాకుఁ గానవచ్చినది. ఇంతయేల ! నిన్నుఁ గాంచిన నాఁటనుండియు నాశరీరమున నవీనజీవన సంచారమగు చున్నది. ఈ యుత్తరమునకుఁ బ్రత్యుత్తరము నేనపేక్షింపలేదు. రేపు నేను మీయింటిముంగిలినుండి పోవుదును. అపుడు నీవొక్కసారి నీమేడ పైనుండి గవాక్షమార్గమున నీదర్శన మొసంగుదువా ! అపుడు నిశ్చయ ముగ నీవు నాపైక్షమావృత్తి ధరించియుందువని తలఁచి నాజీవిత శేషమును సమాధానచిత్తముతోఁ గడపుకొందును. మరల నొక్క మాఱు నుడువుచున్నాఁడను ; డాక్టరు ప్రభాకరరావా తొట్టిలో మరల నెట్లుపడెనో మాకుఁ దెలియదు.

ఇఁకనొక్కమాట. నీవు నావిన్నపమును మన్నించి సదయాంతః కరణముతో నాకు నీదర్శనమిచ్చినచో నేను నీకృపను వేఱువిధముగ భావించి నీసత్కీర్తికిఁ గొఱంతఁదెచ్చు నేకార్యమునైనఁ జేయుదు నేమో యని భీతివహింపఁబనిలేదు. అంతియేకాక, దానివలన, డాక్టరు ప్రభాకరుని మరణవిషయమునఁ జేయునీరహస్య శోధనమున కెట్టియూ టంకమును గలుగనేరదు. నీకుఁ దెలిసిన విషయములఁ బ్రకటింపవలదని నేనెన్నఁడును వేడను.

ఇట్లు నీకృపాపాత్రుఁడు,

నారాయణరావు. ”

ఈ రెండు త్తరములను జదివినపిమ్మట నామనసునఁబుట్టిన వికారములను వర్ణించుచుఁ గూర్చున్నచో మీకు విసుఁగుఁజనించునేమో! కాని, అయుత్తరములను జదివినపిమ్మట నామనసున నెట్టివిచారములు పుట్టెనో వానినిమాత్ర మిచట సూచింపవలసియున్నది. నేను జబ్బులో నుండియున్నందున నారాయణరావు వ్రాసిన యుత్తరము సకాలమునఁ జదువుటకు వలనుపడినది కాదు. కావున, నాతఁడాయుత్తరమునఁ జేసిన విన్నపము వ్యర్థమయ్యెను. ఇదిమాత్రము నాహృదయమును వేధింప సాగెను. అదియునుఁగాక కుముదకుఁ దెలియకుండ నాతనికి నిజవృత్తాంత మెట్లు తెలుపవచ్చునో యదియు నాకుఁ దెలియలేదు. చీఁకటిలో నున్న తేలు, ఎవ్వరినెప్పు డెచటఁగుట్టునో తెలియదు—అట్లేనేను నారాయణ రావును దర్శింపఁ బ్రయత్నించినచోఁ గుముద యేమిచేయునో యెవ్వరు చెప్పఁగలరు? ఆమె యెల్లవేళల నానడవడిపైఁ గన్నుంచియే యుండు ననుభీతిచే నేను నాగదిలోసైత మాతనిపేరు బిగ్గరగా నుచ్చరించుట మానితిని. ఏలయన — సర్వవ్యాపకుఁడగు వాయుదేవుఁడా శబ్దమును దన రెక్కలపై నిడికొనిపోయి యామెవీనులఁ బడవేయునేమో! కుముద వంటి భయంకరస్త్రీతో వైరమనుపేరు తలంచినంత మాత్రముననె నాయొడలు పులకరించెను. కాని, యేమైనను, నాయిష్టమునకు వ్యతిరేకముగా వర్తించుట నాకిష్టము తటస్థించెను. నారాయణరావు వ్రాసిన సంగతు లసత్యములుకావని నామనోదేవత నాకుఁ జెప్పుచుండెను. ఈ కారణమువలన నారాయణరావువంటి యుదారహృదయుని, కుముదకు భయపడి నిష్కారణముగా దుఃఖపెట్టుట నాకు మేలని తోఁచలేదు. కుముద పలుకులయెడ విశ్వాసముంచి నారాయణరావును దిరస్కరించుట యెన్నఁటికిని న్యాయబద్ధమును, హితపరిణామమును గాదని నేను చక్కఁగ నెఱింగియుంటిని.

కుముద వ్రాసిన యుత్తరమునందలి భయోద్రేకమూలమగు విషయము నాహృదయముపై బాగుగనే పనిచేసెను. ఆమె బెదరింపుల

వలన నిద్రించుచున్న నాయభిమానము జాగరితము కాఁజొచ్చెను. ఆమె యిష్టమును దీర్చుటకై నేను నారాయణరావునకు దూరముగ నుండుట యయోగ్యమనియు నశక్యమనియు నామనసు నాకుఁ జెప్పసాగెను. ఇప్పుడె కొంచెము ధైర్యము తెచ్చుకొని, యామెకు నామనసుపై నున్న యధికారమును దృఢీకరింపఁ బ్రయత్నించినచో నది సిద్ధించునని నాకుఁ దోఁచెను.

నా హృదయమున మరల జాగరితమైన ప్రేమ — నారాయణ రావుపైఁ బ్రేమ, నాయీవిచారమున కుత్తేజనమిచ్చెను. కాని, నారా యణరావుతో నెట్టిసంబంధమైనఁ గల్పించుకొనుటకుఁ బూర్వమె యాతఁడునిర్దోషియని రూఢిపఱుచుటయె నాయిష్టముగా నుండెను. ఆతని యందలి నాసంశయములన్నియుఁ బూర్ణముగ నశించినఁగాని యాతని సాంగత్యమున నాకు సౌఖ్యప్రాప్తిలేదని నేను నిశ్చయించుకొంటిని.

కాని, నావంటియసహాయస్త్రీ కాతని నిరపరాధిత్వము నెట్టె అంగున రూఢిపఱుపవచ్చునో నామనసున నాలోచింపఁదొడఁగితిని. ఒక్కమార్గమును దోఁపదయ్యెను. ఆతని యుత్తరమునకుఁ బ్రత్యుత్త రము వ్రాయుట కాలస్యమైనందులకుఁ గారణమాతని కేవిధముగఁ దెలుపవచ్చునాయని యాలోచించుటలోనె యొకగంటసేపుఁ గడపితిని. తుదకాతని కుత్తరము వ్రాయవలెననియు, నిట్లు వ్రాసితినని కుముద కును దెలుపవలయుననియు, నిష్కర్ష చేసికొంటిని. నేనిట్లు స్థిరపఱుచు కొని రెండుత్తరములను వ్రాసితిని.

"కుమారీ! కుముదా!

కడచిన పదునేను దినముల నుండియు నేనస్వస్థనై మంచముపట్టి యున్నందున నీయుత్తరము నేఁడేచూచితిని. హంతకుని నేనెన్నఁడుఁ బ్రేమించుదానఁగానని రూఢిగనీమనసున నెంచుము. నారాయణరావుపై నాకెంతపఱకు లేశమైన సంశయముండునో యంతవఱకు నాతనితో సంబంధము కుదురుటయశక్యమని నమ్ముము. కాని, నారాయణ

రావుపైఁగల యారోపణ మనృతమని నామనసున కెప్పుడు రూఢి పడునో, యప్పుడుమాత్రము నేనాతని ప్రేమను స్వీకరించుట కించుకయైన వెనుదీయుదానఁగాను. గాన, నీకుఁగాని, మఱెవ్వరికైనఁగాని, కోపమువచ్చినను నేను భయపడను—లక్ష్యపెట్టను.

నేఁటిటపాలో నేను నారాయణరావుగారి కొకయుత్తరము నంపితిని. దాని ప్రతియొకటి దీనితో నీయొద్దకంపియున్నాను.

నీకు విధేయురాలు,

నలిని. ”

“ నారాయణరావుగారి సన్నిధికి :—

కడచిన రెండువారములనుండియు నేను జ్వరముతో లేవలేకుంటిని. అందువలన మీయుత్తరమునకుఁ బ్రత్యుత్తరముఁ బంపవిలంబమయ్యెను.

డాక్టరు ప్రభాకరుని మృత్యువుతో నాకెట్టిసంబంధము లేదని చెప్పు మీవాక్కులయెడ నాకు విశ్వాసముకలదు. మీనిరపరాధిత్వము శీఘ్రముగనె సప్రమాణముగ స్థిరపడునని నాకాశకలదు.

కాని, యీవేళవచ్చువఱకు మన మొండొరుల మెట్టిసంబంధము నుంచుకొనకుండ మనజీవయాత్రలను గడపుదము. న్యాయమును, సరళమునైన మార్గమున వర్తించునెడ మనమార్గమునందలి కష్టపరంపరలు మనల బాధింపఁజాలవు.

నలిని, ”

“ మఱియొక మనవి—మీరేదైన నుత్తరము నాకంపఁదలంచినచోఁ గుముదమూలమున పంపవలయును. పూర్ణముగ నాలోచించియె నేనీసూచన నొసంగుచున్నదానను. ”

# పదునేనవ ప్రకరణము

నారాయణరావు నిర్దోషియని శీఘ్రముగనె లోకమునకుఁ దెలుపఁ గలనను నాసతో నేనీరెండు త్తరములను వ్రాసియుంటిని. కాని, యిప్పు డింకేమిచేయవచ్చునో నాకుఁ దోఁచలేదు. నాచిత్తవృత్తి శాంతినందు కొలఁది ముందుకార్యమున కేమార్గము నవలంబింపనగునో నాకుఁదోఁప సాగెను. మఱునాఁటి యుదయమున నేను నిద్రనుండిలేచి డాక్టరు ప్రభాకరరావు వసించుచుండిన గృహమునకుఁ ద్రోవఁబట్టితిని. ఆయిల్లదెకుఁ దీసికొని నేనందుండఁ దలంచితిని. అదియునుగాక, ఆ చుట్టుపట్ల నున్న వారివలన డాక్టరు స్వభావాదులనుగూర్చి యింకనేమైనఁ దెలిసికొన వలయునని నేను నిశ్చయించుకొంటిని.

నేనాయిల్లు చేరునప్పటి కాయింటి యజమానురాలాయింటనే యుండెను. ఆమె కోమలహృదయయు, బహుభాషిణియునై యుండెను. ఎందువల్లనో యీమెకు డాక్టరుమృత్యువే ప్రియమగు విషయమై యుండెను. నేనామెతో మాటలాడుచుఁ బ్రసంగవశమున డాక్టరు ప్రభాకరుని పేరెత్తినంతనె యీమె తనవాచాలతఁ బ్రకటింపనారంభించెను. ఆమె మాటలలో ననేకమహత్తర విషయములు బయలుపడు చున్నవని నేను గ్రహించితిని. ఆ విషయములను గూర్చి విస్తారముగఁ బ్రశ్నించినచో నామె నిష్కారణముగ నన్ననుమానించునేమో యను భీతిచే నేనామె వాక్ప్రవాహమున కడ్డురాక మౌనముతో నన్నియు వినుచుంటిని. ఆమె చెప్పినదానినిబట్టి చూడఁగా డాక్టరు మరణమునకుఁ బూర్వ మొకనెలనుండియు నాతనివర్తన మద్భుతముగ మారిపోయి నట్లు తెలియవచ్చెను. ఒక్కనెలకుఁ బూర్వము డాక్టరాయంత్రాలయము నకుఁ దీసికొని పోఁబడుటయుఁ బిమ్మట వెంటనె యాతని ప్రవర్తన మున మార్పుగపడుటయు నాలోచించి చూచినచో నెన్నియో సంశయములు పుట్టుట సహజమే. అందువలన గిరిజతో — (ఆస్త్రీపేరు గిరిజ) నెయ్యము మైత్రిని సంపాదింప నిశ్చయించితిని.

డాక్టరుగారు వసించుచుండిన గదులే నాకనుకూలముగ నుండు టచే నన్నివిషయముల శోధించుట కవకాశము కలిగెను. ఆ గదుల చక్కఁదనముకన్న, డాక్టరు స్వంతసామగ్రి యింకను నెక్కడిదక్కడ నే యుండి యదియే విశేషముగ నామనసున నాకర్షించెను. డాక్టరునకుఁ బ్రియములగు చిత్తరువులు, ఆతఁ డెప్పుడుఁ జదువుకొను పుస్తకములు, గిరిజ వలన నప్పుడప్పుడు నాకుఁ దెలియుచుండిన యాతని నడవడులు—ఈ మూఁడింటిని విమర్శనపూర్వకముగ సహనముతోఁ బరీక్షించినచో నాతనిరహస్య మెఱుఁగవచ్చునని నాకు దృఢవిశ్వాసముండెను. ఆతని గదిలోనున్న ప్రతివస్తువును నాకు ఒక్కొకవింతమాదిరి నగపడసాగెను.

ఆనాఁటి సాయంకాలమే నేనాయింట నివసింపఁ బోయితిని. మధ్యాహ్నము నేనాగదిలోకేగినప్పుడు గిరిజ నాతో నుండినందున నాకాగదిలోని వస్తువులనన్నిటిని విశేషపరీక్షాపూర్వక దృష్టితోఁ దిలకించుట కనువుపడలేదు. కావున, మధ్యాహ్నమున్నట్లే సామానులన్నియు నిప్పుడుఁగూడ యథాస్థలమునందే యుండుటచే నాకానందము కలిగెను. ఆ రహస్యము నెఱుఁగు నుద్దేశమే నామనసును బాధించుచుండినందునఁ దత్క్షణమె యచటి సామానులనన్నిటినిఁ గ్రమముగఁ బరీక్షింపసాగితిని. మొదట నాగోడపై వ్రేలాడుచున్న చిత్రపటములమీఁదికి నాదృష్టి ప్రసరించెను. అచటనున్నయొక పరాసుసాధువు చిత్రపటముపైనాకుఁ గౌతుక మొదవించెను. డాక్టరు ప్రభాకరునివంటి దృఢహిందూ ధర్మాభిమాని కొక క్రైస్తవసాధువు చిత్రపటము నెడ నింతటిప్రేమ యెందుల కుండెనో! ఆసాధుపురుషుఁ డొకపర్వతశిఖరమున నిలిచియుండి చేత నొక క్రాసు (సిలువ) ధరించియుండెను. అత్యంతగంభీర రూపముతో నాతఁడా సిలువపై దృష్టినిలిపి కామక్రోధాదిశత్రువులపై విజయము నార్జించుచున్నట్లు లాచిత్రమున నిరూపింపఁబడియుండెను. ఈచిత్ర పటవీక్షణమున, దృఢనిశ్చయము, ఈశ్వరధ్యాననిష్ఠ మొదలగునవి

కుదిరి మనుజునకుఁ దనమనోవృత్తి నెట్లు స్వాధీనము చేసికొననగునో స్పష్టముగ గోచరమగుచుండెను. నేనాచిత్రపటదర్శనమున లీననై యుండ నాయింటి యజమానురాలగు గిరిజ యచటికి వచ్చెను. నేనా పటమును దిలకించుచుండ నాకును దానిపైఁ బ్రీతి కలిగినదని తలఁచి యామె సానుభూతితో నిట్లనియెను.

"నలినీబాయీ! ఈ చిత్రము భయప్రదముగా నుండలేదా? డాక్టరు ప్రభాకరుఁ డెప్పుడును దీనిని మూసియేయుంచువాఁడుసుమా!"

"ఏమి! ఆతఁడు దీనిని మూసియుంచువాఁడా? అని నేనాశ్చర్యముతో నడిగితిని.

"అవును; నేను నిజమే చెప్పుచున్నాను." అని చెప్పుచు నామె బల్లను సమీపించి దానియఱలను దెఱచి లోపలినుండి యొకఛాయా పటమును దీసి నాకుఁ జూపుచు "ఆతని దుఃఖదాయక మృత్యువునకు సుమారొక నెలకుఁబూర్వ మీపటమును నీచేతనున్న పటము కొనకు సూదితోఁ గ్రుచ్చియుంచెను. నీవు కొంచెము జాగ్రత్తగ నీక్షించినచో దానికి సూదిగ్రుచ్చిన రంధ్రములింకను గనఁబడఁగలవు; ఆతఁడు చేసిన పని నిశ్చయముగ నాకెంతో బాగుగనుండెను—ఆతని యెదుటనె నేనీ మాట చెప్పితిని. నేనొకనాఁడాతనితో "డాక్టరుగారూ! మీరు మూసి యుంచెడు చిత్రపటము నిజముగ మనుష్యులగదిలో నుండఁదగినది కాదు." అని యంటిని. నామాటలనువిని యాతఁడు బెదరుచూపులతో విభ్రాంతునివగిది నావంకఁ జూడసాగెను. అప్పుడే యాతని హృదయమున నేదోవికార ముదయించినదని నాకుఁ దోఁచినది. కాని యితరులెవ్వరు నీ విషయమై యేమియు మాటలాడకున్నందున నేను నావిషయ మెవ్వరి తోడను జెప్పలేదు. కాని, దీనివలన నేదియోకీడు మూడనున్నదని నేనప్పుడే తలఁచితిని" అనియెను.

గిరిజ నాకుఁజూపిన పటముకూడ నాచేతనున్న పటమువలె భయంకరమైనదై యుండెను. కాని, యంతటి మనోహరమైనదియునై యుం

జెను. గిరిజచెప్పిన తుదిమాటలను విని నేను చేతనున్న ఛాయాపట మును బల్లపైఁబెట్టి గిరిజ మొగమును జూచుచు నిట్లంటిని—

" ఆతనికిఁ బిచ్చియెత్తి యుండెనని నీకుఁ దోఁచుచున్నదా ? "

" ఔను. కావుననె యాయున్మాదభగమున నాతఁ డాత్మహత్య గావించుకొనెనని కూడఁ జెప్పుచున్నాను. "

నేను క్రిందవైచిన పటముదెసకు మఱల నొకమాఱు తిలకించి తిని. ఈవల నాచిత్తవృత్తిలో నెంతియో మార్పు కలిగెను. పుష్పలతపై నాకుఁగల ప్రేమవలన డాక్టరు ప్రభాకరునిపైనున్న యాత్మహత్యా రోపణమును తుడిచివేయవలయునని నేనింతవఱకు నాత్రముతోనుంటిని. ఆకార్యమును సాధించుటకు బద్ధకంకణనై యుంటిని. కాని, యిప్పుడు గిరిజ మూలమునఁగూడ నట్టినీచారోపణమును గూర్చియే వినుటచే నా హృదయమున నాలోచనాతరంగములు వెల్లివిరియఁ దొడంగెను.

గిరిజ తనమాటల సందడిలో నుండుటచే నాహృదయమున నెట్టి యాలోచన జరుగుచుండెనో తెలిసికొనుట కామె కవకాశముకలుగ లేదు. ఆత్మధోరణి ననుసరించి యామె యిట్లనియెను.

" వినుము ! నన్నుఁబోలిన యిరుగుపొరుగు వారలకుఁ దెలియ రాని విషయములు నాకెన్నియో తెలియును. ఇట్లనుటచే నాతఁడు నాతో విస్తారముగ మాటాడుచుండెననుకొందువేమో !—అట్లుకాదు. ఆతఁడు నిష్కారణముగ నితరులతో మాటలాడు స్వభావముకలవాఁడు గాఁడు. ఎల్లప్పుడును జదువుచునే యుండును. కాని, యాతని యన్న పానాదులు మాయింటనె జరుగుచుండుటచే నాతని స్వభావమును నేను చక్కఁగ నెఱుంగుదును. పురుషుల స్వభావమును దెలిసికొన నేరని స్త్రీలు నిజముగ మూర్ఖురాండ్రే సుమీ ! "

ఆమె మాటలవలన నాకొకింతుక కాలక్షేపమగుచుండెను. ఆమె నింకను మాటాడుటకుఁ బ్రోత్సహింపవలయునని నేను మందహాసము చేసితిని ! అప్పుడామె—

"ఈనడుమఁ గొంతకాలమునుండి ప్రభాకరరావునకు భోజనము నెడలఁగూడ లక్ష్యము లేకపోయెను. భోజనమునకుఁ గూర్చుండి యేదో దీర్ఘవిచారమున నిమగ్నుఁడై యుండువాఁడు. ఆతనికిఁ బకోడీలన నెంతయో యిష్టము! నేనొకనాఁడు క్రొత్తమాదిరిగఁ బకోడీలను వండి యాతనికి వడ్డించితిని. ఆతనికి భోజనవస్తువులపై దృష్టియుండినఁగదా! ఆతఁడా పకోడీలను ముట్టుకొనకయె లేచిపోయెను. అప్పుడు నేను భీతితో "పకోడీలు నేఁడు బాగుగ నుండలేదా?" అని ప్రశ్నించితిని. నేనీ ప్రశ్న యడుగునప్పటి కాతఁడు గుమ్మముదాటి పోవుచుండెను. నాయీ ప్రశ్నమును విని యాతఁడు వెనుకకుఁ దిరిగి యొకవిధమగు దృష్టితో నన్నుఁ జూచుచు "గిరిజా! ఱేపటినుండి నాకొఱకు నీవెట్టి భోజన పదార్థమును వండనక్కఱలేదు. అట్లు చేసితివేని నేను భుజింపఁబోను." అని స్పష్టముగాఁ జెప్పివేసెను. నలినీ! ఈ వర్తనమునకు నీవేమందువు? ఈ వర్తన మాశ్చర్యకరముగా లేదా?" అనియెను.

"చాలు! ఇంతేనా? ఇంకేమైన—" అని నేను పలుకఁబోవ నంతలో నామె నామాటకడ్డమువచ్చి మరల నిట్లనియెను.

"కాని, నేనిప్పుడు నీతోఁ జెప్పఁబోవువిషయ మింతకన్న నతి భయంకరమైనది. ఇప్పటివఱకు నేనావిషయ మెవ్వరితోఁడను జెప్ప లేదు. ఏలయన—డాక్టరు ప్రభాకరుని మిత్రమండలికి—(ఈమిత్రమండలి యతిబహుళసంఖ్యఁగలదై యుండెను)—గోపమువచ్చుచుండును. నీకును డాక్టరు ప్రభాకరునకును నెట్టిసంబంధమును లేనందున నావిషయమున నీకుఁ గోపమురాదని తలంచి నేను నీతోఁ జెప్పుచున్నాను. డాక్టరు గారితో మాటలాడుటకై యెవ్వరైన వచ్చినప్పుడు వారి నిందే కూర్చుండఁబెట్టి నేనులోపలికిఁ బోయి డాక్టరుగారితోఁ జెప్పుచుందును. ఇట్లుండ నొక్కనాఁడెవ్వరో వచ్చిరని తెలుపుటకై యాతనికడ కరిగితిని. అప్పుడచట కొరడాదెబ్బల చప్పుడు నాకు వినవచ్చెను. నేను భయపడితిని. ఆతనిం బిలుచుట కశక్యమయ్యెను — పిలిచినచో నాతనికి వినఁ

బడదు. కావునఁ దలుపుతట్ట నారంభించితిని. చాలసేపటివఱకు నల్లు తలుపు తట్టుచు నిలిచియున్న పిదప నాతఁడువచ్చి తలుపుఁదీసెను. ఆతని రూపము వెలవెలఁబోవుచుండెను. చేతులు గడగడవడఁకుచుండెను; అప్పుడు నాకేమి తోఁచునో నీవే యాలోచించుకొనుము! అచట నెవ్వఁడైన నొకబాలుఁ డుండినచో—"

"కాని, యాతనియొద్ద బాలుఁడెవ్వఁడును లేఁడు!" అని నే నంటిని.

ఆమె: ఔను — ఆగదిలో నాతఁడుతప్ప నింకెవ్వరును లేరు. ఆతఁడు మేడదిగిపోయినపిమ్మట నేనాగదియందంతటను వెదకితిని. నాకెవ్వరును గాన్పింపరైరి. ఆతని పుస్తకములపెట్టె తలుపుమాత్రము కొంచెముగఁ దెఱవఁబడియుండెను. మఱునాఁడాతనిగది నూడ్చుచుండఁగా నేను సహజముగనె యాపెట్టె సందునకుఁ దొంగిచూచితిని. అప్పుడు నాకాశ్చర్యమయ్యెను. ఆపెట్టెసందున నొకకొరడా దాఁచఁబడి యుండెను!

నేను: (ప్రకంపిత హృదయముతో) ఏమీ! కొరడాయా! నీ నాతనికడ కేగినప్పు డాతఁడు దాని నుపయోగించుచుండెనని నీవు చెప్పుట లేదుగదా!

ఆమె: అప్పు డాతఁడు దాని నుపయోగించుచునే యుండవలయును! కాని, యెవ్వరిపై నుపయోగించుచుండెనో యదిమాత్రము నాకుఁ దెలియదు. ఒకవేళ నాతఁడు ఒకరూపమును గల్పించుకొని యాకల్పిత భూతముపై దీనిని ప్రయోగించుచుండెనేమో!

నేను: అవును— అదియు సంభవమె.

ఆమె: వెఱ్ఱివార నేక సమయములలో ననేక విచిత్ర చేష్టలఁ జేయుచుందురు. డాక్టరుగారు నలుగురిలోఁ దలద్రిప్పుకొనువారని యెంచి యింటనేకాంతముగ నిట్టి వెఱ్ఱిపనులను జేయుచుండరని చెప్పఁదగదు! ఆతఁడు బయటఁ దిరుగుచున్నప్పుడు బలవంతముగఁ దనశక్తినంతను

వినియోగపఱిచి మనసును స్వాధీనపఱుచుకొనవలసి వచ్చుచుండుటచే నింటికి వచ్చిన వెంటనె యామనసు విచ్చలవిడిగ సంచరించుటతప్పదు; ఆవేగ మడఁగినపిమ్మట స్వాధీనపఱచుకొనుట కాతనికి సాధ్యమగు చుండును. ఒకగృహస్థుఁ డొక్క-చోటనే పదియేండ్లు నివసించుచుండెను; కాని, యాతఁడు చిత్తోన్మత్తుఁడని యాచుట్టుపట్లనున్న వారికెవ్వరికినిఁ దెలియదు. అతని భార్యమాత్ర మాతని యున్మాదాగ్ని కొకనాఁ డాహుతి యయ్యెను.

నేను: డాక్టరు మహావిద్వాంసుఁడై యుండెను. అతని సంభాషణ పద్ధతియు ననుకరింపఁదగినది సుమా!

ఆమె: అవును—అతని కుపన్యాసము లిచ్చుట చాలఁబ్రీతి—

ఏమిచేసినను డాక్టరాత్మహత్య చేసికొనెనను నామె యభిప్రాయము మారకుండుటచే నికనావిషయమైన పలుకుట లాభము లేదని తలఁచి నేనావిషయమును విరమించితిని. ఆమెవలన నింక నేదైనఁ దెలిసికొనవలయునను నుద్దేశముతో నేనీవిధముగఁ బ్రశ్నించితిని.

నేను: అతని చిత్తవృత్తి యింతగ మాఱుటకుఁ గారణమేమై యుండునాయని నీవెన్నఁడైన నాలోచించితివా? అతని మనసునకు గాఢవిషాదముఁ గలిగించు విషయమేదైన సంఘటిల్లలేదుగద!

ఆమె: అట్టిదేదియు సంభవింపలేదు—ఒకవేళ నాకది తెలిసి యుండకపోవచ్చును! ఆగష్టు నెలలో నొకవారము దినములు నేనూరికిఁ బోయియుంటిని. అక్క-డనుండి మరలి వచ్చినప్పుడే యాతని వృత్తిలో మార్పు కలిగినదని నేను గ్రహించితిని. అప్పటి యధికోష్ణమువలన నాతనికట్టి మార్పు కలిగినదని నేను తొలుత ననుమానించితిని. కాని, యది మనుజుని చాలఁగాల మింటనె కూర్చుండియుండనీయదు, అది రాత్రులయందుఁ జాలసేపు చదువనీయదు. డాక్టరుగా రహోరాత్రము లేకనిష్ఠతో నేదియో వ్రాయుచునే యుండిరి.

నేను : అతఁడొక పుస్తకమును వ్రాయుచుండెనుగాదా ? అతఁడొక గ్రంథము వ్రాసి పూర్తిచేసియున్నాఁడని వినియున్నదానను.

ఆమె : నిజమే! అతఁడొక గ్రంథము పూర్తిచేసియున్నాఁడు. అతఁ డగపడకపోయిన నాఁటిరాత్రియే దానిని బూర్తిచేసి యొకప్రకాశకుని కిచ్చినాఁడు. ముందుఁ దనకిట్టి దుర్మరణము కలుగునని తెలిసియె కాఁబోలు నాతఁ డాపుస్తకము నింతశీఘ్రముగ వ్రాసిముగించెను.

నేను : ఔనా ? నీకట్లు తోఁచుచున్నదా ?

ఆమె : అందనుమానమేమున్నది ? అతఁ డాపుస్తకమునందలి కడపటిపంక్తులు వ్రాసి యందు సంతకము చేసినప్పుడు నేనాతని సమీపముననె యుంటిని. ఆ పుస్తకము పూర్తియైనప్పు డాతఁడు విడిచిన దీర్ఘనిశ్వాసమును నేనెన్నఁడు మఱవఁజాలను.

నేను : (నాజిజ్ఞాస యధికమగుటచే) డాక్టరునకుఁ గొలఁది కాలములోనే యొకతరుణితో వివాహము కానుండెనని నీవెఱింగి యుంటివా ?

ఆమె : ఎఱుఁగను—ఆసంగతి నేనెఱుఁగను.

తనకిట్టిమహత్తర విషయము తెలియకున్నందున నొకింత విచారించి యామె ఖిన్నహృదయముతో నిట్లనియెను.

"అతని కెవరిపైనైనఁ బ్రేమయుండియుండవలయునని నాకొకింత సంశయము కలిగియుండెను ; కాని, యాతని ప్రియురాలిపేరు నాకుఁ దెలియదు ! పాపము ! ఆదౌర్భాగ్యబాలిక కెంతదుఃఖము కలిగియుండెనో!"

అని పుష్పలతనుగూర్చిన సంగతులు నానోట వినవలయునను కౌతూహలముతో నామె నావంకఁ జూడసాగెను. నేను చెప్పఁదగిన దంతయుఁ జెప్పితిని ; కాని, యామె రహస్యవిషయములు మాత్రము తెలుపనైతిని. ఏలయున—ఆవిషయము లొకయపరిచయస్త్రీకిఁ దెలుపుట వలన నేమిలాభము ? నేనూరకుంటిని. అప్పుడు గిరిజ నన్నుఁ జూచి—

"ఒకవేళ వారిలోవారికిఁ గలిగిన కలహమె యిట్టి దుఃఖకర కృత్యమునకుఁ గారణమయ్యెనేమో ? పుష్పలత యెంతయొత్తనిదై యుండి

నను, మొత్తనివారెన్నఁడు నెవ్వరితోడను జగడమాడఁగూడదను నియమము లేదుకదా ?" అనియెను.

నేనీకల్పనమును మన్నింపనైతిని.

ఆమె : అదేమైనఁగానిమ్ము. అన్నివిషయములును మనకుఁ దెలియుట యశక్యము. డాక్టరు మృత్యువంటులలో నొక్కటి — ఆతఁడా యంత్రాలయమున నేటికిఁ బ్రాణత్యాగము చేసెనో నేను చెప్పఁజాలను. కాని, యాతఁడున్మాదభరమున నాత్మహత్య చేసికొనియెనను విషయమున నాకణుమాత్రమును సంశయము లేదు.

వీనినన్నిటిని గూర్చి బాగుగ నాలోచించి నేనిట్లంటిని.

"గిరిజా ! నీ వాగస్టునెల 17 వ తేదీకిఁ బూర్వ మూరికేఁయుంటివా ? తరువాతఁ బోయియుంటివా !

నేనీప్రశ్న మెందులకడిగితినో యాలోచించుకొనుటకైన నామె నిమిషమైన నూరకుండక తత్క్షణమె—

"డాక్టరు మృతినందిన వారమున నేనిచట లేను. ఆతఁ డాగస్టు 16 వ తేదీని మృతినందెనని నీకు జ్ఞప్తియున్నదికదా ! అనంతరము శీఘ్రము గనే నేను తిరిగి—" అనియెను.

కాని, నాకు దానితో నగత్యము లేదు. డాక్టరు కపటమార్గమున నా యంత్రాలయమునకుఁ గొనిపోఁబడినప్పు డామె యింటియొద్ద లేదను సంశ మూమె మాటలవలననే స్పష్టమగుచుండెను. అదియునుగాక, యామె సంభాషణమున నారాయణరావు మొదలగువారి పేరునెత్తి నందున, నాయంతటను నేను వారి ప్రసంగమునే దెచ్చిపెట్టుభారము నాకు లేకపోయెను.

నేను : నీకు నారాయణరావుగారి యింటివారితోఁ బరిచయమున్నదా ? నారాయణరావు తండ్రి బహు శ్రీమంతుఁడై యుండెనని నేను వింటిని.

గిరిజ : ఔను. కమలాబాయి మృత్యువువలన నిప్పుడాభాగ్యమంతయు నామెయిరువురు కుమారులకును, సరస్వతికినిఁ జెందఁగలదు.

నేను : సరస్వతి మిగుల నందకత్తె సుమీ !

గిరిజ : కావుననె యీయామె గర్వభూయిష్ఠయని చెప్పుట కనుమానము లేదు. ఆమె జంత్రపుబొమ్మవలె నగపడును ? ఆమెకు శృంగారించుకొనుటకే వేళచాలదు. నిజము చెప్పుమనిన నాకామె సౌందర్యమింపుగ లేదని వచింపకతప్పదు. కాని, లోకులకు సౌందర్యస్వభావమేమి తెలియును ! కనుకనే యీయూరియందలి సొగసుకత్తెలలో నామె యగ్రగణ్యగ భావింపఁబడుచున్నది !

నేను : ఏమి ! కుముదకూడ నత్యంతరూపవతియని జనులనుకొనుచుండ నేనెన్నిమారులో వినియున్నానే !

గిరిజ : కుముదా ! నీవామెను రూపవతియందువా ? లోకులామెను సుందరస్త్రీలలో గణించుట నేనును వినియున్నాను ; నిజమే.

నేను : సరే, యేమమ్మా ! సరస్వతిభర్త గొప్ప జమీందారుఁడఁటకాదా ?

గిరిజ : గొప్పకేమున్నది ! ఆతఁడొకగొప్ప జమీందారునకు దూరపుఁజుట్టమఁట ! అంతే — అన్నకొడుకో, మేనల్లుఁడో — ఈ చిన్న చిన్న చుట్టరికము లెవరికి జ్ఞప్తియుండునమ్మా !

నేను : కమలకాంతరావు మరణానంతర మతిశీఘ్రముగ సరస్వతికినిఁ బెండ్లిచేయఁబడెనని వినియున్నాను. ఆమాట నిజమైయుండునా ?

గిరిజ : అవును. బ్రహ్మసమాజవిధిననుసరించి యీయామెవివాహము నెఱవేర్పఁబడెను. అంతతొందరగా నేలచేసిరో నాకుఁ దెలియదు. దానివిషయమై లోకులేమేమో చర్చించిరి.

ఈ యొకటిరెండుగంటలలో నాకుఁ దెలియవచ్చిన సంగతులను గూర్చి నేనాలోచించుచుఁ గూరుచుండియుంటిని. గిరిజ మాటలాడుచునే యుండెను.

గిరిజ : నిజముగఁ గమలాకాంతరావొక యుత్తమ పురుషుఁడై యుండెను. అతనికి ధనవంతుఁడనను గర్వమావంతయైనఁ లేదు. మమ్ముఁ బోలిన బీదసాదలకాతఁడు తండ్రివంటివాఁడు. అతఁడు తనవంటి సుస్వభావస్త్రీనిఁ బెండ్లాడియుండినచో నెంతయో బాగుగ నుండియుండును. పోనిమ్ము —ఇప్పుడావిషయమై యాలోచించిన నేమి ప్రయోజనము! అయినదేమో మంచిదే యనవలయును.

నా హృదయమున నెగయుచున్న విచిత్ర మనోభావముల నామెకుఁ దెలియనీయఁ గూడదను నుద్దేశముతో నేను "అట్లయిన నీకును వారికిని మంచిపరిచయమే యున్నది!" అంటిని.

గిరిజ : (నవ్వుచు) ఛీ! అంతగనేమియును లేదు. నాకంత యెక్కువగ వారితోఁ బరిచయము లేదు. ఈయూరిలో నొక్కరికైన వారి సంగతులు సంపూర్ణముగఁ దెలిసియుండవు.

నేను : డాక్టరు ప్రభాకరరావున కాయింటివారితో మైత్రి యుండెనా?

గిరిజ : మైత్రియున్నట్లు నాకుఁ దెలియదు.

నా ప్రశ్నయందలి మహత్త్వ మామెకుఁ దెలియలేదు.

ఆమె నాభావమును గ్రహింపలేకపోవుటచే నేను "వారిలో నెవ్వరైన డాక్టరును జూచుట కప్పుడప్పుడు వచ్చుచుండిరా?" అని ప్రశ్నించితిని. ఆమె తలగదలించుచు లేదనియెను. అపుడు నేను "ఏమి! ఎవ్వరును వచ్చుచుండ లేదందువా?" అని మరలఁ బ్రశ్నించితిని.

గిరిజ : నారాయణరావైనను, గోపాలరావైనను, ఏమైనఁ బని యున్నప్పు డాతనిఁ జూచుట కప్పుడప్పుడు వచ్చుచుండిరి. కాని, యంత మాత్రమున వారికీతనితో దృఢమైత్రియుండెనని చెప్పవలనుపడదు. ఆ సోదరుల కెవ్వరితోడను దృఢమైత్రియున్నట్లు నేనూహింపను.

ఆమె యీ సామాన్యజ్ఞానమునకె తాను ధన్యనని భావించుకొనుచుండెను. ఇఁకనధికముగ నామె కేమియును దెలియదని నిశ్చయించుకొని నేనా ప్రస్తావమును మార్చితిని. కాని, యా ప్రస్తావములో డాక్టరు

ప్రభాకరునిపేరే రాకుండుటచే నాసంభాషణ మామెకు రుచింపక పోయెను. ఆమెయేదోపని పేరుచెప్పి యచటినుండి లేచిపోయెను.

## పదునాఱవ ప్రకరణము

గిరిజ వెడలిపోవుట నాకానందముగనే యుండెను. ఆనాఁడు నాకుఁ దెలిసిన విషయములనుగూర్చి చాలా సేపాలోచించుకొనుటకు నాకేకాంతవాస మగత్యమైయుండెను. అదియునుగాక, డాక్టరు ప్రభాకరుని సామగ్రులను జక్కఁగఁ బరీక్షించుటకు నేనాత్రపడుచుంటిని. ప్రప్రథమమున గిరిజచూపిన పటము నామనసునాకర్షించెను.

ఆచిత్రపటము ధర్మరక్షణార్థమై తనప్రాణములను గోల్పోవ సిద్ధముగనున్న సుస్థిరసంకల్పుఁడగు నొకసత్పురుషుని ఛాయాపటమై యుండెను. ఆతఁడొకవృక్షమునకు బంధింపఁబడి యున్నట్లును, అడుగున గడ్డివలయొకటి కట్టఁబడియున్నట్లును, ఆచిత్రమున లిఖింపఁబడియుండెను. ఆచిత్తరువు కళావిషయమున నంతసుందరమైనదని చెప్పఁజాలను; కాని, యందగపఱిచిన దృశ్యముమాత్రము హృదయాకర్షకముగ నుండెను. ఆపట మొక పుస్తకమునుండి చించితీయఁబడి యుండవలెనని నాకుఁ దోఁచెను. ఆపుస్తక మచటిబీరువాలో దొరకునేమోయని యందలి పుస్తకముల నన్నిటిని బరీక్షించి చూచితిని. కాని, నాకాపుస్తకము కనఁబడలేదు గోడకుఁదగిలించియున్న యాచిత్తరువునకుఁ గళావిషయమునఁ దీసిపోవునీచిత్తరువును జతసేయుటలో డాక్టరుగారి కేదోనిగూఢ కారణముండవలయునని నామనోదేవత నాకుఁ జెప్పుచుండెను. కాని, యాచిత్రమెక్కడిదో, ఏగాథను నిరూపించుచున్నదో నాకుఁ దెలిసినఁగాని, యానిగూఢ కారణము నెఱుంగుట కశక్యముగా నుండెను. కాని, యాపుస్తక శోధనమున నాప్రయత్నము లన్నియు నిష్ఫలము లయ్యెను. అచటఁ బెద్దపెద్దపుస్తకము లనేకములుండెను. కాని వానిలో

నుండి యీచిత్తరువు తీయఁబడినట్లు నాకుఁదోఁచలేదు. ఆపుస్తకము దొరకినచోఁ నాకార్యభారము చాలవఱకుఁ దగ్గునని నేనాసించియుంటిని. కాని, నాకాపుస్తకము దొరకనందున నేను మిగులవిచారించితిని. డాక్టరాత్మహత్యఁ గావించుకొనెనని గిరిజచెప్పినమాటలను నేనింకను విశ్వసింపలేదు. కాని, యామె చెప్పినమాటలన్నియు నిక్కమములే యైయుండునని విశ్వసించుటకుమాత్రము సంసిద్ధనై యుంటిని. అందుల కామె చెప్పిన యనుమానకారణముమాత్రము నాకు మంచిదని తోఁచలేదు. డాక్టరునకు భ్రమకలిగినదనుటమాత్రము నాకు నిజమని తోఁచదు. ఆతనికిఁ బిచ్చిపట్టియున్నచోఁ నాతనిప్రియురాలికి—పుష్పలతకుఁ దెలియకుండునా!

డాక్టరుమరణమునకు స్వయముగనాతఁడే కాని, యితరులకారణభూతులు కారనిమాత్ర మిప్పుడు నాకుఁ దోఁపసాగెను. కాని, యాతనికీపూర్ణతారుణ్యమునఁ దనజీవితముపై నింతవిసుఁగేలజనించెనో తెలియదయ్యెను. ఆమాత్రము నాకుఁ దెలిసియుండెనా, యిప్పుడు నాప్రియతముండగు నారాయణరావు కేవలము నిరపరాధి యనిమనఃపూర్వకముగనెంచి, యింక నే కార్యమునను బ్రవేశింపక స్వస్థచిత్తనై యింటఁ బరుండి నిద్రింతునుగదా! కాని, దైవదుర్విపాకమున లాతనియాత్మహత్యకుఁ గారణము తెలియకున్నందున నేనాకారణములను శోధించుటకై యతితీవ్రముగఁ బ్రయత్నముల నొనర్పఁదొడంగితిని.

ప్రభాకరునిబల్లయఱలు తెఱవఁబడియుండుటకు నాకుత్సాహముగానుండెను. కాని, యాయఱలను దెఱచుటకు నాకేమధికారమున్నది! అదియునుగాక, యాయఱలలో విశేషవస్తువులేవైననున్నచోఁ బంచాయితీదారులు చేరియున్నప్పుడే పరికించియుండరా! వానిని జప్తుచేయించియుండరా! అనితలపోసి యాబల్లతాళపుఁ జెవులక్కడనె పడియున్నను, ఆబల్లను దెఱచునాకోర్కెనణఁగఁద్రొక్కి వేసితిని.

ఆతని పుస్తకములనన్నిటినిఁ బరీక్షించుటకు నాకెట్టియభ్యంతరమునుండలేదు. కాని, యాపుస్తకముల మూలమున నాకేమి తెలియఁగలదు! వివిధవిషయములను గూర్చిన గ్రంథము లనేకములు చేర్చియుంచుటవలన నాతనికి గ్రంథపఠనమునం దధికప్రేమ కలదనువిషయము తక్క నితరమేమియును స్ఫురింపఁజాలదు. అయిన నన్నివిషయములు నందఱకును దెలియఁజాలవుగదా! ఈపుస్తకములలో నైతను నాకుపయుక్తమగు వస్తువేదైన లభింపఁగూడదా యనునాసతో నేనాపుస్తకముల నన్నిటిని జాగరూకతతోఁ దిలకింపసాగితిని. తుదకాబల్లపైఁ బడియున్నయొక సుందరగ్రంథముపై నాదృష్టిపడెను. అది చిత్రపటసంగ్రహ (Album) గ్రంథమైయుండునని నేననుకొంటిని.

నాయూహ వ్యర్థముకాలేదు. అది చిత్రసంపుటయే! మిగులఁ దమకముతో దానినందికొని యందుఁ బుష్పలత ఛాయాపటమున్నదేమోనని చూడసాగితిని. పత్రములఁ ద్రిప్పిచూచుచుండ నాయిష్టవస్తువు—నానెచ్చెలియగు పుష్పలత ఛాయాపటము నాకుదొరకెను. దానిని జూచుచుండ నాపుస్తకమునుండి యొకపచ్చని కవర క్రిందఁ బడెను. తొందరగా దానినందుకొని చదివితిని. దానిపై "ప్రియ పుష్పలతకు—సౌకారురోడ్డు; విసరపురము." అని వ్రాయఁబడి యుండెను. ఆకవరను జూచినంతనె యిట్టికవరనొకదానిని బూర్వమొకప్పుడు చూచి యున్నట్లు జ్ఞప్తికివచ్చెను. పుష్పలత చనిపోయిన దినమున నిట్టిపచ్చని కవర యొకటి యామె పేరున టపాలో వచ్చియుండెను. కాని, యానాఁటి గందరగోళములో నామె యాకవరను జూడలేదు. అనంతరమది నాకన్నులకును మరలఁ గనఁబడలేదు. ఆకవరమీఁద యక్షరముల పోలికయు, ఇప్పుడు నాచేతనున్న కవరమీఁద యక్షరముల పోలికయు నొక్కమాదిరిగానుండెను. దీనివలనఁ బుష్పలతకానాఁడు వచ్చినయుత్తరము డాక్టరుప్రభాకరు నొద్దనుండియే వచ్చియుండునని నాకిపుడు తోఁపసాగెను. ఇదినామనసునఁదోఁచినంతనె నాయొడలుగిఱ్ఱునఁ దిరుగఁదొడంగెను. గదిలోనికిఁ జల్లనిగాలి రావలయునని నేనుకిటికీతలుపుల

నన్నిటిని తెఱచితిని. పైనుండివీచుచున్న యాహ్లాదజనకమగు శీతల మారుతముచే నాయొడలు కొంచెముగ శాంతినందసాగెను. అప్పుడా కవరు యేమైయుండునాయని శాంతచిత్తముతో నాలోచింపసాగితిని.

ఆనాఁడు జరిగిన దుఃఖకర విషయములవలన నాయుత్తరము నొక్కరును జూడరైరి, అందులకు వింతయేమున్నది ? అదిసహజముగఁ గనులఁబడురీతినే బల్లపై వేసియుంటినని నాకిప్పుడు బాగుగజ్ఞప్తియున్నది. తరువాతనది యెవ్వరికిని గనఁబడక పోవుటయే నాకు వింతగనున్నది ! ఇంకెవరైన దానినెత్తుకొనిపోయియుందురా !

అయ్యదిరాత్రివేళ కాకుండినచోఁ దక్షణమె నేను పూర్వమున్న యింటికరిగి దానికై యెల్లెడల వెదకియుందును. రాత్రిపదిగంటలయ్యెను. అప్పుడు పుష్పలత మరణించిన నాఁటిరాత్రి జరగిన యావద్వృత్తాంతములును దలపోసికొనుచుఁ బరుండియుండుటకన్న వేఱు మార్గము లేకపోయెను. ఆనాఁడు టపాబంట్రోతు ఆయుత్తరమును దెచ్చి నాచేతికిచ్చియుండెను. నేనుద్యోగముకొఱకై ప్రయత్నించి ప్రయత్నించి నిష్ఫలమనోరథనై ఖిన్నవదనముతోఁ నింటిగుమ్మము మెట్టుల నెక్కుచుండ నాతఁడాయుత్తరమునాకిచ్చెను. అప్పుడాయుత్తరమునంతగ లక్ష్యభావముతోఁ జూడనైతిని. కాని, యాకాగితము మీఁది పచ్చనిరంగు మాత్రము నాకన్నులఁబడక మానదయ్యెను. ఆపత్రముంగొని నేనెట్లుగదిలో కరిగితినో, అచటనెవ్వరును లేకుండుటచే నెట్లుదానినా బల్లపైఁబడవేసితినో, మొదలగు సంగతులిప్పుడు నాకు జ్ఞప్తికివచ్చెను. అనంతరము నేను కిటికీకడకేగి నిలిచితిని. ఆపిమ్మటఁ బుష్పలత గదిలోకివచ్చువఱకు నేనేమిచేసితినో నాకు జ్ఞప్తి లేదు.

అప్పుడు నేనెక్కడ నిలిచియుంటినో జ్ఞప్తికిఁదెచ్చుకొనఁ బ్రయత్నించితిని. నేనుకిటికీకడ నిలిచినట్లు జ్ఞప్తికలిగెను. పుష్పలతను నేను తొలుతఁజూచి నప్పుడామె నాకును ఆబల్లకును నడుమనిలిచి యుండెను. కావున, నేనామెను జూడకమునుపె యామె యాయుత్తరమును జదివి

యుండఁబోలును! కాని, యామె చదివినపిమ్మట దానినచటనె యెం దైనవేసియుండెనో, లేక, తనజేబులో వేసికొనియుండెనో; ఆమె మరణానంతర మామె ధరించియున్నరవికె జేబులో నాజాబుదొరకియుండ లేదు. దీనినిబట్టిచూడ నామె దానినిజూచియుండలేదనియే తోఁచుచున్నది. అదియునుగాక, డాక్టరాయుత్తరమున శీఘ్రముగఁ దానాత్మహత్యఁగావించుకొనువాఁడనని వ్రాసియుండునేమోయని నేననుమానించితిని. అదియామెకుఁ దెలిసియున్నచో నామె యప్పుడగపడినంత యానందముతోనుండఁగలదా? ఆమె యప్పటిమందస్మితవదనారవింద మిప్పటికిని నాకన్నులకుఁగట్టియున్నట్లున్నది. ఆమెయాయుత్తరమును జదివి యెందైనఁబారవేసియుండెనా? అట్లయినచో నాత్మహత్యవిషయమైచెప్పిన సంగతులందు లిఖింపఁబడియుండుట యసంభవము, కాని, దీనికొప్పుకొనుటకు నామనసంగీకరించుటలేదు. తుదకు నాకిట్టియాలోచనయెడ విసుగుఁజనించి నేను నిద్రాదేవినారాధింపఁ దొడంగితిని. కాని, యానాఁటిరాత్రి యామెకుఁగూడ నాపైననుగ్రహముదయింపదయ్యెను. మఱునాఁటియుదయముననె లేచి నేను నాపూర్వనివాసగృహమునకరిగి యాయింటియజమానురాలినిదర్శింప నిశ్చయించుకొంటిని. ఆమెవలన నేవిషయమును దెలియకున్నచో గోపికాబాయికడకేగ నెంచితిని. పుష్పలతమరణానంతరము నేను కమలాబాయిశుశ్రూష సేయుటకరిగినందునఁ బ్రేతదహనాదికవిధులు గోపికాబాయిపై మోపి వెడలినసంగతి మీఱెఱింగియేయున్నారు. ఆమె వలనను నాకుఁగావలసిన విషయము తెలియుటదుస్తరమైనచో డాక్టరు కృష్ణారావుగారికడకైన నరిగి యాతనికీయుదంతమువినిపించి, యీకార్యమున నేనాతనియుపదేశమును స్వీకరించుటకై నిశ్చయించుకొంటిని.

ఉదయమునలేచి నేను గోపికాబాయియింట నామెనుగలిసికొంటిని. కాని, యామె కాయుత్తరమువిషయమై యేమియుఁ దెలియలేదు. ఆమెకుఁ గాని, యాయింటియజమానురాలికిఁగాని, యాయు

త్తరమును జూచియున్న జ్ఞప్తిలేదు. పుష్పలతాప్రేతమునుదహానవిధికిఁ దీసికొనిపోయినతరువాత నిల్లూడ్చుదాసివచ్చి యిల్లంతయు శుభ్రముగానూడ్చిపోయెను ; కాని, దానికిఁగూడ నాయుత్తరమెక్కడను గనఁబడలేదు.

ఈవృత్తాంతము నెడల నాకు నిరాశకలిగెను. ఆయుద్వేగభరమున నేను డాక్టరుకృష్ణారావుకడకేగనుంటిని ; కాని, యొక్కమాఱు నేనుండినగదిలో స్వయముగ శోధించినపిమ్మటఁ గడపటియుపాయము నాలోచింతమని నిశ్చయించుకొంటిని. తత్క్షణమె నేను గదిలోనికరిగి బల్లపైనున్న వస్తువులనన్నిటిని పూర్వముపెట్టెలోఁ బెట్టియుండిన వానినన్నిటిని బయటికిఁదీసి నాముందుఁబఱచుకొంటిని. కుట్టుపనుల సామానులనుంచు పేటిక ; — ఉత్తరముల పేటిక — ఒకచిన్నడైరీ— రామదాసుకీర్తనలు—ఇవియే యందుండినసామానులు.

కుట్టుపనులపరికరములనుంచు పెట్టెలోను, ఉత్తరముల పెట్టెలోను నాయుత్తరమున్నదేమోయని వెదకుటకెంతో సేపుపట్టలేదు. డైరీని— రామదాసుకీర్తనల పుస్తకమునుగూడఁ గదలించిచూచితిని. అందెందును నాకాగితముదొరకలేదు నాకుఁ గడునిరాశయయ్యెను. మరల సామానులనన్నిటి నాపెట్టెలోఁబెట్టివేసితిని. ఇంతలో నాపుస్తకముల నింకొకమాఱు పుటలవెంబడిఁబుటలుగాఁ దెఱచిచూడవలయునని నాకు మనసయ్యెను. అట్లుసేయఁదొడంగితిని. ఆహా! నాయదృష్టము! ఆపుస్తకమున నాయిష్టవస్తువు—ఆపచ్చనికవరనాకు దొరకెను. ఆకాగితమానాఁ డెట్లువచ్చెనో, యట్లే తెలియఁబడకయే యుండెను. దానిని గనినంతనె నాకెంత యానందమైయుండునో సహృదయులగుపాఠకులే యాలోచించి తెలిసికొందురుగాక!

# పదునేడవ ప్రకరణము

ఆఁచ్చనికవరనుగనినంతనె ఆశ్చర్యము, ఉత్కంఠత, భీతి, మొదలగు పరస్పర విరోధవికారములచే నామనసునిండిపోయెను. ఆకవర నాకన్నుల యెదుటఁ బెట్టికొని చింపుదునా, వలదాయని చాలాసేపాలోచించితిని, ఏమరణపత్రాధారమున జంగమస్థావరసంబంధమైన పుష్పలత యాస్తి యంతయు నాకుహస్తగతమయ్యెనో, యయ్యది రిజిష్టరు కాఁబడియుండ లేదు కాని, యామెకెవ్వరును సమీపబంధువులు లేనందున నామె యాస్తికి మేము వారసులమని యెవ్వరును ముందఱికి రారైరి. అట్లుండియు నామె నాకిచ్చినద్రవ్యము వ్యయపఱుచుటకు నాకుఁబ్రాణము మీఁదికివచ్చుచుండెను. ఆమె లేఖను నేను తెఱచిచూచుటవలన నేదో భయంకరపాతక మొనర్చుటయే యనినాకుఁ దోఁపసాగెను. కాని, కొంతసేపాలోచించినపిమ్మటఁ బుష్పలతయంత్యాజ్ఞ నాకు జ్ఞప్తికి వచ్చెను. డాక్టరుప్రభాకరుని పేరునకు రానున్న యాత్మహత్యాకళంకమును దుడిచివేయుటకై యీయుత్తరమును జదువుటయుగత్యమని నాసదసద్వివేకబుద్ధికిఁదోఁపసాగెను. నానేత్రముల నావరించియున్న యజ్ఞానాంధకారపటలము సమ్యక్ జ్ఞానకిరణములచే దూరము గావింపఁబడుటచే నాకర్తవ్యము నాకుస్పష్టముగఁ గనఁబడసాగెను. ఇంకనొక్కక్షణమైన నాలసింపక యాపైకాగితమునుజించి లోపలియుత్తరమును బయటికిఁదీసితిని. అందీవిధముగ లిఖింపఁబడి యుండెను—

" సెప్టెంబరు ; 13 ; సాయంకాలము.

" ప్రియపుష్పలతా !

నీకోమలహృదయమున కేనెట్టిభయంకరాఘాత మొనర్చుచున్నాఁడనో—నాకిట్లు సేయఁ దప్పనిసరియైనది – దాననీకెంత దుఃఖము

కలుగునో నేను కొలఁదిపెట్టఁజాలకున్నాఁడను. దానినెట్లయినమరలింప సాధ్యపడియున్నచో నేనట్లేచేసియుందును. నాతోపాటు నిన్నుఁగూడ నీదుఃఖసాగరమునకీడ్చుకొనిపోవుచున్నందులకు నామనసెంతదుఃఖించుచున్నదో నీవెఱుఁగవు. ప్రేమవిషయమున నీమనసెంతమృదులమైయున్నను, అదిన్యాయనిష్ఠురమైనదని నాకుఁదెలియును. "వజ్రాదపి కఠోరాణి, మృదూనికుసుమాదపి" యను కావ్యోక్తి యన్నివిధముల నీకేసరిపోవుచున్నది. ఈకారణమున నీవు నన్ను నాకర్తవ్యమునుండి పరాఙ్ముఖునిగఁజేయకుందువని నాకాశకలదు. చలింపనిధైర్యముతో నేనునాకర్తవ్యమును నెఱవేర్చునట్లు, నీవు నాకుఁ బ్రోత్సాహ మొసఁగుదువుగాక! కర్తవ్యముకొఱకు నేను నాప్రాణముల నపాయ సముద్రమునఁ బడవేయ, నీవు నీమృదుహాసపుష్పవృష్టి నాపైఁగురియింతువని నేనెఱుంగుదును, అట్లుండియు నేను స్వర్గలోకప్రవాసము—బహుదీర్ఘప్రవాసము—సేయుటకుఁబూర్వమె నీకడకరుదెంచి, యాస్వర్లోకామృతమును సైతమధిక్కరింపఁజాలు నీయధరామృతమును గ్రోలుటకును—నీయాశీర్వచనములనందుటకును నాకు సాహసము కలుగదయ్యెను. అందులకు నేనెంతవగచుచున్నాఁడనో యాదైవమునకె యెఱుక! "మీరెక్కడకరిగెద?" రని నీవు నన్నుఁబ్రశ్నింప, నీకన్ని సంగతులను జెప్పవలసివచ్చును. కాని, నాయాత్మార్పణకార్యము ముగియువఱకు నేనెచ్చటికిఁబోవుచున్నానో యది యింకొకరికిఁదెల్పుట నాయిష్టముకాదు.

ముద్దరాలా! ఈయుత్తరము నీచేతికందుసరికి నాయాత్మ స్వర్గలోకమార్గమునఁబట్టియుండును, ధీరోదాత్తపతివ్రతాశిరోమణి కనఁవగుధైర్యముతో నీవు నీశోకమును బిగఁబట్టియుందువని నేను నమ్ముచున్నాఁడను. నాశవముదొరకినపిమ్మట నేనెందులకుఁజచ్చితినో యది లోకులకెఱుకపఱుపుము. నేనీనాఁడాత్మహత్య చేసికొనుచున్నను నాకార్యధర్మముపైఁ బూర్ణవిశ్వాసముకలదని లోకులతోఁజెప్పి

వారికి విశ్వాసముకలిగింపుము. ఈనగరముననున్న జనులకందఱకు నాపై నపారభక్తియు, విశ్వాసమును, ప్రేమయు నున్నందున వారు నీపలుకులనునమ్మెదరు. ఒకవేళ వారు నీమాటలను విశ్వసింపరేని, అప్పుడు నాయింట నాడ్రాయరులో నేనుంచియున్న యుత్తరమును దెమ్ము. అదిసమస్తమును దెలియఁజేయును. దానినాసాహాయ్యమున లోకులనిశ్శంక హృదయులఁజేయుము.

కాని, మిగులనగత్యముగుప్రస్తావముకలిగినప్పుడే యాకాగితములను దీసికొనుము, లేకున్న వానినిముట్టకుము. అయినను నేఁడు మొదలు పదిదినములవఱకు నెట్టి యావశ్యకముకలిగినను, ఆకాగితములను దీయరాదని నీకాజ్ఞాపించుచున్నాఁడను. నీవు నాయీయుంత్యేచ్ఛను—ఆజ్ఞను—భంగముచేసినచో నీకు నాయాత్మపైఁ ప్రేమలేదనియు, నాయీనశ్వరశరీరముమీఁదమాత్రమే ప్రేమయున్నదనియు నేననుకొందును.

ప్రియా ! కల్పనరూపమున నీరమ్యమూర్తిని నానేత్రముల సమక్షమున నిలువఁబెట్టికొని, దానిపదకమలముల నాయశ్రువులతో నభిషేకించి, నేను నీకడఁ గడసారిసెలవుపుచ్చుకొనుచున్నాఁడను, మరల మనమాస్వర్లోకమునఁ గలిసికొందము. అప్పుడు మనపాతకములన్నియు నశించి నిరాశాదారుణయాతన మనయనుభవమునకిఁక రాదని నాకు దృఢాశకలదు. ఆసుదినములభించువఱకుఁ బరమేశ్వరుఁడు నిన్నురక్షించుఁగాక !

ఇట్లు,

ప్రభాకరుఁడు. ”

“ ఇఁకనొకటి—ఈవిషయమై నేఁటివఱకు నీకొక్కమాటయైనఁ జెప్పకున్నందులకు నీవాశ్చర్యపడనక్కఱలేదు. ఈవిషవార్త తగు సమయమునకుఁబూర్వమె నీకుఁదెలిపి నీసుఖస్వప్నమునకు భంగముఁ గల్పించుట నాకిష్టములేదు. సర్వసాక్షియగుఁబరమేశ్వరునకుఁదప్ప

నితరుల కెవరికిని నాహృదయమున నేమున్నదో యెఱుఁగ నశక్యమై యుండెను. ”

## పదునెనిమిదవ ప్రకరణము

తనయాకాశప్రయాణము పూర్తిచేసి, పశ్చిమదిగ్వధువున కొక్క-మాఱు కడసారిగాఢాలింగన మొసఁగి, దినమణి యస్తాచలమున నదృశ్యుఁడయ్యెను. ప్రియోపగూహనమునఁ బశ్చిమదిగ్వధూముఖకమలముపైఁ బ్రసరించినయరుణకాంతి యింకను నదృశ్యముకాలేదు. ఆమెస్థితియింకను గొంతకాలమిట్టులేయున్నచో భూజనులామెను జూచి పరిహసింతురను తలంపున, నిశాదేవి యంధకారస్వరూపకృష్ణ వసనముచే భూమినంతను గప్పివేసెను. ఈయాకస్మికాంధకారము వలనఁ బశుపక్ష్యాదులపై మనుజులొనర్చుచున్న యత్యాచారము లొకింతతగ్గెను. ఎల్లెడల శాంతత ప్రసరించెను. అట్టివేళ డాక్టరులేఖలో నిర్దేశించిన బల్లను దెఱచి యందలివస్తువులనెల్లఁ దిలకించుచుఁ గూర్చుండియుంటిని. ఒకానొక యదృశ్యశక్తి నాకృత్యమును సాశంకముగఁ జూచుచున్నట్లు నాకుఁ దోఁచెను. ఆబల్లయందలి విశేషములతో నాసుఖదుఃఖములకు గాఢ సంబంధముండుటచే దానిని తెఱచుటకు నాకు ధైర్యముకలుగదయ్యెను.

నేనాపుస్తకము నీక్షించుచుఁ గొంతసేపుకూర్చుండియుంటిని. ఎంతవిచిత్రముగా నేనీకార్యమునకుఁ దొడంగితిని! నిజముపరికించినచోఁ బుష్పలతకును నాకు నేమిసంబంధము! ఆమెకు నాకు నెనిమిది దినములపరిచయమేకదా! అట్లుండ నామె నాకుఁదన స్వార్జితమంతయు నిచ్చుటయు, నామెతనప్రియుని కీర్తిని కాపాడుమహాకార్యమున నన్ను నియోగించుటయు, విచిత్రములుకావా? ఏదియెట్లయిన — డాక్టరుప్రభాకరునిస్వవిషయములలో జోక్యము పుచ్చుకొనుటకు

నాకధికారమెక్కడిది ? కాని, తత్క్షణమే నారాయణరావుస్వరూపము నాకుఁ దృగ్గోచరమయ్యెను. కుముద యాతనివంకఁగని రాక్షసివలె నవ్వుచున్నట్లు నాకుఁదోఁచెను. కుముదబారినుండి నారాయణరావును రక్షించుటకై యాకాగితములలో నేమి వ్రాయఁబడియున్నదో తెలిసి కొనుట నాకావశ్యకమైయుండెను. ధైర్యమునుచిక్కఁబట్టుకొని తరువాత నేనాయుఱను దెఱచితిని.

అందున్న కాగితమున నిట్లు వ్రాయఁబడియుండెను.

" మరణభీతిచే నేమనుజుఁడు కర్తవ్యతాపరాఙ్ముఖుఁడగునో యామనుజుఁడు బ్రదికియున్నను జచ్చినవాఁడేయగును.

నేనుకళాశాలలోఁజదువుచున్నప్పుడే నాకు వైద్యవిద్యయందు బ్రీతియుండెను. మెట్రిక్యులేషనుపరీక్షలో నుత్తీర్ణుఁడనైన పిమ్మటఁ నేను బొంబాయినగరమునకరిగి సర్వకళాశాలలోఁ జదువుకొనునప్పుడు నావయసు పదునాఱేండ్లుమాత్రమే. అచటఁ బ్రథమప్రవేశపరీక్షలో నుత్తీర్ణుఁడనై డాక్టరువిద్యనారంభించితిని. ఆకాలములోఁ జిన్ననాఁటి నుండియు నాకెక్కుడుప్రీతియున్నందునఁ బ్రతివత్సరమును జరగుపరీక్షలలో జయమందుచుంటిని. సకలవృత్తులలోను వైద్యవృత్తియత్యంత పవిత్రమనియు, శ్రేష్ఠమనియు నాకుఁ దోఁచుచుండెను. ఈవృత్తిలో నితరులకుపకారము సేయునవసరము తఱచుగఁగలుగుచుండును. తక్కిన వృత్తులలో నిట్టియవకాశము లేదని నానమ్మకము.

నాశరీరస్థితి బాల్యమునుండియు సుకుమారమైనది. ఆటపాటలయందు నామనసుచొరదు. బొంబాయివంటియపరిశుద్ధవాయుపూరితమగు పట్టణమున నాలుఁవత్సరములు నివసించుటచే నాదేహస్థితి బాగుత్తిగఁజెడెను. వీనినన్నిటిని జక్కగ నాలోచించియే విసరపురమున—పరిశుభ్రవాయుశోభితమగుపురమున — అవృత్తినవలంబింప నిశ్చయించితిని. ఈపురమునకువచ్చి నివసించుటచే నాశరీరముస్వస్థతఁజెందెను.

"పరోపకారార్థమిదంశరీర" మ్మను నార్యోక్తిననుసరించి నేను నాశరీరమును బరోపకారమునకై వినియోగ పఱుపసాగితిని. ఆహా! ఆపరోపకారము నా కెంతదూరమైపోయినది! నాప్రాణములపై నాశచే నేనింకొకరిజీవితము నిష్ప్రయోజన మొనర్పఁగారణభూతుఁడ నైతిని. తనకర్తవ్య కార్యముకఠినమైనదనియెంచి, యాకార్యమునుండి యెవ్వఁడు విముఖుఁడగుచున్నాఁడో యాతనియపరాధము క్షమింపఁ దగినదికాదు. కష్టపరంపరలతోఁబోరాడుచు నెదురీదుటయందేశౌర్యము కలదు. తనకు మార్గంబునఁజిక్కులొదవినంతనె పిఱికితనముతో నచ్చుండి తొలఁగిపోవువాఁడెప్పుడును బనికిమాలినవాఁడనియే నా మతము.

ఈనామతముననుసరించి వర్తింప నేనెట్లసమర్థుఁడనైతినో యీక్రిందివిషయములవలనఁ దెలియఁగలదు.

ఆగష్టుపదునాఱవ తేది సాయంకాలమున నాకుఁగమలాకాంత రావుగారింటికిరమ్మనివార్తవచ్చెను. కమలాకాంతరావుగారస్వస్థతగా నుండిరి. ఆతనికివ్యాధియెట్టిదో యెవ్వరికిని దెలియలేదు. నాకు వారి యొద్దనుండి వార్తవచ్చినప్పుడు నేనొకమహద్విషయమునుగూర్చి వ్రాయుచుఁ గూర్చుండియుంటిని. దానివల్లే యసంపూర్తిగానుంచి వారిగృహమునకరిగినచో నప్పుడు నాకుఁదోఁచినసంగతులు వ్రాయుట మఱచిపోవుదునేమోయనుభీతి కలిగెను. కావున, నాలేఖను బూర్తి చేసినపిమ్మటఁ బోవుదమని నాకుఁదోఁచెను.

నిజమూహించినచో నాయసంపూర్తిలేఖకన్న, నాకు వారి యెడఁగల ద్వేషబుద్ధియె, యటకుఁబోవలదని నాకధికతీవ్రముగ బోధించుచుండెను. కాని, కష్టకాలమున నొరులకుపకారమొనర్చుటయె నాపరమపవిత్రకర్తవ్యకార్యమగుటచే నేనాలేఖనట్టెయుంచి, తత్క్షణమె కమలాకాంతరావుగారియింటికి బయలుదేరితిని.

నేనెందులకాత్మహత్యఁ గావించుకొంటినో దానిని స్పష్టముగను, నచ్చునట్లుగను దెలుపుటకై నాకొరులగు పరవిషయములఁ జెప్ప వలసివచ్చుచున్నది. అట్లు చేయకుండుట కుపాయము లేదు. అంతియే గాక, ప్రసంగవశమున నేనొకవ్యక్తివిషయమై కొంచము కఠినముగ మాటాడవలసియున్నది. కాని, సత్యసంబద్ధమైనదానినే నేనిటవచించు చున్నాఁడను, అందులకు సహృదయులు నన్నుక్షమింపకపోరని తలఁచెదను. కమలాకాంతరావుగారియింటికరుగుటకు నాకిష్టము లేదని నేను తొలుతనె వచించియుంటిని. అట్లు చెప్పుటకుఁగారణమేమన— అతనిద్వితీయపత్నియగుకమలాబాయియెడ నాకున్నభీతియే—కమలా బాయియత్యంతదుష్టస్త్రీయనియుఁ బాతాళభైరవియనియు, లోక ప్రవాదముండెను. ఆలోకప్రవాదమునిజమని శీఘ్రముగనె నాయను భవమునఁ దెలిసికొంటిని.

ఈకారణమున వారిగృహమునకరుగుటకు నాకుఁబ్రాణము మీఁదికివచ్చుచుండెను. ఇల్లువీడి బయటికరుగునప్పు డొక్కసారి నాగదివంకకుఁదిరిగి దీర్ఘనిశ్వాసమునువిడిచితిని. ఏదోప్రాణసంకటము సంభవింపనున్నదని నాకపుడుతోఁపసాగెను. కాని, యచటి కేగుట నాకర్తవ్యమని నామనసునుస్వస్థపఱుచుకొని, యెట్టకేలా యావార్తా వహునితోఁ బయలుదేరితిని.

పైకిఁజిన్నవిగఁ దోఁచునవియె యొకానొకప్పు డతిభయంక రములగుచున్నవి. నేనాపొలములమీఁదుగఁబోవుచుండ నాయున్మత్త బాలుఁడెచటినుండియో తటాలునవచ్చి నన్నుఁగట్టిగఁగౌఁగిలించు కొనియెను. ఉన్మత్తునిసంస్పర్శన మశుభకరమనుపూర్వోక్తియెడల నాకుఁ బూర్ణవిశ్వాసముండినందున నేనొకించుక బెదరితిని. అప్పటినా మూర్ఖత్వమున కిప్పుడు—నాకుఁబశ్చాత్తాపము కలుగుచున్నది. కాని, యిప్పుడేమి చేయనగును? అప్పుడే నాతప్పిదము నాకుఁ దెలియవచ్చెను. దురదృష్టవంతుఁడగు నాయున్మత్తబాలకుని నేనుతిరస్కరించినందున నాకుఁ బశ్చాత్తాపముకలిగెను. తత్క్షణమె నేను వానిని నాచెంతకుఁ

జేరఁబిలిచి, ప్రేమమీఱ వానిమొగముపైఁజేయిడి తినుటకేమైనఁదీసి కొమ్మని నాలుగణాలాతనికిచ్చి సెలవొసంగితిని.

అల్పావకాశముననె నేను కమలాకాంతరావుగారి యిల్లు చేరితిని. అప్పుడు కమలాకాంతరావుగారు ద్వారముదెస మోముఁబెట్టుకొని మంచముపైఁబరుండియుండిరి. ఆతనిసుస్వభావమునకై యూరనెల్లరు నాతనిస్తుతించుచుండిరి. కాని, యాతనిమాటలేవియు నహంకారమదోన్మత్తయగు నాతనిభార్యకడమాత్రము సాగుటలేదు. నేను గదిలోనడుగిడినప్పు డామె యాతనితలకడఁగూర్చుండియుండెను. తన పతిహస్తమును దనహస్తముతోఁబట్టుకొని యనిమిషలోచనములతో నామె యాతని ముఖమునెకాంచుచుండెను. నేను లోనికరిగినంతనె యామె యచ్చోటునుండిలేచి నన్నాస్థలమునఁగూర్చుండఁబెట్టవలసి యుండెను, కాని, యామె నావైపునకొకవిధమగు వికారదృష్టితోఁజూచుచు నచ్చటనుండికదలదయ్యెను. కమలాకాంతరావును జూచినంతనె యాతఁడిఁక గంటయో రెండుగంటలో మాత్రముజీవించుననని నాకుఁదోఁచెను. ఆతనికి నాకు నెక్కుడు పరిచయమున్నందున నాతఁడు నాకేమైనఁజెప్పనేమోయనితలఁచి నేనాతని మొగముదగ్గరకువంగి, యాతనివీనులదగ్గర నామోమును జేర్చి మాటాడఁబోవ, నింతలోఁ గమలాబాయి యధికారయుక్తస్వరమున—

"వీరినిఁగొంచెముసేపుస్వస్థముగాఁ బరుండనిండు. ప్రశ్నల నడిగి యాయాసపెట్టకుఁడు అనియఱచెను.

కొందఱు మనుష్యులరూపమును గంఠస్వరమును భయంకరములుగనుండుననుట యనుభవజ్ఞులకుఁ దెలిసినవిషయమే! కావున, నేనొకించుక వెనుకకుఁదగ్గితిని. నేనేమియుఁబలుకకుండుటఁగని కమలాకాంతరావు నిరాశనందెను, ఆతఁడశ్రుపూరితనేత్రములతో నన్నుఁజూడసాగెను. ఆతనిదీనవదనముంగని యాతఁడేమియో చెప్పనున్నాఁడని నేను తెలిసికొంటిని. వెంటనె నేను కమలాబాయివంకకుఁదిరిగి—

"కమలాకాంతరావుగారు నాతో నేమియో చెప్పఁదలఁచి యున్నట్లున్నారు. కావున, మీరు కొంచెమావలికేగినచో బాగుగ నుండును" అని చెప్పితిని.

కాని, నావినయభాషణములవలన నేమియుఁ బ్రయోజనము లేక పోయెను. తనతావునఁ గూర్చుండియే యామె—

"ఇట్టిసమయమున వీరిని విడిచిపోవుటకు నాకు మనసొప్పకున్నది. తనపత్నికే తెలియఁగూడనట్టి రహస్యవిషయము లేమియుండును? వీరేమైనఁ జెప్పవలసియున్నచో నాసముఖమునను చెప్పవచ్చును!" అని యామె తనతీవ్రదృష్టినొక్కమారు పతిపై ప్రసరించి దిప్పెను.

ఇప్పుడేమి చేయఁదగునాయని నేనాలోచింపసాగితిని. కమలాకాంతరావుమోమున—అతఁడేమో చెప్పఁదలఁచియున్నట్లు స్పష్టమగుచుండెను. చాలసేపాలోచించి నేను కమలాకాంతరావును ద్దేశించి— "కమలాకాంతరావుగారూ! మీరేమైనఁ జెప్పదలఁచియున్నారా? అట్లయినచో మీరనుమానింపక చెప్పవచ్చును. మీతుదివిన్నపము నేనానందముతో మన్నింతును" అని కమలాబాయినిలక్ష్యపెట్టక యె క్రిందికివంగి, యాతఁడేమనునో వినఁదలఁచితిని.

నాయీప్రయత్నము ఫలించెను. ఆతఁడు తనపత్ని దెసనున్న దృష్టిని నావంక కు మరలించెను. అపిమ్మటఁ దనశక్తియంతయు నొక్కటిగఁ జేర్చి యాతఁడు తనవామహస్తమును దలగడక్రిందఁ బెట్టెను.

కమలాబాయి తనభర్త తలగడక్రిందనుండి యేమియో తీయుటకై ప్రయత్నించుచున్నాఁడని తెలిసికొని "ఏమికావలయును?" అని యడిగెను.

కాని, యంతలోనె యాతఁడొకచిన్నిహస్తమునుదీసి నాచేతి కొసఁగెను. అపుస్తకము నాతఁడు నాకొసఁగుచుఁ దనపత్నిఁ జూచి—

"అది రామదాసుగారొసర్చిన యాత్మజ్ఞానబోధశ్లోకములుగల పుస్తకము. అది నాకు మిగుల నిష్టమగుపుస్తకమగుటచే దానిని ప్రభాకరరావుగారికిచ్చితిని. అదియె నాయిష్టము" అనియెను.

కాని, కమలాబాయికిఁ బతివాక్యములపై విశ్వాసముకలుగ దయ్యెను. సంశయదృష్టితో నామె యాపుస్తకమువంకఁ జూడసాగెను. నేను తత్క్షణమె యాపుస్తకమును నాజేబులోఁబడవైచితిని.

నేను—(మెల్లగా) నేను మీబహుమానము నానందముతో స్వీకరించుచున్నాఁడను.

“ఈపుస్తకము నతిలక్ష్యపూర్వకముగఁ జదువుకొనుఁడు” అని యాతఁడనియెను. ఆతఁడుమాటాడినస్వరమునుబట్టి కమలాబాయిబెదరెను. కూర్చున్నచోటునుండి సగములేచి యామె ద్వారముదెసకుఁ జూచి యేమియోసైగచేసెను. ఆమె యెవ్వరికిసైగచేసెనో దానియర్థమేమో నాకుఁదెలియలేదు. పిమ్మట నామె మగఁడున్నగఁ గూర్చుండి తనపతిచెవిలో నేమియోచెప్పెను.

“ఆమెస్వరూపమెప్పటివలెనె నేఁడును గంభీరమును, నిశ్చలమునై యుండెను; కాని, యామెచెప్పినమాట కమలాకాంతరావు పెడచెవినిబెట్టెను. ఆతఁ డామెనుజూడకయె నాతో—

“నాకొఱకు మీరింకొకకార్యమును జేయుదురా?” అనియెను.

నేను “అవశ్యముగ! నేను మీకార్యమును మహానందముతో—” అని యింకను మాటాడనుంటిని. కాని, యింతలోఁ గమలాకాంతరావుపత్నితో మాటాడనారంభించినందున నావాక్యమంతటితో నాగిపోయెను.

ఆతఁడు—(భార్యతో) పో! నాబల్లనిటకుఁదెప్పింపుము.

ఆమె వజ్రాఘాతమైయున్నను నింతగభయపడియుండదు. అతని వాక్యమునువిని నేనుగూడ నొకింతయాశ్చర్యనిమగ్నుఁడనైతిని. తన పత్నికింతటిద్వేషభావముతో నాతఁ డాజ్ఞయొసఁగుట నేనెన్నఁడువిని యుండనైతిని.

ఆతఁడు—(అధీరతతో) బల్ల—ఏమియిట్లు చూచుచున్నావు” త్వరితముగ నాబల్లనిచటికిఁ దెప్పింపుము!

ఇప్పుడామెకచ్చోటువాసిపోవుటకన్న గత్యంతరము లేకపోయెను. కాని, యామె తత్క్షణమె లోనికరుగదయ్యెను. లేచినిలువఁబడి యేమోసైగ చేసినంతనె యామెకనిష్ఠకుమారుఁడగు గోపాలరావచటికరుదెంచి తనమాతృస్థానమునఁగూరుచుండెను. ఆమె యింకను నచ్చటనె యిటునటుతిరుగుచుండుటఁగని కమలాకాంతరావు—

"నేనింకనెంతోసేపుజీవింపఁబోను. ఇప్పుడైన నాయిష్టప్రకారము నను క్షమింపనిమ్ము" అనియెను.

"మీసుఖముకొరకై యేమిచేయుమనినను జేయుటకుసంసిద్ధనై యున్నదానను. ఇట్లుపలికెదరేమి? ఇదిగోనిప్పుడే మీబల్లనిచటికిఁ దెచ్చెదను" అని యామె యప్పుడె యాగదివీడిపోయెను. కాని, యామెకుమారుఁడు చేయూడించుచు నామెనావలికిఁబొమ్మని సైగ చేసినందున నామె వెడలిపోయెను. ఆరహస్య సంజ్ఞయప్పుడే నాకన్నులఁబడియెను. ఆమెయావలికరిగినపిమ్మట నేను కమలాకాంతరావు దగ్గరకరిగి వినయముతో—

"కమలాకాంతరావుగారూ! మీహృదయశాంతికై నేనేమైనఁ జేయవలసియున్నదా?"

అప్పుడాతఁడింకేదియో విచారమునమగ్నుఁడై యుండుటచే నామాటల యెడల లక్ష్యభావముంపకయె యిట్లనియెను.

"ఇంకనుగొంచెముసేపు నాప్రాణములుపోకున్న నెంతబాగుగనుండును! నేనొకతప్పిదమునుసవరించుకొనవలయును." అని యాతఁడు నాచేతినిబట్టుకొని, నన్నుసమీపమునకుదివిచికొని, కంపితస్వరమున "ఆపుస్తకము! దానిని జాగ్రత్తగానుంచుఁడు. దానిని మీయొద్దనుండి బలవంతముగ లాగికొందురని నాకనుమానము కలుగుచున్నది. ఏమైనను దానిని—"

ఇంతలోఁ గమలాబాయిబల్లనెత్తికొని త్వరితముగ లోనికరుదెంచినందునఁ గమలాకాంతరావు తనవాక్యమునంతటనాపివేసెను.

ఆమె యాబల్లను నాకుదగ్గరగాఁబెట్టినందున నేనాతావునుండి యించుక జరగవలసివచ్చెను.

నేనట్లుజరగినందున నాతఁడు నిరాశఁజెందలేదు. ఆబల్లనుగని నంతనె యాతనిముఖము ప్రఫుల్లమయ్యెను. ఆతఁడు ప్రఫుల్లవదనముతో నాబల్లవైపునకుఁ గొంతసేపుచూచి పిమ్మట నన్నుఁబిలిచి యందలి సామానులనన్నిటిని బయటికిఁదీయుమనియెను.

నేనాయాజ్ఞవిని సంభ్రమాయత్తచిత్తుఁడనైతిని. అప్పుడు కమలాబాయినిచూచి నేను—

"మీరుండగ నేను మీపత్రిడాయరులోని సామానులనంటుట యనుచితము—" అనుచుండ గోపాలరావు చేసినసయనసంజ్ఞంగని యామె "వీరియంత్యేచ్ఛను మన్నింపవలయును. మీరు మనసున నేమియుసంకోచింపక వారియిష్టమును నెఱవేర్పుఁడు" అని యామె తనతావునఁగూర్చుండెను.

వెంటనె నేనాడ్రాయరులోని సామానులను దీయఁదొడఁగితిని. అందు పత్రములనేకములుండెను. సర్కారులకోటాయొకటి యుండెను. ఆలకోటాలోఁ గమలాకాంతరావుమరణశాసనముండునని నేననుకొంటిని. కాని, యాతఁడు దానివిషయమై యేమియుఁజెప్పలేదు. అన్ని పత్రికలతో దానినిగూడఁ గ్రిందఁబడవేసితిని. ఆయఱలోనికాగితముల నన్నిటిని దీసినపిమ్మట నాతఁడు నన్నుఁజూచి—

"లోపలిభాగమున నొక దొంగయఱయున్నది. దానినిదెఱచిన నందులో నామరణశాసనముండును. దానినిదీసికొని మీయొద్దనుంచుఁడు. ఆమరణశాసనమును దత్తణమె మీరు వకీలు నీలకంఠరావు గారికిచ్చెదనని వచనమిచ్చినచో నేను శాంతచిత్తముతో మరణింతును" అనియెను.

కమలాబాయి యాశ్చర్యముతో "మరణశాసనమా!" అని యఱచెను.

తా మేమిమాటాడుచున్నదియుఁ వీరికిఁ దెలియుచుండ లేదు కాఁబోలును! వీరికి వాతము గ్రమ్ముచున్నది. వీరిమరణశాసన మీ క్రిందఁబడి యున్నలకోటాలోనున్నది" అని యామె చెప్పఁబోవుచుండెను. కాని, యింతలో నామెపుత్రుఁడు గోపాలరావు—ఆమెనూరకుండుమని సైగ చేసినందున నామె తనమాటను మార్చి "అవును; నిజముగనె వీరికి భ్రమకలిగినట్లున్నది. ఆదొంగయఱలో నొకమరణశాసనము దాఁచి యుంచుట మాకుఁ దెలియనే లేదు. ఆఁ—ఇదేమి?" అనియెను.

ఆ లోపలియఱనుండి నేనొకఁకోటాను బయటికిఁదీయుటఁగని యామె యాకడపటివాక్యము నుచ్చరించెను. చాలసేపటివఱకు నా దొంగయఱను దెఱచుట నాకుఁ గష్టముగనుండెను. తుదకెట్లో ప్రయత్నించి దానిని గ్రిందికదిమి యాయఱను దెఱచితిని. ఆకాగితము క్రిందఁ బడెను. ఆలఁకోటాను దీసికొనుటకు నేనొకించుక యాలసించియున్నచో నయ్యది కమలాబాయి చేతిలోఁ బడియుండును!

"దీనినతిజాగరూకతతోఁ దీసికొనిపొండు" అని యాతఁ డతి దీనముగఁ బలికెను. అతని యప్పటి దీనస్థితికి నాకును దుఃఖము కలిగెను. అప్పుడు నేను "రావుజీగారూ! మీ రీవిషయమై వెతనందఁ బనిలేదు. తత్క్షణమే దీనిని నీలకంఠరావుగారి కంద జేయుదును" అని యంటిని.

గోపాలరావును, గమలాబాయియు నాశ్చర్యచకితులై యొండొరులఁ జూచికొనసాగిరి. పిదపవారు తమదృష్టిని నా జేబువంకకు మరలించిరి. కమలాకాంతరావా మంచమునఁ బరుండియే గర్వభూయిష్ఠయగు భార్యయొక్కయుఁ, బితృప్రేమశూన్యుఁడగు పుత్రునియొక్కయు, హావభావముల ననిమిషలోచనములతోఁ జూచుచుండెను. తుదకతి కష్టముతో శయ్యనుండి సగము లేచి యాతఁడు—

"తుట్టతుదిని వ్రాసిన యీనామృతిపత్రమున నేజేసినయన్యాయమును సవరించుకొనుటకై నేనొకించుక ప్రయత్నించియున్నాఁడను. ఎవ్వఁడు నాయంత్యేచ్ఛ కడ్డమువచ్చునో, యాతఁడు బాగుపడఁడు!

కమలా! నేను మనోదౌర్బల్యముచే నింతదనుక నీకుదాసుఁడనై యుంటిని. కాని, తుదకీశ్వరానుగ్రహమున నంత్యకాలమునన్నైననేమి, నిన్ను ధిక్కరించి నాకిష్టమువచ్చినట్లుగ నొనర్చుటకు నేను సమర్థుఁడనైనందులకు నాకానందమగుచున్నది. మఱియు—మ—ఱి—యు—"

ఇఁక నాతని కెక్కిలివచ్చెను; ప్రాణములు తలక్రిందులయ్యెను; కన్నులుమూతవడెను; మఱలఁ గనులు తెఱచి యాతఁ డశ్రుపూరిత నేత్రములతో నావంకఁజూచెను—మఱలఁ గనులుమూసికొనియెను! ప్రాణములు విడిచెను! ఆహా! అవసానకాలమునందలి యాతనిదైన్యరూపము నాకెన్నఁటికిని మఱపురాదు!

## పందొమ్మిదవ ప్రకరణము

"కమలాకాంతరావుతో నాకు బహుకాల పరిచయ ముండుటచే నాతని సంస్కారక్రియలుముగియువఱకు నేను వారియింటనె యుండవలసివచ్చెను. దహనసంస్కారమైన పిమ్మట నేనింటికరిగెదనని కమలాబాయితోఁ జెప్పితిని. కమలాకాంతరావుగారి మరణశాసనము నొకగడియయైన దూరముగనుంచనైతిని. నేను సెలవందుటకై కమలాబాయికడకరిగినప్పు డాపత్రము నాజేబులోనెయుండెను. ఆమె తన దృష్టిక్షేపముచేతనే నాజేబులోనికాగితము నాకర్షించునేమోయను భీతిచే నేనాజేబులోఁజేయిడి యాకాగితమును గట్టిగఁబట్టుకొని యుంటిని. అదిగని యామె గోపాలరావువంక నోరఁగంటఁజూచి మందహాసముచేసెను. వెంటనె యాతఁ డాగదివీడిపోయెను. ఆతనియప్పటి రహస్యభావపూరితవదనముంజూచుటతోడనే యిట్టిదుష్టునితో నేనిప్పుడు వైరము తెచ్చిపెట్టుకొనుట బాగుగనుండ లేదని నాకుఁదోఁచెను.

కాని, యదిదుఃఖసమయమగుటచే నేమిసేయుటకునుదరుణము కానందున నేను కమలాబాయియనుజ్ఞవడసి ద్వారముకడ కరిగితిని ద్వారముదాటుచుండ నింతలోఁగమలాబాయి—

“ ప్రభాకరా ! ఆమరణశాసనముఁ గొనిపోవుట నీకు యోగ్యముగనున్నదని తోఁచుచున్నదా ? ” అని ప్రశ్నించెను.

“ ఔను—ఇందు యోగ్యాయోగ్యకార్యమేమియున్నది ! ”

“ అట్లయిన నేనును గోపాలరావును జేయువిన్నపములను దిరస్కరించి నీవు దానిని గొనిపోవుదువా ? ”

“ ఏయుపాయము లేనందున నాకిటులొనర్ప వలసివచ్చుచున్నది. ”

“ కాని, మనసునఁ దలంచుము ! దీనివలన నేమైన నపాయ మొదవినచో నితరులను నిందింపకుము. అందులకు నీవే కారకుఁడవగుదువు ! ”

అని యామెయొక్కమాఱు చురుకుఁజూపులనాపైఁ బ్రసరించి గిఱ్ఱునఁదిరిగి లోనికిఁద్వరితముగ నెడలిపోయెను.

క్రోధావిష్టురాలగు నామెరూపముఁగాంచి నేను భీతచేతస్కుఁడనైతిని. మార్గమున గోపాలరావు నన్నడ్డగించునను భీతి నాకుఁగలిగెను. దీనివలన గోపాలరావు నాశరీరమున కేయుపాయమునైనఁ గలుగఁజేయునేమోయని భయపడుచుంటిననుకొనకుఁడు ! కాని, యేరీతినైననేమి, నావినాశముఁగోరువారియింట నేనున్నట్లు నాకు స్పష్టమయ్యెను. త్రోవదప్పి వ్యాఘ్రపంజరమునఁజిక్కినకురంగముగతి నేనగపికుఁడనైతిని. మేడమెట్లనుదిగునప్పుడా మెట్లనుండిజారి నేను క్రిందఁబడుటకేదైననొకయుపాయము గోపాలరావు పన్నియుండెనేమోయని నాకుఁదోఁచెను. నేనతిజాగరూకతతో మెల్లగ నా మెట్లనుదిగితిని. అట్లు దిగుచుండ నేను నామనసున నిట్లుతలపోసితిని. “ అనీచున కిదియేమార్గమా ! నాయంతట నేనీసోపానముపై జారిపడకున్నను, ఆతఁడరుదెంచి, నాకాళ్లలోఁగాళ్లుంచి నన్నుఁ గ్రిందికిఁబడఁద్రోయఁజాలఁడా ! ”

నిజముగ నే వానికీమార్గము తోఁచియుండు నెడ నట్లుచేయుటకు వెనుదీసియుండఁడు ! నాపై బహిరంగముగ ద్వేషమువహించి యేవిధముగనైన నీమరణశాసనమును లాగికొనుట కీమార్గమె వానికి సులభమైనది; కాని, మెట్లుదిగి నేను తలుపుకడకరుగువఱకు నాకాతఁ

డగపడలేదు. నేనిప్పు డతిజాగరూకుఁడనై యుండుటచేఁ దన్ను లక్ష్యపెట్టనని తలఁచి కాఁబోలు నాతఁడు నాకగపడలేదు.

ఈ విధముగా నాలోచించుకొనుచు నేను ముఖ్యద్వారము కడకు నడచుచుండ, గదిలోనుండి యొకమనుష్యుఁడు బయటికివచ్చి యాతలుపుదగ్గర కేఁగుచుండుట నాకన్నులఁబడెను. ఆతఁడు గోపాలరావై యుండునని నేననుకొంటిని.

ఆ సమయమున నాగృహాంగణమున నొక్కరును గనఁబడకుండిరి. ఇట్టి సమయమున నామనుజుఁ డతిత్వరితగమనమున నాద్వారము కడకు వచ్చుటచే నాతఁడేదో దురుద్దేశముతో నావెంటవచ్చుచున్నాఁడని నామనోదేవత నాకుఁ జెప్పుచుండెను. సహజముగనె బెదరి నేనొక్కడుగు వెనుక కేగితిని. నాదృష్టిమాత్ర మొక్కరీతిని యామనుష్యునిపై నుండెను. నాకేదో చిక్కుకలుగనున్నదని తలంచి దానినుండి తప్పించుకొనిపోవుటకై మఱియొక మార్గమున్నదేమోయని యొక్కమారు నలుదిక్కులఁ దిలకించితిని. కాని, యెందును నాకు మార్గమగపడలేదు. వంటయింటఁ బ్రవేశించి, యాతఁడు వెడలిపోవునఱకు నచ్చటనె డాఁగియుండుటయో, లేక, యాతని లక్ష్యపెట్టక ధైర్యముతో సరళముగా నామార్గముననె వెడలిపోవుటయో — ఈ రెండుపాయములకన్న వేఱుపాయము నాకులేదు. కాని, యాఁడుదానివలె బిఱికిపందవలె వంటయింటఁజొచ్చి మూలనొదిగి కూర్చుండియుండుట నాకిష్టములేదు. తుదకు ధైర్యముఁ దెచ్చికొని ద్వారముకడకరుగఁగా నాకచట నొక కృశాకృతియగపడెను. కాని, యామనుజుఁడు గోపాలరావుకాఁడు! ఆతని యగ్రజుఁడు నారాయణరావు.

నారాయణరావు వచ్చుటఁగని నేనాశ్చర్యముతో హతబుద్ధినైతిని. నామనసున నప్పుడు నారాయణరావు విషయమై యేవిచారము నుండకునికి, నాతనినచ్చుటఁ గనినతోడనే నాహృదయమున ననేక కుశ్శంకలుత్పన్నములయ్యెను. కమలాబాయీ గోపాలరావుల ఘోర

భయంకర దుర్మార్గాలోచనలతో నీతనికి సంబంధముండునా యని నామనసులు ప్రశ్నించితిని. కాని, వారియింటిలోనున్న వారిలో నారాయణరావొక్కఁడే సద్గృహస్థని నాకుఁ జాలఁగాలమునుండియు దెలిసియున్నందున నావిచారము నామనసునఁ జాలసేపుండదయ్యెను.

నారాయణరావు నాకాదరభావముతో నభివాదనము చేసి "ప్రభాకరరావు! ఇచట నొక్కక్షణమైన నాలసింపకుఁడు. తక్షణ మిల్లుసేరుఁడు!" అని యాతఁడు భయవిహ్వలహృదయముతో నిటునటు చూడసాగెను. అచట నెవ్వరు లేకుంటఁ గని మరల నాతఁడు "మార్కెట్టురోడ్డునఁ బోవలదు. ఇంకొకత్రోవను బొండు — దగ్గర త్రోవ నేగుఁడు! పొండు!" అని యాతఁడు సమీపముననున్న గదిలోని కరిగెను. అతఁడొసఁగిన సూచన విషయమై యాలోచింపకయే తక్షణమే దాని నాచరణలోనికిఁ దే నిశ్చయించి యిల్లుబయలు వెడలితిని.

బయటఁ జల్లగాలి వీచుచుండుటచే నాకుఁ గొంచెము నెమ్మది కలిగెను. స్వచ్ఛమగు చంద్రప్రకాశమువలన నాకుఁ ద్రోవయగపడు చుండెను. ఆచంద్రప్రకాశమున పచటిసృష్టిశోభ కడుమనోహరమై యుండెను. శుభ్రవస్త్రధారిణియగు ప్రకృతిదేవత పుష్పలతారూపక మణిహారములను ధరించి నిశాపతికి స్వాగతమొసఁగుచుండెనో యనునట్లుండెను. ఆదృశ్యము వీక్షించుటవలన నాభీతియొకింత దూరమయ్యెను. "మార్కెట్టురోడ్డునఁ బోవలదు" అను నారాయణరావుగారి తుది వాక్యమింకను నా చెవులలోఁ బ్రతిధ్వనించుచుండెను. నారాయణరావు సూచనకర్థము నేఁడామరణశాసనము వకీలునకీయవలదనియే యైయుండఁ బోలును!

"నారాయణరావేదైన దురుద్దేశముతోడ నిట్లెందులకు మాటాడ రాదు!" అని నాకు శంకపొడమెను. కాని, యాతని నిష్కల్మష ప్రేమయెడ నాకు విశ్వాసముండుటచే నాశంకను నాహృదయము నుండి పాఱఁదోలితిని. మార్కెట్టురోడ్డునఁ బోయినచో నాకేదైనఁ

ప్రాణసంకట మొదవునని తెలిసియే నారాయణరావు నాకీసూచన నొసంగెనని యూహించుకొంటిని. మరణశాసనము నాయొద్ద నుండుట యంతయుచితము కాదనియెంచి, నేను నాగృహమునకే చేరితిని. ఇంటికరుదెంచిన పిమ్మట సావకాశముగాఁ గూరుచుంటిని. అప్పుడు నామనసున విచారతరంగములుదయించెను. నేఁడు నేను పిఱికివానివలెఁ బ్రవర్తించితినని నాకుఁదోఁపసాగెను. ఇంతవఱకు నేనతిశూరుఁడనని తలంచుచుంటిని. కాని యనుభవమున నేనతిభీరువునని తెలియవచ్చెను. నేను భీరువుననుతలంపు నాకెట్లోయుండెను. నేనతిభీరువునై యుంట నాకుమాత్రమే తెలిసియుండక నారాయణరావునకుఁ గూడఁ దెలిసెను, నాస్వభావమందలివైగుణ్యమాతనికిఁ దెలిసినందుననె యాతఁడు మార్కెట్టురోడ్డున నరిగినచో నీకుఁ బ్రాణోపద్రవము సంభవించునని నన్నుభయపెట్టియుండఁబోలును! నేనామరణశాసనమును దత్క్షణమె వకీలునకందఁ జేసియున్నచోఁ బిత్రార్జితమగుచాస్తిలో నొక్కగవ్వయైన నాసోదరులకు లభించియుండదు. కావుననె, యాపత్రమప్పుడే వకీలు చేతిలోఁబడుట యాతనికిష్టము లేదు. ఆపత్రమిఁకఁగొంత కాలము నాయొద్దనేయున్నచో నెట్లయిన దాని నాతఁడు నాయొద్దనుండి హరింప నెంచియుండును. నాయీతప్పిదమునకై యొకనిరపరాధి మహాకష్టముల ననుభవింపవలసివచ్చును; ఈవిచారము నన్నుబాధింపఁజొచ్చెను. ఇఁక నైన విలంబముసేయకుండ నీ మరణశాసనమును నీలకంఠరావుగారి యింట నొప్పగింపవలయునను నుద్దేశముతోఁ దత్క్షణమె నేను బయలు దేఱితిని.

నేనతివేగముగనడచి మార్కెట్టురోడ్డునందున్న వకీలునీలకంఠ రావుగారి బంగాళాకేగితిని, ఆహా! నేనెంతపొరపడితిని! ఎంతతప్పొ నర్చితిని! అప్పటికెంచుమించుగఁ బావుగంట సేపటికిఁబూర్వమె యాతఁడు బొంబాయి కేగుటకై స్టేషనునకరిగెనఁట! స్టేషనునకరిగి వారిని దర్శింప నిశ్చయించితిని. అక్కడకై దాదాపుపదినిమిషములనడకలో స్టేషనుండెను.

దైవదుర్విపాకమున నచటఁగూడ నాకు నిరాశయేకలిగెను. స్టేషను నకుఁబోవుదమని బంగాళానువీడి బయటికరుదెంచుచుండ రైలుకూత నాకు వినవచ్చెను. సరి! నీలకంఠరావును దర్శించునాశ నాకుఁ బూర్ణముగనశించెను. అతఁడు మరలనెప్పుడువచ్చునని యింటియొద్ద నడుగఁగా, నాతఁడు రెండుమూఁడుదినములలో వచ్చునని ప్రత్యుత్తరమువచ్చెను. ఈవార్త వినినందున నాదుఃఖమునకు మేరయేలేక పోయెను.

ఆరాత్రి శయ్యపైఁబరుండుటకుఁబూర్వ మొక్కమాఱు కమలాకాంతరావుగారిచ్చిన పుస్తకమునుదెఱచిచూచితిని. అపుస్తకమున నేనో రయొకకాగితమున నేమైనవ్రాయఁబడియుండునని నేనుతలంచియుంటిని. కాని, యీవిషయమునను నాకు నిరాశకలిగెను. అపుస్తకమునఁ గొన్నిశబ్దములక్రిందను వాక్యములక్రిందను పెన్సిలుతోఁ గుఱుతులుంపఁబడియుండెను. కాని, యప్పుడు నాకు వానితత్వము తెలియు లేదు.

## యిరువదియవ ప్రకరణము

"ఆరాత్రి నిద్రాదేవికి నాయందనుగ్రహముపొడమలేదు. దానవేను విసిఁగి యరుణోదయమునసెలేచి నాకార్యక్రమణమున కాలకింపనైతిని, నిన్నఁటిదిన మసంపూర్తిగావిడిచిన యాలేఖను బూర్తిచేసినపిమ్మట నౌషధాలయమునకరుగనెంచితిని. కాని, యట్లుచేయఁజాలనైతిని. నేనాలేఖను వ్రాయనైయుంటిని; ఇంతలో నారాయణరావు నాకడ కేతెంచెను.

ఆతనిఁగని నేనాశ్చర్యచకితుఁడనైతిని. కాని, నాకాతనియెడ భయముకలుగలేదు. ఆతని యీయాకస్మికాగమనమునకుఁ గారణమేమైయుండునో కనుఁగొనవలయునని నేనాతనివంకఁ దదేకదృష్టితోఁ

జూడసాగితిని. ఆతఁడు నేఁడు నన్ను మోసపుచ్చునని నేననుకొనలేదు. ఆతఁడును నేఁడు విశేషగాంభీర్యముతో నుండెను. మౌనముతో నాతఁడొకయాసనముపైఁ గూరుచుండెను.

ఆతఁడు : నిన్నరాత్రి మీరు మాజననివిన్నపమును మన్నింపరైతిరి.

నేను : (ఔననునట్లు తలఁగదలించితిని.)

ఆతఁడు : అయిన మీరు మహాపరాధ మొనర్చితిరి. నాయనగారు మీచేతికొసంగిన యీపత్రి మితరులకుఁ జూపరాదు. ఆతఁ డప్పుడు తెలివిలోనుండెనేని దానిని మీకిచ్చియుండఁడు. మీకన్నను మా యమ్మకు మాజనకుని స్వభావము చక్కఁగఁ దెలిసియున్నందున మీకామె మాటలయెడ విశ్వాసము కలిగియుండవలసినది.

నేను : ఇచట విశ్వాసావిశ్వాసములతోఁ బనిలేదు. మృత్యుద్వారమునఁబడియున్న యీమనుజుఁ డాకాగితమును నాకిచ్చెను. ఆతని కడసారి కోర్కె ననుసరించి ప్రవర్తించుటయే నాకు విధ్యుక్తధర్మమై యున్నది. నిన్నఁటి దినమున నేనాకాగితమును గమలాబాయికిచ్చియున్నచో మీరే నన్నందులకై దూషించియుందురు.

ఆతఁడు : మాజనని—

నేను : మీజనని విషయమై మీరేమియుఁ బలుకవలదు.

ఆతఁడు తీక్ష్ణదృష్టితో నావంకఁ జూడసాగెను. ఆతని మనసున నేమున్నదో నేను తెలిసికొని—

"మీతండ్రిగారి మరణశాసనమును మీకీయఁజాల" నని యంటిని.

ఆతఁడు : అదియింకను మీయొద్దనేయున్నదా ?

నేను : దానిని నేనీయఁజాలను.

ఆతఁడు తనకుర్చీనుండి లేచి నన్ను సమీపించి సాంత్వనవచనముల నిట్లనియెను.

" మీరు మీ కర్తవ్యమును నెరవేర్చుచున్నారు ; కాని, యందు వలన సంభవించుదుష్ఫలమును మేమనుభవింపవలసి వచ్చుచున్నది. నేనిప్పుడు మాజనని యాజ్ఞ ననుసరించియే మీకడకు వచ్చియున్నాఁడను—మీరిట్లుచేసి మాకునష్టము కలిగించినను—కలిగించుచున్నను—నిన్న మీకుఁ జేసినయవమానమునకై మాయమ్మ పశ్చాత్తాపపడుచున్నది. కావున, నిన్నటివిషయములను మనసునసుంపక మీ రెప్పటి వలెనె మాయందుఁ బ్రీతినుంతురని నేనాశపడుచున్నాఁడను.

నేను : నారాయణరావు ! మీతండ్రిగారికిని నాకును జిరకాల మైత్రికలదు. కావున, మీరేమిచేసినను మీయెడ క్షమాభావమును వహించియుండుటయే నాకర్తవ్యమని యనుకొనుచున్నాఁడను. మీతల్లికి నాయెడల ద్వేషభావమున్నదని నేను జక్కఁగ నెఱిఁగియున్నాఁడను.

" దాన—నాకత్యంతఖేద —" ఇఁక దనమాటలువినుట నాకిష్టములేదని యెఱింగి నారాయణరావు తనవాగ్ధోరణినిమార్చి యిట్లనియెను. " మీకున్నంత మనోధైర్యము నాకులేనందున నేను మిగుల విచారించుచున్నాఁడను, " అని యాతఁడు తనపితృస్మరణార్థ మేయేసంఘముల కెంతెంతదానధర్మములు చేయఁదలంచినదియు, నేయేధర్మకార్యముల నొనర్పనెంచినదియు, నాకుఁదెలిపి నాసమ్మతినికోరెను.

ఆతనిమాటలనన్నిటిని శాంతచిత్తముతోవిని నాకు యోగ్యమని తోఁచినరీతిని నేనాతనికిఁ బ్రత్యుత్తరమిచ్చితిని. నేను గడచిన రాత్రి యొకింత పిఱికితనమును బ్రకటించినందున నాతఁడు నన్నుపహాసించుచుండినను, కొన్నివిషయములలో నేనాతనికి సముఁడనై యుండుట యాతనికిఁ దెలియకపోలేదు.

చాలసేపటివఱకును లోకాభిరామాయణమునఁ బ్రొద్దుపుచ్చి నారాయణరావింటి కరుగుటకై బయలుదేరెను. కాని యటుపోవునప్పు డాతఁడు పరీక్షాపూర్వకదృష్టితో నాగది-నెల్లకడలఁ [illegible]

నాకుఁ దెలియవచ్చెను. అతఁడు నాగదినింతటివిమర్శదృష్టితోఁ జూచుటలో నాతని కేదో దురుద్దేశమున్నదని తలంచి నేనొకించుక భయపడితిని. ఆమరణశాసనమును జాలదినములు నాయొద్దనుంచుకొనఁగూడదని నిశ్చయించుకొంటిని. రెండుమూఁడు దినములలో నీలకంఠరావు బొంబాయికరిగి దాని నాతని కొప్పగింపవలయునని దృఢనిశ్చయుఁడనైతిని.

అనంతర మానాఁటిసాయంకాలము నేను శివాలయమునకుఁ బోవుచుండ మార్గమధ్యమున గోపాలరావగపడెను. ఏప్రయోజనమును లేకున్నను. అతఁడు తనంతటతానే నాకడకరుదెంచి తనతల్లికిజబ్బుగానున్నదని చెప్పెను. కాని, యాయుక్తిచే వాఁడు నన్నుఁ దమగృహమునకుఁ బిలిపించికొని, నన్నుఁజిక్కులోఁ బడఁద్రోయ నెంచుచున్నాఁడని నాకుఁ దోఁచి, నేనాతనిమాటలఁ బెడచెవినిబెట్టి ముందఱికరిగితిని.

శివాలయమునుండి నేనింటికరుదెంచితిని. దేవాలయమున నసంఖ్యాజనులుండుటచే వారిత్రోపుడువలన నాకెంతో యాయాసము కలిగెను. కమలాబాయినిజముగనే రోగగ్రస్తయైయున్నదో, లేక, యట్లునటించుచున్నదో యని నేనాలోచించుచున్నందున నెప్పటివలె ప్రియురాలగు పుష్పలతనుజూడఁబోవుట మఱచిపోయితిని. సంతోషమున స్కయు, నకళంకయునగు పుష్పలతముఖచంద్రబింబముపై విలసిల్లుచుండు మృదుమధురమందహాసావలోకమున నాశ్రమమంతయుఁ దొలఁగియుండును. కాని, నేఁడట్లుజరగినదికాదు.

గిరిజనెచ్చెలియగుయమున నన్ను ద్వారముకడఁగలిసికొనియెను. గిరిజయూరికిఁబోయినది మొదలు నేను యమునయింటనె భోజనము సేయుచుంటిని. నన్నుఁగనినంతనే యామె యాత్రముతో—

“ మిమ్ముఁజూచుట కొకస్త్రీవచ్చియున్నది ” అనియెను.

నేను—ఆమెయెవ్వరో !

యమున—నేను డాక్టరుప్రభాకరరావు సోదరినని చెప్పినది. ఆమెహాలునగానున్నది. ఆమె తటాలున మీకచేరిగదిలోనికరిగి

కూర్చున్నది. చాలసేపటివఱకు నామె మీకై నిరీక్షించి మీరురారని యిప్పుడే వెడలిపోయినది.

నేను: (ఆశ్చర్యముతో) ఏమి! నాచెల్లెలా? నాకుఁ జెల్లెం డ్రెవ్వరును లేరే! ఆమెరూప మెట్టులుండెనో చెప్పఁగలవా?

యమున: నేఁజెప్పఁజాలను. ఆమె మేలిముసుఁగు వేసికొని యున్నందున నామె రూపమును నేను బాగుగఁ గుఱితింపఁజాలనైతిని. ఆమెవయస్సెంతయో యదియును జెప్పఁజాలను. కాని, యామెనడక తీరుఁగని యామె మీకగ్రజయై యుండునను కొంటిని.

ఆమె మాటలధోరణికి నామేనుగగుర్పొడిచెను! "నీకుఁ గృతజ్ఞుఁడను" అని యెట్లోనుడివి వేగముగ నేను మేడపైకరిగితిని. ఆస్త్రీ యెవ్వరో నాకుఁ గొంచెమూహింపవలసుపడెను.

నాగది గుమ్మముకడ కరుదెంచి బయటినుండియె లోనికిఁదొంగి చూచితిని. గదిలోని సామానులన్నియు నెక్కడవక్కడనె యుండెను. లోనికరిగి తొలుత నేను నాబల్లకడకేగితిని. నేను బయటికరుగునప్పు డక్కడఁబెట్టిన కాగితము లక్కడనెయుండెను. కాని వానినెవ్వరో కదలించియుండిరి. ఏలయన — నేనొకవైపునఁ బెట్టియుండిన గుఱుతు కాగిత మిప్పు డీకాగితములతో నుండెను. అంతట నన్ను భయమావహించెను. నేను సభయాంతఃకరణముతో ఆ మరణశాసనముండున్నదో లేదో చూచుటకై డ్రాయరునుదెఱచితిని. దైవవశమున నదియుండే యుండెను. ఆబల్లలోని యొకదొంగయఱలో దానినుంచియున్నందున నదియాస్త్రీకిఁ గనఁబడలేదు.

ఆసీచస్త్రీ నాగదిలోనికి వచ్చిపోయెననివిని నేనుకళవళమంద సాగితిని. ఆమెప్రతిబింబ మింకను నాకాయద్దములోఁ గనఁబడునను భీతిచేఁగాఁబోలును నాకాయద్దము వైపునకైనఁ జూచుటకు సాహసము కలుగలేదు.

ఆమరణశాసనమును సేకరించుటకై వారిన్ని ప్రయత్నము లొనర్చుచున్న కారణమేమియో నాకుఁ దెలియదు. కమలాకాంత రావే మహాపరాధమును సవరించుకొనుట కాపత్రమున నేమి లిఖించి యుండెనో నాకుఁ దెలియదు. కొంచెముపిశ్రాంతి కలిగినపిమ్మట కమలా కాంతరావా పత్రమున నేమి వ్రాసియుండునో యది యాపుస్తకము మూలమునఁ దెలిసికొనవచ్చునేమో యని యొక్కమారా పుస్తకమం తయుఁ దిలకింప నిశ్చయించితిని.

అప్పుడు నాకు వేళుగఁ బనియుండనందున నేనాపుస్తకమును జదువనారంభించితిని. అందొకటిరెండుపుటలు చదివియుందును; ఇం తలో నాతలుపు నెవ్వరో తట్టినసవ్వడి వినవచ్చెను.

గిరిజ గ్రామములో లేనందున నేనే తలుపుఁ దెఱచితిని. కాని, ఆశ్చర్యము! ద్వారముకడ నాయున్మత్తబాలుఁడు నిలిచియుండుట నాకన్నులకగపడెను. వానింగని నేనించుక విసిఁగికొంటిని. ఏపనిమీఁద నిట్లు వచ్చితివని నేను వానినడిగితిని.

వాఁడు : ఊరికుత్తరభాగమునయున్న వీధిలో బండిలోనుండిపడిన యొకమనుజుఁడు నన్ను మీయొద్దకంపెను. ఇప్పుడామనుజుఁ డాజీర్ణ యంత్రాలయమున నిశ్చేష్టుఁడై పడియున్నాఁడు. ఔషధోపచారము సేయుటకై యాతఁడు మిమ్ముఁదోడి తెమ్మనియెను.

అప్పుడు నేనధికముగ శ్రమపడియున్నందున నీయాహ్వానము నాకించుక కష్టముగఁ దోఁచెను. అంతియేగాక, ఆయాకస్మికవార్త కాపుస్తకపఠనము నంతటితో నాపవలసివచ్చెను. ఆపుస్తకమునకును నామనస్స్వాస్థ్యమునకును సంబంధముండుటచే నాపుస్తకము నాపివేయు టయు, నింతరాత్రివేళ నాజీర్ణయంత్రాలయమున కరుగవలసివచ్చు టయు, నాకుఁ బ్రాణముసంకటములుగా నుండెను. కాని, యచటికరిగి నచో నాకెట్టికష్టము లొదవునో యప్పుడు నేనూహింపఁజాలనైతిని. ఆబాలుఁ డున్మత్తుఁడైనను సందేశవ్యవహారమున నారితేరినవాఁడు.

కావున, వాఁడు చెప్పినదనృతమని తెలఁచుటకైన మార్గములేదు. ఆబాలున కస్తమానము నెందైనఁదిరుగుచుండుట యభ్యాసమైనందున వాఁడట్టివేళ నాయుపద్రవము సంభవించినస్థలమున కరిగియుండుటయు సంభవమె. అచటికరుగకుండుటకు నాకుఁబొడమినభీతియు, ననిష్టమును దప్ప వేఱుకారణములులేవు. విపద్గ్రస్తులకు సాయమొనర్చుటయె నా పవిత్రకర్తవ్యమగుటచే నేనచటి కరుగవలసివచ్చెను.

వీలగునంతవఱకు శాంతిభావమునువహించి నేనాయంత్రాలయమునకుబయలుదెడలితిని. కాని, నేనాయంత్రాలయమును సమీపించుకొలఁది నాభీతియును వృద్ధికాసాగెను. కమలాకాంతరావుగారి యింటఁ గమలాబాయినిగనినంతనే నాకెట్టి యాలోచనలును భీతియును బొడమినవో, అట్టియాలోచనలును అట్టిభయమును ఆపురాతన యంత్రాలయమునుగనినంతనె నాకుఁబొడమసాగెను. కమలాబాయి యింట నాయందుఁదోఁచినపిఱికితనమే, యిప్పుడును నన్నావేశించుటం గని, యేమైనను గానిమ్ము—ఆ నాఁటిపిఱికితనమువలన నేనొనర్చిన తప్పిదమువంటితప్పిదము నెన్నఁడును జేయఁగూడదని నేను నామనసున స్థిరపఱచుకొంటిని.

మనసుదృఢపఱచుకొని యతిశాంతభావముతో నేనాయంత్రాలయముసమీపించితిని. అచటకృష్ణవస్త్రాచ్ఛాదితయు, లంబదేహయునగునొకవ్యక్తి చేతలాంతరునుధరించి నిలువఁబడియుండెను. నన్నుఁజూచినంతనె యావ్యక్తి ముందఱికరుదెంచెను. నేను "నీపేరేమి? వ్యాధిపీడితుఁడెందున్నాఁడు?" అని యావ్యక్తి నడిగితి.

"గాయముతగిలిన మనుజుఁడు లోపలనున్నాఁడు" అనియెను.

ఆవ్యక్తి కంఠస్వరము నేను మున్ను విన్నదానివలెనుండుటచే నే నావ్యక్తి మొగముపై పునఃకుఁగాంచితిని. కాని, యావ్యక్తి యంధకారమున నిలిచియుండుటచే మొగమునాకగపడలేదు.

"మీరెవ్వరు?" అని నేను ప్రశ్నించితిని.

నా ప్రశ్న కెట్టి ప్రత్యుత్తరమునీయకయే యావ్యక్తి—
"మనము లోనికరుగుదము రండు" అనియెను.

ఒక్క వారము దినములకుఁబూర్వ మెవ్వఁడైన నొకయపరిచిత పురుషుఁ డిల్లువిన్నవించుకొనియుండిన నేనించుకంతయు లక్ష్యపెట్టి యుండను. కాని నారాయణరావుగారియింట నాపిఱికితనమువలనఁ గలిగిన ఘోరాపరాధము మూలమున, నిష్కాత్మరక్షణార్థమై జాగరూకతతో నుండుటయు నాకుఁ బిఱికితనమనియే తోఁచుచుండెను.

కావున ముందువెనుక లాలోచింపక నేనాయంత్రాలయమున నాతనివెనువెంటనె ప్రవేశించితిని అంధకారపూరితమగు నానిర్జనాలయమున నొకయజ్ఞాతవ్యక్తితోఁ బ్రవేశించుట యెంత యపాయకరమో చదువరులే యాలోచించుకొందురుగాక! క్రమక్రమముగ నాభీతి యభివృద్ధి కాసాగెను. గాయములు తగిలినమనుజు నింతిలోపలికిఁ దీసికొనిపోయి యెందులకుంతురని నాకు సంశయముతోఁచెను. ఆయంత్రాలయమునందలి మధ్యభాగమునకుఁ బోవువఱకు నెట్టెటో నామనసును బిగఁబట్టుకొనియుంటిని. ఇఁకనే స్థైరింపఁజాలకపోయితిని. తుదకు నేనాగృహస్థునిచేయిఁ బట్టుకొని "మీరెక్కడకు నడచుచున్నారు?" అని యడిగితిని.

కాని, నాప్రశ్నకేమియుఁ బ్రత్యుత్తర మొసంగకయె యాతఁడు ముందఱికి నడచుచుండెను. అప్పుడు నేను మరల—

"ఇఁకమీతో ముందఱికి నడచుట నాకిష్టములేదు. పడిపోవుటకు సిద్ధముగనున్న యీభవనమున రాత్రినడచుట యపాయకరము" అని యంటిని.

అప్పటికిని నాతఁడేమియుఁ బలుకఁడయ్యెను.

"ఇఁకనొక్కయడుగైన నేనిడను," అని నేనచటనె నిలిచితిని. కాని, తత్క్షణమె మఱొకవ్యక్తి నాపరోక్షమునవచ్చి నిలిచెను. అప్పుడు భీతిచే నాకెట్టియవస్థ కలిగియుండునో సహృదయు లాలోచించుకొం

చూచుగాక! మొదటినుండియు నావ్యక్తి నావెనువెంటనె వచ్చుచుండె నని నాకిప్పుడు తెలియవచ్చెను. ఆగృహస్థునిఁ గనినంతనే నేను భీతిచే స్తంభితుఁడనై పోయితిని, నేను బిగ్గరగాఁ గేకలిడఁ బ్రయత్నించితిని. కాని, నానోటమాటరాలేదు. ఎట్టకేల కతికష్టముతో—

“ మీ — మీరు — నన్ను — వ — లలోఁ — జిక్కిం చు — కొంటిరి. మీ — రె — వ — రు? నన్నిక్కడ — కేల — తెచ్చితిరి?” అని యడిగితిని.

“ మాకుఁ గావలసిన వస్తువును మీయొద్దనుండి తీసికొనుటకై మిమ్మిక్కడకుఁ గొనితెచ్చితిమి!” అని నావెనుక నిలిచినవ్యక్తి యూప రోధిక స్వరమునఁ బలికెను.

అతని కంఠస్వరమునాలించి యాతఁడు గోపాలరావని తెలిసి కొంటిని—ఇఁకనాయాయువు తుదముట్టెనని నేననుకొంటిని!

## యిరువదియొకటవ ప్రకరణము

గోపాలుని కంఠస్వరము వినినంతనే నాయొడలాపాదమస్తకముఁ గంపింపఁదొడంగెను. నాగుండియలు దడదడఁ గొట్టుకొనసాగెను. నేను నిశ్చేష్టుఁడనై క్రిందఁబడుదునేమోయని నాకు భయము వేయసాగెను. నేనేమియుఁ బలుకకుండుటఁజూచి యాతఁడు—వితండవాదియు నహంభావయుక్తుఁడునైన నీవంటిపురుషుని మాటలతో వశపఱచుకొనుట యశక్యము. మిమ్మనుకూల మార్గమునఁ బెట్టుటకై త్రాసదాయకమైనను మేమీరామబాణము నుపయోగింపవలసి వచ్చుచున్నది.” అనియెను.

నేను: (ధైర్యముఁ దెచ్చికొని) అట్లయినఁ గమలాకాంతరావుగారి వంశజులు తమకార్యసాధనమునకై బందిపోటుతనమునైన స్వీకరింతురా?

ఇంకొకవ్యక్తి : (నిశ్చితస్వరమున) మాకీ వేదాంతముతోఁ బని లేదు.

ఈస్వరమును విన్నతోడనే నామనసున నెక్కడనో దాగియున్న యాశాతంతులేశము తెగిపోయెను. అది స్త్రీకంఠస్వరము అయినను ధైర్యము తెచ్చికొని నేను—

"తన ప్రామాణికత్వముచేతను దయాళుత్వముచేతను జగద్విఖ్యాతుఁడైన నారాయణరావు, నామిత్రుని ప్రియపుత్రిఁ డీనీచకృత్యమునకుఁ దన సమ్మతినిచ్చునా!" అనియంటిని.

గోపా : నారాయణరావు మిమ్ములనిక్కడ దించి యెక్కడకో వెడలిపోయినాఁడు. ప్రామాణికత్వమును దయాళుత్వమును మేమెఱుంగము! ప్రస్తుతకార్యమున మాకు విశేషావశ్యకముగనున్న దృఢనిశ్చయము మాయొద్దఁగావలసినంతియున్నది.

నారాయణరావు వెడలిపోయినాఁడని గోపాలరావు చెప్పిన మాటలనువిని నేను తలయెత్తి నలుగడలఁ దిలకించితిని. నారాయణరావు నిజముగనె లాంతరునచటఁ బెట్టి వెడలిపోయియుండెను. ఆ దీపపు మంద ప్రకాశమున నేనొకసోపానము దగ్గరనిలిచియున్నట్లును, నామెదుట నిద్దరునిలిచియున్నట్లును నాకు స్పష్టపడియెను. ఆయిద్దఱిలో నొకవ్యక్తి నల్లనివస్త్రముచేఁ దనదేహమునుగప్పుకొనియుండెను. ఆవ్యక్తియే కమలాబాయియని నేనప్పుడే గుర్తించియుంటిని. ఈనీచులకపట జాలమునఁజిక్కుకొనుట కేనిట్టిమూర్ఖుఁడనైతినిగదాయనినన్ను నేను నిందించుకొనసాగితిని. "నీలకంఠరావు బొంబాయికిఁబోయియున్నాఁడని తెలిసినవెంటనె నేను బొంబాయికేలపోవనైతిని! పోనిమ్ము; ఒక్కయుత్తరమైన నాతనికివ్రాసి యాతనిమరణము విషయమై సమస్తము నాతనికేల తెలుపకపోయితిని!" ఈవిధముగ ననేకవిచారములు నాహృదయమున నుత్పన్నములయ్యెను.

కమలా : (భయపెట్టు స్వరమున) ప్రభాకరరావూ ! ఆమరణ శాసన మిచ్చుటనున్నదో మాకుఁ దెలుపుదువా ?

నేను : ప్రాణముపోయినను జెప్పను.

కమలా : అదియిప్పుడు నీయొద్దనున్నదా ?

నేను : లేదు.

కమలా : అట్లయిన నది నీగదిలోనున్నదా ?

నేను : (ఏమియు మాటాడలేదు.)

కమలా : అది మీగదిలో నున్నదిగదా !

నేను : మీరక్కడకుఁ బోయియుంటిరిగాదా ! ఆసంగతిమీకుఁ దెలిసియే యుండును.

మరణశాసన మిచ్చుటనున్నదియుఁ దెలియనిచో నాప్రాణములు తీయుట వారికి లాభకరముకాదనియు, అందులకై భయపడనక్కఱ లేదనియుఁ దలఁచి నేనట్లంటిని.

కమలా : (క్రోధముతో) మీపలుకుల కర్థము తెలియుట లేదు,

అప్పుడు గోపాలరావు నాభుజముపైఁ జేయివైచి—

"ఆమరణశాసన మిచ్చుటనున్న నేమి ? ఈరాత్రియె మాకది లభింపవలయును. ఇంకనీయాటలు మాయొద్దసాగవు. అపత్రము మాకొసంగెదనని వాగ్దత్తముచేసినచో మీకీనాఁడు దీనినుండి విముక్తి కలుగఁగలదు." అనియెను.

నేను : (అతనిచేతిని దీసివేయుచు) కాని, నామరణమువలన మీకేమిలాభము కలుగును ? ఈమార్గమున, ఆమరణశాసనము మీకు లభించునని నమ్మితిరా !

గోపాల : నిశ్చయముగ ! మీగదిలోనెయున్నచో నది మాచేతఁ బడెనని యే తలంపవలయును,

ఈతని మాటలు భయావహములై నాహృదయమును భేదింప సాగెను.

ఇఁక నా మరణశాసన మాతనికేఁ జిక్కెనని నాకుఁ దోఁపసాగెను. ఎట్లయిన నా మనసు నెమ్మదిపఱచుకొని యచటినుండి తప్పించుకొని పోవుట కేదైన మార్గమున్నదేమో యని, చూడసాగితిని. అప్పుడు మేమా యంత్రాలయపు వెనుకభాగమున నుంటిమి. గోపాలరావుతోఁ బోరాడి తప్పించుకొనిపోవుట యసాధ్యముగనుండెను ; నేను హఠాత్తుగ డనై క్రిందికిఁ జూచితిని—అచట నేలమాలియలో దిగుటకేర్పఱిచిన సోపానపంక్తి నాదృష్టిపైఁ బడియెను. ముందు వెనుక లాలోచింపక నేనాకస్మికముగ నా సోపానములుదిగి యా నేలమాలియఁ బ్రవేశించితిని.

కాని, యా నేలమాలియలో నేనడుగిడునంత "జాగ్రత ! అచట నొకతొట్టియున్నదిసుమా !" అనునొక శబ్దము నాచెవినిబడియెను.

తొట్టియను శబ్దము వినినంతనే నేను నిలిచినచోటనె నిలిచిపోయితిని. ఇంకముందేమి చేయవచ్చునో నాకుఁ దెలియదయ్యెను. హఠాత్తుగ డనై నేనట్టెనిలిచియుండ గోపాలరావచటికి వచ్చెను.

"పై యంతస్తుకన్న నీస్థలము మీకు మంచిదని తోఁచుచున్నదా! బహుయోగ్యమైన స్థలమునకు వచ్చితిమని మీకుఁ దోఁచుచున్నది కాఁబోలును !" అని గోపాలరావు రాక్షసునివలె నవ్వసాగెను. అతఁ డెందులకు నవ్వెనో నాకుఁ దెలియదయ్యెను. భీతిచే గడగడవడఁకుచు నేను తలవ్రేలాడవేసితిని ; అప్పుడు నేనాతొట్టియొద్దన నిలిచియుంటుట నాకుఁ దెలియవచ్చెను. నేను కలగనుచుంటినా ?—లేదు లేదు—నేను స్వప్నసృష్టిలో నుండలేదు—ఆతొట్టిలోని యంధకారముంగని, లోకమునందలి యంధకారమంతయు నొక్కటిగ నిచటఁ జేరియుండెనని నేననుకొంటిని. ఆతొట్టివైపునకుఁ గాంచినంతనె నామనసున నొకవిధమగు భయమావహించెను. నాకెంతభయమెందులకుఁ గల్గెనో నేను చెప్పఁజాలను.

ఈ సమయమున నేమైనఁ బలుకుటకన్న గత్యంతరము లేకపోవుటచే నేను గద్గదస్వరముతో—"ఇప్పుడు నాప్రాణములు మీయధీన

మున నున్నవని నేనెఱుంగుదును. నన్నుఁ జంపవచ్చునా కూడదాయని మీరే యాలోచింపవలసియున్నది" అని యంటిని.

"అట్లయిన నామరణశాసనమును మాకిచ్చుటకు మీరు సమ్మతింతురా?" అని గోపాలరావడిగెను.

"సమ్మతింపను" అని నేను నామెడ నాతనిముందఱికి వంచితిని.

కాని, నేననుకొనినట్టులాతఁడు నామెడపైఁ గొట్టలేదు. తీక్ష్ణదృష్టిని నాపైఁ బ్రసరింపఁజేయుచు—

"మరల నొక్కమాఱాలోచించుకొని మీరు మీనిశ్చయబుద్ధిని మార్చుకొందురని నాకు దృఢవిశ్వాసముకలదు" అని యాతఁడొక్కమాఱా కృష్ణవస్త్రాచ్ఛాదితవ్యక్తి వంకఁ జూచి నన్ను సమీపించి—"హా! ఏమిది?"—ఆ క్షణమున నేమి జరిగెనో నాకుఁ దెలియదయ్యెను; కాని యాయుత్తరక్షణముననె నాయొడలంతయు నెత్తురుగ్రమ్మియుండుటచేతను, మేనికి వాయువు సోఁకకుండుటచేతను, నేనెక్కడనుండినదియు నాకుఁ దెలియవచ్చెను. ఏత్రొట్టిఁగనినంతనె నాకు విశేషభీతి పొడమియుండెనో యాతొట్టిలోనే నేనుంటిని! అంధకారము పూర్ణముగ నన్నావరించియుండెను. ఆతొట్టియొద్దనమాత్రము నాకొకింత వెలుతురగపడెను.

భీతిచే గట్టిగఁ గేకలువేయుటకై ప్రయత్నించితిని. కాని, నాకు నోరురాలేదు. అస్పష్టమును, క్షీణమునైన యొకధ్వనిమాత్రము నానోటినుండి వెడలెను. ఆధ్వనియు నాతొట్టెలోనే లీనమైయుండును; ఒడ్డునకేగియుండునని నేను విశ్వసింపఁజాలను. కాని, యదివారికి వినఁబడియుండెనేమో! వారి పాదధ్వనిచే వారాసోపానపంక్తికడ కరుగుచుందురని నేను తలంచితిని. వారాలాంతరును దమతోఁ దీసికొనిపోవుటచే నాతొట్టియొద్దన నగపడుచుండిన వెలుతురు క్రమముగ మందమగుచుండెను. ఈస్థలముననె నేనన్నపానములులేక చావవలయునని వారుద్దేశించి యుండిరి.

"ఆహా! దైవమా! అప్పటికృత్యములు తలంచినంతనే నారోము డలు జల్లుమనుచున్నది. పరుగుపరుగునరండు! రండు" అని గట్టిగ నఱచితిని. సాయమొనర్పరండని యాచించితిని. అతిదీనముగ వేడు కొంటిని. కాని, వానివలన నేయుపయోగమును గలుగదయ్యెను. అచటి మందప్రకాశము క్రమముగ నదృశ్యమయ్యెను!

వెఱ్ఱివానివలె నేనిటునటు కదలసాగితిని. నేను మృత్యువునకు భయపడుచుండలేదు. నేడుగాకున్న రేపైన మరణముతప్పదు! ఏప్రా ణియు మృత్యుముఖమునుండి తప్పించుకొనఁజాలదు. కావున మరణము నకై భయపడుట మూఢత్వమే—మరణము శరీరధారులకు సహజమే— ఇది నామనసున దృఢముగ నుండెను! కాని, యిట్టిభయంకరస్థలమున— ఇట్టి యజ్ఞాతప్రదేశమున — ఇంతటియాకస్మికముగ—మరణము వచ్చి నందులకు నాకు భయమగుచుండెను—నాశరీరమునుండి వెడలునాత్మ యైన నంధకారమయమగు నీతొట్టినుండి బయటికి వెడలునో లేదో యని నాకు శంకపొడమెను. అంధకారబంధురమగు నాతొట్టిలో నెంత సేపెన్ని దినములు నేనుండవలసివచ్చునో నాకుఁ దెలియదయ్యెను!

కాని, యట్టిస్థితిలో నేనైదునిముసములకన్న నెక్కుడుకాల ముండలేదు. కొలఁదిసేపటిలోనే గోపాలరావు దీపముతో నచటికి వచ్చెను. ఆదీపప్రకాశము నాకన్నులఁబడినంతనె నాశరీరమున నూతన ముగఁ బ్రాణము వచ్చినట్లుండెను. ఆతొట్టియొద్దున నిలిచి గోపాల రావు "ఇప్పటికైన మీరు మీమనోనిశ్చయమును మార్చుకొందురా లేదా?" అని ప్రశ్నించెను. ఆప్రశ్నవిని నేనవర్ణనీయానందము నంది తిని. "ఆమరణశాసనము మీకప్పగింతును" అని చెప్పినచో నాకీ కారాగృహమునుండి విముక్తి కలుగునని నాకుఁ దెలిసెను.

గోపాలరావా తొట్టియొద్దుననిలిచి తొట్టిలోనికిఁ దొంగిచూచు చుండెను. కాని, లాంతరచటికొకింత దూరమున నుండుటచే నాకాతని శాంతస్వరూపము స్పష్టముగఁ గనఁబడలేదు. నేను మహాతురతతో "దానిని మీకొప్పగించినచో నన్ను విడుదలచేయుదురా?" అని

ప్రశ్నించితిని. "ఔ" నని యాతఁడనినంతనె నేనాపత్రి మొచ్చటనుంచి నా యాసలమును, అయినగుపొరుగువారికిఁ దెలియకుండ దానిని గొనివచ్చి తెఱంగును త్వరితముగఁ దెలిపివేసితిని.

అప్పుడు వారికి సమాధానమయ్యెను, అతఁ డానిముసమునను యచ్చోటువాసిపోయెను. కాని, శీఘ్రముగ మరల నాయొద్దకువచ్చి నాద్రాయురు తాళపుఁజేతుల నన్నడిగెను. అప్పుడే తాళపుఁజెవ్వుల నాతని కందునట్లుగ విసరివేసితిని. వానినందికొని యాతఁ డచటినుండి వెడలి పోయెను.

"నాకెప్పుడు విముక్తి కలుగును?" అని నేను బిగ్గరగా నఱచితిని. ప్రత్యుత్తరముఁరా లేదు. దీపకాంతియు మందమగుచుఁ దుదకదృశ్యమయ్యెను. ఎల్లెడల మరలఁ గటికిచీఁకటు లలముకొనియెను.

కాని, యాచీఁకటివలన నాకుఁ బూర్వమంతటి భయముకలుగ లేదు—ఏలయున — అల్పావకాశమునను విముక్తి కలుగునని నాకాశ యుండెను. చాలసేపైనను నచటి కెవ్వరును రారైరి. నాడెందమను మాన గ్రస్తమయ్యెను! "వారు నన్ను మోసపుచ్చలేదుకదా?" అని నాలో నేననుకొంటిని.

నాయొడలు జల్లుమనియెను — రోమాంగములెగసెను. తిట్టుటయు, శపించుటయు, మూర్ఖమనియుఁ బురుషత్వముకాదనియు, నాకప్పుడు తెలిసియుండినచో గోపాలరావుపై శాపవృష్టి గురియించియుండను. నాసంశయ మసహ్యముగ నుండునంతలో నొక్కమనుజుఁడు లాంతరును దీసికొని తొట్టియొద్దునకు వచ్చి నిలిచెను. అతఁడెవ్వఁడై యుండునాయని నేను తలయెత్తి పైకిఁజూచితిని; కాని, యాతని నేను గుఱితింపలేకపోయితిని. అతని పలుకుసవ్వడివలన నాతఁడు గోపాలరావు కాఁడని యెఱింగితిని. వచ్చిన యాగృహస్థు "డాక్టరుగారిచట నున్నారు? అతఁడిచట సుఖముగా నున్నాఁడని గోపాలరావు నాతోఁ జెప్పినాఁడు?" అనియెను.

ఆకృష్ణవస్త్రాచ్ఛాదితవ్యక్తి "డాక్టరీలోపలనున్నాఁడు" అని తెలిపియుండఁబోలును! అప్పుడాతఁ డొక్క నిట్టూర్పువిడిచి "ఆతనిని లోనికిఁ ద్రోయుట యావశ్యకమైయుండెనా? ఆతనికేమియు గాయములు తగులలేదుగదా" అనియెను.

ఈతని యీప్రశ్నకుఁ గమలాబాయి యేమి ప్రత్యుత్తర మిచ్చెనో నాకు వినఁబడలేదు, కాని, యాప్రత్యుత్తరమున నాతనికి సమాధానమై యుండనోపు; ఆతఁ డొకపలుకైనఁ బలుకక తత్క్షణమె యచ్చోటువాసిపోయెను. కమలాబాయి మాత్రము నాకుఁ గావలి కాచుచుండెను. ఆమె యచటనుండుటచే నచటి యంధకారము నాకు మఱింతభీతిదాయకముగా నున్నట్లుండెను. అయినను, విడుదలకలుగఁగలదని నాకు దృఢాశకలిగెను. ఏలయన—ఇప్పుడచటికివచ్చి వెడలిపోయిన నారాయణరావచటనె యుండునెడల నావినాశమున కొప్పుకొనఁడని నాకు నమ్మకముండెను. ఇంచుమించుగ నొక్కగంటలో గోపాలరావచటి కరుదెంచెను. "మనపని నెరవేఱినది" అని యాతఁడు పలికినంతనె నారాయణరావా తొట్టిని సమీపించి లోనికొకత్రాడును జారవిడిచెను. దానిని నేను గట్టిగఁ బట్టుకొంటిని. ఆతఁడు నన్నుఁ బైకి లాగికొనియెను.

నాకుఁ బునర్జన్మము కలిగెను. ప్రత్యక్షముగ మృత్యుదేవత కోరలకుఁ జిక్కియు నేను బ్రదికినందున నాకెంతో సంతోషము కలిగెను. విశ్వమున సమస్తసౌఖ్యముల బొందుటకై మరల నాకుఁ బ్రాణములు వచ్చెను. పుష్పలత సహవాసమున నాకొదవనైయున్న భవిష్యత్సౌఖ్యాశ నన్నాహ్లాదమున నోలలాడించెను. కాని, యేమైనఁగానిండు! నాకీవిషయమునఁ గలుగవలసినంత యానందము కలుగలేదు. ఆతొట్టి వంకఁ గనినంతనె నామనసెట్లో యగుచుండెను. ఆయంధకారకారాగృహమున నేనేమేమో మఱచివచ్చినట్లు నాకుఁ దోఁచుచుండెను.

గోపాలుని వచనముల మూలమున నావిచారశృంఖలము తెగిపోయెను.

" డాక్టర్ ప్రభాకరరావూ! మాతండ్రి నీచేతికిచ్చిన మరణ శాసన మిప్పుడు నాచేతనున్నది. "

నేనేమియుఁ బలుకలేదు. అందులకాతఁడు మరల నిట్లనియెను.

" నేను దానినిఁ జదివి చూచితిని. నాకత్యంతపూజ్యుఁడగు నాతండ్రి వచించిన తెలుఁగున నయ్యది యాతని మరణశాసనమే !— కాని, మేము భయపడినట్లుగ నందేమియు లేదు. కావున, మరల దానిని రేపుగాని యెల్లుండిగాని, మీకంపెదను. అనంతరము మీకిష్టమువచ్చి నట్లు చేయఁదగును "

ఆశ్చర్యచకితుఁడనై నేనాతని వైపునకుఁ గాంచుచు " ఏమీ! దానిని మరల నాకుఁ బంపెదరా ! " అంటిని.

" అవశ్యముగ ! రేపే దానిని మీకిచ్చెదను. "

## ఇరువదిరెండవ ప్రకరణము

" నేను వ్రాయుచున్న విషయములలోఁ గల్పనములకన్న సత్యాంశములే యధికముగా నున్నవి. ఆతోట్టినుండి విముదలనైనందులకు నాకు నిశ్చయముగ నానందము కలిగియుండవలయునని, వాచకులకుఁ దోఁచుట సంభవమె. కాని, సత్యస్థితి యిందులకు విరుద్ధముగ నుండెను. గోపాలరావా పత్రమును మరల నాకంపెదనని చెప్పగనే నామనసున— ఏమయ్యెనో చెప్పఁజాలను ! ఆపత్రమును సేకరించుటకై యింతగ నాయాసపడిన యీగోపాలరావు తనంతటఁదానె దానిని మరల నాకిచ్చుట యసంభవమే. పోనిండు — ఒకవేళ నిచ్చిననూ, నిచ్చునేమో ! అతఁడు దానిని నాకిచ్చుట కేదైన నిగూఢకారణముండి తీరవలయును. కావున, నయ్యది నాచేతనెప్పుడు పడునాయని నేనుత్సుకతతో నిరీక్షించుచుంటిని.

మఱునాఁటి రెండుజాముల వేళ కాపత్రము నాకుఁ జేరెను. అది యొక క్రొత్తలకోటాలో నుంచఁబడి పూర్వమువలెనె సీలుచేయఁబడి

యుండెను. ఆపత్ర మొక నీచునిచేతఁ బడకున్నచో దానినెవ్వరైనఁ దెఱచియుందురని నాకనుమానము కలిగియేయుండదు. గోపాలరావేదో మోసముచేసియున్నాఁడని నామనోదేవత నాకుఁ జెప్పుచుండెను. తత్క్షణమె నీలకంఠరావు కడకరిగి దాని నాతని కొప్పగింపవలయునని నిశ్చయించుకొంటిని.

నీలకంఠరావత్యాదరముతో నాకు స్వాగతమొసంగెను, కాని, నాయాగమన కారణము నెఱింగి యాతఁ డాశ్చర్యచకితుఁడయ్యెను. ఆలకోటాను గని యాతఁ డిట్లనియెను—

"కమలాకాంతరావుగారి చెంతకు నేను నేఁడరుగనై యుంటిని. అతని మరణశాసనమును నేనే వ్రాసితిని, కాని—"

నేను: అ మరణశాసనమున నేమి వ్రాసియుంటిరో నాకుఁ జెప్పఁ గలరా?

నీల: క్షమింపుఁడు! ఆపత్రమున నేమి వ్రాయఁబడి యుండెనో దానిని మొదటఁ దెలిసికొనఁదగిన వారాతని పుత్రులె.

నీలకంఠరావు వచనములకు నాకేమియుఁ దోఁచకపోయెను. అందేమి లిఖింపఁబడి యుండెనో యెఱుంగుటకు నేనింతగ నుత్సుకుఁడనయిన కారణమును దెలిపినచో, నామూర్ఖ్యమును నేనె నానోట వెలిపుచ్చినవాఁడ నగుదును. నాకీర్తికిఁ గలంకము కలిగినను గలుగనిండు; కమలాకాంతరావుగారి యపారసంపత్తి యొరుల కాతని యిచ్ఛా విరుద్ధముగ నందఁజేయఁ గూడదని నేను నిశ్చయించుకొంటిని. నామనసున జరుగుచున్న యాలోచనముల నెఱింగియే కాఁబోలును నీలకంఠరావు నన్నుఁ జూచి—

"ఈ పత్రము కమలాకాంతరావుగారు మీచేతి కెందుల కిచ్చిరో మీకుఁ దెలియునా?" అని యడిగెను.

నేను: అయ్యా! మృత్యుద్వారమునఁ బడియున్న మనుజుఁడు తనమిత్రునకుఁ జెప్పిన రహస్యవిషయము లితరులకుఁ జెప్పఁగూడదను సంగతి మీ రెఱుంగనిది కాదు—నాసంశయము వ్యక్తపఱచుట కిదియె

యుదనని తలచుటచే నేనిట్లంటిని. " ఈపత్రము దురదృష్టవశమునఁ గొంతతడవు వేఱొకనిచేతఁ జిక్కియుండెను. అతఁ డిందేమైన మార్పు చేసినేమోయని నాకు సంశయముగనున్నది. కావున, నిది మీరు వ్రాసిన దగునో కాదో తెలిపినయెడ నేను మీకుఁ గృతజ్ఞుఁడ నయ్యెదను.

నీల : మహానందముతోఁ జెప్పెదను!

అని నీలకంఠరావు ఆలకోటానువిప్పి యందలి పత్రమును జదివి-

" ఔను; ఇదియె. ఇందేమియు మార్పఁబడియుండలేదు " అని యెను.

ఈ మాట వినినపిమ్మట నేను సంతృప్తచిత్తుఁడనై తిని. అంతట నేను లేచి యింటికరిగితిని.

ఇంటికరుదెంచి సమస్తవృత్తాంతమును శాంతచిత్తముతో నాలోచించుకొనఁగా మరల నాహృదయమున సంశయపిశాచ మావహిల్లెను. తెలియుచుగ నాకు నారాయణరావును గోపాలరావును గనఁబడుచుండురు. వారింగనినప్పుడు నాసంశయము మఱింతవృద్ధి యగుచుండెను. వారందఱు నానందముగ నున్నట్లగపడుచుండురు. గోపాలరావు మాత్రము నన్నుఁ జూచినప్పుడెల్లఁ దిరస్కారసూచకముగ నవ్వుచుండును — ఈతఁడాపత్రమున నేమైనమార్చి యుండవలెనను నాసంశయము నాకు దృఢమయ్యెను. కాని, యింకను నాకావిషయమై నిశ్చయమిట్టిదని తెలియలేదు. కమలాకాంతారావుగారి మరణపత్ర మింకను బ్రకటింపఁ బడియుండలేదు.

అనంతరము కొలఁదిదినములలోనె నీలకంఠరావామరణశాసనమును కమలాబాయికిని నామె పుత్రులకును జదివివినిపించెను. ఆపిమ్మట దానిని నేను చూడఁగలిగితిని. కాని, యేమాశ్చర్యము! కమలాకాంతరావుగారు తనయపారసంపదలో సగముభాగము భార్యకిచ్చి మిగిలిన సగము భాగమును తినముగ్వురు బిడ్డలకును సమముగఁ బంచియిచ్చియుండెను!

ఆ మరణపత్రమును జదివి నేనాశ్చర్యనిమగ్న మానసుఁడనైతిని. కమలాకాంతరావు తనసంపదనంతను బత్నికిని బుత్రులకు నిచ్చియుండు నెడల, నాపత్రము తనభార్యచేతఁ జిక్కరాదని యాతఁడు చెప్పుటకగత్య మేమి యుండును ?

ఆ మరణశాసనము నాతఁడు నాచేతికెందుల కీయవలయును ? పొరపాటున నాతఁడు వేఱొకలకోటా నాచేతికీయలేదుగదా ! కమలాబాయి చెప్పినట్లుగ నాతఁడప్పుడు తెలివితప్పియుండెనా ! ఈ రెండవ కల్పనమె మెల్లమెల్లగ నిజమని నాకుఁ దోఁపసాగెను. కాని, యీ కల్పనమువలన నాకు సంపూర్ణసమాధానము గలుగలేదు. ఆ యంత్రాలయమందలిత్రొట్టి జ్ఞప్తికి వచ్చినంతనె యామరణశాసనము నాకప్పగించుటలోఁ గమలాకాంతరావున కేమైననిగూఢ కారణముండవలయు నని నాకుఁ దోఁచెను.

ఇందువలనఁ గొన్నిదినములవఱకు నాకేమియుఁ దోఁచకుండెను. నావలన నాకుఁ దెలియకుండ నేదైననన్యాయము జరుగుచుండెనా యను భావనమె క్రమక్రమముగ నంతరింపసాగెను. జీవితమునందలి నిత్యకర్తవ్య కార్యములును, బుష్పలత సాంగత్యమున లభించు భావి సౌఖ్య కల్పనములు మొదలగువాని మూలమున నాకామరణశాసనము మాటయే సంపూర్ణముగ విస్మృతికలుగఁబోలును ! కాని, యీక్రింద వర్ణించిన యాకస్మిక శోధనమువలన నిందులకు మఱియొక స్వరూప మేర్పడెను.

ఒకనాఁడు రెండుజాముల వేళ నేనొకపడకకుర్చిపైఁ గూరుచుండి, ప్రక్కబల్లపైనున్న పుస్తకమును దీసికొని సహజముగనె దానిని జూచుచుంటిని. ఆపుస్తకమునందలి కాగితముల నక్కడక్కడఁ జదువుచుంటిని. ఆ పుస్తకమునఁ గొన్ని పదములక్రిందను, వాక్యములక్రిందను బెన్సిలుతో గుర్తులిడఁబడియుండెను. అప్పుడు నాకేమి తోఁచెనో గాని, గుర్తులిడఁబడిన పదములను వాక్యములనుమాత్రమే కలిపిచదివి

తిని! ఆహా! ఆశ్చర్యము! ఆవాక్యములన్నియుఁ గలిపిచదువుటకు వీలుగానుండి వానికొకయర్థ మేర్పడియెను— ఆ వాక్యముల యర్థము నా మనసుననాటెను. ఈ పుస్తకమేమియాయని పరికించిచూడ నయ్యది కమలాకాంతరావుగారు నాకిచ్చిన పుస్తకమగుట స్పష్టమయ్యెను.

కమలాకాంతరావు తన యాంతరికాభిప్రాయము నాపుస్తకమున గుర్తులిడిన పదములమూలమున వ్యక్తపఱచియుండెను. వానిలో ముఖ్యములైనవానిఁ గొన్నిటి నిట నుదాహరించుచున్నాఁడను.

"ఈ నీచులకడనుండి యాపిల్లను రక్షింపుఁడు"

"పిల్ల యీ భాగముననె యున్నది."

"గొప్పవారి యిండ్లలో నామెను వెదకుఁడు."

"ఆయిల్లు బొంబాయిలో కాల్బాదేవిరోడ్డున నున్నది."

"పిల్లను నేఁ జూడలేదు."

"ఆమెయెడ నన్యాయముగాఁ బ్రవర్తించితిని."

"నా సకల సంపదలు నామె కందఁజేయుఁడు."

"మరణశాసనము నా డ్రాయరులోని దొంగయరలోనున్నది."

"న్యాయమైన సాహాయ్యముఁ జేయుఁడు."

ఈపై వాక్యములవలనఁ గమలాకాంతరావుగారు తమ ద్రవ్యమంతయు నొకయనాథ బాలికకిచ్చి యున్నట్లు స్పష్టమగుచున్నది. కావున నేను నీలకంఠరావుగారి కిచ్చిన మరణశాసనము నిజమైనది కాదని నా కిప్పుడు పూర్ణముగఁ దెలిసెను.

## ఇరువదిమూఁడవ ప్రకరణము

ఆ పుస్తకమున గుర్తులిడఁబడియున్న పదముల యర్థము నాకుఁ దెలియవచ్చినంతనే నేనా పుస్తకము నతిలక్ష్యపూర్వకముగఁ జదివితిని. అట్లు చదువఁజదువ నాకీయుదంతము తెలియవచ్చెను.

కమలాకాంతరావుగారికి మూవురుకొడుకులుండిరి. అందఱిలోఁ బెద్ద (ఇక్కడ నెవరికిని దెలియదు.) వాఁడు కమలాకాంతరావుగారు నీనగరమునకు రాకపూర్వము జన్మించియుండెను. కమలాకాంతరావు మూలనివాసము గోవా—ఏవో కారణములనుబట్టి యాతఁడు విసరపురమున నివసింపవచ్చెను. ఆతని జ్యేష్ఠపుత్రుఁడు (నారాయణరావు కన్నఁ బెద్దవాఁడు) ప్రస్తుతము చెఱసాలలోనున్నాఁడు. ఆతఁడీ కష్టకాలమునఁ దనయేకపుత్రినిఁ దండ్రికడ—కమలాకాంతరావుకడ—కంపియుండెను. కాని, యీ బాలిక నింటనుంచుకొన్న నీ బాలిక యెవ్వారని యెవరైన నడిగినచో నున్నసంగతి చెప్పవలసివచ్చును; దానఁ దనకీర్తికిని, కులమునకును గళంకము కలుగుననుభీతిచేఁ గమలాబాయి యీ బాలికను బితామహుని యెదుటి కైనఁ బోనీయలేదు. తనమనుమరాలినిఁ దాను బోషింపఁజాలక పోయితినిగదా యని కమలాకాంతరావుగారు వెతనందసాగిరి. ఈ తప్పునకుఁ బరిహారముగా నాతఁడు నా చేతి కిచ్చిన మరణశాసనమునఁ దన సకలసంపదలును నా యనాథబాలికకిచ్చియున్నట్లు వ్రాసియుండెను.

ఈ మరణ శాసనమునే నేను గోపాలరావునకిచ్చితిని. నా యవివేకముచే నిరపరాధినియు, ననాథయునగు నా బాలిక జీవితమునకు భంగము కలిగినదికదా యని నా హృదయము దగ్ధమగుచుండెను. నిజమైన మరణశాసనమునుజించివైచి కృత్రిమశాసనమొకటి గోపాలరావు నా కిచ్చెను. ఈ విషయములు నిజమని యిప్పుడు పూర్తిగ నాకుఁ దెలిసెను. తీవ్రపశ్చాత్తాపాగ్నిజ్వాలలు నా హృత్పుటమును గాల్చివేయుచుండెను. స్వస్థముగ నొకచోఁ గూర్చుండక ఆ బాలికను శోధించి శక్యమగునంతటి సాయ మొనర్పవలయునని నిశ్చయించుకొంటిని.

తత్క్షణమె దాని నాచరణలోనికిఁ దెచ్చుటకై ప్రయత్నింపసాగితిని. ఆ బాలికను శోధించుటకన్న వేఱుకర్తవ్యము లేదని నాకుఁ దోఁపసాగెను. కావున బ్రథమశకటముననె బొంబాయినగరమునకుఁ బయనమైతిని.

ఈ నగరమునకరిగి కాల్‌బదేవిరోడ్డుననుండు మహోన్నత గృహయజమానులనడుగ శీఘ్రముగనె నా కావలయుండు గృహము దొరకెను. ఆ గృహ బహిఃపార్శ్వము చూచుటకెంతో రమణీయముగా నుండెను. ఎవ్వతె సర్వనాశనమునకు నేను గారణభూతుఁడనైతినో యా బాలిక యీ గృహమున నగపడఁగలదనితలఁచి నేనును సంతసించితిని. ఆ బాలికరూపము మనమునఁ గల్పించుకొనఁ దొడంగితిని. "ఆమె తన పితామహివలె దుర్భిమానయు, భ్రష్టచిత్తయునై యుండునా? కాక పితామహునివలె సుశీలయు, శాంతస్వభావయునై యుండునా?" అని నాలో నే నాలోచించుకొనఁ దొడంగితిని.

ఆ బంగాళాయొద్దకేగి నే నాత్రముతోఁ దలుపు తట్టితిని. ఆ బంగాళా యజమానురాలొక గుజరాతీవృద్ధస్త్రీ. ఆమె తత్క్షణమె తలుపుఁదెఱచి నన్ను లోనికిఁ గొనిపోయెను. "మీఁడ నెవ్వతెయైన ననాథబాలిక నివసించుచున్నదా?" యని నే నామె నడిగితిని. ఆమె నన్నాశ్చర్యముతోఁ జూచుచు—

"ఎవ్వరు? మనోరమయా?" అనియెను.

ఔనని నేను చెప్పితిని. అప్పుడామె విచారసూచకముగ "ఔను మనోరమ యిచటనె నివసించుచుండెను. కాని కొన్నిదినములకుఁ బూర్వ మొకస్త్రీ యామెను దొడ్కొనిపోయినది" అనియెను.

"స్త్రీ" స్త్రీ యనుపదము నా వీనుల సోఁకినంతనే నేను ఊచ్చవడిపోయితిని. ఏలయన—ఆమె నా మొగమువంకఁ దేరిపారఁజూచి "మీరీ లోపలికి వచ్చెదరా? సావకాశముగ మనమావిషయమును గూర్చి ముచ్చటించుకొనవచ్చును" అనియెను.

వెంటనే మే మచ్చటి కచేరిచావడిలోనికరిగితిమి. అచ్చటనున్న కుర్చీపైఁ గూరుచుండి నేను—

"నేను మనోరమకు పాలకుఁడను. ఆమెను బోషించుట నా కర్తవ్యము. ఆమె యే స్త్రీతోఁ బోయినదో చెప్పఁగలవా? ఆ స్త్రీ పేరేమి? ఆమె యిపుడెచ్చోట నున్నది?" అని యంటిని.

ఆమె : (నిట్టూర్పు విడిచి) లేదు లేదు—నాకేమియుఁ దెలియదు. ఆస్త్రీ తన విషయమేమియు నాకుఁ దెలియనీయలేదు. ఇంటినుండి వెడలునపుడు మనోరమ దుఃఖించుచున్నట్లగపడెను. మనోరమకుఁ బోషకు లెవ్వరైన నున్నారని నాకుఁ దెలిసియున్నచో నేనామెను బోనిచ్చియుండను. ఆస్త్రీయే మనోరమయుండినగదియద్దె మొదలగునవి యిచ్చెను. కాని—

నేను : 'కాని' యేమి?

ఆమె : తన మేలిముసుఁగును దీయనేలేదు. కావున నా కామె యెడ సంశయ ముదయించెను.

నేను : నాకా స్త్రీ యుదంతమంతయుఁ దెల్పుఁడు. మనోరమ యొక దుష్టస్త్రీ చేఁజిక్కెనేమోయని నాకు భయమగుచున్నది.

ఆమె : ఆయాఁడుది పగలు పదునొకండుగంటలకిచటికి వచ్చెను.

నేను : ఎప్పుడు?

ఆమె : కడచినగురువారము.

ఆ దినమె గోపాలరావు నాకా మరణశాసనమును మరలనిచ్చెను. నేను సంశయించుచున్న స్త్రీయే యాబాలికను దోడ్కొనిపోయియున్నచో నా బాలికకెట్టిగతి కలుగునోయని నాకు భయమువేయసాగెను.

వృద్ధు : ఇక్కడకు వచ్చినంతనె యాస్త్రీ మనోరమను దర్శింపఁ గోరెను. తత్క్షణమె మనోరమ నిటకుఁదోడితే నొకసేవకున కాజ్ఞాపించితిని. కాని, యాకాంతయాబాలికనున్నచోటనే చూచెదనని యక్కడకె పోయెను. కొలఁదిసేపటిలోనే మేడదిగివచ్చి "మనోరమ నా వెంట వచ్చుటకు సిద్ధముగానున్నది" అని నాకుఁ దెలియఁజేసెను. ఆమె మాటలకు నేనాశ్చర్యపడితిని. కొంచెమాలోచించి "మనోరమను జూచి యామెతో మాటలాడిననెగాని, నేనేమియుఁ జెప్పఁజాల" నంటిని. "నీ కామెతో నేమిపనియున్నది?" అని యామె యించుక కోపముతోఁ

జలికెను, అప్పుడు "నాకామె కొంచెము డబ్బియవలసియున్నది" అని యుత్తరమిచ్చితిని. వెంటనె యామె నాకీయవలసిన సొమ్మునిచ్చివేసెను. అనంతరము నేను "మీరామె కాపులా ?" అని యడిగితిని. అందుల కామె "నాకు నామెకుఁ జాలఁగాలము నుండియుఁ జెలిమికలదు" అని యెను. అందువలన నా కధిక సంశయము కలిగెను. కాని, యా స్త్రీని పరకుఁగొనకుండ నాబాలికకడ కేగుటకు నాకుధైర్యము కలుగదయ్యెను. మీ రామె నెచ్చటకుఁ గొనిపోవుదురని నేనామె నడుగవలెనను కొంటిని. కాని, నా నోట మాటరాలేదు. ఇంతలో మనోరమ మేడ దిగివచ్చెను. ఆమె మ్లానవదనయైయుండెను. వెంటనె యా స్త్రీ మనోరమ హస్తమును బట్టుకొని బయటకిఁ బోవసాగెను. మనోరమతో నేను మాటాడరాదను తలంపు నామె ప్రకటించెను. అపుడు నే నోర్వఁజాలక పోయితిని. ఆకస్మికముగా నేనా స్త్రీని సమీపించి "నాకు మీ చిరు నామా తెలుపుదురా ?" అని యడిగితిని. అందులకామె కోపముతో "నాచిరునామాతో నీకేమి పని ? మనోరమ కెట్టియుత్తరములును రావు గదా ? సరే ! ఇదిగో నా చిరునామా" అని యామె యొక కాగితపుఁ దునుకను నాచేతికిచ్చెను. అందేమో వ్రాయఁబడియుండెను. తత్క్షణమె మనోరమను వెంటనిడికొని యామె వెడలిపోయెను.

నేను : ఆ కాగితపుఁ దునుక మీ యొద్దనిప్పుడున్నదా ! దానిని మీరు నా కీవఱకెందులకుఁ జూపలేదు ?

వృద్ధు : ( దుఃఖముతో ) స్వామీ ! ఆ చిరునామా యామెది కాదు. వేఱొక స్త్రీది—ఆ స్త్రీకి మనోరమ యెవ్వరో తెలియదు. ఆమె కీమె విషయమే తెలియదు.

నేను : ఇది మీ కెట్లు తెలిసినది ?

వృద్ధు : మఱునాఁడు మనోరమపేర నొకయుత్తరము వచ్చెను. ఆ యుత్తరము నామె కందఁజేయవలయునని నేనే స్వయముగ నా యుత్తరమును దీసికొని యా చిరునామాగల యింటి కరిగితిని. కాని,

యీ యింట నెవ్వరికిని మనోరమపేరైనఁ దెలియలేదు.

నేను : ఆ కాగితమున వ్రాయఁబడిన పేరుగల స్త్రీనైన మీరెచటఁ సందర్శించితిరా ?

వృద్ధు : ఆఁ.

నేను : మీ యింటికివచ్చిన స్త్రీ యామె కాదని మీకు బాగుగఁ దెలిసినదా ?

వృద్ధు : ఔను. ఈ స్త్రీ పొట్టిది. స్థూలకాయ ; సరళస్వభావ నా యింటికి మేలిముసుఁగు వైచికొనివచ్చిన కాంత యీ లక్షణములకు వ్యతిరేకముగా నగపడెను.

నేను : మీ యింటికివచ్చినపడఁతి చూచుటకెట్లుండెను ?

వృద్ధు : ఆమె పొడుగుగనున్నది. ఆమె నడకతీరుఁజూచి యామె సౌందర్యవతియై యుండఁబోలునని నే ననుకొంటిని ; ఉండవలయునను టకుఁ గారణము నే నామెను జూడకుండుటయే—కాని, యామెను జూచుటకైన నా కానందమే కలుగలేదు. అంతేకాదు ; నా కామెపై నొకవిధమగు ననూయ పొడమెను.

మనోరమను దోడ్కొనిపోయిన స్త్రీ విషయమై నా కింకెట్టి యనుమానమును మిగులలేదు. అయినను ఒక ప్రశ్న యడుగఁదలఁచి—

"మీ మాటలవలన నా స్త్రీ యొక్క గొప్పయింటిదని తెలియుచున్నది" అంటిని.

వృద్ధు : అట్లేకానిండు ; కాని, యామెదుస్తులుమాత్రము సాధారణమైనవిగా నుండెను.

మునుపు నా యింటికి నాసోదరినని వచ్చినప్పు డా స్త్రీ నల్లనిచీరఁ గట్టియున్నందున నిప్పుడు నాచీరయే కట్టుకొని వచ్చియుండునేమోయని తలంచి నేను "ఆమె యేరంగుచీరఁ గట్టియుండెను ?" అని యడిగితిని.

వృద్ధు : నల్లచీర.

సరి ! ఇఁక నేమి ? మనోరమను దోడ్కొనిపోయిన స్త్రీ నిప్పుడు నేను తెలిసికొంటిని. ఆబాలిక కెట్టిగతి కలుగునాయని నాకు విచారము

కలిగెను. కొంచెము సేపాలోచించి "మనోరమ పేరవచ్చిన యుత్తర మెచ్చటనున్నది?" అని ప్రశ్నించితిని. ఆ ముదుసలియు నా యుత్తరమును నాకుఁ దెచ్చియిచ్చెను. ఆమెకు పాలకుఁడనగుటచే, నాసంబంధమున నాకాయుత్తరమును విప్పిచదువుటకు సంపూర్ణాధికారముండెను.

"ప్రియమనోరమా!

ఎవ్వరి ఆశ్రయమున నివసింప నీవు గోవానుండి ఇక్కడకువచ్చితివో, ఆతఁడిప్పుడే పరలోకమునకేగెను. నేనాతనికి జ్యేష్ఠపుత్రుఁడనగుటచే నిన్నుఁ బోషించుభారము నాపైనున్నది. అది నా కర్తవ్యము. శీఘ్రముగ నేను నీకడకు రానున్నాఁడను. అంతవఱకు నీ వెవ్వరిని దర్శింపకుము. నా యీ యాజ్ఞను జవదాటితివేని నీ జీవితము నిరర్థకము కాఁగలదు. నీకు నష్టము కలుగఁగలదు. మనము కలసికొన్నపిదప నీకు నేను విశ్వాసపాత్రుఁడనని తెలియఁగలదు.

నీ హిత చింతకుఁడు,

నారాయణరావు."

"ఆహా! ఈ యుత్తర మొక్కదినముముందుగ వచ్చియుండరాదా!" అని నేను దుఃఖాతిరేకముననంటిని. ఆ ముదుసలియు భీతచేతస్కయై నావంకఁ జూడసాగెను. ఈ యుత్తర మొక్కదినము ముందుగ వచ్చియున్నచో మనోరమ యా కాంతతోఁ బోయియుండదు. కానిండు! శీఘ్రముగా నామెజాడఁ గనుగొనఁ గలుగుదునని నాకు సంపూర్ణాశకలదు. మఱి యేమమ్మా! మనోరమ చూచుట కెట్లుండును?" అంటిని,

వృద్ధ: మీ రామెను సుందరియందురో, ఏమందురో యేనెఱుంగ—యించుక శక్తిమంతురాలే—అయినను, ఆమె శరీరమున నంతగా లావణ్యములేదు. అట్లుండినను, ఇచటివారందఱామెను మిగుల సుందరియనియే చెప్పుచుందురు" అనియెను.

నేను: ఆమె స్వభావమెట్టిది?

వృద్ధ : అత్యంతోదార స్వభావ ; కోమలాంతఃకరణ ; వినయ సౌశీల్యము లామె సొమ్ములు.

నేను : మీకామె పూర్వవృత్తాంతము తెలియునా ?

వృద్ధ : తెలియదు.

నేను : ఆమె తన విషయమై మీ కేమియుఁ జెప్పలేదా ?

వృద్ధ : లేదు. ఒక్కమాటయు నాఁడలేదు. ఆమె వయసువఱకు మీరిన ప్రౌఢయు, దూరదర్శినియునై యుండెను. ఆమెవంటి కోమలాంతఃకరణముగల బాలికను నే నింతవఱకుఁ జూచియెఱుంగను.

ఆమె కట్టకడపటి వాక్యమును వినినంతనె నా దుఃఖము ద్విగుణీకృతమయ్యెను. అంతటి కోమల స్వభావయు, నిరపరాధినియు నగు బాలిక వినాశమునకు నేను కారణభూతుఁడ నైతినిగదా యను విచారము శతసహస్ర వృశ్చికదంశనమువలె నన్ను వేధింపఁ దొడఁగెను. ఇంక నిచటఁ గాలయాపన మొనర్చుట మంచిదికాదని నాకుఁ దోఁచి లేచితిని. అంతలో సుస్వభావయగు నా ముదుసలి నన్నుద్దేశించి "మనోరమ పెట్టెనేమి చేయవలయును" అనియెను.

నేను : (ఆశ్చర్యముతో) ఏమి ? ఆమె పెట్టె యింకను నిచ్చటనే యున్నదా ?

వృద్ధ : ఔను. ఆమె తొందరగ వెడలిపోవుటచే దాని నామె కిచ్చుట మఱచిపోయితిని. దానిని దీసికొనిపోవుటకై యెవ్వరైన వత్తు రేమోయని నేననుకొనుచుంటిని. కాని, యింతవఱకు నామెకడనుండి యెవ్వరును రాలేదు. కావున, నాకా విషయమై మిగుల భయమగు చున్నది.

నేను : ఔను—భయముకలుగుట సహజమే.

వృద్ధ : ఈ యుదంతమును బోలీసువారికిఁ దెలుపుదమని తలఁచితిని. మనోరమ యేదో ప్రాణసంకటమున నున్నట్లు నాకు భయమగు చున్నది.

నేను : అగత్యమని తోఁచునెడల నేఁడే పోలీసువారికిఁ దెలుపుదును. మీరారు చింతింపకుఁడు. పరమేశ్వరునికృపచే మనోరమ శీఘ్రముగనే మనలఁ గలిసికొనఁగలదు.

అని సదయహృదయయగు నా వృద్ధురాలిని నూఱడించి నే నామె యనుమతివడసి లేచితిని. ఒక్కనిముసమైన బొంబాయిలో నాగక మొదటిరైలుబండినెక్కి విసరపురమునకువచ్చి చేరితిని.

## ఇరువది నాల్గవ ప్రకరణము

ప్రాంజలినై నా యపరాధములనన్నిటి నొప్పుకొనుటకు నేను నిశ్చయించుకొనియున్నందున, వానిలో నొక్కటియైన దాఁపకుండ క్షమాశీలురగు పాఠకులకుఁ దెలియఁబఱిచెదను. ఇందువలన నా దోషములతో నాలోనున్న యల్పసద్గుణములనుసైతము సూచించుకొను నధికారము నాకు సంప్రాప్తమగుచున్నది. విసరపురమున కేతెంచినవెంటనే కమలాబాయికడకరిగి మనోరమజాడ నెఱుంగ నెంచితిని. కమలాబాయి క్రుద్ధరూపమునకును, గోపాలరావు దుశ్చరిత్రమునకును భయపడువాఁడఁగానని నేను కృతనిశ్చయుఁడనైతిని. కమలాకాంతరావుగారొసఁగిన పుస్తకముమూలమున నా కెఱుకపడిన యేర్పాటుల ననుసరించి, కమలాబాయివలననే యా మనోరమకుఁ దగిన సంరక్షణము లభించినచో సరియే; అట్లుకాకున్నచో న్యాయమందిరమున న్యాయాధీశునెదుట నీ విషయములన్నియు విశదపఱిచి న్యాయసాహాయ్యముం గైకొనియైన మనోరమను రక్షింపవలయునని నేను సంకల్పించుకొంటిని.

కమలాకాంతరావుగారి భవనముకడ కరిగితిని. ఆ గృహము నేఁడు వేఱురూపమును దాల్చియుండెను. పూర్వము భయప్రదమై, నిర్జనమై కన్పట్టుచుండిన ఆ భవనము నేఁడానందమునకు జన్మస్థానమై యొప్పారుచుండెను. గృహావరణమున నందందుఁ జిన్నచిన్న పతాక

ములు మారుతవశమునఁ జలించుచు వివిధవర్ణములతో విరాజిల్లుచుండెను. ఇంటిముందఱ విశాలమగుపందిరి యమర్పఁబడి యుండెను. బ్యాండు వాయించువారు తమతమ యాయుధములను—వాద్యములను—సిద్ధముగఁ బట్టుకొని వేచియుండిరి. ఈసర్వసమారంభము నీక్షించి నేనాశ్చర్యనిమగ్నమానసుఁడనైతిని. ఇట నెల్లెడల నానందము తాండవమాడు చుండెను. ఇంట నేమైన మహోత్సవము చేయఁబడుచుండెనా? ఇంతటి యానందమునకుఁ గారణ మేమైయుండును? నాకేమియుఁ దోఁచక పోయెను. నేఁడు భవనముఖ్యద్వారము తెఱవఁబడియుండెను. అచట భటుఁడొకఁడు మంచివస్త్రములను ధరించి కావలి యుండెను. నన్నుఁ గనినంతనె యాభటుఁడతివినయముతో నమస్కరించి లోనికరుగుఁడని విన్నవించెను.

నేఁడీభవనమున నేమియుత్సవము జరగనున్నదని యాద్వారపాలకు నడిగితిని. ఇంతగొప్ప యుత్సవము జరగుచుండ నాకుఁదెలియక పోవుటకై యాతఁ డచ్చెరువంది—

“ సరస్వతీబాయికి వివాహమగుచున్నదని నిజముగ మీకుఁదెలియదా! మీకా మంత్రణపత్రిక పంపియుందురని తలఁచియుంటిని.” అనియెను.

నేను : ఏమి? సరస్వతీబాయికి వివాహమా? నీవొడలు తెలిసియే మాటాడుచున్నావా? మూర్ఖుఁడా! భాద్రపదమాసమునఁబెండ్లి సేయుదురఁటరా?

భటుఁడు : (భీతితో) స్వామీ! పేదలమగుమాకది యేమి తెలియును? సర్ ప్రతాపరావుగారికిని సరస్వతీబాయిభర్తకును దృఢమైత్రి కలదు. సర్ ప్రతాపరావుగారు ప్రార్థనాసమాజమున కధ్యక్షులై యుండుట మీ రెఱిఁగియే యుందురు. వారికి జ్యోతిశ్శాస్త్రమున నించుకయు నమ్మిక లేదు; వివాహ మీమాసముననె కావలెనని గట్టి పట్టుపట్టిరి. అమ్మగారు నందులకు సమ్మతించిరి. అన్నియుఁ జిన్నతనపుఁ జేష్టలే.

పెద్దమహారాజుగా నున్నచో నిట్టిసంస్కారబాధల కొప్పుకొని యుండరు గదా!

సరస్వతికి వివాహము కానున్నదని వినుటచే నాచిత్తవృత్తియం దాకస్మికముగ నాశ్చర్యజనకమగు మార్పుకలిగెను. సరస్వతిసుందరియు వినియు, మృదుస్వభావయునియు నేనెఱుంగుదును. తనతల్లి దుష్కృత్యములకట్టిఫలమామె యనుభవింపవలసి వచ్చినదిగదా యని నేను విచారించితిని. ఆమెకీ మరణశాసనముతో నెట్టిసంబంధమును లేదనియే నెఱింగి యుంటిని. వివాహవిధులు నెఱపుటకింక రెండుమూఁడు గంటలవ్యవధి యుండెను. ఇట్టిసమయముననే వచ్చిన బంధుమిత్రాదుల సమక్షమునఁ గమలాబాయి దుష్కృత్యముల పట్టికను జదువునెడ నీవివాహమునకు విఘ్నము కలుగునేమోయని నేననుకొంటిని. కానిసరస్వతి వివాహమగు వఱకు నాకూరకుంటయే యుత్తమమని తోఁచెను ; ఇంతలో మనోరమ మూర్తి నామనశ్చక్షువుల యెదుటనిలిచెను. సరస్వతిపై జాలిచూపినచో మనోరమకు హాని కలుగుట నిక్కమని నాకు భయముతోఁచెను. ఏమైనను సరియే. మనోరమకు హితమగునదియే ప్రథమమున నెఱవేర్చుట నావిధ్యుక్తధర్మమని నా హృదయము నాకు బోధింపఁ జొచ్చెను. తత్క్షణమె నాజేబులోనున్న దినచర్య గ్రంథమునందలి యొక్క కాగితమును జించి, యీ క్రిందివిధముగ వ్రాసి కమలాబాయి సన్నిధికంపితిని.

“నేఁడు మీకుమార్తెకు వివాహము జరుగనున్నదనియే నెఱుంగుదును. నన్నుఁ జూచుటకు మీకిష్టముండదనియు నాకుఁ దెలియును. కాని, యొకరిహితమునకై తత్క్షణమె మిమ్ము సందర్శింపవలసిన యగత్యము కలిగినది. నాకు దర్శనమిచ్చుట కనుమానించితిరేఁ—దర్శనమీయ నొల్లరేని — తిన్నగ కచేరీచావడిలోనికివచ్చి యచట మీబంధుమిత్రాదుల యెదుట నేను మీ దుష్కృత్యములన్నిటిని బూసగ్రుచ్చినరీతి నుగ్గడింపవలసి వచ్చును. ఈ సమయమున నాయీనిశ్చితాభిప్రాయమునుండి నన్ను మరలించుటకు మీకు శక్తిచాలదు.

ప్రభాకరుఁడు.”

అల్పావకాశముననె కమలాబాయి నేనున్న తావున కరుదెంచెను. నేనామెను మనసార సేవగించుచుండినను, అప్పటి యామె స్థితికి నా మనసునీరయ్యెను—నాకు జాలికలిగెను. అప్పుడామె రక్తాంబరధారిణియైయుండెను. పూర్వ మామె చక్కఁదనమునకు వన్నెఁదెచ్చుచుండిన యలంకారములేవియు నిప్పుడు లేవు. కుంకుమతిలక విహీనమగుటంజేసి యామె ఫాలభాగము కళావిహీనమైయుండెను. కాని, యామె స్వభావమునమాత్ర మంతగా మార్పుకలుగలేదు. నేను నిలిచియున్న స్థలమునుండి యించుకయుఁ గదలక యామె నన్ను సమీపించుదనుక నట్టె నిశ్చలుఁడనై నిలిచియుంటిని.

ఆమె నాకొక గజముదూరమువఱ కరుదెంచి స్తబ్ధయై నిలిచెను. శిష్టాచారము ననుసరించియైన నామె యోగ్యమగురీతి నాకు స్వాగత మొసఁగునని తలంచియుంటిని. కాని, యొక్కపలుకైనఁ బలుకక తిరస్కారభావముతో నావంకఁజూచుచు నామె నిలిచియుండెను. కాని, నా నిశ్చలభావమును గనిపెట్టి యామె యించుక వెఱగందెను. ఒక్కసారి పరిశోధకదృష్టితో నన్నుఁజూచి యధికారస్వరమున నామె—

"దీనియర్థమేమి? ఇట్టిబెదరింపు టుత్తరములు వ్రాయుటయందేమైన లాభమున్నదని మీకుఁ దోఁచుచున్నదా?" అనియెను.

నేను: అమ్మా! ఇప్పుడు నాతోఁ జాలసేపు సంభాషించుచుఁ గూర్చుండుటకు మీకుఁ దీరిక లేదని యే నెఱుంగుదును. నాకును మీతో వితండవాదములు సేయుచుఁ గాలయాపన మొనర్చుట కవకాశము లేదు. మనోరమ యెచ్చటనున్నదో యామెజాడ నాకుఁ దెలుపుదురేని దత్క్షణమె నేను వెడలిపోవుదును.

మనోరమ పేరువినినంతనె యామె వెఱగందెను. ఆమె రూపమున నింతవఱకును గన్పట్టుచుండిన నిర్లక్ష్యభావము క్షణములో నదృశ్యమయ్యెను. కమలాబాయివంటి యభిమానయు, సాహసయునగు

స్త్రీకిసైత మింతటి భీతికలిగించుట కామనోరమానామమునం దేమి మాహాత్మ్యమున్నదో నాకుఁ దెలియలేదు.

కమలా: నా కామెజాడయే తెలియదు. నే నామెనుజూడనైన—

నేను : మీ కామెయుండుచోటు తెలియునని నాకుఁ బూర్ణ విశ్వాసము కలదు. మనోరమ ఎచ్చటనున్నదో యిప్పుడే నాకు మీరు తెలుపనిచోఁ దత్క్షణమే లోనికివచ్చి సకలమును నివేదింతును ! దాని పరిణామ మెంత భయంకరమగునో యాలోచించుకొనుఁడు ! మీ భావి జామాత రామారా వెంతటిసజ్జనుఁడో, యెంతటి యున్నత కులోద్భూతుఁడో నే నెఱుంగుదును. ఆతఁడు మీవలె బందిపోటులు—

కమలా: (పైకిదూకవచ్చి) చాలు ! చాలింపుఁడు ! ఒక్క మాటయైన నోట రానీయకుఁడు.

తత్క్షణమె యామెచేతికిఁ గాగితమును బెన్సిలునిచ్చి నేను—

"వ్రాయుఁడమటి—మనోరమ యెచ్చటనున్నదో సంపూర్ణమైనవిలాసము నీ కాగితమున వ్రాయుడు ! నేఁడు సూర్యాస్తమయ మగులోపల నామెజాడ నాకుఁ దెలియవలయును — తప్పదు" అని ధిక్కరించి పలికితిని.

తీవ్రదృష్టితో నామె నావంకఁదిలకించి యా కాగితముపై నేమోవ్రాసి దానినాకొసఁగి "ఈ నిముసమునను దీనిని దీసికొని వెడలుఁడు. ఇఁక నేమైన మాటాడవలసియున్నచో మఱొకప్పుడు మరల రండు" అనియెను.

కాని, నేను నిలిచినచోటువిడిచి కదలనైతిని. ఆమె వ్రాసి యిచ్చిన కాగితమును బిగ్గరగాఁ జదివిన యనంతరము—

"అమ్మగారూ ! ఈ చిరునామా నిక్కువమైనదో కాదో యిప్పుడే యెఱుంగుటకు సాధనములులేవు. కావున నిచ్చోటు వీడిపోయిన వెంటనే మీ రిందువ్రాసియున్నయూరి పోలీసువారికిఁ దంతిసమాచారమిచ్చి మనోరమ యాయూర నీ చిరునామాగలచోటు నున్నదో

లేదో చూచి తెలుపుమందును. ఒకటిరెండుగంటలలో నాకుఁ బ్రత్యుత్తరము రాఁగలదు.

అచట మనోరమ లేదని యుత్తరము వచ్చినా, పోలీసువారిసాహాయ్యముతో మరల నిచటికి వత్తును. కావున, నీచిరునామాలో నేమైన మార్పు సేయవలసియున్నచో నిప్పుడే చేయుఁడు" అంటిని.

ఆమె తెచ్చబడిపోయెను; ఆమెరూపము నిస్తేజమయ్యెను; ఆమె భీతచేతస్కయై గడియారమువంకఁ జూచుచు నూరక నిలిచెను. గోపాలరావీసమీపమున నెందైన నున్నాఁడేమోయని చూచుటకై కాఁబోలు, నామె నలువంకల దృష్టిసారించెను.

నేను: (ధిక్కారపూర్వకముగ) గోపాలరావిప్పుడు మిమ్ము రక్షింపఁ జాలఁడు. ఈ యింట యంత్రాలయము సందువలెఁ దొట్టి లేదనియే నెఱుఁగుదును. ప్రత్యక్షదండధరుఁడైన నన్నిప్పుడు నాయీసన్మార్గమునుండి విచ్యుతునిగాఁ జేయఁజాలఁడు. కావున, మీరిప్పుడీచిరునామాలో నేమైన మార్పు చేయవలసియున్నచో——

అంతటఁ జావడిలోఁ గరతాళధ్వనులు వినవచ్చెను. నాపలుకులంతట నాపితిని. మఱుముహూర్తములోఁ గమలాబాయి యిటునటుఁ బరికించి నాకరమునఁ గన్న కాగితమును జటాలున లాగికొనియెను.

"నీవొకపిశాచమవు!" అని యామె మరల నా కాగితముపై నేమియో వ్రాసి "ఇదిగో నా మునిలాసము! ఇందు వివరించినచోట నామె నీకవశ్యముగఁ గాన్పింపఁగలదు. ఆమెనింటికిఁ దెచ్చునంతటి యగత్యము మీకుండదని నానమ్మకము" అనియెను.

ఆమె యాడిన తొడితమాటలయందలి యర్థమప్పుడు నాకుఁ దోఁచలేదు. ఆ జాడ తెలిసినంతనె మఱేమియు విచారింపక తత్క్షణమె నేనచ్చోటు వాసిపోయితిని.

# ఇరువదియైదవ ప్రకరణము

కమలాబాయియిచ్చిన చిరునామా నిజమని యిప్పటికైన నాకుఁ దోఁచలేదు. కావునఁ దత్క్షణము తంత్రీకార్యస్థానమునకరిగి తంత్రీమూలమున మనోరమజాడ నెఱుఁగు నుద్దేశమునా పరణాలోనికిఁ దెచ్చితిని. ఇంచుమించుగ నఱగంటలో నాకుఁ బ్రత్యుత్తరము వచ్చెను.

"మనోరమ యిచటనున్నది. ఆమె మిగుల రోగగ్రస్తయై యున్నది. తత్క్షణము బయలుదేరి రావలయును."

అప్పటికించుమించుగఁ బావుగంటలో నొకబండి విసరపురము నుండి యాయూరికిఁ బోవనై యుండెను. ఆ బండినెక్కి యాఱుగంటలకు నేనాపురముఁ జేరితిని. ఆ కాగితమున వ్రాయఁబడియున్న యింటి కడకరుగునప్పటికి నాహృదయమున భీతి యావహిల్లెను. ద్వారముకడ నొకరక్షకాధికారినిలిచియుండెను. అతనిని యప్పటియునికిఁగని లోపల నేదోభయంకరకృత్యము జరగియుండవలెనని నేననుకొంటిని.

"విసరపురమునుండి తంతిసమాచారమంపినవారు మీరా ?" అని యాయధికారి నన్నడిగెను.

నేను : ఔను.

అధి : హతభాగినియగునీబాలికకు మీరాప్తులా ?

నేను : ఔను. ఆమెకు నేనొకహితచింతకుఁడను.

అధి : మనోరమాబాయి యిప్పుడే ప్రాణములువిడిచెనని తెలుపుటకే నెంతయుఁ గుందుచున్నాఁడను.

నేను : హా ! దైవమా !

అనిమాత్ర మెపలికి, నేనొకానొకవిభ్రాంతునిపోల్కి నాతని ముఖమువంకఁజూచుచు నిశ్చేష్టుఁడనై నిలిచితిని.

అధి : ( అతినమ్రతతో ) అయ్యా ! లోనికివిచ్చేయుఁడు !

లోనికరిగి మేమిరువుర మాసనములపై నాసీనులమైతిమి. చుట్టుప్రక్కల నెవ్వరును లేకుండుటఁగని సమస్త వృత్తాంతము నివేదింపుమని యాతనినడిగితిని.

అధి : మీ రంపిన తంతివార్త ననుసరించి యొకభటుని మనోరమను శోధించుట కచటికంపితిని. అతని నెవ్వరును దలుపుఁదెఱచి లోనికిఁ దీసికొనిపోలేదు. కాని కొంచెము వెఱపించినపిమ్మట నాతఁడు లోనికిఁ గొనిపోఁబడియెను, మీ తంతివార్త యొక గంటముందుగ వచ్చియుండినచో నెంతో బాగుగనుండును ! కాని, భవితవ్యమున కెవరేమిచేయఁగలరు ? ఆ మనుజుఁడు లోనికరుగుటకుఁబూర్వమే యామె విసమును గ్రోలియుండెను.

నేను : (కుర్చీనుండి లేచి) ఏమి ! విషమా ?

అధి : ఆ బాలిక యిచటి కెట్లువచ్చెనో నాకుఁ దెలియదు. కాని, యామెశీలమును, ధైర్యమును వర్ణనీయములై యుండవలెనని నాకుఁ దోఁచెను. ప్రాణముపోవుటకుఁబూర్వ మామె యతి శాంత చిత్తముతో నిట్లనియెను.

" ఆజన్మ కారాగృహ నివాసముకన్నను మరణమే శ్రేయమని తలఁచి నేను విషప్రాశనముఁ గావించితిని. నా మరణమువలన నెవరికిని దుఃఖము కలుగఁజాలదు. నా తండ్రికి నేను మరణించిన వార్తయైనఁ దెలియఁజాలదు ! "

నేను : ఆమె యెవరిపేరైన నుగ్గడించెనా ? ఇక్కడ కామె నెవరు తెచ్చిరో యా విషయమై యేమియుఁ జెప్పనే లేదా ? ఆమెను మోసపుచ్చి యిచ్చటికిఁ దెచ్చినస్త్రీని వెదకుటకై మనకు సహకారిగా నుండు సంగతు లేవియుఁ జెప్ప లేదా ?

అధి : లేదు. ఆ సంబంధమైన వేవియు నామె నాకుఁ దెలుప లేదు. ఇక్కడి కామె నొకస్త్రీ తీసికొనివచ్చెనను సంగతికన్న మఱేమియు నామెకుఁ దెలియదని నాకుఁ దోఁచుచున్నది.

ప్రస్తుతకార్యమతికఠినమైనది. సమస్తము నతిశాంతచిత్తముతో నాలోచించియే చేయవలయునని యోచించి సాధ్యమగునంతశాంత భావమువహించి నేనిట్లంటిని.

“ నాపేరు ప్రభాకరరావందురు. నేను విసగపురవాస్తవ్యుఁడను. నాకీబాలికతో నెట్టిసంబంధబాంధవ్యములు లేవు. నేనీమె నెన్నఁడును జూచియెఱుంగను. మనోరమయను బాలిక ప్రాణసంకటముననున్నదని యెఱింగి మీకాతంతివార్తనంపితిని. ”

అధి : ఈమె బొంబాయిలో నివసించుచుండిన యింటిజాడ మీకుఁదెలియునా ”

అదియాతనికిఁదెలిపితిని. ఆతని రెండవప్రశ్నకై నిరీక్షింపకయే నేనా బాలికమృతకళేబరమునుఁగాంచునాత్రమును బ్రకటించితిని.

వెంటనే యాతఁడు నన్నొకగదిలోనికిఁదీసికొనిపోయెను. ఆగదిలో నాకగపడినదృశ్యము నేనెన్నటికిని మఱవఁజాలను. నేనెక్కడకరిగిన నక్కడ నా బాలికరూపము నాకన్నులయెదుటఁగన్పట్టుచుండెను. నితాంతరమణీయమును, గంభీరమునైన యాబాలికరూపము నాహృదయఫలకమున శాశ్వతముగఁజిత్రితమైయుండెను. నేనేకాంతస్థలమునఁ గూరుచుండియుండ నామెదీనమూర్తి నామనశ్చక్షువులముందఱ నిలిచి నాపిఱికితనమునకై నన్నుదూఱుచున్నట్లు నాకుఁదోఁచుచుండెను !

మనోరమనుజూచి శూన్యహృదయముతో నేను క్రిందికివచ్చిన పిమ్మట నాయధికారి “ ఇచటవేఱొకస్త్రీయున్నది. ఆమెవలన మీకేమైనఁ దెలియునేమో చూడుఁడు ! ” అనియెను.

ఆస్త్రీ యాగృహయజమానురాలై యుండఁబోలునని నేనూహించి యామెకడకరిగితిని. కాని, యేమాశ్చర్యమిది ! గదిలోఁ బ్రవేశించినంతనే తనయాకారమగపడకుండ నల్లనిగుడ్డను మేలిముసుఁగుగ వేసికొనియున్న యొకవిచిత్రస్త్రీ నాకన్నులఁబడెను ! ఆమెమొగము కూడ నాకగపడుటలేదు.

నేను భీతచేతస్కుఁడనై "అన్నన్నా! ఈమెయెవరు?" అని యడిచితిని.

అధి : ఈమెయె మనోరమనిచ్చటికిఁ దెచ్చియుంచినది. ఇంతకుఁ బూర్వమె నాభటుఁడీమెనుబట్టుకొనియెను. ఈమె యొకభయంకర స్త్రీ—త్వరలోనే యామె తనయపరాధములకు న్యాయమందిరమునఁ బ్రత్యుత్తరమీయవలసియున్నది. ఎల్లరు నీమెరక్కసియని గుర్తింపఁ గలరు.

ఏకామిని మనోరమను మోసపుచ్చిబలిమినిదీసికొని పోయినదని నేననుమానించుచుంటినో, ఆకామిని నామరూపవర్ణములతో నీమెకు సంబంధము లేకుండుటఁగాంచి, నేను దిగ్భ్రాంతుఁడనై పోయితిని. ఈస్త్రీ చూచుటకున్నతయు, స్థూలయునై యుండెను. కాని, యీామె యొద్ద సౌందర్యలేశమైననాకగపడ లేదు. ఆమెకడకరిగినేను —

"మనోరమను బొంబాయినుండి యిచ్చటికిఁదీసికొనివచ్చినది నీవా?" అని ప్రశ్నించితిని.

స్త్రీ—అవును.

నేను : అనాథయు నిరపరాధినియు నగునీబాలిక నెట్లువంచించి యిటకుఁదీసికొనివచ్చితివి?

ఆస్త్రీ ప్రత్యుత్తరమొసఁగలేదు. నిగూఢముగ మందస్మితమొనర్చెను.

అధి : (అధికారస్వరమున) చెప్పుము! నవ్వెదవేమి?

స్త్రీ : నేను పితామహిననని యీాబాలికకుఁ జెప్పితిని. మనోరమ ఆజ్ఞాపాలకబాలికయగుటచే—

తటాలున నేనామెకడకొక్కయుంగవైచి యామెచెవిలో "ఆయింట మనోరమగది యేదిశనున్నది? చెప్పుము?" అంటిని.

స్త్రీ : తూర్పుదిశ.

నేను : అసత్యము — అనృతమాడుచున్నావు. నీవాయింటి కరుగలేదు.

స్త్రీ : (భీతిచే) స్వామీ ! గట్టిగామాటాడకుఁడు. మీకది తెలిసియున్నచో—

మఱేమియుఁబల్కలేదు. నేఁడే మూమెవలన విశేషోదంతములు తెలియఁజాలవని నాకుఁదోఁపసాగెను. తనమాటధోరణిమూర్చి యాస్త్రీ "నేనె మనోరమనిచ్చటికిఁ దెచ్చినదానను. ఆమెనిక్కడకుఁదెచ్చుట ఘోరాపరాధమైనచో నందులకుఁ బ్రత్యుత్తరమిచ్చుటకై నేను సంసిద్ధనై యున్నదానను. ప్రతిమనుజుఁడును దనజీవితకాలమం దెప్పుడైన నిట్టికష్టములకులోఁబడుట సహజమె." అనియెను.

నాకావిషయమై పూర్తిగఁ దెలిసియున్నందున నామెమాటల లోనిగూఢార్థము నాకప్పుడెగోచరమయ్యెను. ఆయపరాధభరమును దనపై నెందులకు మోపుకొనుచున్నదో నాకుఁదెలియలేదు. ఒకవేళ నామె కందువలన విశేషబహుమానము లభించునేమో !

ఆమె నిశ్చలస్వరూపముంగాంచి యామె యీరహస్యమును ప్రాణముపోయినను వెలిపుచ్చదని నేనూహించితిని. అదియునుగాక యామెతో నిప్పుడు కలహించుచుఁగూర్చుంటవలన నెట్టిలాభమును లేదనితలఁచి యామెమాటలనువిశ్వసించినవానివలెఁ బైకిఁజూపట్టితిని. మనోరమప్రేతమునుగూర్చి విచారణముసేయుటకై వచ్చియున్న పంచాయితీదారులకంటెఁబడుట నాకిష్టములేనందున నొకటిరెండు ప్రశ్నలాస్త్రీనడిగి వెంటనె నేనచ్చోటువాసిపోయితిని.

## ఇరువది యాఱవ ప్రకరణము

నేను విసరపురమునకుఁదిరిగి వచ్చితిని. మనోరమ మరణించినదని విన్నప్పటినుండియు నాచిత్తవృత్తిమారియుండెను. నేనిప్పుడు దేహశ్రమకేమాత్రమును లక్ష్యపెట్టుచుండలేదు. నాకార్యము —

నాకర్తవ్యము—ఇంకనుబూర్తికాలేదు. నామనస్స్వాస్థ్యమునకుభంగము కలిగెను. కమలాబాయినింకొక్కమాఱుచూచుట నాకావశ్యకమై యుండెను.

ఆనాఁటియుదయమెనిమిదిగంటలకె నేను నారాయణరావుగారి భవనమునకరిగితిని. నేఁడాభవనముఁబ్రవేశించుటకు నాకు శీఘ్రముగ సెలవుదొరకదని తలంచియుంటిని. కాని, నాకాశ్చర్యమయ్యెను. ఆద్వారపాలకుఁడు నేఁడధికాదరముతో నాకుస్వాగతమొసఁగి లోనికిఁ గొంపోయి నన్నొకకురిచీపైఁగూర్చుండఁజేసి, నేనుచెప్పకము న్నె కమలాబాయికడకరిగి నాయాగమనమును నివేదించెను. అతఁడట్లు కమలాబాయికడకరుగునప్పుడు నన్నుద్దేశించి యిట్లనియెను.

“ స్వామీ ! అమ్మగారు నేఁడు మిగులనలసియున్నారు. అయినను మిమ్మవశ్యముగదర్శింతురు. డాక్టరుప్రభాకరరావుగారు నేఁడే తెంచినచో వారినిటఁగూర్చుండఁబెట్టి తమకుఁదెలుపవలసినదని అమ్మగారు నాకాజ్ఞయిచ్చినారు. ”

వాఁడచటినుండి వెడలిపోయినపిమ్మట నేనాగదినాలుగువైపుల కును దిలకించితిని. కమలాబాయి—అట్టిమరభిమాన స్త్రీ—నేఁడింతటి మృదుస్వభావయగుట కేల చ్చెరువందితిని. ఏదేని గూఢకారణ ముండకున్న నామెయింతటివినమ్రభావమునుధరింపదని నాకుఁదెలిసి యుండెను. ఆమె నాకుభయపడియుండునా ? ఛీ ! ఛీ ! కల్ల ! అసంభవము ! ఆఁ ! ఆమె ఏదోకపటజాలమున నన్నుఁబడద్రోయనెంచి యుండఁబోలును ! ఏమైననుసరియె ! నేఁడామెకణుమాత్రమును భయ పడరాదనియు, నామెను లక్ష్యపెట్టరాదనియు నిశ్చయించుకొంటిని. దీనయు, ననాథయునగు మనోరమమూర్తి నాదృష్టులకుగోచరమై నా యీనిశ్చితమును దృఢపఱుచుచుండెను.

నేనాస్థితిలో నచటఁ జాలసేపుకూర్చుండనక్కఱలేకపోయెను. శీఘ్రముగఁ గమలాబాయి నాసమక్షమునకువచ్చినిలిచెను. ఒక్క

మాతామెను దిలకించినంతనె వస్తుస్థితి నాకుగోచరమయ్యెను. ఆమె భీతిచే గుండెలో రాయిపడినదానివలె నగపడెను. ఇటునటుచూచి తనసంభాషణములవినుట కట నెవ్వరును లేరని తెలిసికొని యామె "మనోరమ మీకుఁగనఁబడినది కాఁబోలును ! ఆమెకొఱకు ద్రవ్యమునడుగుటకై మీరిచటికివచ్చియుందురు—మీరడుగు మొత్తము న్యాయమైనదిగను, యోగ్యమైనదిగనున్నచో నేను మహానందముతో నొసంగెదను" అనియెను.

నేను : (కోపముతో) ద్రవ్యమా ! మరణించినమనుష్యులకు ద్రవ్యముతో నేమిప్రయోజనమున్నది ? కమలాబాయీ ! నీవుమనోరమనుజంపితివి !

కమలా : (భీతితో) చంపితినా ? హత్యయా ! మనోరమ హత్యయా !

నేను : ఔను, హత్యకాకున్నమఱేమి ! నీవే యామెను మోసపుచ్చి తెచ్చి యీ భయంకరస్థలముననుంచితివి. ఆ కారాగారమున బంధింపఁబడి బ్రతుకుటకన్న మరణమేయుత్తమమని యోచించి యీ బాలిక—యీయనాథబాలిక—యీమనుమరాలు — మనోరమ — విషప్రాశనముచేసి యాత్మహత్యఁగావించుకొన్నది. నీదుస్తులనిచ్చి నీవెవ్వతెనామెకొఱకు బంపితివో యీనికృష్టపట్టుబడినది.

కమలా : (తడఁబడుచు) మీరేమనుచున్నారో నాకర్థమగుచుండలేదు. నేనామెనాయింటికిఁగొనిపోయితినని యెవ్వరుచెప్పినారు ?

నేను : కాని, మనోరమచిరునామామాత్రము మీకుఁదెలిసియుండెనా ! ఇంకేమియును దెలియదా ? కమలాబాయీ ! నీవే యామె నాదుష్టస్త్రీకివశపఱిచితివని నాకు రూఢిగఁదెలియును.

కమలా : నాకాయింటివిషయమై తెలిసియుండెను. కాని, యాగృహమంతభయంకరముగనుండుటయెఱుఁగ ! నేనాయిల్లుచూచియైననెఱుంగ — అంతియేకాక, యాగృహమున మంచిగౌరవము

గలయొకకాంతయుండవలయునని నేనుతలంచియుంటిని— నాకుమిగుల విచారముగనున్నది.

నేను : ఆగృహము మంచిదోచెడ్డదో తెలియకుండు నంతటి మూఢురాలవు కావు. నీమాటలను బంచాయతీదారులు విశ్వసింపరు. అంతియేకాక, యాదుష్టస్త్రీవస్త్రములనుధరించి మీరుమనోరమకడ కరిగియుంటిరిగదా! ఆనీచకార్యమునకు మీమనసెట్లొప్పినది? దాని కేమిసమాధానముచెప్పఁగలరు? ముసుఁగువైచుకొనుటకుఁ గారణమే మని మిమ్ముఁబ్రశ్నించినచో మీ రేమనిప్రత్యుత్తరమీయఁగలరు?

కమలా : కాని, మనోరమకడకరిగినదానను నేనని సిద్ధాంతీకరించుటకు మీ కేమాధారమున్నది?

నేను : మనోరమనుగొనిపోయినమగువ యున్నతయు, సుందరియునై యుండెనని యాయింటియజమానురాలు నాతోఁజెప్పినది. కాని, యిపుడు మనోరమయొద్దనున్నవనితసుందరికాకుండుట నాయీకన్నులేచూచినవి. అదియునుగాక, మనోరమయుండినయింటివివరణ మామెకుఁ దెలియునే తెలియదు. మనోరమయుండినగదియాయింటికిఁ బూర్వదిశనుండెనని యామె చెప్పినది.

కమ : ఆలాఁగునా?

నాయీసంభాషణమువలనఁ దన కేమియు బాధకలుగలేదని నాకుఁ దెలియఁజేయుట యామెయుద్దేశము — కాని, యాప్రయత్నమున నామెకు విజయముకలుగలేదు. ఆమె వెఱగందియుండుట యప్పుడే నాకుఁ దెలియవచ్చెను. ఆమె తానుప్రస్తుతమెట్టిస్థితిలోనున్నదో యాలోచించి తెలిసికొనుటకై యొక్కింతసేపవకాశమీయఁదలంచి నే నూరకుంటిని. తనపై నెట్టిభయంకరవిషయముపడినదో యాధూర్తస్త్రీకి నిమిషములోఁ దెలిసిపోయెను. కొంతతడవాలోచించి పరిహాసస్వరమున నామె యిట్లనియెను.

" మనోరమ మృత్యుముఖమునఁబడియున్నందున నిప్పుడామెకు ధనముతోఁబని లేదు. మీవంటి స్వార్థత్యాగులును, నిరీహాపరులును, ధనవిహీనులవై పునరుఁ దొంగిచూడనైనఁజూడరు ! అయినను, మీకు నావలన నేమియో కావలసియున్నది. కాకున్న మీరు నాయొద్ద కేతెంచి యుండరు ! ప్రతీకారాపేక్షతో నిచటికి మీరరుదెంచియుంటిరేమో ! ఒక్కయబలయెడఁ బ్రతీకారభావమును వహించుట నిశ్చయముగ మీకు గౌరవాస్పదమే !

నేను : అమ్మా ! ప్రతీకారము, ద్రవ్యము తక్క మీకితరమేదియునగపడుచుండ లేదా ? న్యాయమనునక్షరముల మీ రెన్నఁడైన వినియున్నారా ?

కమలా : (భయముతో) అట్లయిన దీనిని న్యాయసభకుఁగొని పోవుదురా ?

నేను : త్వరలో మనోరమామరణవిషయము పరిశీలనమునకు రానున్నది. అప్పుడు మీరును నేనును న్యాయమందిరమునకరుగవలసి వచ్చును. న్యాయాధీశులకుఁగు ప్రశ్నల కుత్తరములిచ్చుటకు మీరు సంసిద్ధులైయున్నారుకదా ?

కమలా : (భయకంపితయై) న్యాయవిచారణమా ? మనోరమకు నాకునెట్టిబాంధవ్యమున్నదో మీరు లోకులకుఁ దెలియఁజేసితిరా ?

నేను : ఇప్పటివఱకు నట్లుచేయ లేదు.

కమలా : మాకు నామెకుఁగలబంధుసంబంధము లోకులెఱుంగుదురా ?

నేను : ఎఱుంగరు.

కమల : మఱి యామెయెవ్వతెయనుకొనుచున్నారు ?

నేను : కమలాకాంతరావుగారామెకుఁ బోషకులై యుండుట లోక మెఱుంగును.

కమలా : అట్లయిన మీకుఁదక్క నిజమైనబంధుత్వమితరులకుఁ దెలియదుకాదా ?

నేను : ఔను.

తోకత్రొక్కినపామువలె నామె బుసకొట్టుచు నాపై కుఱికెను. అప్పు డామె నేత్రము లగ్నికణములఁగురియుచున్నట్లు నాకగపడెను. కాని, యామె క్రోధాతిరేకమున నన్నేమియుఁజేయలేదు. నిర్భయముగ నేనామెను దదేకదృష్టితోఁ జూచుచు " ఔను ! నాకొక్కనికే నిజము తెలిసియున్నది " అనియంటిని.

ఆమె వెనుకంజవేసెను. నేనిప్పుడు మునుపటిపిఱికిప్రభాకరుఁడ గానని యామెకుఁ దెలియవచ్చెను.

కమలా : ప్రభాకరరావుగారూ ! మీకు మనోరమయందింత వాత్సల్యమేమిటికుదయించినది !

నేను : నా తెలివితక్కువవలననె యామెకింతటిహానిఘటిల్లినది. ఈ యొక్క కారణమువలననె, యామెనువధించు సామాన్యజనుల కన్నను, నాకీర్తికన్నను, ఆమెవిలువయధికమైనదని నాకుఁదోఁచు చున్నది. తెలిసినదా ?

నేనీమాటలను మిగులఁ గ్రోధముతోఁజెప్పితిని. అవియామె హృదయముననాటెను. అప్పుడు గద్గదస్వరముతో నామె యిట్లని యెను.

" నిరపరాధులపైఁ గనికరముంచుటయె మీబిరుదము. అందులకు మిమ్మునే దూషించుచుండలేదు — నాతో నీకిటికీకడకొకసారి రండు ! అచట నిరపరాధిత్వమునకు రెండవయుదాహరణమును మీరుచూడఁ గలరు. ఆ పిమ్మట మృతినందిననిరపరాధినిఁగరుణించుట శ్రేష్ఠమో కాక, జీవముతోనున్ననిరపరాధినిని గరుణించుట శ్రేష్ఠమో మీరే నిర్ణయించెదరుగాక ! "

అని యామె నన్నొకకిటికీకడకుఁగొనిపోయెను. అచట నామె నాకుఁ జూపునదేమైయుండునాయని నేనాలోచించుటకుఁబూర్వమె యావాతాయనముపైనున్న యవనికతొలఁగింపఁబడియెను.

ఆవాతాయనమార్గమున దృగ్గోచరమైనదృశ్య మతిరమణీయముగనుండెను! తోఁటయందలిభూభాగమంతయుఁ బచ్చనిపచ్చికచేఁ గప్పఁబడియుండెను. ఉద్యానదేవత వివిధవర్ణవిచిత్రపుష్పములచే నలంకృతయై యాశాద్వలవేదికపై నృత్యము సేయుచున్నట్లుండెను! ఉద్యానమందలిసురభిళమందమారుతములు మనోహరముగ వాతాయనమార్గమున దాఁగుడుమూఁతలాడుకొనుచుండెను. కాని, యాదృశ్యము వలన నామనసున నెట్టిపరిణామమును గలుగలేదు. నన్నాశ్చర్యసాగరమున ముంచినదృశ్యము వేఱు—అచట నొక యామ్రవృక్షచ్ఛాయను సరస్వతియు నామెభర్తయుఁ బరస్పరమతితరప్రేమలాలసులై ముచ్చటలాడుకొనుచు సుఖాసీనులై యుండుట నాకన్నులకగపడెను.

"ఈ నూతనదంపతులసౌఖ్యనాశనమొనర్చుటకు మీరు సంసిద్ధులైయున్నారా?" అని సకంపితస్వరమునఁ గమలాబాయి నాతో ననియెను.

ఆమె యప్పటిస్వరము నాకొకవిధముగానున్నట్లుతోఁచెను. ఆమెరూపమున నిప్పుడు తొంటిక్రూరభావమావంతయు దృగ్గోచరమగుచుండలేదు. మాతృప్రేమ యామెమనోవృత్తిపైఁ బూర్ణాధికారము నెఱపుచుండెను. ఆమె మరలనిట్లనియెను.

"సరస్వతి మీకెట్టిదపరాధమొనర్చియున్నది? మీరీయుదంతమంతయు న్యాయమందిరమునకుఁగొనిపోయినచో నామెకెట్టి భయంకరస్థితికలుగునో మీరే యాలోచింపుఁడు! ఆమెమగఁడెంతటి మానధనుఁడో యెంతటిబుద్ధిమంతుఁడో మీకుఁదెలిసియేయుండును. తనభార్యసోదరుఁడు కారాగారబద్ధుఁడైయున్నాఁడని తెలిసినంతనె యాతఁడామెనుద్యజింపఁడా! దీనివలన నాతనికామెయందుఁ బ్రేమ లేదనితలంపకుఁడు. ప్రేమకన్న నాతనికి మానవరక్షణమె శ్రేష్ఠమని తోఁచును. మానావమానకల్పనము బహువిచిత్రమైనదిగదా!"

కమలాబాయి చెప్పిన యీపలుకులయం దధికముగ సత్యాంశము న్నదని సరస్వతిభర్తను జూచుటతోడనే నాకుగోచరమయ్యెను. సరస్వతిపుట్టింటివారు నిష్కళంకులని యాతఁడు నమ్మియున్నంత వఱకు నాతఁడు తనపత్నినన్యభావముతోఁ బ్రేమించుచుండుట నిశ్చయమే. కాని, యామెయగ్రజుఁడొకఁడు చెఱసాలలోనున్నాఁడని యతనికిఁ దెలిసెనా యాతఁడామెను దిరస్కరింపఁదొడంగును. ఈవిషయము నామనసును బాధించుచున్నదని తెలిసియే కాఁబోలు నాధూర్త- కమలాబాయి మరల నిట్లనిపలుకఁదొడంగెను.

“ మీ మిత్రునకు సరస్వతిపై నెంతప్రేమయుండెనో మీకుఁ దెలుపనక్కఱలేదు. ఆమెకించుక దుఃఖముకలిగిన నాతఁడోర్చువాఁడు కాఁడు ! ఒకమృతప్రాణికి సాయమొనఁగూర్పవలెనని తనముద్దుల పట్టిజీవితమువ్యర్థపఱుప—మంటఁగలుప—మీమిత్రుఁడు—మత్పతి—ఉద్యుక్తుఁడయియుండునా ! ”

ఈ ప్రశ్నకే నేమియుఁబ్రత్యుత్తరమీయనైతిని ; నాకేమియుఁ దోఁచదయ్యెను. నేనాలోచనానిమగ్నమానసుఁడనైతిని. నేనుబలుకకుండుటఁగనియామె—

“ చూడుఁడు ! ప్రభాకరరావుగారూ ! నిర్వ్యాజమును, అకృత్రిమము నగు సరస్వతిమనోహరరూపముదెస నొక్కమాఱు చక్కఁగఁ బరిశీలించిచూడుఁడు ! మీకృత్యమువలన నాముగ్ధకు — కోమల హృదయయగు నాబాలిక కెంతటిదురవస్థకలుగునో చక్కఁగ నాలోచింపుఁడు ! ” అనియెను.

నేను : అమ్మా ! ఒక్కభయంకరస్థలమున నింతకన్నధిక సుందరమైన, యధికపవిత్రమైన, యధిక లావణ్యమైన, బాలికా ప్రేతముపడియుండుట మీరుమఱచితిరా !

నాయీమాటలకుఁ గమలాబాయి క్రోధాతిరేకమున గడగడ వణఁకసాగెను. ఆక్రోశభరమున నామె నాపైఁబడి నన్నుఁగొట్టునేమోయని భయపడితిని. ఆమె యింతతీవ్రక్రోధావిష్టయైయుండుట

యేగన్నఁడుగాంచియెఱుఁగ—సహజముగనే యామె దెబ్బలఁదప్పించుకొనుటకు నేనాయత్తపడితిని.

కాని, దైవవశమున నట్టిదిసంభవముకాలేదు. తానిప్పుడెంత హీనస్థితిలోనున్నదియుఁదెలిసికొని కమలాబాయి కోపమును మ్రింగివైచెను.

“తొలుత నేను మిమ్ము శ్రమపెట్టినందున, నన్ను మీరిచ్చవచ్చిన తెఱంగునఁబరిభవించుటకు మీకధికారమున్నది. నేనిప్పుడు చెప్పుచున్న దామృతబాలికనుగూర్చి కాదు—మీనెచ్చెలికాని తనయ విషయమై—సరస్వతినిగూర్చి—నేనిప్పుడు చెప్పుచున్నాను. ఆమె సౌఖ్యనాశమునకు మీరుకారకులగుదురా? వచింపుఁడు! ఈవిషయమై యేదోయొకటి నిశ్చయముగఁదెలియవలయును.” అని యామె శాంతభావముతోఁబలికెను.

నేను : అమ్మా! నా ప్రశ్నకుఁదగిన సమాధానమొసఁగుదురేని మీ విన్నపము నాలోచింతును. మీరు మనోరమను మోసపుచ్చి యచటనుండి యెట్లు తీసికొనివచ్చితిరో తొలుత నాకెఱింగింపుఁడు!

కమలా : అట్లయిన సమస్తము నానోటనే వినవలయునని మీయభీష్టమా?

నేను : ఔను.

అప్పుడామె పిశాచివలె హాసముచేసెను. పిదప క్రుద్ధయై పెదవులుగఱచుకొనుచుఁ దీవ్రదృష్టితో నన్నుఁజూచి యిట్లనియెను.

“మీకావృత్తాంతమంతయుఁ దెలుపుటకన్న వేఱువిధానము లేదు. మనోరమ నాయింటినుండి యెట్లు తెచ్చితినను ప్రశ్నకుత్తర మిచ్చుట యతిసులభము. నేను మనోరమకుఁబితామహినిగానా? సరే! నేను నీపితామహిని. నాతోఁబయలుదేరిరమ్మని చెప్పుటయే తడవుగా నామె నావెంటవచ్చుటకు సంసిద్ధయయ్యెను.

“ఆపిమ్మట నామె నాదుష్టస్త్రీకెట్లు స్వాధీనపఱచితిరి?”

“మీరు వ్యర్థజిజ్ఞాసాపరులుసుఁడీ!”

"దాని కేమిలెండు! నాజిజ్ఞాసను మీరుతీర్పకతప్పదు."

"నావలననకలోదంతముఁదెలిసిన పిమ్మట నాపిల్లనుగరుణింపుఁడని నేను మిమ్ము్రడుగనక్కఱయుండనట్లు మీకుఁ దోఁచుచుండఁ బోలును! మీరు పొరపడుచున్నారు, నేనింతకంటె నధికభయంకరాపరాధము లొనర్చియుండినను, వానినిబట్టి సరస్వతిసౌఖ్యమును బాడు సేయుట యేమాత్రమును న్యాయము కాఁజాలదు" అని యామె విషాదపూరితమందహాసముతోఁ బలికెను.

నేను : నాకీతత్త్వజ్ఞానముతోఁబని లేదు. తొలుత మీసంగతులనుగ్గడింపుఁడు.

కమలా : మనోరమనుదీసికొని నేను సరదాశ్రమమున కరిగి యామెనటనొకగదిలోఁగూర్చుండనియమించి యొకపనినిమిత్తమే నచ్చటనుండిబయటికరిగితిని. తొలుత నేర్పాటుచేసికొనిన మేరకా స్త్రీ మార్కెట్టునొద్ద నాకై ప్రతీక్షించుచుఁ గూరుచుండియుండెను, నావల్లనియుడుపులా మెకిచ్చి సరదాశ్రమమునకంపితిని. ఆమెయు నావలెనే మేలిముసుఁగు వేసికొనియుండినందున మనోరమ యామెను నన్నుగనె భావించెను. చెప్పుఁడు! మీరింకనేమైన నడుగఁదలఁచి యున్నారా?

నేను : ఔను, ఇఁకనొక్కప్రశ్న యడుగవలసియున్నది. మనోరమ నక్కడనుండితిసికొనిపోవుటకుఁ గారణమేమి? బహుభంగులఁ గష్టపెట్టి యిడుమలపాల్సేసి యామెనాత్మహత్యకుఁబురికొల్పుటకా?

నాయీప్రశ్నవిని యామె కోపారుణితనేత్రయయ్యెను. వేటు వడితప్పించుకొనినయాఁడుబెబ్బులివలె గర్జించుచు నామె యిట్లనియెను.

"ఏయుపాయముచేనైన నామెను నామార్గమునుండితొలఁగింప వలయుననియే నాయుద్దేశము. కాని, మనోరమ మరణించునని నేను తలఁచియుండనైతిని. అసత్యప్రేమాతిరేకమె నన్నీకృత్యమునకుఁ

బుకికొల్పినది. నేను హంతకురాలనుగాను. నాయీకృత్యమునకు మూలకారణము దృఢమగునా యపత్య ప్రేమయే."

అపత్య ప్రేమయా! కమలాబాయివంటినీచస్త్రీనోటనైన నపత్య ప్రేమనుగూర్చిన గర్వోక్తులు వెలువడుట నాకత్యాశ్చర్యముగా నుండెను.

"మనోరమయు స్నేహమువలన మాకెంతటిహాని ఘటిల్లియుం డునో మీకుఁ దెలియునా? ఆమెమూలమున మావంశసంబంధమగు విమల కీర్తిధ్వంసమైపోయియుండును. ఆమెకొఱకు మేమందఱము దేశములఁ బట్టిపోవలసినవారమైయుందుము. మావంశకీర్తినిగాపాడుటకై యొక్క మనోరమయే కాదు. కారాగారబద్ధులగు వారి తనయులు వేయి మంది మరణించినను నేనుచింతించియుండను—ఔను; నేనుదుఃఖం చియే యుండను."

నేను: కాని, మీరీకృత్యమొనర్చునపుడు మీపుత్రులకెంతటి నష్టముఁగలిగించుచుంటిరో యెప్పుడైన నాలోచించితిరా! మీ యీనీచకృత్యములకు సమ్మతించుటచేతను సాయమొనర్చుటచేతను వారు తమగౌరవాభిమానములను మంటఁగలిపికొనిరికాదా?

కమలా: నాకొడుకులిప్పుడు పెద్దవారై యున్నారు - ధనికులై యున్నారు. వారిసంరక్షణమునకు వారేపాటుపడుదురు.

నేను: కాని, నారాయణరావు—

కమలా: చాలింపుఁడు! దయచేసి నారాయణరావు విషయమై యేమియుఁబలుకకుఁడు. ఆతని నేనోయొకపనికై బయటికంపియున్నాను. నాకు వానియందావంతయువిశ్వాసము లేదు.

ఈకడపటిమాట లామెరహస్యముగాఁజెప్పెను. ఈమాటలామె నోటవెలువడినప్పుడామె చేయిఁద్రిప్పినందున నామెకుఁదెలియ కుండఁగనె యీవాక్యము లామెయుచ్చరించెనని నాకుఁదెలిసెను. పోనిండు! నారాయణరావైనఁ దమతల్లివంటి నీచుఁడు కాఁడుగదాయని నాకానందమయ్యెను.

నేను : (నారాయణరావు మనోరమకు వ్రాసినయుత్తరమును జేబులోనుండితీయుచు) కాని, ఉపాయాంతరము లేక నారాయణరావును గూర్చి కొంచెము చెప్పవలసివచ్చుచున్నది. ఈ యుత్తరము — మీ రెవ్వతెను నాశనముసేయ నెంచితిరో యాయనాథబాలికకు నారాయణరావు—మీసుతుండు పంపియుండెను. దీనిని జదివినపిమ్మట మీరిప్పుడు చెప్పినది నిరాధారమైనది కాదని మీకు నిశ్చయముగాఁ దెలియఁ గలదు.

కమలా : ఈ యుత్తరము మనోరమ కెప్పుడు చేరినది ?

నేను : మీరామెను దీసికొని పోయినమఱునాఁడు.

కమలా : అట్లయిన దీని నామె చూడలేదు కాదా ?

నేను : లేదు.

కమలా : ఇంక నెవరైన దీనినిఁ జదివియున్నారా ?

నేను : మనమిద్దఱము తప్ప నింకెవ్వరు నీయుత్తరమును జూడనైన లేదు—ఇఁకఁ జదువుట యెట్లు ?

కమలా : మీరు తక్క నితరులెవ్వరును దీనిని జూడలేదు గదా ?

నేను : లేఖకునకుఁ దప్ప మఱెవ్వరికి నిందలి సంగతులు తెలియవు.

కమలా : అట్లయిన దీనినిఁ జింపివేయుదగును. (అని దాని నామె చింపివేసెను.)

నేను : (క్రిందికి వంగి యా తునుకల నేరుకొనుచు) మీరు తప్పు పనిసేయుచున్నారు. ఈ యుత్తరము నాయొద్దనున్నదని పోలీసువారికిఁ దెలిసియున్నది. విచారణసమయమున దీనిని న్యాయమందిరమున నుంపవలసివచ్చును.

కమలా : ఆ తునుకలను నేను గాల్చివేసియున్నచోఁ జాలఁ బాగుగనుండును !

నేను : అందువలనఁగూడ మీకేమియును లాభము కలుగఁబోదు. ఏలయన—ఆయుత్తరము నాకడనుండి యెట్లు పోయినదియు న్యాయాధీశులకుఁ దెలుపవలసియుండును.

ఈ మాటలువిని యామె భయప్రకంపితయయ్యెను. అదిగని నేను "ఇఁక నీ తునుకలను న్యాయమందిరమున నర్పింపవలసియుండును. ఇంకేమిచేయుదును ! ఈ యుత్తరములోని విషయములను గూర్చి నారాయణరావే సమాధానము చెప్పఁగలఁడు !" అంటిని.

కమలా : నాకుమారుఁడు నాయెడలనంత విశ్వాసహీనముగాఁ బ్రవర్తింపఁడు.

నేను : అట్లుండియు నాతఁడు మీకుఁదెలియకుండఁగ నుత్తరములు వ్రాయఁగలఁడు !

కమల : అతఁడొకించుక దుర్బలహృదయుఁడు.

నేను : అతని యాహృదయదౌర్బల్య మీయుత్తర మొక్కదినము ముందుగ వ్రాయనీయనందులకు నాకెంతో విచారముగనున్నది.

కమల : ఇదియే వానిస్వభావమునందలిదోషము. వానికింకను నాస్వభావము పూర్తిగాఁదెలియలేదు.

నేను : గోపాలరావైనచో మీస్వభావమును జక్కఁగ నెఱుంగునా !

కమలా : అనుమానమెందులకు ! కావుననె వాఁడు నారాయణరావువలెఁ దప్పిదములొనర్చుచుండలేదు.

ఈ మాటలఁజెప్పుచు నామెవికవికనవ్వెను. ఆ నవ్వువలన నామె నీచత్వమెంత పరమావధినొంది యుండెనో నాకుఁ దెలియవచ్చెను. ఇట్టి నీచస్త్రీతో నింతకాలమువఱకుఁ మాటాడుచుఁగూర్చుండుటచే నాకు విసుఁగుజనించి, సంభాషణమునింకఁ గట్టిపెట్టు తలంపున నేనిట్లంటిని.

"అమ్మా ! మీరు మీనోటనె వివరించిన విషయములఁగూర్చి యాలోచించినచో మీరు కరుణకపాత్రలని తెల్లమగుచున్నది. అట్లుండియుఁ మీయీదుష్కృత్యముల ఫలము నిరపరాధినియగు

మీ బాలిక యనుభవింపఁగూడదనునుద్దేశముతో నేనీవిషయములను రహస్యముగనుంచెదను, కాని, యావద్వృత్తాంతములును, నీయిహలోక న్యాయమందిరమున విదితము సేయకున్నను, సర్వసాక్షియగు నాపర మేశ్వరుని న్యాయసింహాసనముముందఱనైనఁ దప్పకుండ మీరును నేనును జెప్పవలసివచ్చుననుమాట మీరు మఱవకుందురుగాక! ఈన్యాయదంష్ట్రిలనుండి మిమ్ముఁ రక్షించుటకు నేనుసమర్థుఁడనై యుంటినే గాని, మిమ్ముఁబాధించుచుండు మీసదసద్వివేకబుద్ధిపోటులనుండి నేను మిమ్ము రక్షింపఁజాలను. "ఈచేత సేసిన దాచేతఁగుడుచు" నను నీతి వాక్యమున నొకింతైన సత్యాంశమున్నచో మీయీపాపకృత్యము లకుఁ దగినఫలమును మీరీలోకముననె యనుభవింపకమానరు."

నాయీసంభాషణ మామె కెట్టిపరిణామమును గలిగింపలేదు. ఆమెలక్ష్యభావమంతయు నేనీవిషయములన్నియు రహస్యముగనుంచెద నని మాటయిచ్చెదనో లేదో యనుదానియందె లీనమైయుండెను.

"అట్లయిన మీరీవిషయములను గుప్తముగానుంతురుకాదా!" అని యామెయడిగెను.

"దేనివలన మీకుఁ బరాభవముకలుగునో దానిని నేనెవ్వరికిని దెలుపనని మాటయిచ్చుచున్నాఁడను."

"మఱియీబాలికయెడ మీకింతదయకలుగుటకుఁ గారణ మేమని యెవ్వరైననడిగినచో నేమియుత్తరమిత్తురు?"

"కమలాకాంతరావుగారి జాబువలన మనోరమయను బాలిక బొంబాయిలోనున్నదని యెఱింగి, వారివిన్నపముననుసరించి నేనా బాలికను వెదకసాగితినని చెప్పెదను."

ఈమాటలువినినంతనె యామెరూపము ప్రఫుల్లమయ్యెను. విజయమందితినను గర్వముతోఁ గాఁబోలు, నామె నావంకఁజూచుచు, నాగవాక్షముమీఁది యవనికనుజారవిడిచెను. అనంతరము సహాస వదనయై యామె——

ప్రభాకరా! నేను మీ యెడ నపరాధిని. కోపభారమున ననేక సమయములలో మిమ్ము నొవ్వనాడితిని—మీరు మాత్ర ముదార హృదయముతో వానినన్నిటిని క్షమించుచుంటిరి. మీ వంటి యుదార హృదయముగల బుద్ధిమంతు లీలోకమున నరుదుగ నుందురు” అనియెను.

నేను : కమలాబాయీ! మీ యపరాధములు దేనిమూలమునను బరిహారములు కాఁజాలవు. నేఁటినుండి మన సంబంధము తెగినది- ఇఁక నా పరమేశ్వరుని న్యాయసింహాసనము సన్నిధినే మన మొండొరులము కలిసికొందము. అచ్చట మీకుఁగాని, నాకుఁగాని యేవిషయమునం దొక్క-యక్షరమైన దాచియుండుట శక్యముకాదు. ఈ మాట మనసునందుంచుకొని మీరు మీ స్వయంకృతాపరాధములకుఁ బశ్చాత్తాపము వహించి, యాత్మశుద్ధి యొనర్చుకొనుటకుఁ బ్రయత్నింపుఁడు! నేనిఁక సెలవుఁగైకొనియెదను.

అని వచించి నేను ద్వారముకడకరిగితిని. ద్వారముదాటుచుండ నింతలో గోపాలరావు నాయెదుటఁ బ్రత్యక్షమయ్యెను.

“అమ్మా! డాక్టరును బోనీయవచ్చునా?” అని యాతఁడు తల్లినడిగెను.

కమలా : (శాంతగంభీరస్వరమున) పోనిమ్ము!

తత్క్షణమె నాకభివందనమొనర్చి గోపాలరావు పార్శ్వమునకుఁ దప్పుకొని, నాకుఁ ద్రోవయిచ్చెను.

రెండవసారి నేను మృత్యుదంష్ట్రలనుండి తప్పించుకొంటిని.

## ఇరువదియేడవ ప్రకరణము

“నా యీశోకపూరితకథను త్వరలో ముగింపవలయును.

ఈవిషయములన్నియు రహస్యముగనుంచెదనని కమలాబాయికి మాటయిచ్చితినేగాని, లోకుల కేదియో కేవలమసత్యకల్పితవిషయము

లను నివేదింతునని మీరు తలంచియుందురు. అట్లుకాదు. ఈవిషయమై నన్నెవ్వరు నంత శ్రద్ధగఁ బరీక్షాపూర్వకముగాఁ బ్రశ్నింపరని నేను తలంచియుంటిని. విచారణసమయమునఁగూడనట్లులే జరిగెను. ఆబాలి కకును గమలాకాంతరావుగారియింటివారికి నేమైనసంబంధముండెనా యని నన్నెవ్వరునడుగలేదు, నారాయణరావుకూడఁ దనయుత్తరము విషయమై సమాధానపూర్వకమగు ప్రత్యుత్తరమిచ్చినందున వాని యెడ నెవ్వరికి ననుమానము కలుగలేదు. పంచాయతీదారులు "ఆత్మ హత్య" యనియె నిర్ధారణముచేసిరి.

భూలోకన్యాయాధీశులు తమకుఁగలశక్తి సామర్థ్యములననుస రించి యీవ్యాపారమును దుదముట్టించిరి. వారియభిప్రాయము ననుస రించి నేనును గమలాబాయి మొదలగువారును నిర్దోషులమని నిర్ధా రణముకాఁబడినను, నాసదసద్వివేకబుద్ధి నన్నొక్కపెట్టున వేధించుచునే యుండెను. లోకదృష్టి కేనెంతనిరపరాధినై యుండినను నాలోజాగరిత మగుచున్నసదసద్వివేకదృష్టికి నేను ఘోరాపరాధినే. నేనుక ర్తవ్య భ్రష్టుఁడనగుటచేతనే కదా యీదుఃఖదాయక విషయములు సంఘటించి నవని నాయంతరాత్మ నన్ను బాధించుచుండెను.

ఒక్కనాఁడు నారాయణరావు నన్నుసందర్శింపవచ్చెను. అతని మాటలవలన, నన్నాతోట్టెలోఁబడఁద్రోయువిషయమున నాతని సమ్మతియుండలేదనియు, నేనింకను గొంతసేపాపట్టుపీడకయున్నచో నాతనిమూలమున గోపాలరావు నన్నాతొట్టెలోనుండి బయటికీఁదీసి యుండుననియు, నాభీరుత్వమునుగనిపెట్టివారు నన్ను బెదరించిగాని, మఱి యేవిధముగనైనఁగాని, యీమరణశాసనమును గైకొనుటకు నిశ్చయించిరనియు, గోపాలరావాతనితోఁజెప్పియున్నట్లు నాకుఁదెలియ వచ్చెను. కమలాకాంతరావుగారి వంశమున నొక్కపురుషుఁడైన సద్వర్తనుఁడై యుండినందులకు నాకు సంతుష్టికలిగెను.

కాని, యీవిషయములన్నియుఁ దెలిసిన పిమ్మట నాసదసద్వివేక బుద్ధి నన్ను మఱింత బాధింపఁజొచ్చెను. పశ్చాత్తాపాగ్నిజ్వాలలు నా హృదయమున కసహ్యములయ్యెను. నలుగురుమిత్రులయెదుటనడ యాడుటకు నాకు లజ్జవొడమెను. పెద్దపెద్దసభలలో నుపన్యాసము లిచ్చుచు నేప్రజలకు నేను నేఁటివఱకు స్వదేశమునకై, కర్తవ్యమునకై రాజ్యమునకై, స్వధర్మమునకై, ప్రాణత్యాగమైన నొనర్చుటకు సంసిద్ధము కావలెనని యనేకసమయములలోఁ జెప్పియుంటినో, యాప్రజలె యిప్పుడు నన్నుఁగాంచి నవ్వుచున్నట్లు నాకుఁదోఁచసాగెను. ఏమృత్యుభయమువలన నేను నాకర్తవ్యమునుండి పరాఙ్ముఖుఁడనైతినో యామృత్యుశిక్ష చేతనేగాని నాపాపక్షాళనము కాఁజాలదని నాకుఁ దృఢ విశ్వాసము కలిగెను.

సరి! నాయాత్మచరిత్రము సంపూర్తియైనది. ఏతొట్టిలోఁబడి మరణించుటకు బెగడువడి యామరణశాసనమును గోపాలరావున కిచ్చితినో యాతొట్టికడకె నేనిప్పుడు పోవుచున్నాఁడను. నాయీ యాత్మాహుతిచేనైన నాపశ్చాత్తాపాగ్నిజ్వాలలు శమించుఁగాతమని సర్వనియామకుఁడగు నాపరమేశ్వరునిఁ బ్రార్థించుచున్నాఁడను. ఈ యాత్మసమర్పణము కేవలకర్తవ్యమగుటచే నిట్టులొనర్చుచున్నాఁడను. ఆ తొట్టిలో నాకుఁగలుగఁబోయెడి వేదనలతగ్గింపుమని యాపరమాత్మని నేను వేడఁబోను. కాని, యాభయంకరవేదనలను ధైర్యముతో నోర్చుకొనుటకు నాకు మనస్థైర్యమొసంగుమని దయామయుఁడగు నాప్రభువును వేఁడుచున్నాఁడను. నాయాత్మయాజ్ఞానంతరమైనను, ఆ ప్రభువు నాయాత్మకుఁ శాంతియొసఁగుఁగాక!”

# ఇరువదియొనిమిదవ ప్రకరణము

ముగిసినది. డాక్టరుప్రభాకరరావుగారి యాత్మవృత్తము ముగిసినది. ఆ పుస్తకము నామేజాబల్లపైనుంచి శూన్యదృష్టితో దానివైపు చూచుచుఁ గూర్చుంటిని. డాక్టరుగారి కృత్యమెంతవఱకు యోగ్యమైనదో యేనేమియుఁజెప్పఁబోను. ఇట్టిమహద్విషయములలోఁ బ్రతి మనుష్యుఁడును సర్వవిషయముల శాంతభావముతో యోచించిచూచుకొని స్వమతమును సిద్ధాంతీకరించుకొనుటయే శ్రేయస్కరము. డాక్టరుగారి కృత్యముమంచిదోకాదో సుజ్ఞులగు పాఠకులకుఁ దెల్పు నధికారము నాకు లేదు.

కాని, యొక్కటిమాత్ర మిచ్చటఁజెప్పవలసియున్నది. ఆ యంత్రశాలయందలితొట్టిలో నదీతీరమునిండియుండుట డాక్టరుగారికిఁ దెలిసియుండదు. ఏలయన—గోపాలరావాతనిఁ దొట్టినాతొట్టిలోఁ ద్రోసినప్పు డది జలవిరహితమైయుండెను. గాలిలేకపోవుటచేతను, నాహారములేకపోవుటచేతను, కొన్నినాళ్లాతొట్టిలో నవస్థపడవలసివచ్చునని యాతఁడనుకొనియుండును. ఈకారణమువలననె యాతఁడు పుష్పలతకు వ్రాసినయుత్తరములోఁ బదిదినములవఱకుఁ దన్నువెదకవలదని వ్రాసియుండును ; కాని, దైవవశమున నాతొట్టి జలపూరితమైయుండుటచే నాతని ప్రాణములు పోవుటకుఁ జాలకాలముపట్టియుండలేదు. దానినిబట్టియంత యాయాసమునుగలిగియుండదు. ఆతనికి విశేషకష్టముకలుగకుండ మరణముసంప్రాప్తమైనందులకు నాకుసమాధానముకలిగెను. ఆరాత్రి నాకుఁ బట్టినంతగాఢనిద్ర యానడుమ నెప్పుడును బట్టియుండలేదు.

ఉదయమున లేచుసరికి నాయొడల నొకవిధమగు నవీనోత్సాహము సంచారము సేయసాగెను. ఈనాఁటి బాలభానుని కిరణజాలములు నాకవర్ణనీయానందమును గలిగింపఁజొచ్చెను. శకుంతసంతతులప్పుడు

మధురా వ్యక్తకూజితములు నాహృదయమున రహస్యమైనసుఖభావనలఁ దలసూపఁజేయుచుండెను. ప్రాతఃకాలమందమలయానిలము లెప్పటివలెఁ ద్రాసదాయకములుకాక నేఁడు నాతనువల్లికను బులకింపఁజేయుచుండెను. వేయేల! నేఁడు వర్ణింపవలపిగాని యానందసాగరమున నే నోలలాడుచుంటిని—ఎందులకో ?—

శయ్యనుండి లేచి, యెప్పుడు నారాయణరావుగారి కడకరుగుదునా, యెప్పు డీకమిూరు కుముదకు భయపడనక్కఱలేదని వచింతునా యని నేను తహతహింపుచుంటిని. నారాయణరావుగారికీవిషయములలోఁగల సంబంధము స్తుతిపాత్రమైనదికాకున్నను ప్రభాకరరావుగారి మరణముతో నాతని కెంతమాత్రము సంబంధము లేదనుట మాత్రము నిక్కువము. ఆ సంగతి యాతఁడు వ్రాసియుంచినపుస్తకమే వెల్లడించుచుండెను. కావున, నారాయణరావుగారి కేవిధముగను కుముదప్రాణాపాయమును ఘటింపఁజాలదు. నారాయణరావుగారి నెట్లయిన నవమానపఱుపవలయుననియే యామె ముఖ్యోద్దేశము. ఇప్పుడేమిచేయఁగలదు ? కావున నామె కీవృత్తాంతము తెలుపనెంచితిని. తత్క్షణమె కుముదకిట్లుత్తరము వ్రాసితిని.

"కుముదసన్నిధికి—

నారాయణరావుగారిపై నీకుఁగలయనుమానము కేవలము నిరాధారమైనది. డాక్టరాత్మహత్యఁగావించుకొనియెనని యాతని స్వహస్తలిఖితపత్రికవలననె తెల్లమగుచున్నది. ఆ యుత్తర మదృష్టవశమున నిప్పుడు నాయధీనముననెయున్నది. ఈ యుదంతము నారాయణరావుగారి కెఱుకపఱుచుటకై యిప్పుడే నేనాతనిగృహమునకరుగుచున్నదానను.

ఇట్లు,

నలిని."

వెంటనే యీయుత్తరమునుగవరలోనుంచి దానిపైఁగుముద చిరునామా వ్రాసి పోస్టులో వేసితిని. అనంతర మొక్కనిముసమైన నాలసింపక యీపుస్తకమును జేతఁబట్టుకొని నారాయణరావుగారి యింటికి బయులుదేరి పోయితిని.

మిగులవడివడిగనడచి నేనతిశీఘ్రముగ నాగృహమునకరిగితిని. పూర్వమేమందిరము నాకత్యంతభయప్రదముగఁ గాన్పించుచుండెనో యామందిరమె నేఁడు నాచిత్తవృత్తిలోఁగలిగిన మార్పువలన నాకత్యంతరమణీయముగానున్నట్లు కన్పట్టెను. ఉల్లసితాంతఃకరణముతో నేను ద్వారము చెంతఁజేరి తలపుఁదట్టనై యుంటిని. ఇంతలోఁ దలుపుఁదెఱచి నారాయణరావాకస్మికముగ నాయెదుటఁబ్రత్యక్షమయ్యెను.

నన్నువీక్షించుటవలనఁ గలిగినయద్భుతానందభావములచే నాతని వదనమండలమరుణమయ్యెను. నాప్రఫుల్లవదనము నుత్కంఠతతోఁ జూచుచు నాతఁడిట్లనియెను.

“ నేఁడుగదా సుదినము ! నిన్నుఁగాంచినంతనె నాహృదయమున నెట్టి యానందతరంగములుత్పన్నములగుచున్నవో నేనువర్ణింపఁజాలను. నీప్రఫుల్లవదనమండలముంజూడ నీవెద్దియో సంతోషవార్తఁదీసికొని వచ్చితివని నాకుఁదోఁచుచున్నది. ”

“ నిజమె ! నేను సంతోషవార్తనే తీసికొనివచ్చితిని ” అని నేనాతనితోఁ గచేరీచావడికరిగితిని. ఆసమయమున నారాయణరావు నేత్రములలో స్పష్టముగదృగ్గోచరమగుచున్న నాయందలియుత్కట ప్రేమ, నాతఁడీకచేరీచావడిలోనే పూర్వము కొన్నిదినముల క్రిందట నాకడఁబ్రథమమున వ్యక్తపఱచియుండెను.

నేను : ( గంభీరముగ ) నారాయణరావుగారూ ! తొలుత నీపుస్తకమును జదివిచూడుఁడు ! ఈశ్వరునికృపచే నిప్పుడే నాకిది లభించినది. దీనివలనఁ గుముద మీపైనారోపించిన భయంకర నీచారోపణము కేవలమసత్యమని స్థిరపడుచున్నది.

అని నా జేబులోనున్న పుస్తకమునుదీసి యాతనికిచ్చి యచట నున్నయొక వాతాయనముచెంత కరిగినిలిచితిని.

స్వభావముగ నుద్యానవనశోభందిలకించునపేక్షతో నేనాగవాక్షమునకు వేయఁబడిన యవనికను దూరముగాఁదొలగించితిని. అటు చూచునరికి నాకచటఁగనఁబడినదృశ్యము నాచిత్తము నాకర్షించెను. సహజరీతి నేనచటనున్నయొక జాజిపొదవైపునకు దృష్టిసారించితిని. కాని, యేమాశ్చర్యము! అచటఁగూర్చుండియున్నవ్యక్తిద్వయము నాకంటఁ బడుసరికి నేనట్లెనిలువఁబడిపోయితిని. వారివైపున కేకాగ్రదృష్టితోఁ దిలకించుచు నెంతయోసేపునిలిచియుంటిని. నన్నింతయాశ్చర్యమున ముంచినయావ్యక్తిద్వయమేమాయని తెలిసికొనుటకై పాఠకులుత్సుకులై యుందురు! చాలసేపుపాఠకులను సందిగ్ధావస్థలో నుంచుట నాకిష్టములేదు. నారాయణరావుసోదరియు నామెభర్త రామారావును నచటఁగూర్చుండి యిష్టగోష్ఠిఁబ్రొద్దుపుచ్చుచుండిరి. మఱి యందాశ్చర్యమేమున్నదని పాఠకులు నన్నడుగుదురేమో! నిజముపరికింప ననన్యప్రేమభావమున నాదంపతులు లోండొరులతో మంతనములాడుకొనుచు నొక్కెడఁగూర్చుండియుండుట యందాశ్చర్యమేలేదు. కాని, డాక్టరుగారి యాత్మవృత్తమున నెయ్యది ప్రాముఖ్యముగను శ్లేఖింపఁబడియుండెనో యయ్యదియే ఆసరస్వతీరామారావు ప్రేమసంవాదమే—ఇట్టులాకస్మికముగ నాకును నయనగోచరమగుటకై నేనాశ్చర్యపడుట స్వాభావికమేయని, సహృదయులగు నాపాఠకులొప్పుకొందురని నేను విశ్వసించుచున్నదానను. ఈయకల్పితవిషయమువలన నామనసున నుత్పన్నమైనవిచారతరంగములు చాలసేపు నెలకొనియుండవయ్యెను. కిటికీమూసివేసి నేను నారాయణరావుగారి వైపునకుఁజూచితిని. చెంతనె యొకకుర్చీపైనాసీనుఁడై యాతఁ డాపుస్తకపఠనమున విలీనుఁడై యుండెను. ఆతని ముఖమున దుఃఖభావముస్పష్టముగఁదోఁచుచున్నందున, నాతనివదన మభ్రాచ్ఛాదితమైన పూర్ణిమా

చంద్రబింబమువలెఁ దేజోవిహీనమైయుండెను. దుఃఖపూరితమగు నాతనివదన పద్మమును నేను చూడఁజాలక పోయితిని. చూచిసహింపఁ జాలకపోయితిని. మొగమునవ్వేలకుఁద్రిప్పుకొని యచటనె యొకకుర్చీపై గదలకుండఁ గూరుచుండియుంటిని.

నారాయణరావుగారు పెద్దయింగ్రొద్దాపుస్తకమును జదువు చుండిరి; ఎట్టకేలకు దానినిముగించిరి; దానినట మేజాబల్లపై నుంచి నా చెంతకరుదెంచినిలిచిరి. ఆతనివంకఁజూచుట యసభ్యతయనియు నవిచారమనియుఁదలఁచి నేను క్రిందికిఁజూచుచుఁ గూర్చుండియుంటిని. నేనట్లుపైకెనిర్లక్ష్యభావము నగపఱిచినందులకై యాతఁడించుక బెగ డొంది గద్గదస్వరమున నిట్లనియెను.

"ప్రభాకరునిమరణమునకు నేనేకారకుఁడనని నీకుఁదోఁచు చున్నది; నాయభిప్రాయము నట్టిదేయైయున్నది!"

ఈ శబ్దములువీనులసోకినంతనే నేను తలయెత్తితిని. అపరిమిత లజ్జయు నపారప్రేమయు నాతని ముఖమునఁ దాండవమాడుచుండుట నాకునయన గోచరమయ్యెను!

"డాక్టరుప్రభాకరరావిట్టి నీచాపనిందను మీపై మోపలేదని మీకుఁదెలిసియుండనోపు!" అని నేనాతని నెమ్మదిపఱుచునుద్దేశ ముతో నంటిని. కాని, నాయభిప్రాయము రహస్యముగనుంచుట భావ్యముకాదని నాకుఁదోఁచి, తత్క్షణమె మరల నేనిట్లంటిని. "కాని, మీరు కేవలము నిరపరాధులని చెప్పుటకువీలు లేదు. నేనిట్లుస్పష్టముగ మాటాడుచున్నందులకు మీరుకోపింపకుఁడు! అట్లుచేయకుండినచో నేను మీయాదరణమునకుఁ బాత్రనై యుండను."

నారా: నిజమె! మఱియు, నీస్పష్టోక్తులకు నేను కోపించిన యెడల సత్యమననేమియో నాకుఁదెలియదనియే చెప్పవలసివచ్చును. స్వాపరాధములను తమనోటనెవచించుట యించుకవిచారకరమగు విషయమే; నిజమే; కాని, నీయెదుట-నాహృదయేశ్వరిసమ్ముఖమున-నేనేమియు దాపఁజాలను. నలినీ! నీపై నాకెంతటియగాధప్రేమ—"

నేను : (తటాలున లేచినిలిచి) నారాయణరావుగారూ! ఇదేమి! మీ రిట్లు పలుకుచున్నారు? మీ యీసంభాషణము లెవ్వరైన విన్నచో నేమందురు!

నారా : లోకు లేమనుకొందురో యని నేనాలోచింపను—అందులకు లక్ష్యపెట్టను. నీపైనున్న ప్రేమనింకను నాహృదయమునందె యణఁచిపెట్టుటకు నాకలవికాదు. నలినీ! నా భవిష్యజ్జీవితము సౌఖ్యపూర్ణమొనర్చుటయో కాక దుఃఖమయ మొనర్చుటయో నీచేత నున్నది. కావున నింకను సేపు నావిన్నపమునాలింతువా!

ఆతని మాటలనాలించి నేను తలపైకెత్తితిని.

నారా : నలినీ! నీయీకృపకు నేనెంతయో ఋణపడియున్నాఁడను. (ప్రేమగద్గదస్వరమున) ప్రభాకరునాత్మవృత్త మంతయుఁ జదివియున్నావుకదా?

నేను : ఔను.

"దాన మూఁడుమాసములకుముందు మే మెంతకష్టదశ యందుంటిమో నీకుఁ దెలిసియుండును. సరస్వతిపై రామారావుగారికిఁ ప్రేమ మతిశయమయ్యెను. ఆతనిఁబోలినరూపసంపన్నుఁడును, సుశిక్షితుఁడును, శ్రీమంతుఁడు నగుభర్త మాసోదరికిలభింపవలయునని మా కధికాశయుండెను. రామారావుగారివిద్వత్తుకన్న నాతనియపరిమిత ద్రవ్యమె మమ్మాతనికడకాకర్షించుచుండెను. కాని, మావంశరహస్యము నెఱింగియున్నచో నాతఁడు సరస్వతినిఁ బెండ్లాడుట కంగీకరించియుండఁడు. మాయన్నకు — ఏదోయపరాధమునకై శిక్షవిధించిరి. ఇప్పటికి నాతఁడు చెఱసాలలోనేయున్నవాఁడు. నాతండ్రి తనమనసురాలి నింటికిఁదెచ్చియుంచునని నాకుఁదెలిసినంతనె యందులకువిరుద్ధముగ నేనుమాటాడఁజొచ్చితిని. కాని, యాబాలికకు మాతండ్రిద్రవ్యములో భాగమిచ్చు విషయమున మాత్రము నేనడ్డుచెప్పలేను. కేవలము

మానరక్షణమునకై మాతండ్రిగారి కృత్యమున కడ్డు చెప్పుచుంటిని. మాతల్లియు సోదరుఁడు నందులకు నాతో నేకీభవించిరి. మాతండ్రి రెండవమరణశాసనము వ్రాయకున్నచో మాకుఁగష్టములేక యుండును. కాని, యాతఁడు మాకుఁదెలియకుండ రెండవమరణశాసన ము వ్రాసెను. ఇఁక నేమిసేయఁదగును. ఆమరణపత్రము నీలకంఠరావుగారి కందనీయఁగూడదని కృతనిశ్చయులమైతిమి. కాని, కడకు మాతండ్రి యామరణపత్రము డాక్టరు ప్రభాకరరావునకప్పగించెనని వినినప్పుడు నాకెట్టులుండునో నీవేయాలోచింపుము! ఆ మరణపత్రముం గొని యాతఁడానాఁడె యింటికరుగుచుండ మార్గమునెట్టులైన నాతనినడ్డగించి మరల దానిని దెచ్చియిచ్చుటకు గోపాలరావు ప్రతినయొనర్చెను. కోపావేశభరమ్మున నాతఁడు డాక్టరునకెట్టియుపద్రవమైనఁ గలిగించునని యెంచి నేనది డాక్టరునకు సూచించితిని. అతనికడనుండి యామరణపత్రమును సేకరించుటకై గోపాలరావొనర్చుచుండిన ప్రయత్నములఁగని ప్రభాకరుని ప్రాణరక్షణ విషయమై నాకనుమానమును భీతియుఁ గలుగుచుండెను. అతఁడు స్వయముగ నాపత్రము మాకిచ్చునేమో చూతమని మఱునాఁడు నేనాతనిగృహమునకరిగితిని. కాని, యందువలన లాభములేకపోయెను. ఇఁకనేమిసేయవచ్చునో నాకుఁదోఁచదయ్యెను. హతాశుఁడనై నేను నాగదిలోఁబరుండియుండ నాతల్లియు గోపాలరావును నాగదిలోనికరుదెంచి "డాక్టరును బురాతనయంత్రాలయమునకుఁబిలిపించి సాంత్వనవచనములచేనైన — అందువలన గార్యమనుకూలింపదేని, బెదరించియైన—నాతనియొద్దనుండి యామరణశాసనమును సేకరించుట మాయుద్దేశ" మని నాకుఁ దెలిపిరి. ఆసమయమున నన్నాయంత్రాలయమునకుఁగొనిపోవుపద్ధతిమీఁద నేనాప్రయత్నమునకొడఁబడితిని. సమయమైనప్పుడు డాక్టరునకు సాయమొనర్చునుద్దేశముతో నేనాయంత్రాలయమునకరుగ నెంచితిని. నాయుద్దేశమిట్టిదని వారనుమానింపకుండ నేనాతని కాయంత్రాలయ ముఖ

ద్వారమున స్వాగతమిచ్చి మానముతో నాతని లోనికిఁగొనిపోవు పని నాపైఁబెట్టికొంటిని.

"కాని, యీకార్యమొనర్పుటఁగూడ నాకతికష్టముగానుండెను. కావుననె గోపాలరావు డాక్టరుతో విరసముగ మాటాడఁదొడంగి నప్పుడు నేనచటనిలువలేకపోయితిని. లాంతరునుక్రిందఁబెట్టి నేను దూరముగాఁబోయితిని. నాయీకృత్యము పౌరుషకృత్యముకాదనియే నెఱింగియుంటిని. అప్పుడు నాకట్లుతోఁచకపోలేదు. అపారద్రవ్యము— ఉచ్చపదవి - ఐహికకీర్తి - నాకప్పుడు తుచ్ఛములుగాఁ గనఁబడసాగెను. కాని, నాతల్లికడ నాప్రయత్నములేమియుసాగలేదు. ఆమె యాజ్ఞనుజవ దాటుటకు నాకు ధైర్యముకలుగదయ్యెను. పరుగుపరుగునఁ బోయి డాక్టరునకు సాయమొనర్పవలెనని యెన్నిమారులో ప్రయత్నించితిని. కాని, యెంతప్రయత్నించినను భూగర్భమందిరమున నేమిజరుగుచున్నదో పోయిచూచుటకు నాకు సాహసముకలుగలేదు. అట్టిస్థితిలో నాకచట చాలసేపుండవలసిన యావశ్యకము లేకపోయెను. త్వరలోనే గోపాల రావు లాంతరుఁదీసికొని నాచెంతకరుదెంచెను. "డాక్టరు మరణ పత్రముఁదెచ్చుటకు నాకనుమతియొసఁగియున్నాఁడు; దానిని దెచ్చు టకై యీతనిగృహమున కరుగుచున్నాఁడను." అనియెను. "డాక్టరు గారెచటనున్నా"రని నేనడిగితిని. ఆతఁడా భూగర్భగృహమున నగ పడును. అమ్మయు నచ్చటనెయున్నది" అని యాతఁడనియెను. ఆతని యుచ్చారణమునుబట్టి డాక్టరేదోయుపద్రవమున మునిఁగియున్నాఁడని నేనూహించితిని. తత్క్షణమె నేనామందిరమున కరిగితిని. నాతల్లి యచట ముఖముపై నీలవస్త్రమునుగప్పుకొని నిలిచియుండెను; కాని, డాక్టరు మాత్రము నాకెక్కడను గన్పట్టఁడయ్యెను. "డాక్టరుగారెచట నున్నారు?" అని భయకంపితస్వరముతో నేనడిగితిని. ఆప్రశ్నకుత్తర ముగా నామె యచటనున్నతొట్టివైపునకు వ్రేలుసూపెను. అప్పుడు నాహృదయమున నెట్టులుండెనో మాటలతో వచించుట